# అబ్బూరి సంస్మరణ

సంపాదకుడు

డాక్టర్ గోపాలకృష్ణ అబ్బూరి



నాట్యగోష్ఠి
హైదరాబాదు

# విషయసూచిక



## I. అబ్బూరి వ్యక్తిత్వం

## II. అబ్బూరి సాహిత్య సమీక్ష



## III. అబ్బూరి వ్యాసాలు, ఇంటర్వ్యూలు

## IV. సంపాదకీయాలూ పీఠికలూ అభిప్రాయాలూ



## V. అబ్బూరి అసంకలిత రచనలు

## VI. Abburi the Man



## Essays by Abburi

# ఒకమాట

అబ్బూరి వారి మిత్రులూ, అభిమానులూ, శిష్యులూ వారి రచనలూ, జీవిత చరిత్రా ప్రచురితమైతే బాగుంటుందని భావించడంతో ఈ సంపుటానికి శ్రీకారం చుట్టడం జరిగింది. అబ్బూరి వారికి అత్యంత సన్నిహితులుగా మెలిగినవారిలో చాలామంది కీర్తిశేషులైనారు. రామకృష్ణరావుగారు తమ రచనలను భద్రపరచుకొనే ప్రయత్నం యేనాడూ చెయ్యలేదు. ఆయా పత్రికలలో అచ్చయిన రచనల గురించిన సమాచార సేకరణకే పెద్దప్రయత్నం చెయ్యవలసి వొచ్చింది. తెలిసినంతలోనే సేకరించవలసినవి చాలా ఉన్నాయి. హీరేన్ ముఖర్జీగారు వంగభాషలో రాసిన స్వీయ చరిత్రలో రామకృష్ణరావుగారిని గురించిన సమాచారం విపులంగా ఉందని వారే తెలియజేశారు. దాని అనువాదాన్ని సంపాదించడానికి ప్రయత్నం జరుగుతోంది. అలాగే ప్రఖ్యాత రంగస్థల నటీనటులు శంభు మిత్ర, సురేష్ అవస్థి, హబీబ్ తన్వీర్, జోన్ లిటిల్‌వుడ్ మొదలైన వారి జ్ఞాపకాలను సేకరించవలసివుంది. అలాగే చీరాల—పేరాల సత్యాగ్రహం గురించీ, అంతకుముందు కలకత్తాలో వారి రాజకీయ జీవితంగురించీ తెలుసుకోవలసివుంది.

లభించినంతవరకు, సేకరించగలిగినంతవరకు ఆయననుగురించి రాసిన వ్యాసాలూ, ఆయన రచనలూ ఈ సంపుటంలో చోటు చేసుకున్నాయి. ఇందులో చేరని రచనలేమైనా మిత్రులెవరికైనా లభ్యమైతే, మాకు పంపితే కృతజ్ఞతతో స్వీకరించి మరొక సంపుటాన్ని తీసుకురాగలమని మనవి.

ఈ సంపుటాన్ని ఈమాత్రంగానైనా తీసుకు రాగలగడానికి సహాయం చేసిన డాక్టర్ అత్తలూరి నరసింహారావు, శ్రీ పన్నాల సుబ్రమణ్యభట్టు, శ్రీ జి.ఇ. ఫ్రెడరిక్, శ్రీ కె. వి. రమణారెడ్డి, శ్రీ ఏల్చూరి మురళీధరరావు, ప్రసిద్ధ చిత్ర దర్శకుడు శ్రీ బి. నరసింగరావు, శ్రీపతి, శ్రీచంద్ర గారలకు మా కృతజ్ఞతలు.

రచనలను పునర్ముద్రించుకోవడానికి అనుమతినిచ్చిన రచయితలకూ, పత్రికాధిపతులకూ మేము ఋణపడివున్నాం.

సోమరాజు రంగారావు
'నాట్యగోష్ఠి'

# సవరణలు

| పుట | పంక్తి | ఉండవలసినది |
| --- | --- | --- |
| 105 | 6 | "కే. వి. ఆర్)" |
| 114 | 7 | అని వ్యాఖ్యానించారట |
| 114 | 8 | 'What else |
| 157 | 7 | ఇ. బి. హవెల్ |
| 311 | 2 | గెర్ హార్ట్ హాప్ట్‌మెన్ |
| 313 | 3 | 'మనమెరుగుదుము. (వోల్టేర్) తరువాతి వాక్యం "వోల్టేర్" అన్న అక్షరాలు.. అథస్సూచికలో వుండవలసినది. |
| | 4 | (వోల్టేర్) |
| 315 | 19 | Jabala |
| 331 | 15 | మేలమాడుచుండ. |
| 345 | 11 | Oedipus Rex. |

చిత్ర విభాగం

| | |
| --- | --- |
| 12వ చిత్రం : | 2, ప్రిన్సిపాల్ కపూర్ |
| 13వ చిత్రం : | న్యూఢిల్లీలో నేషనల్‌స్కూలు ఆఫ్ డ్రామా స్నాతకోపన్యాసం చేసిన తరవాత ఉత్తీర్ణులైన విద్యార్థినులతో |
| 25వ చిత్రం : | డెహరాడూన్లో ఎం. ఎన్. రాయి సమాధి దగ్గర అబ్బూరి అస్థి నిక్షేపం. ఎడమవైపు కుమారులు వరద రాజేశ్వరరావు, గోపాలకృష్ణ. |

# "నాటకం అంతా బాగుండాలి"

గురుదేవులైన అబ్బూరి రామకృష్ణారావుగారిగురించి చెప్పాలంటే, ముందుగా నేను వారి రెండవ కుమారుడైన అబ్బూరి వరద రాజేశ్వరరావు గురించి చెప్పవలసివుంటుంది.

అబ్బూరి వరద రాజేశ్వరరావు నాకు బాల్య మిత్రుడు. వాడే నాకు ఆది గురువు.

జీవితం అంటే బడి, భోజనం, ఆట—అంతే నాకు తెలిసినది. అంతకంటే జీవితం చాలా విశాలమైనదని, లోతైనదని నాకు చెప్పక చెప్పినవాడు రాజేశ్వర రావు. అందుకే వాణ్ణి నేను నాకు ఆదిగురువుగా చెప్పుకుంటాను. 1931వ సంవత్సరంలో వాడు బెజవాడనుంచి విశాఖపట్నంలోకి దిగి ఎ. వి. యన్. కాలేజి హైస్కూల్లో సెకెండ్ ఫారంలో చేరేడు, నాకు సహాధ్యాయి అయ్యేడు. అయిన రోజునే ఆదిశంకరుడులాగ "దేముడు లేడు" అని నాకు తెలియ చెప్పేడు. ఆ రోజునే వాడి చెల్లెలి మరణం గురించి ఒక గేయం చదివేడు. చెల్లెలి మరణానికీ దేముడనేవాడు లేకపోవడానికీ సంబంధం ఏమి వుందని చెప్పేడో నాకు గుర్తులేదు కాని, ఖచ్చితమైన సంబంధం వుందనిమట్టుకు వాడు ఆ రోజున నన్ను నమ్మించగలిగేడు. ఆ రోజు నాకు బాగాగుర్తు. అది మధ్యాహ్నం మూడు గంటల సమయం. ఎ. వి. యన్. కాలేజి హైస్కూల్లో ఒక చిన్నగది. ఒకటే కుర్చీ, చాలా బల్లలు. ముప్పై మంది కుర్రవాళ్ళలో వాడూ, నేనూ. ఉపాధ్యాయు డున్నాడో లేడో గుర్తులేదు. సూర్యుడు ఏటవాలుగా పడమటికి దిగుతున్నా భగ భగ మండుతున్నాడు. షెడ్డు పెంకుల కన్నాల్లోంచి క్లాసుగదిలోకి సన సన్నగా దిగుతూన్నాడు. అప్పుడు చెప్పేడు అబ్బూరి రాజేశ్వరరావు "భగవంతుడులేడు" అని. చెప్పడమైనా చాలా అధికారపూర్వకంగా భగవంతుడు భక్తుడికి చెప్పి నట్టుగా చెప్పేడు. ఆదినం ఆమాట వినగానే నాకు ఎంతో భయం వేసిందని కూడా బాగాగుర్తు. దిక్కులేని వాళ్ళుగా దిక్కుతెలియని వాళ్ళుగా అకస్మాత్తుగా తల్లీ, తండ్రీ పోయిన వాళ్ళుగా నేను అయిపోవడం నాకు ఎంతోగుర్తు.

ఆ తర్వాత ఉత్తమ సాహిత్యం ఉంటుందనీ, ఉన్నదనీ తెలియజెప్పిన వాడు రాజేశ్వర్రావే. శ్రీశ్రీ గారూ, విశ్వనాథ సత్యనారాయణ గారూ ఉన్నారని చెప్పినవాడూ రాజేశ్వర్రావే. మా కాలేజీ హిస్టరీ డిపార్ట్‌మెంట్ పత్రిక్కి "మాయం టావూ, బాబూ అంతా మిథ్యంటావూ" అనే గేయం మహాకవి శ్రీశ్రీ గారిచేత రాయించినదీ రాజేశ్వర్రావే. విశ్వనాథ సత్యనారాయణగార్ని కాలేజీకి రప్పించి క్లాసు రద్దు చేయింపించి ఆయనచేత కిన్నెరసాని పాట పాడింపించి విన్నవారం దరికీ కళ్ళంట నీళ్ళు రప్పించినదీ రాజేశ్వర్రావే. ఎమ్. ఎన్ రాయ్‌గారు కాలేజీకి రాకూడదని కాలేజీ ప్రిన్సిపాల్ కామయ్య పంతులుగారు నిషేధిస్తే విద్యార్థులచేత సమ్మె చేయింపించి ఆ రాయ్‌గార్ని కాలేజీకి రప్పించి గద్దె ఎక్కించినదీ రాజేశ్వ ర్రావే. 1937వ సంవత్సరం ఎన్నికల్లో తెన్నేటి విశ్వనాథంగారికీ, అంకితం భానోజీరావుగారికీ జరిగిన పోటీలో జస్టిస్ పార్టీమీద కాంగ్రెస్ పార్టీ తరపున రోజు కొక బులెటిన్ వదిలినదీ రాజేశ్వర్రావే. తెల్లవారుఝామున కోటవీధి బాబూలాల్ గారితో ప్రభాత్ భేరికి బయలుదేరడానికి ముందుగా సముద్రపొద్దున ఇసకలో ఇసకే తలగడాలుగా చేసుకొని నేనూ, చాలా మందిమి రాత్రంతా పడుకొన్నది రాజేశ్వర్రావుతోనే. మ్యూన్సిపాల్టీవారు లైసెన్సు లేదని సైకిలు పట్టుకుపోతే భాగ వతుల నారాయణరావు కోసం జరిమానా చెల్లించడానికి కాణీ, కాణీ, అణా, అణా చొప్పున డబ్బులు దండిందీ అందరం కలసి రాజేశ్వరావుతోనే. రెండవ ప్రపంచ మహాసంగ్రామంలోకి రష్యా దిగకముందే ఫాసిస్టు రాజ్యాలు ప్రజావ్యతిరేక రాజ్యాలని నమ్మినదీ రాజేశ్వర్రావువల్లనే. 1931 లగాయితూ 1939 వరకూ రాజేశ్వర్రావులేని నిత్యజీవితం నాకు ఏ రోజూ లేదు. చిన్నప్పుడు వాడు మాకు లీడరు. మా అందరికీ అప్పట్లో ఇప్పటి లెక్కప్రకారం చిన్నసైజు హీరో. ఇప్పటికీ కూడా కొన్ని, కొన్ని విషయాల్లో వాడు నాకు ఇంకా ఒక హీరోవే. వాళ్ళో వున్న ముఖ్యలక్షణం ఏమిటీ అంటే వాడు నమ్మిన, వాణ్ణి నమ్మిన స్నేహితుడి కోసం ప్రాణాలు ఒడ్డగలడు. ఆ స్నేహితుడు తనపై పరమ పగబట్టిన పార్టీకి చెందిన వాడైనాసరే. అంతేకాదు అబ్బూరి (వరద) రాజేశ్వర్రావు (గారు) పరమ గడసరి, సొగసరి, ఇంకా ఎక్కువ మంచి మాట(కా)రి.

అబ్బూరి రామకృష్ణారావుగార్ని రాజేశ్వర్రావు తండ్రిగానే నాకు తెలుసు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆయన ఆంధ్రోపన్యాసకులుగా వుండేవారు. తెలుగు చెప్పే ఉపాధ్యాయులు అంతా ఆ రోజుల్లో పంచె కట్టుకొని, లాంకోటు వేసుకొని,

తలపాగా పెట్టుకొనేవారు. అబ్బూరివారు మాత్రం సూటు తొడుక్కొనేవారు. అందుచేత ఆయన ఇంగ్లీషు చెప్పేవారని అనుకొనేవాడ్ని. అయితే ఆ తర్వాత తెలిసింది, ఆయన ఆ రెండింట్లోనీ పాఠాలు చెప్పగలరని. అంతేకాదు సంస్కృతంలో కూడా చెప్పగలరని. విశ్వనాథ సత్యనారాయణగారు తమ గురువులు గురించి ప్రస్తావిస్తూ "నా అంతటివాడు వారికి శిష్యుడవడమే వారికి గొప్ప" అనే భావం కలిగేలా చెప్పేరని వినికిడి. రాజేశ్వరరావ్ తండ్రిగార్ని తత్తుల్యమైన భావంతో మేమంతా చిన్నప్పుడు చూసే వాళ్ళం. రాజేశ్వరరావే ఇంత గొప్ప వాడైతే రాజేశ్వరరావు తండ్రిగారు ఇంకా ఎంత గొప్పవారో అని.

ఆయన నిజంగా గొప్పవారని ఆ తర్వాత తెలుసుకున్నాను, చాలామంది లాగానే. వారి గురించి చాలామంది చాలా విషయాలు చెప్పేరు. అంతకుమించి ఆయన గురించి నేను చెప్పగలిగింది ఏమీలేదు. అయితే శ్రీశ్రీ గారు గురించి కాబోలు ఆయన చెప్పిన "తిరుగుబాట తిరిగిచాటు" అనే మాటలగురించి అనుకుంటాను కొన్ని అపార్థాలు కొందర్లో చెలరేగేయి. కాని నాకు తెలుసు ఆయన ఆద్యంతం అభ్యుదయ వాది.

నేను రాసిన 'తిరస్కృతి' అనే నాటకం గురజాడ కళాకేంద్రం వారి ఆధ్వర్యాన్న ఒకసారి ప్రదర్శింపబడింది. అబ్బూరి రామకృష్ణారావుగారు వచ్చి చూసేరు. ఆ నాటకంలో అప్పుడు ఒక పాత్రని నా మిత్రుడు శ్రీ చాగంటి సన్యాసిరాజు అద్భుతంగా పోషించాడు. ఆ తర్వాత అబ్బూరివార్ని కలుసుకున్నప్పుడు సన్యాసిరాజు పాత్ర చాలా బాగుందికదా అని అడిగేను. అప్పుడు ఆయన నవ్వుతూ చాలా చమత్కారంగా అన్నారు... "పప్పుచార్లో ఉప్పు చాలా బాగుంది కదా అంటే ఎలాగోయ్? పప్పుచారంతా బాగుండాలి కాని" అని అన్నారాయన.

నిజమే. నాటకంలో ప్రతి పాత్రా బాగుంటేనే నాటకం అంతా బాగుంటుంది.

నాటకం అంతా బాగుండాలనేది అబ్బూరివారి ధ్యేయం. జీవితం గురించి కూడా వారిధ్యేయం అదే.

విశాఖపట్నం—2<br>
24-4-1988

రాచకొండ విశ్వనాథ శాస్త్రి

# అబ్బూరి రామకృష్ణరావు- జీవిత కాలక్రమణిక

జననం

1896 20 మే, అనంతవరం (తెనాలి తాలుకా)లో— లక్ష్మీనరసింహశాస్త్రి, బాపమ్మ దంపతులకు. తాతగారి ఊరు చెముడుపాడులో బాల్యం.

విద్యాభ్యాసం

1909 ఐదోఫారం తెనాలి హైస్కూల్లో. మెట్రిక్యులేషన్ సికిందరాబాదు మహబూబియా కాలేజీలో, పార్శీభాషాధ్యయనం.

1912_13 ఎఫ్. ఎ. బందరు నోబుల్ కళాశాలలో.

1914 మహారాజా సంస్కృత పాఠశాలలో చేరిక, మైసూరు.

1916 వీణా శేషణ్ణ వద్ద వీణాభ్యాసం.

1917_18 కలకత్తా సిటీ కాలేజీలో నాన్—కాలేజియేట్ విద్యార్థిగా చేరిక.

1918_19 హేరంబచంద్ర మిత్రా వద్ద అధ్యయనం. బి. యె. లో ఉత్తీర్ణత.

[1932-33] ఎఫ్. ఎల్. ఎ. (లైబ్రరీసైన్సు)లో ఉత్తీర్ణత (ప్రైవేటుగా).

ఉద్యోగం

1926 బెజవాడలో ఆంధ్రాయూనివర్సిటీ స్థాపన కాగానే సి.ఆర్. రెడ్డి ఆహ్వానంపై లైబ్రరీలో చేరిక [30 ఆగస్టు].

1930 ఆంధ్రాయూనివర్సిటీ విశాఖకు తరలింపు.

1949 లైబ్రరీ సభలు, సమావేశాలకు హాజరు [ఢిల్లీ, మద్రాసు].

1950 లైబ్రరీ సైన్సు బోధన ప్రారంభం_యూనివర్సిటీలో.

1955 రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ స్థాపనకై ప్రణాళికలు. సమావేశాలకు కర్నూలుకు రాకపోకలు.

1959 యూనివర్సిటీ ఉద్యోగ విరమణ.

## సాహిత్యరంగం

1909 తెనాలి హైస్కూల్లో ఐదోఫారంలో ఉండగా 'జలాంజలి' రచన.

1912 'జలాంజలి' ప్రచురణ (ఆంధ్రభారతిలో).

1915 'మల్లికాంబ' ప్రచురణ.

1916 అబ్దుల్ రహమాన్ చుగ్తాయ్ చిత్రకళా ప్రదర్శన సమీక్ష (ఇండియా టు డే పత్రికలో). మైసూరు యూనివర్సిటీ స్థాపన సందర్భంగా సంపాదక లేఖ.

'ఊహాగానం' రచన.

1918—19 'ఊహాగానము—పూర్వప్రేమ' ప్రచురణ.

1919 'దుగ్గిరాల'తో కలిసి ఆంధ్రసారస్వత పరిషత్తు (మద్రాసు)కు హాజరు.

ఆంధ్రపత్రికలో సారస్వతానుబంధం ప్రారంభం. 'అభినవ కవితా ప్రశంస' మొదలైన వ్యాస పరంపర ప్రచురణ.

1920 కృష్ణాపత్రికలో 'రసమంజరి' శీర్షిక ప్రారంభం, అందులో 'నదీ సుందరి', 'సూర్యరాజు కథలు' ప్రచురణ.

దుగ్గిరాల ప్రోద్బలంపై "జలియన్‌వాలా బాగు" జంగం కథ—రచన, ప్రదర్శన—నిషేధం.

1923—24 'శారద' మాసపత్రికకు రచనలు (హనుమంతరాయ చిత్రకళా మందిరము', 'ఊహాలేఖ్యములు').

1925 శారదలో కన్యాశుల్క ప్రదర్శన గురించి సచిత్ర వ్యాసం (పేరు లేకుండా).

'మంగళసూత్రం' డిటెక్టివ్ నవలా రచన (1924).

1933 "నదీసుందరి" పుస్తకరూపంలో ప్రచురణ.

1936 వర్ధమాన లేఖక సంఘ స్థాపన, అధ్యక్షత. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ పత్రిక "ఇండియన్ లిటరేచర్" సంపాదక వర్గంలో చేకరు.

1942 'బొమ్మరిల్లు'—ఇబ్సెన్ నాటకం "ఎ డాల్స్ హౌస్"కు తెలుగు అనుసరణ (అలభ్యం).

1943 "ధాన్యలక్ష్మి" నాటక రచన (అలభ్యం).

1952 విశాఖ రచయితల సంఘ కార్యకలాపాలు— అబ్బూరి అధ్యక్షతన గురజాడ వర్ధంతి ఉత్సవాలు (నవంబరు).

1957 విశాఖ రచయితల సంఘం పక్షాన "నన్నయ పద ప్రయోగసూచి", వేర్వేరు వృత్తులకు సంబంధించిన పదజాల సేకరణ ప్రణాళిక, "ఈ శతాబ్దంలో తెలుగులో వచ్చిన కావ్య, నాటక, కథానికల పట్టిక తయారుకు కృషి. విశాఖ రచయితల సంఘం అధ్యక్షులుగా అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తును వ్యతిరేకిస్తూ, సాహిత్య అకాడమీ స్థాపన విషయంలో విద్యామంత్రి యస్. బి. పి. పట్టాభి రామారావు గారి ప్రకటనను అభినందిస్తూ లేఖ (జూన్ 20, 1957). ఫ్రెంచి అకాడమీ పద్ధతిలో సాహిత్య అకాడమీ ఆశయాలు—నియమావళి రచన. అకాడమీ స్థాపన. పదకోశాల నిర్మాణానికి తీర్మానం.

కేంద్ర సాహిత్య అకాడమీకై రవీంద్రుడి నాటకాల ('రక్తకరొబి', 'రాజా') అనువాదం.

1958 రవీంద్రుడి నాటకాల అనువాదం—'ముక్తధార', 'బ్రహ్మచారిసమితి'. తిక్కన పద ప్రయోగకోశం (అకాడమీ తరఫున).

1959 "కన్యాశుల్కం,— కథాద్వయ సమ్మేళనం" వ్యాసం, "విశ్వవీణ" డిసెంబరు (విశాఖ).

1960 సాహిత్య అకాడమీలో తెలుగు ఛందోవికాసం గురించి పరిశోధనకై ప్రతిపాదన.

1962 'హాప్ట్‌మన్ అండ్ అప్పారావు' (ఆంగ్లం), కన్యాశుల్కం— పూర్వోత్తర ప్రతుల పరిశీలన. గురజాడ శతజయంతి సంచికలలో— "మృచ్ఛకటిక" అనువాదం. 'సంక్రాంతి — సమ్ రికలెక్షన్స్" (ఆంగ్లం) — ఇలస్ట్రేటెడ్ వీక్లీ, 28 అక్టోబరు.

1963 "యూనిలిట్" గురజాడ సంచికకు (ఆంగ్లం) ముందుమాట. ఆవిష్కరణ సభలో ప్రసంగం. "కాంటెంపొరరీ తెలుగు రైటింగ్" (ఆంగ్లం) ఇలస్ట్రేటెడ్ వీక్లీ, 26 మే.
క్షేత్రయ్య పదాల గురించిన వ్యాసం (అముద్రితం).

1966 'ది తెలుగు స్టేజ్' వ్యాసం (ఆంగ్లం) ఇలస్ట్రేటెడ్ వీక్లీ, 4 సెప్టెంబరు.

1967 "ముఖ్యమంత్రి" నాటకరచన (బెర్నార్డ్ షా నాటికకు అనుసరణ).
"వార్షికోత్సవం" నాటకరచన (చెహోవ్ నాటికకు అనుసరణ).
"ప్రజాశత్రువు" నాటకరచన (ఇబ్సెన్ నాటికకు అనుసరణ).
కేంద్ర సంగీత నాటక అకాడమీ ప్రచురణల సలహా సంఘం సభ్యత్వం.

1968 'ది సెర్చ్ ఫర్ ఎ ప్లే' (ఆంగ్లవ్యాసం) ఇలస్ట్రేటెడ్ వీక్లీ, 2 జూన్.

1969 కేంద్ర ప్రభుత్వం, కేంద్ర సంగీత నాటక అకాడమీల ఆధ్వర్యాన రంగస్థల నిఘంటు నిర్మాణ సంఘ సభ్యత్వం. నిఘంటువు ప్రచురణ (హిందీ).

1970 తెలుగు అకాడమీ — రంగస్థల నిఘంటు నిర్మాణం— సంపాదకత్వం.

1974 ఆంధ్రా యూనివర్సిటీచే 'కళాప్రపూర్ణ' బిరుద ప్రదానం.
"వారం రోజులు వాల్తేరులో'— 'రజని' రేడియో ఇంటర్వ్యూ.

1975 ప్రపంచ తెలుగు మహాసభల్లో యివ్వదలచిన తామ్రపత్ర నిరాకరణ.

1976 అభ్యుదయ రచయితల సంఘంచే సన్మానం.

1979 ఏప్రిల్ 26 తారీఖున చివరి పద్యం.

## రాజకీయరంగం

1921 అఖిలభారత కాంగ్రెసు మహాసభలకు రామదండుతో హాజరు (30 మార్చి)

1932 రేవు కార్మికులకు రాత్రి పాఠశాల.

1933 బొంబాయిలో కమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శి జోగ్లేకర్‌తో సమావేశం. విశాఖలో కమ్యూనిస్ట్ పార్టీ స్థాపన. రేవు కార్మిక సంఘ స్థాపన.

1937 కామ్రేడ్ ఎం. ఎన్. రాయ్ విజ్ఞప్తిమేరకు కాంగ్రెసులో చేరిక. లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్‌మెన్ సభ్యత్వం.

1940 అఖిల భారత రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ స్థాపన—జాతీయ కార్య నిర్వాహక వర్గ సభ్యత్వం.

1941 తెనాలిలో రాష్ట్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ మహా సభలకు హాజరు.

1942 మద్రాసులో (అక్టోబరులో) ఫాసిస్ట్ వ్యతిరేక ప్రచారోద్యమం.

1972 పౌర హక్కుల సభకు అధ్యక్షత, విప్లవ రచయితల అరెస్టును నిరసిస్తూ ప్రసంగం.

## నాటకరంగం

1925 రామవిలాస సభవారి 'కన్యాశుల్కం' నాటక ప్రదర్శనకు సహాయం.

1931 ఆంధ్రాయూనివర్సిటీ డ్రమెటిక్ అసోసియేషన్ ప్రారంభం.

1932 'జస్టిస్,' 'క్యూపిడ్ రాంపెంట్,' 'కన్యాశుల్కం' నాటకప్రదర్శనలు.

1934 'నాట్యగోష్ఠి' ఉద్యమ ప్రారంభం.

1943 నాట్యగోష్ఠి ఆశయాలను అనుసరించే నాటక సంస్థ-నటాలి—స్థాపన.

1944 కన్యాశుల్కం, ప్రతిమాసుందరి ప్రదర్శనలు.

1959 నాట్య విద్యాలయ స్థాపన. అబ్బూరి డైరెక్టరుగా సంవత్సర పరిమితి గల సర్టిఫికేట్ కోర్స్ ప్రారంభం [1961 నుంచి రెండు సంవత్సరాల డిప్లొమా కోర్సుగా మార్పు].

1960 "పెద్దమనుషులు" నాటక ప్రదర్శన. రచన సోమంచి యజ్ఞన్న శాస్త్రి. ప్రయోక్త అబ్బూరి. [కేశవ మెమోరియల్ హైస్కూలు హాలులో— హైదరాబాదు]

కన్యాశుల్కం ప్రదర్శన. ఆం. ప్ర. సంగీత నాటక అకాడమీ

నిర్వహించిన నాటక సదస్సు సందర్భంగా [ఇండియన్ నేషనల్ థియేటర్ పక్షాన] 14 డిసెంబరు.

1961 కన్యాశుల్కం ప్రదర్శన [తేదీ, నెల తెలియవు] ఆంధ్రాయూనివర్సిటీ చే "ఎర్రగన్నేరు" [రక్తకరోబి] నాటక ప్రదర్శన [రెండు ప్రదర్శనలు].

1962 "కన్యాశుల్కం" ఉగాది—మార్చి 1962-పబ్లిక్ గార్డెన్స్‌లో కొత్త పద్ధతి రంగాలంకరణతో ప్రదర్శన.

"కన్యాశుల్కం" 21 సెప్టెంబరు. గురజాడ శతజయంతి కమిటీ పక్షాన [రవీంద్రభారతి] "కన్యాశుల్కం" 22 సెప్టెంబరు—ఆం.ప్ర. నాట్య సంఘం పక్షాన [రవీంద్రభారతి].

1963 'కన్యాశుల్కం" ప్రదర్శన.

1964 'కన్యాశుల్కం' ప్రదర్శన—నాట్యసంఘం పక్షాన — 27 మార్చి రవీంద్రభారతి.

'కన్యాశుల్కం' గుంటూరు [ఏకాదండయ్యపంతులు హాలు] నాట్యగోష్ఠి పక్షాన 17 ఏప్రిల్. "కన్యాశుల్కం" రైస్‌మిల్లర్స్ హాల్ విజయవాడ నాట్యగోష్ఠి పక్షాన 18 ఏప్రిల్. బ్రెఖ్ట్ శైలిలో శాహజీ రచన 'సతీదాన శూరం' యక్షగానం ప్రదర్శనకై ప్రయత్నం.

1965 "మృచ్ఛకటిక" ప్రథమ ప్రదర్శన నాట్యవిద్యాలయ రిపర్టరీ. రవీంద్రభారతి "నాటక ప్రయోగం" ఇంటర్వ్యూ 'కళావని' సంచిక 1965—66 [?]

1966 'కన్యాశుల్కం' ప్రదర్శన. రవీంద్రభారతి నాట్య విద్యాలయ రిపర్టరీ 6, ఫిబ్రవరి

"మృచ్ఛకటిక" ద్వితీయ ప్రదర్శన రవీంద్రభారతి. పదవ సాంవత్సరిక నాటకోత్సవం [సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌వారి యేర్పాటు]. న్యూఢిల్లీలో మృచ్ఛకటిక ప్రదర్శన రంగమంచ్ 15, మార్చి. 'కన్యాశుల్కం' ప్రదర్శన, ఆలిండియా ఫైనార్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ సొసయిటీ హాలులో 16 మార్చి. రాష్ట్రపతి భవన్‌లో రాష్ట్రపతి రాధాకృష్ణన్ సమక్షాన మృచ్ఛకటిక ప్రదర్శన.

టెలివిజన్‌లో మొదటిసారిగా తెలుగు నాటక ప్రసారం మృచ్ఛకటిక. టెలివిజన్‌లో అబ్బూరితో ఇంటర్వ్యూ. ఎస్. హెచ్. వాత్స్యాయన, ఎం.ఎన్. కపూర్.

దక్షిణ భారత నటీనట సమాఖ్య ఆధ్వర్యాన వరల్డ్ థియేటర్‌డే ఉత్సవం సందర్భంగా ఉపన్యాసం 27 మార్చి.

యునెస్కో ఆధ్వర్యాన జరిగిన అంతర్జాతీయ నాటకగోష్ఠి 'ఈస్ట్ వెస్ట్ సెమినార్'లో భారత ప్రతినిధిగా ప్రతినిధివర్గంతో పాల్గొనడం న్యూఢిల్లీ, అక్టోబరు. సెమినార్‌లో ఉపన్యాసం. వివిధ దేశాల నాటక ప్రదర్శనలకు హాజరు. ప్రఖ్యాత బ్రిటిష్ నటీమణి డైరెక్టర్ మిస్ జోన్ లిటిల్‌వుడ్‌తో ప్రాచ్య పాశ్చాత్య నాటక శైలుల గురించి చర్చలు. అబ్బూరి తలపెట్టిన నాగార్జునాచార్య జీవితం గురించిన నాటకం విషయంలో చర్చలు. సదస్సులో బ్రెఖ్ట్ భావాలను సమర్థిస్తూ ప్రసంగం.

1967 ఆప్టా (ఆంధ్రప్రదేశ్ థియేటర్స్ అసోసియేషన్) స్థాపన. అధ్యక్షులుగా అబ్బూరి ఎన్నిక. ప్రథమ మహాసభల సందర్భంగా "ముఖ్యమంత్రి"— అబ్బూరి రచన—ప్రదర్శన—16 సెప్టెంబరు (రాష్ట్ర ఎన్. జి. వో. ల సంఘంచే) ప్రకాశం ఆడిటోరియం — గాంధీ భవనంలో.

'వార్షికోత్సవం' ప్రదర్శన (చెహోవ్ నాటికకు అబ్బూరి అనుసరణ).

1968 ఇండియన్ నేషనల్ థియేటర్స్ ఆధ్వర్యాన జరిగిన సదస్సులో 'తెలుగు నాటకం—సమాజం' గురించి ప్రసంగం.

"బహురూపి" బెంగాలీ నాటక ప్రదర్శనల యేర్పాటు —ఆప్టా ఆధ్వర్యాన.

'బహురూపి' స్థాపకులు, ప్రసిద్ధ వంగనటులు శ్రీ శంభుమిత్రా, శ్రీమతి తృప్తి మిత్రాలతో గోష్ఠి — ఆకాశవాణి, హైదరాబాదు.

1970 నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా (న్యూఢిల్లీ) కాన్వొకేషన్ ఉపన్యాసం. బెర్టొల్ట్ బ్రెఖ్ట్ నాటకాల ప్రదర్శనలు చూడటం, జర్మన్ దర్శకులు కార్ల్ వెబర్‌తో గోష్ఠి, బ్రెఖ్ట్ నాటకాల రిహార్సల్స్ పరిశీలన.

కపిల కాశీపతి

# భావకవి పరంపరలో ద్వితీయుడు నే నెరిగిన మొదటి ఆధునిక కవి 'అబ్బూరి'

నేను ఎరిగిన మొదటి ఆధునికకవి అబ్బూరి రామకృష్ణరావు. చదివిన అభినవకవిత రాయప్రోలు సుబ్బారావుగారు గారిది. అబ్బూరి పరిచయం 1920 పూర్వమే కలిగింది. రాయప్రోలువారి సందర్శనభాగ్యం 1936 దాకాకలగలేదు. ఇద్దరూ గుంటూరుజిల్లా వాస్తవ్యులే.

చాలా చిన్నతనం. రామకృష్ణరావు అప్పుడే కలకత్తానించి గుంటూరు విజయంచేశాడు. అంతా బెంగాలీవేషం. జులపాలజుట్టు, కళ్లజోడు, పచ్చగా బక్క పలచని మనిషి. ముఖంలో విజ్ఞానం వుట్టిపడే వర్చస్సుతో, పైలాపచ్చీసుకి ఇద్దర్ని వున్న పరువం. కనుతుదల మలుపులోనూ, పెదవుల విరుపులోనూ ఒక కొంటె తనం. లోకాన్ని చూసి లోలోపలనవ్వుకొనే స్వభావం కనబడేది. అరండల్ పేట ఆచార్లుగారి లైనులో రామకృష్ణరావు అన్నగార్లిద్దరూ, అప్పగారూ కాపురాలువుండే వారు. వారెవరింట్లోనో కవిగారి విడిది. సాయంకాలం షికారుగా వెళ్లేవాడు మాయింటిముందు నించి. ఒకటి రెండుసార్లు భార్యామణితో కూడా కలిసి వెళ్ళినట్లు జ్ఞాపకం. ఆరోజుల్లో అటువంటి వాహ్యాళి విడ్డూరమే. ఎందుకో ఆనాడే రామకృష్ణ రావంటే గౌరవం, ఆపేక్ష కలిగాయి; ఈనాటికీ నిలిచిపోయాయి. జ్ఞానం కలిగిన తర్వాత మా అన్నదమ్ములికి స్నేహితుడైనాడు. మాయింట అతిథిగావున్నాడు. గిరీశం చెప్పినట్టు అబ్బూరితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషను. చెప్పినజోక్ చెప్ప కుండా చెబుతాడు. ఎన్నాళ్ళైనాసరే. అతనితో బాతాఖానీ నిజంగా విద్య. ఇంగ్లీ షులో, సంస్కృతంలో, తెలుగులో, బెంగాలీలో పండితుడు.

అప్పటికప్పుడే ఆయన కవిత సుప్రసిద్ధమైంది. విద్యార్థిగా వుండగా వ్రాసి నాడు. ఆ కవిత విద్యార్థులికి పఠనీయ గ్రంథంగా నిర్ణయించారు విద్యాశాఖవారు.

సికింద్రాబాదులో మహబూబ్ కాలేజీ విద్యార్థిగా వుండగా అతనికి కలిగిన కిశోర ప్రేమానుభవ ఫలితమే ''మల్లికాంబ''. అతనికి ప్రియురాలి "మోమున మోము జేర్చి ముద్దిడ కోరికలేదు". ప్రేమకు దారి జూపగ వరించినాడు నెచ్చెలిని.

మైసూరులో కొన్నాళ్లు గడిపాడు. అబ్బూరి రాయప్రోలు వారిద్దరికీ కట్ట మంచి రామలింగారెడ్డిగారి అభిమానం వుండేది. ఇద్దరికీ ప్రథమ ఉద్యోగప్రాప్తి వారి ఆశీర్వచనంతోనే కలిగింది. వంగనారుతో వచ్చినాడు, కన్నడకస్తూరి సేకరించినాడు; తెనుగుతేట రుచి చూపించినాడు. భావకవి పరంపరలో ద్వితీయుడుగా నిలిచినాడు. ఇతనికి తిక్కన అభిమాన కవి. భారతం చదివిన తర్వాత మనం వ్రాయడమేమిటి అనుకున్నాడు ఒకప్పుడు. రాయప్రోలు అభినవకవిత ప్రభావం ఇతని మీద ఉన్నది. తన రెండవకావ్యంపేరు "ఊహాగానం" అన్నాడు. ఎంత వ్రాయగలిగిన శక్తివుండో అంత తక్కువ వ్రాసినాడు. నాటకం మీద ప్రీతి, "నదీసుందరి" వ్రాసి వూరుకున్నాడు. "కన్యాశుల్కం" విద్యార్థులచేత వేయించి, తాను రామప్పపంతులు వేషంవేసి ఆ పాత్ర విశిష్టత నిరూపించినాడు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో లైబ్రేరియన్‌గానూ, ఉపన్యాసకుడుగానూ వుండి తనకి పుటకతో వచ్చిన సంస్కారం కొందరికి పంచియిచ్చినాడు. అటువంటివారిలో మా సోమంచి యజ్ఞన్నశాస్త్రి ఒకడు. శాస్త్రీ నేనూ కలిస్తే రామకృష్ణరావు సంగతి మాట్లాడక తప్పదు.

రామకృష్ణరావు 'రాయిస్టు'. అనగా ఎం. ఎన్. రాయ్ అనుయాయుడు. అతనూ నేనూ కలిసి ఢిల్లీలో రాయ్ యింటికి వెళ్ళాం. అప్పుడు రాయ్ బ్రిటీషిండియా ప్రభుత్వంవారికి చాలా ముఖ్యుడు. అదే రాయ్‌తో నాకు తొలి పరిచయం. రామకృష్ణరావంటే రాయ్ దంపతులికి విపరీతమైన గౌరవం. ఆదరమూను. తిరిగి వచ్చేటప్పుడు, బస్సుకోసం మధురా రోడ్డులో ఢిల్లీగేటుదగ్గిర నుంచున్నాం. ఇద్దరమూనూ. రాయ్ సంగతి ప్రస్తావిస్తూ ఆయన రూపురేఖలు విమర్శించాను. రామకృష్ణరావుకి కొండంత కోపం వచ్చి నన్ను తన్నడానికి సిద్ధమైనాడు. ఇంతలో మాముందు వో పెద్ద ఇటికల లారీ నుంచుంది. అందులోంచి హరీంద్రనాథ చటోపాధ్యాయ దిగాడు. ఇందులో సవ్వారీ చేస్తున్నావేమిటని అడిగితే, ఎవర్నో చూసి వస్తున్నానని అసందర్భంగా జవాబు చెప్పాడు. హరీన్ రాకపోతే నా పని ఏమయ్యేదో అనుకుంటాను.

ఆవేళ ఢిల్లీలో అభ్యుదయ రచయితల సమావేశం. ముగ్గురం కలసి ఆ సభకి వెళ్లాం. శ్రీశ్రీ కూడా ఆ సభకి వొచ్చాడు. అటుతర్వాతే అనుకుంటాను శ్రీశ్రీని ఢిల్లీ రేడియోకు పిలిపించుకున్నాం. అతనందులో ఇమడలేదు. నాకు శ్రీశ్రీ తొలిరచనలలో ప్రతిభ తెలియజేసినవాడు రామకృష్ణరావు.

రామకృష్ణరావు కవిత్వ కంసాలి. మాటలు రత్నాలులాగ పొదుగుతాడు. అతను శిల్పి. అతని ఆదర్శం గొప్పది. తన సృష్టి తనకేనచ్చదు. కవినిగదాఅని రొట్ట వ్రాయకుండా వ్రాసింది కాస్తా ఎంతో చక్కగా వ్రాసి పూరుకున్నాడు. అతను వో డిటెక్టివ్ నవల వ్రాశాడంటే, ఎవరూ నమ్మరు. దానిపేరు "మంగళసూత్రం". అబ్బూరికి చిన్నతనంలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి శుశ్రూష కూడా లభించింది. ఆయన కథ లెన్నైనా చెబుతాడు. చిన్నతనంలో గురజాడ వారి పాట ముత్యాలు, దుగ్గిరాలవారి మాట రత్నాలు మాసొమ్ము. ఇవి రెండూ రంగరించగా నా తొలికవిత "ఆంధ్రరత్నం" వొలికింది — గోపాలకృష్ణయ్య కావలసినంత గొప్పవాడు కాలేదని విచారం.

నింగి కెగయ నిలిపికట్టిన
మబ్బుమేడలు మాయమయ్యేను

డెబ్భయ్యో పడిలోవున్న రామకృష్ణరావు విషయంలో కూడా అంతే అను కోవాలా అనిపిస్తుంది. అప్పుడప్పుడు, చిన్ననాటి అభిమాననగరం సికింద్రాబాదు. పెద్దవాడై ఆంధ్రుల ముఖ్యనగరం హైదరాబాదులో వుంటున్నాడు. ఏదోవిధంగా సాహిత్య వీధిలోనే నడుస్తున్నాడు.

(పుస్తక ప్రపంచం — ఆగస్టు, 1965)

సోమంచి యజ్ఞన్న శాస్త్రి

# అబ్బూరి రామకృష్ణారావుగారూ - నేనూ

పందొమ్మిది వందల ముప్పయి రెండు, జూను నెలలో, బి.ఏ. (ఆనర్సు) చదవడానికి నేను విశాఖపట్నం చేరుకున్నాను. అంతకి మునుపు ఒక్కసంవత్సరం క్రితమే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆనర్సు కోర్సు ప్రారంభమయింది. తెలుగు, హిస్టరి, పాలిటిక్సు, ఎకనమిక్సు సంయుక్త సబ్జక్టులతో రెండు శాఖలలోనూ కలిసి, పదహారుమందో, పద్దెనమండుగురో విద్యార్థులుండేవారు. నేను చేరిన సంవత్సరం సైన్సు శాఖలు కూడా ప్రారంభమయాయి. అన్ని కోర్సులకీ కలిపి సుమారు నలభై మంది విద్యార్థులము చేరాము. గత సంవత్సరంలో చేరిన వారితో కలిసి, యూనివర్సిటీ మొత్తానికి అరవై మందికి మించని విద్యార్థులం. రాధాకృష్ణగారు వైస్ ఛాన్సలరు, రామకృష్ణారావుగారు 'లైబ్రరీ – ఇన్ – చార్జి'.

ఆ సంవత్సరమే ఒక ఇంగ్లీషు నాటకమూ, ఒక తెలుగు నాటకమూ వెయ్యాలని విద్యార్థులం నిశ్చయించుకున్నాము. ఇంగ్లీషులో రవీంద్రుడి Sacrifice, తెలుగులో విశ్వనాథవారి నర్తనశాల ఎన్నిక అయాయి.

నేను రాజమహేంద్రవరంలో, భమిడిపాటి కామేశ్వరరావుగారి స్వయం తరిఫీదులో, ఆయన నాటికల ప్రదర్శించడం నేర్చుకుని, విశ్వవిద్యాలయంలో చదువు ప్రారంభించిన కొద్ది నెలల్లో, భమిడిపాటివారి రెండు నాటికల ప్రదర్శనకి పూనుకున్నాను. నిజానికి, ఆప్రదర్శనతోనే మా నాటక కృషి ప్రారంభమయింది. నాటకాభిమాని అని తెలుసుకుని రామకృష్ణారావుగారిని ఆహ్వానించే నిమిత్తం వారిని మొట్టమొదటిసారిగా కలుసుకున్నాను "కామేశ్వరరావుగారి ఫార్సులు చిన్న కాలేజీలలో పనికొచ్చినా, యూనివర్శిటీ అంతస్తుకి తగవు. మంచి నాటకమేదైనా ఎన్నుకో" అని సలహాయిచ్చారు. "అయ్యా నాకు అనుభవమున్న దానితోనే ప్రారంభిస్తున్నాను. మిమ్మల్ని కూడగట్టుకుని మంచి నాటకాలు వెయ్యకపోము. ఈ లోగా మానాటికలు చూడ్డానికిరండి" అని పట్టుపట్టాను. మొదటిపరిచయంలోనే

ఆయనంటే, అప్యాయత, చొరవ, కలిగాయి. నన్ను వొదిలించుకోలేక, కొంచెం సణుగుతూనేకాబోలు, వారా ప్రదర్శనకి హాజరయారు. కడుపుబ్బ నవ్వుతూ చివరి దాకా కూర్చున్నారు. దానితో మా పరిచయం కొంత "సిమెంటు" అయింది.

Sacrifice నాటకానికి మాకు Director గా, ఫిలాసఫీలో రీడరు, డాక్టర్ సేన్ ని రాధాకృష్ణగారు నియమించారు. అసలు రాధాకృష్ణగారికి మేము ఇంగ్లీషులో నాటకం వెయ్యడమే ఇష్టంలేదు. కాని మా పట్టుదలకి లొంగి అనుమతి యిచ్చి, డా. సేన్ గారిని తగిలించారు. సేన్‌గారికి నాటకానుభవం ఏమీ వున్నట్టు లేదు. ఆయన ఒక బెంగాలీ అవడమూ, రవీంద్రుడి భక్తుడవడం, ఈ రెండే మా నాటకం డైరెక్టు చెయ్యడానికి, ఆయనకివున్న అర్హతలు. ఆయనది శల్యసారథ్యమై, ప్రదర్శన యోగ్యత సంపాదించుకోలేక పోయింది. ఈ నాటకం వీళ్లు వేస్తే అభాసుతప్పదని సేన్‌గారి శిఫారసు మీద రాధాకృష్ణగారు నాటక ప్రయత్నం మానిపింపచేసేశారు. నర్తనశాల విజయవంతంగా ప్రదర్శించాము, తరువాత. ఇంగ్లీషు నాటకపు మాగోడు విని మమ్మల్ని ఓదార్చినవారు రామకృష్ణారావుగారు. రామకృష్ణారావుగారికీ, రాధాకృష్ణగారికీ స్నేహంలాటి పరిచయ ముందని, సేన్ బారినుంచి మమ్మల్ని రక్షించమని రాధాకృష్ణగారితో చెప్పమని కోరుతూ, రామకృష్ణారావుగారిని నేకలిసేవాడిని. నాకేవో పిట్టకథలూ, అప్పుడప్పుడు చాటు పద్యాలూ వినిపించి, ఓదార్చి పంపించేసేవారు. అసలు సమస్యా తీరకపోయినా, ఈ కథలు, నాటకపు డైరెక్షను విధానాలూ, మమ్మల్ని మరింత సన్నిహితం చేశాయి. రాధాకృష్ణగార్జి జోక్యం లేకుండా ఓ ఇంగ్లీషు నాటకం వేసి తీరాలని కూడా అప్పుడే నిర్ణయించుకున్నాము.

ఇది ఇలా వుండగా, మాకు Modern History లెక్చరర్‌గా, హిరేన్ ముఖర్జీ యూనివర్సిటిలో చేరారు. ఆయన ఇంగ్లండులోనే వుండగా, కమ్యూనిష్టు అభిమాని అయాడు. కపూర్ అన్న మరో యువకుడు, ఇంగ్లీషు లెక్చరర్‌గా చేరాడు. ముఖర్జీ రాకతో మాలో కొంత రాజకీయ చైతన్యం కలిగింది. రామకృష్ణరావుగారు కూడా కమ్యూనిజము వైపు ఆకర్షితులయినవారే. ముఖర్జీ ప్రోత్సాహంవల్ల ఒక Study group ఏర్పాటయింది. ముఖర్జీ ప్రోద్బలంవల్ల నేను అందులో చేరాను. రామకృష్ణరావుగారు ఆ గ్రూపులో ఒక ప్రధానవ్యక్తి. నాటకాలూ, రాజకీయ వాద సంవాదాలూ, మా ఇద్దరినీ మరింత సన్నిహితం చేశాయి. ఆ వాతావరణంలో, మేము అదివరకే అనుకున్న ప్రకారం, ఇంగ్లీషు

నాటక ప్రదర్శనకి తయారీ ప్రారంభించాము. ఎన్నిక చేసిన నాటకం, Gals-worthy వ్రాసిన నాటకం, జస్టిస్. కపూరు నాటకానికి డైరెక్టర్. రామకృష్ణారావు గారు, ఒక కీలకమైన పాత్ర, ప్లీడరుగారి పెద్ద గుమాస్తాగారి పాత్ర ధరించారు. నాది నాటకంలో ఓ చిన్న పాత్ర. కాని ఏ విధంగానో, కార్యక్రమ నిర్వాహణా బాధ్యత అంతా నామీదికి వచ్చింది. ఆ ఇంగ్లీషు నాటకంలో రామకృష్ణారావుగారి మాటతీరు, నటన చాలా చక్కగా అమిరాయి. అంతకిముందు ఆయన రచయిత, పిట్ట కథలు చెప్పి అలరించగల సంభాషణాచతురుడు అనే తెలుసుగాని, నటుడు అనే విషయం తెలియదు. ఆ నాటకంలో ఆయన నటనా చాతుర్యం గొప్పగా ప్రదర్శితమయింది. అయితే, ఆయనది తేలికగా నిరుత్సాహపడిపోయే తత్వంలా కనిపించింది. రిహార్సల్సులో ఒక్కనాడు ఒక్క వాక్యం తిన్నగా రాకపోయినా, చలించిపోయి, "నేను తిన్నగా వెయ్యగలనంటావా" అని నన్ను ప్రశ్నించేవారు. నాటకపు ప్రదర్శన రోజుకి, హనుమంతుడికి తనశక్తిని గుర్తుచేసే స్నేహితుడిగానే తయారయాను. వేసే పాత్ర చిన్నదయినా, చదువుమానుకుని నాటకంలో నిమగ్నుడనై పోతున్నానని మామిడిపూడి వెంకటరంగయ్యగారు నన్ను హెచ్చరించారు. కాని రామకృష్ణారావుగారి కుడి భుజాన్నయిపోయిన నేను, కేవలం నాపాత్రధారణతో తృప్తిచెంది, ఎలా బయట పడగలను? జస్టిస్ నాటక ప్రదర్శనం చాలా తృప్తికరంగా పూర్తయింది. ఆ నాటక విజయానికి, రామకృష్ణారావుగారి పాత్ర నిర్వహణ ఓ ప్రధాన కారణమవడానికి నాకేమీ సందేహంలేదు.

మరు సంవత్సరం — 1934 అనుకుంటాను — రామకృష్ణారావుగారి నాయకత్వం కింద, కన్యాశుల్కనాటకం చేపట్టాము. రామకృష్ణారావుగారు, కన్యాశుల్కంలో గిరీశం, అనవసరంగా ప్రయోజనాన్ని మించి విజృంభించిన పాత్ర అని, ఆ పాత్రని తగ్గించి, నాటకం ప్రదర్శిస్తేనే, నిజమైన నాటక నైపుణ్యం బయలు పడుతుందని అంటూవుండేవారు. వారి ఆలోచనా సరళిని అనుసరించే కన్యాశుల్కం ప్రదర్శిద్దామని మేము మద్దతు ఇచ్చాము. ఆ విధంగా నాటకాన్ని కత్తిరించారు. రామకృష్ణారావుగారు రామప్ప పంతులు. నేను కరటక శాస్త్రిని. డా. అయ్యగారి వీరభద్రరావు లుబ్ధావధాన్లు. ఉండుండి రామకృష్ణారావుగారికి సందేహమూ, భయమూ కూడా పుట్టుకొచ్చేవి. మనం సంస్కరించి తయారు చేసిన నాటకం, ప్రజలు ఆమోదిస్తారా? రామప్పపంతులుగా నా గొంతుక తిన్నగా వినిపిస్తుందా? నా నటన బాగుందా? కన్యాశుల్క నాటకంలో కూడా నాపాత్ర

కరటక శాస్త్రికి పరిమితంకాలేదు. రామకృష్ణారావుగారి భయ సందేహాలు పార దోలుతూ, అయనకి ప్రోత్సాహమిస్తూ, ఆయన ఆలోచనలకి కొంతవరకు రూపం కలిపించే బాధ్యత నాకు లభించింది. స్థానం నరసింహారావుగారిచేత మధురవాణి వేషం వేయించాలని ఆయన విశాఖపట్నం రాగా, టర్నర్ చౌల్ట్రిలో కలుసుకు మాట్లాడాము. కుదురలేదు. దాడి గోవిందరాజులు గారి చేత వేయించారు. ఆ నాట కానికి "వాస్తవిక" సెట్టింగులు తయారు చెయ్యడము ఒక ప్రత్యేకత. గిరీశాన్ని తగ్గించినా, నాటకం చాలా బాగుందని పెద్దలందరూ మెచ్చుకున్నారు. నాటక నైపుణ్యం ఆశించినట్టుగా ప్రదర్శితమయిందని ఒప్పుకున్నారు. అన్నిటినీ మించి నది, రామకృష్ణరావుగారి నటనాచాతుర్యం. తరువాత ఆ నాటకం, మరి కొన్ని మారులు ప్రదర్శితమయింది.

## II

1934 – 35 లో మాకు కొంత బాధ కలిగించిన ఒక పరిణామం జరి గింది. రామకృష్ణారావుగారప్పుడు అసిస్టెంట్ లైబ్రేరియన్‌గా కాబోలు పదవిలో ఉండేవారు. లైబ్రరీ ఆరంభదశలో కష్టించి దానిని ఆర్గనైజ్ చేసినదంతా ఆయనే. కాని ఆయనమీద థామస్ అన్న మరో ఆఫీసరుని వేశారు, లైబ్రేరియన్‌గా. రామ కృష్ణారావుగారితో భాషించి ఆనందించడానికి మిత్రులు చాలామంది వస్తూవుండే వారు. అందులో ఒక గ్రూపు, నేను, శ్రీశ్రీ, ఉల్లి తిరపతి. మా అభిరుచులు కొంతవరకు వేరు. కాని ఎలాగో, ఎప్పుడో కలిసిపోయాము. లైబ్రరీకి కొత్తగా కాని, లైబ్రరీ పట్టీలో చేర్చని పుస్తకాలు కూడా మేము తీసుకు పోగలిగేవాళ్ళం. వ్యవధులు మించి బాతాఖానీ కొట్టేవారిమేమో కూడా. ఏతావాతా, రామకృష్ణారావు గారు లైబ్రరీ పనికంటె బాతాఖానీ ఎక్కువ కొడుతున్నాడనీ, ఆయన అలసత వల్ల లైబ్రరీ పుస్తకాలు చాలా పోతున్నాయనీ, థామస్ రాధాకృష్ణగారికి ఫిర్యాదు చేశాడుట. తత్ఫలితంగా, రామకృష్ణారావుగారిని, లైబ్రరీనించి, తెలుగు లెక్చరర్‌గా బదిలీ చేశారు. లెక్చరర్ పదవి, నిజానికి అసిస్టెంట్ లైబ్రేరియన్ పదవి కంటె మంచిది. కాని ఆయన సంభాషణ, బాతాఖానీ కింద జమకట్టి ఆయనని బదిలీ చేశారని నాకు ఒక పక్క కోపమూ, నాలాటి వాళ్ళవల్ల ఇలాటిది జరిగిందేమోనన్న బాధా కలిగాయి. అయనని ఎలాగైనా లైబ్రరీలోనే వుంచమని, కొంతమంది అప్తుల ద్వారా, రాధాకృష్ణగారికి విన్నపాలు పంపించాము. రామ

కృష్ణారావుగారి మంచికోసమే తానిది చేశాననీ, సాహిత్యంతో తిరిగి సంపర్కం కలగడంవల్ల రామకృష్ణారావుగారి Creativity తిరిగి వికసిస్తుందని రాధాకృష్ణ గారు సమాధానం చెప్పి తప్పించుకున్నారు. పని జరగక పోయినా, రాధాకృష్ణ గారికి రామకృష్ణారావుగారి మీద గౌరవమూ, అప్యాయతా వున్నాయని ఒప్పుకోవలసొచ్చింది.

III

1935 జూన్‌లో మా ఆనర్సు పరీక్ష ఫలితాలు తెలిశాయి. నాకు ఒక రిసర్చి స్కాలరుషిప్పు లభించింది; నెలకి ముప్పయి రూపాయలు: ఒక సంవత్సరం ఎకనమిక్సు శాఖలో రిసర్చి. కాని యూనివర్శిటిలో నాకు గైడ్ లభించ నందున, కలకత్తాలో, డా. బసవరసు రామచంద్రరావుగారన్న ప్రొఫెసరు కింద రిసర్చి చెయ్యడానికని, ఆ నగరానికి వెళ్లాను. కాని రిసర్చేమో సాగలేదు. నేను బెంగాలీ ఫిలుములు, నాటకాలు చూడ్డంలో నిమగ్నుడనైపోయాను: నే విశాఖ పట్నం వొదిలిన కొద్ది నెలల్లో హిరేన్ ముఖర్జీకూడా తన లెక్చరర్ పదవికి రాజీనామా యిచ్చి, కలకత్తా వచ్చేశాడు. మే మక్కడ తరచు కలుసుకునే వాళ్ళం. రామకృష్ణారావుగారిని గురించి ముచ్చటించుకునే వాళ్ళం.

ఆ సంవత్సరం లక్నోలో జరిగే కాంగ్రెస్ సభకి నేవెళ్ళదలుచుకున్నానని రామకృష్ణారావుగారికి వ్రాశాను. ఆ సందర్భంలోనే Progressive Writers Conference అక్కడ జరుగుతోందని, దానికి ఆహ్వానం మీద తామూ రాబోతున్నామనీ ఆయన వ్రాశారు. ముఖర్జీకూడా వస్తున్నట్టు చెప్పారు. ముగ్గురం కలకత్తాలో కలుసుకుని లక్నోకి బయలు దేరాము. ఆనాటికి నేను కాంగ్రెస్—కాంగ్రెస్‌లో అంతర్గతంగావున్న సోషలిష్టు పార్టీ—అభిమానిని. ముఖర్జీ పదహార ణాల కమ్యూనిష్టు. నాకు అర్థమైనంత వరకు, రామకృష్ణారావు, కమ్యూనిష్టు అభిమాని. కాని కమ్యూనిష్టు కాదు. మా అభిరుచులు వేరు. ఉద్దేశాలు కొంత వరకు వేరు. కాని ముగ్గురమూ పరస్పరాభిమానులం. నాకూ రామకృష్ణారావు గారికీ స్నేహం మరింత బలవత్తరం.

లక్నోలో రామకృష్ణారావుగారూ, నేనూ Progressive Writers Conference తెలుగు డెలిగేట్లుగా నమోదు అయాము. ముఖర్జీ బెంగాలీ రచయితగా. తెలుగు భాష అంటే అక్కడ ఎవరికీ తెలీదు. మద్రాసీయులము కనక మద్రాసీ భాషీయులము: మద్రాసీ భాషలేదని ఫలానిది తెలుగు భాష అనీ సంజా

యిషీ చెప్పుకోడానికి మేమూ తికమక పడేవారము, వినే ఇతర డెలిగేట్లూ confuse అయిపోయేవారు. ఈ పరిస్థితి మా ఇద్దరికీ చిరాకు తెప్పించేది, ముఖర్జీని ఈ బాధ అంటకపోయినా. నాకు అసలే కాంగ్రెస్ సమావేశంలో వున్న ఆకర్షణ యీ Progressive Writers' Conference లో లేదు. ఆ కాన్ఫరెన్సు డెలిగేట్లలో వున్న "అజ్ఞానం" నన్ను మరింత విముఖుడిని చేసింది. మేము రెండు మూడువేల మైళ్ళ దూరంలో వున్న తెలుగుదేశంనుంచి వచ్చామన్న ఒక్క ముక్క వారికి అర్థమయింది. మమ్మల్ని ఎవరికి పరిచయం చేసినా, మూడువేల మైళ్ళ దూరంనించి వచ్చిన డెలిగేట్లు అని మాత్రమే పరిచయం చేసేవారు. రామకృష్ణారావుగారికీ ఇది చాలా ఆందోళన కలిగించేది. నేను కాంగ్రెస్ సమావేశానికి వెళ్ళిన సమయంలో ఒకటి రెండు మారులు రామకృష్ణారావుగారు కాన్ఫరెన్సులో ప్రసంగించారనీ, భాష విషయమై కొంత ఘర్షణ పడ్డారనీ విన్నాను.

మా ముగ్గురికీ Kaiser Bagh అన్న భవనంలో వసతి ఏర్పాటు చేశారు. ఆ బసలో సౌకర్యాలు తిన్నగా వుండేవి కావు. అది రామకృష్ణారావు గారిని కొంత కలచివేసేది. ముఖర్జీకి అవన్నీ సామాన్యంగా సంభవించే లోపాలే అనిపించేది. బసలో రామకృష్ణారావుగారికీ, ముఖర్జీకీచాలా వాదోపవాదాలు జరిగేవి. ఏవో అభిప్రాయ భేదాలు పొడచూపుతున్నట్టు నాకు అనిపించేది.

ఓనాటి ఉదయం మేం ముగ్గురమూ టిఫిను తిని సమావేశానికి వెళదామని బయలుదేరాము. వేడివేడి జిలేబీ తప్ప మాకు టిఫినేమీ కనిపించలేదు. జిలేబీ తినేసి మంచినీళ్లో, లస్సీవో తాగేసి సమావేశానికి వెళ్ళిపోదామని ముఖర్జీ. పరగడుపున మజ్జిగ తాగే అలవాటు లేదన్నారు. పరగడుపంటె? సరియైన అర్థం చెప్పాలంటే, "not your own stomach" "Empty stomach" అన్నమాట సామాన్యార్థంలో. Empty stomach లో లస్సీ ఎందుకు పొయ్యకూడదని వాదోపవాదం. అది ఒకరికి బూర్జువాల మూఢ నమ్మకాల నిరసనగానూ, మరొకరికి కమ్యూనిష్టుల, మన అన్ని సాంప్రదాయాల నిరసనగానూ పరిణమించింది. గొంతుకల స్థాయి హెచ్చింది. ఇదంతా హాస్యాస్పదమయిన సంఘటనే. తరవాత హాయిగా కలిసి తిరిగాము ముగ్గురమూ. కాని రామకృష్ణారావుగారి సున్నితమైన మనసుమీద, స్పందించే హృదయంమీద ఏదో దెబ్బ తీసిందని నేననుకున్నాను. కొంతకాలం తరవాత రామకృష్ణారావుగారు, కమ్యూనిష్టు పంథా విడిచి M. N.

Roy శిష్యవర్గంలో చేరారని విని ఇది లస్సీ విప్లవమని చమత్కరిస్తూ ఓ కథ వ్రాశాను.

## IV

కలకత్తాలో నా టైము వృధాగా గడిచి పోయింది. రిసర్చి సాగలేదు. మద్రాసులో "లా" చదువుకి చేరవలసొచ్చింది, (1936–37; 37 – 38). నా మొదటి సంవత్సరపు పరీక్షల సమయంలో, కొన్ని రోజులు నాతో గడపడానికి రామకృష్ణారావుగారు మద్రాసు వచ్చారు. నే యూనివర్సిటీ వొదిలిన తరువాత, మరో మారు కన్యాశుల్కం ప్రదర్శించామనీ, మద్రాసులో తిరిగి ప్రదర్శించాలని వుందనీ, మధురవాణిగా, కొమ్మూరి పద్మావతిగారిని చేర్చుకోవాలని పద్మావతిగారింటికి రెండు మూడు మారులు వెళ్లాంగాని ఆవిడ ఆరోగ్యం సరిగాలేనందువల్ల అప్పట్లో వేషం వెయ్యలేమన్నారు.

కన్యాశుల్కాన్ని పునాదిగా పెట్టుకుని నాటకోద్యమం లేవదియ్యాలి అని ఆయన కలలు కనేవారు. ఉభయులమూ కలిసి కొన్ని వూళ్లు తిరిగి సభ్యులని చేర్పించాలని ప్రయత్నించాము. కాని ఫలించలేదు. 1939 సెప్టెంబరులో నాకు ఆల్ ఇండియా రేడియోలో వార్తా శాఖలో ఉద్యోగం రావడంతో మేం కొంత దూరమయాము. ఆంతకంటె నేను క్విట్ ఇండియా ఉద్యమం సమర్థిస్తూ, ఉద్యోగం వదులుకుని జైలుకువెళ్లాను. ఆయన "నటాలి" స్థాపించి, నాటకాలు ప్రదర్శించారు.

## V

నేను 1944లో బొంబాయి చేరిన తరవాతగాని మాకు కలుసుకుని హృదయాలు విప్పి మాట్లాడుకునే అవకాశం కలగలేదు. ఆయన 'నటాలి' స్థాపన విషయమై నాకేవిధమైన సంకోచమూ కలగలేదు. ఆధునిక నాటకాలకి ఒక ఉద్యమం అవసరమని నేనూ నమ్మిన వాడిని. దారులు అప్పుడప్పుడు వేరైనా, మా స్నేహ బాంధవ్యాలు ఏనాడూ పలచబడలేదు.

వారు హైదరాబాదు చేరిన తరవాత అనేక మారులు కలుసుకున్నాం. ఆయన సునిశిత దృష్టికి గోచరం కాని విషయముండేదికాదేమో. కేవలం నాట

కోద్యమం మీదే కాక, అనేక మౌలిక విషయాలమీద, కృషి జరగాలని ఆయన తహతహ పడేవారు. పదకోశాల తయారీ, మాండలిక పదాల సేకరణ మొదలయిన విషయాలెన్నో చేపట్టాలని, చేపట్టించాలని ఆయన ఆతృత. కాని, ఆయనది, అతిసున్నితమైన మనసు. ఏమాత్రం అన్యాయం జరిగినా, వేసిన పథకం కొంచెం వక్రించినా, అమితంగా బాధపడిపోయేవారు. దానివల్ల వారికి నైరాశ్యం కలిగి, వారి శక్తికి లోబడిన విషయాలు కూడా చేపట్టడం మానుకుంటున్నారని నాకు అనుమానం కలిగేది. అయన సాహిత్యానికి, నాట్యరంగానికి చెయ్యవలసినంత, చెయ్యగలిగినంత సేవ చెయ్యడమే లేదని ఆరాటపడుతూ, వాదిస్తూ, ఘర్షణపడుతూ వుండేవాడిని.

రామకృష్ణారావుగారి రచనలు, ఆయన నడిపిన, పాల్గొన్న ఉద్యమాలలో ఆయన శక్తి సామర్థ్యంలో ఒక అల్ప అంశం మాత్రమే. అణువణువునా స్పందించే బహుముఖ ప్రజ్ఞావంతుడు ఆయన, గొప్పరచయిత. గొప్ప భావుకుడు. గొప్ప ప్రయోక్త. చక్కని నటుడు కూడా. వీటన్నిటినీ మించి, ఆంధ్ర దేశంలో ప్రభవించిన ఒక మహావ్యక్తి.

బాలాంత్రపు రజనీకాంతరావు

# మా అబ్బూరి మేష్టారు

అది 1934 వేసవి. కాకినాడలో ఇంటరు చదువుతున్న మా అన్నయ్య నళిని సెలవులకి పిఠాపురం వచ్చాడు. అతని ఇంటిరుమీడియెట్‌కి పాఠ్య నాటికగా పెట్టిన 'నదీ సుందరి' నాటకం ఆతనిదగ్గర పుచ్చుకుని మా పినతండ్రి సూరిబాబు (బాలాంత్రపు సూర్యనారాయణరావు) రెండు సార్లు చదివి ఆద్యంతాలూ సాహిత్య 'వ్యథామాధురి'కి లోనయి, అప్పటికి స్కూలు ఫైనలులోకి రాబోతున్న నన్ను వాళ్ళబ్బాయినీ కూడా చదవమన్నారు. మేమూ చదివాము.

మా సూరిబాబు కలకత్తా ఎమ్. ఏ. మా అబ్బూరి మేష్టారు మైసూరులో గడుపుచుండిన 1913 ప్రాంతం మా సూరిబాబు త్రివేంద్రంలో ఒక పెళ్ళి చేసుకుని దాంపత్య సౌహార్ద బాంధవ్యాలను చవిజూసి వెనక్కి (ఆంధ్రాకి) వచ్చేశారు. ఆయన సంస్కృతాంధ్ర ఆంగ్ల సాహిత్యాలను కూలంకషంగా చదివిన మేధావి మాత్రుడేకాక 'రసలోలుపుడు.' "ఈ నదీసుందరిని ఈయనెవరూ — అబ్బూరి రామకృష్ణరావుగారా — ఆయన సంస్కృతంలోనే వ్రాసుంటే ఆ నాటకాన్ని, కాళిదాస భాస భవభూతుల నాటకాల పక్కని సమానంగా తులతూగేటంత గొప్పదిరా. 'రమ్యాణి వీక్ష్య'....అనే కాళిదాసు అపూర్వ శ్లోకభావాన్ని—ఈ నాటక రచనలో ఇతివృత్తంలోను, ప్రతి ఆంకంలోనూ ప్రతి సంవాదంలోనూ అక్షర శిల్పంగా నిరూపించారురా" అన్నారు.

ఆయేడు కాకినాడలోని పిఠాపురం రాజావారి కళాశాలలో విద్యార్థులూ, కళాశాలలో లెక్చరర్లూ, నదీసుందరి నాటకం ప్రదర్శించారు. మా అన్నయ్య నళినీ కాంతరావు కావేరి పాత్రనూ, కాళ్ళకూరి సత్యనారాయణగారు (గణితశాస్త్రం ఉపన్యాసకులు) అగస్త్య పాత్ర ధరించారు. అది 1935. కాకినాడ కళాశాల రస వచ్చరిత్రలో అదొక చిర నూతన మధురస్మృతి. ఆ తర్వాత మరొకసారి మా

అన్నయ్య అగస్త్య పాత్ర శ్రీ బి. వి. నరసింహారావు కావేరి పాత్రా నిర్వహించి కూడా ప్రదర్శించారు.

1935 — 1937లో నేను కాకినాడలో ఇంటరులో చేరాను. అక్కడ మా యింటికి వస్తూ పోతూ ఉండేవారు, నేను తరచు వారిళ్ళల్లో కలిసే సాహితీ మిత్రులు ఆచంట జానకిరాం, ముద్దుకృష్ణ. కృష్ణశాస్త్రి, శివశంకరులవంటి పెద్దల సాహితీగోష్ఠులద్వారా వైతాళికులూ, జ్వాలా, ఉదయినీ, ప్రతిభా వంటి సాహిత్య సంపుటాలా సాహిత్య పత్రికలా పరిచయం లభించింది. అబ్బూరి మేష్టారితో పరోక్షపరిచయాన్ని 'వైతాళికుల'లో పడినవారి ఖండకావ్యాల్లోని వారి సాహితీ మూర్తిని మరింత సన్నిహితం చేశాయి. అవి — 'ఊహాగానము—పూర్వ ప్రేమ—' 'అప్రాప్త మనోహరికి' — 'తిక్కన సోమయాజి', — 'సరోజినీ దేవి'— 'పృథివీ ప్రశంస'. వీటిలో చివరి మూడు ఖండకావ్యాలలోను మేష్టారి ఛందోరీతి ప్రాచీనరూపాలలో నవ్యశిల్పకల్పనలకు మా సూరిబాబు ముగ్ధులైపోయి, నాచేత మళ్ళీ మళ్ళీ చదివించేవారు — రాగాలలో పాడించేవారు. నదీసుందరిలోని 'రసపిపాసి' పద్యాలూ, 'సంధ్యాకామిని' 'కావేరిదేవేరి' గేయాలూ మా అన్నయ్య నాచేత పాడించుకుని వరసలు పెట్టించింది ఆ రోజుల్లోనే.

1937 వసంత ఋతువుతో కాకినాడలో నా ఇంటర్మీడియెట్ పాస్ కాగానే, వర్షాలు పడ్డ వెంటనే వాల్తేరు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో బి. ఏ (ఆనర్స్) (మూడేళ్ళ ఎం. ఏ. కోర్స్ అన్నమాట) మొదటి సంవత్సరం (థర్డ్ ఇయర్) తరగతిలో చేరాను. మా తరగతిలో ముగ్గురం విద్యార్థులుంటే, మాకు ఉపన్యాసకులు పింగళివారు, గంటివారు, మల్లాదివారు, వజ్ఝలవారు, గొర్తివారు, చివరగా వారిలో ఎవరికి ఏమాత్రమూ తీసికట్టుగాని అబ్బూరి మేష్టారూ. వీరందరి వద్దా ప్రత్యక్షంగా వారి వారి ఉపన్యాసాల ఎత్తులూ, లోతులూ, తేపులూ (మాధుర్యాలూ) సచ్ఛాత్రులతోపాటు పంచుకొనే అదృష్టం లభించింది నాకు.

మొదటి సంవత్సరం — అబ్బూరి మేష్టారు సంస్కృతానికీ, కాంపొజిషన్ (వ్యాసరచన)కే వచ్చేవారు. ఈ రెండో సబ్జక్టులో భూమ్యాకాశాలనడుమ ప్రపంచంలోని అన్ని విషయాలూ కలిసి వచ్చేవి. సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక, తాత్త్విక, విషయాలెన్నో చెపుతూ వాటిలో మమ్మల్ని చర్చింప జేసేవారు. విశ్వకళాపరిషత్తు ప్రారంభంలో ఆయన లైబ్రేరియన్ కూడా అయి ఉండడం,

ఎన్నో విషయాలపై నాటక, కావ్య సాహిత్య విమర్శ పద్ధతులపైని, వివిధ దేశాల సాహిత్య రచయితల గ్రంథాలను మా చేత చదివించి, మా వ్యాసరచనలు చేయించేవారు. ఒక్కొక్క వ్యాసాన్ని ఒక 'థీసీసు' — పరిశోధన వ్యాసంలాగా వ్రాయించేవారు ఆ తరగతి గదిలోనే బ్రిటన్, ఫ్రాన్సు, రష్యా, అమెరికా, నార్వే, హంగరీ, మొదలైన వివిధ దేశాల కథలను, నాటకాలను, ఆయా రచయితల జీవిత చర్యలను గురించి చెపుతూ మా చేత ఆ పుస్తకాలు చదివించేవారు. వివిధ దేశాల నాటకోద్యమాలను కవితోద్యమాలను గురించి మా మనో గవాక్షాలను తెరుస్తూ, యూరప్, అమెరికాలలోని రంగస్థల నాటకోద్యమాలను, బెర్నార్డ్‌షా, ఇబ్సెన్, జె. ఎమ్. సింజ్, మోలియర్, మేతర్లింక్, ప్రీస్ట్లీ, చెకొవ్, మోల్నార్, వంటి నాటక కర్తలను, మనదేశంలోని కవితోద్యమాలలో హేలీ ధూమకేతువు లాగా ఆకాశం క్షితిజరేఖపైకి ఎక్కివస్తూన్న మన శ్రీశ్రీని ఆయన తరానికి చెందిన శిష్ట్లా, నారాయణ బాబులూ, పఠాభీ వంటి వారిని, వచన రచనలో చలాన్నీ మా దృక్పథంలో ప్రవేశపెట్టింది అబ్బూరి మేస్టారే. 'మధుపాళి' [హనీ గేదరర్స్) అనే పేరుతో యూనివర్సిటీలో ఆనాటి యువ రచయితలం, నేనూ, జనమంచి రామకృష్ణా, ఎ. ఎస్. రామన్ (తరువాత ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఎడిటర్), వేమూరి రామనాథం (యూ. ఎన్. ఓ), మామిడిపూడి ఆనందం, వరద రాజేశ్వరరావూ మరి కొందరు- మేస్టార్ని మార్గదర్శకులుగా సాహిత్య సాంస్కృతిక సమావేశాలు జరుపుకొనేవారం. మేం రచించిన కవితలూ, నాటికలూ, ఆ సమావేశాలలో చదవ డమూ, ఎవరికితోచిన విమర్శలు వారు చేయడమూ, మేస్టారు తుదిపలుకులతో సమావేశాలు ముగించే వారం. అబ్బూరి వారి దర్శకత్వంలో 'ఎ హిమ్ టు ది రైజింగ్ సన్' అనే నాటకం వేశాం.

ఆ రోజుల్లో 'ఆసుపత్రిలో కోయిల' అనే ఆధునిక కవిత వ్రాస్తూ, వైజాగ్ టి. బి. హాస్పిటల్‌లో పేషెంట్‌గా ఉండిన జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి యూనివర్సిటీ హాస్టల్‌కీ, చిన వాల్తేర్‌లో అబ్బూరి మేస్టారింటికి వచ్చి. తనవీ, శ్రీశ్రీవీ, ఇంకా ఎందరో ఆధునిక ఆంధ్ర కవులవీ కవితలని కంఠో పాఠంగా వొప్పచెప్పుతూండేవాడు.

ఒకనాడు అబ్బూరి మేస్టారు 1916 — 17 ప్రాంతంలో రచిం చిన ఖండకావ్యాలు 'అప్రాప్తమనోహరికి,' 'బాల్యస్మృతి', 'మృతప్రేమ',

కావేరిని గూర్చి అగస్త్యకుమారుని ఆవేదన పద్యాలూ జలసూత్రం చాలా హృద యంగమంగా చదివాడు.

ఈ నాలుగు ఖండకవితలకీ, 1923 లో కావేరిని గురించి రచించిన నదీ సుందరి నాటకానికీ 'నేపథ్యం అనదగిన ఉదాత్త చారిత్రకానుభూతులు మేస్టారికి కావేరీ తీరంలో (మైసూరులో) ఎదురైనాయని అప్పుడే తోచింది— నాలాంటి సన్నిహితులకి. ఏ జలసూత్రమైనా 'అప్రాప్త మనోహరి' ని గురించి ఏమైనా ప్రశ్నిస్తే, ఏదో చిన్నతనంలో అనుభవాలూ, ఏవో వ్రాశాను, ఇప్పుడు సిగ్గు పడు తున్నాను, అని మేస్టారు నవ్వేసేవారు. ఆనాటికే ఆయనలో అక్కిరాజు ఉమా కాంతంగారి నిశిత సాంప్రదాయిక విమర్శ ధోరణి ఒక పక్కా, ఇంకొకవైపు హేతువాద పూర్వకమైన సామ్యవాద ధోరణీ—క్రియాత్మక రచనపట్ల ఆయనకొక నిర్లిప్త నిర్లక్ష్యాన్ని కలిగించాయా అనిపించేది.

కాని, 'అప్రాప్తమనోహరి' తరవాతి తరపు భావకవులెందరికో వొరవడి అయింది. నదీసుందరిలోని అగస్త్య కుమారుడు, కావేరిని గురించి ఖండకవిత లోని అగస్త్యకుమారుడూ ఉదార త్యాగాగ్ని దగ్ధుడయిన ప్రేమికుడుగా రచయిత చుట్టూ ఒకపరివేషాన్ని దర్శింపజేస్తారు. అప్రాప్త మనోహరియైన కావేరి— సహ్యాద్రినికుంజం వైపు వెళ్ళవద్దని కవేరముని చేసిన నిషేధంతో—దూర సాగర తీరాల జనసాంతర సౌహృదాల నిరంతరాకర్షణతో — పర్వత శిఖరాల నుంచి లోయలలోని మైదానాలవైపు చూసినప్పుడల్లా అప్రయత్నంగా తన హృదయంలో నిమ్నగమనోత్సుకతా వేగంతో—ఇన్నిటినీ గుండెల్లో దాచుకుని—తనని ఆదరంతో అత్యంత స్నిగ్ధ హృదయంతో చెలిమికాడుగా వచ్చిన చెలువుడైన అగస్త్యుణ్ణి సహచరుడుగా సహ్యాద్రి శిఖర నికుంజానికి తోడు తీసుకవెళ్ళి, అక్కడ నదీ ప్రవాహంగా మారిపోతుంది. కొన్ని జన్మలదాకా వదలని బెంగతో — గుండెని సహస్ర సంవత్సరాల తపస్వి యంతగా రాయి చేసుకుని అగస్త్యునితోపాటు మనం కూడా కొండ దిగుతాం—మెల్ల మెల్లగా వెనక్కి వెనక్కి చూస్తూ! అది అఖండ కవితలలో గాని, ఆ అపూర్వ నాటకంలోగాని ఆబ్బూరి మేస్టారు అవిస్మరణీయ మైన ఆమర శిల్పంగా రూపొందించిన స్వీయ మధురానుభవం!

నా అనర్సు చదువు 1940 లో పూర్తయింది. 1942 లో నేను మద్రాసు ఆల్ ఇండియా రేడియోలో చేరాను. ఆ తొలిరోజుల్లో నేనూ మా అన్నయ్య

నళినీ 'నదీసుందరి' నాటకాన్ని ఆంధ్రమహిళా సభలో సభావిద్యార్థినుల చేత రంగస్థలంపై ఆడించాం. శ్రీమతి జనమంచి సుగుణ కావేరి పాత్రా, శ్రీమతి సామ్రాజ్యం రమణారావు అగస్త్య పాత్రాధరించారు. దర్శకత్వం మా అన్నయ్యదీ, సంగీతం నాదీను.

అది ద్వితీయ ప్రపంచమహాయుద్ధపు రోజులు. నాటి ప్రభుత్వం సహకారంతో అబ్బూరి మేస్టారు 'నాట్యగోష్ఠి'కి చెందిన 'నటాలి' బృందం చేత 'కన్యాశుల్కం', 'ధాన్యలక్ష్మి' నాటకాలను వివిధ నగరాల్లో ప్రదర్శనలిస్తూ మద్రాసు వచ్చారు. మద్రాసులో రంగస్థలంపైన, రేడియోలోనుకూడా ఆ నాటికలు ప్రదర్శింపజేశారు మేస్టారు.

1960_61 నాటికి నేను హైదరాబాదు ఆకాశవాణికి బదిలీ అయిన రోజుల్లో, ఆంధ్ర యూనివర్సిటీ, రిజిస్ట్రారు_గోపాలస్వామిగారిచేత మా డైరెక్టర్‌కు ఉత్తరం వ్రాయించి, అబ్బూరి మేస్టారు అప్పుడు తాను తయారు చేస్తున్న 'ఎర్ర గన్నేరు'—టాగూర్ 'రెడ్ఓలియండర్స్' నాటకానికి గేయాలకూ నాచేత సంగీతం కంపోజ్ చేయించారు. ఆ నాటకాన్ని ఆకాశవాణి హైదరాబాదులో ప్రసారం చేయించి, వక్కలంక సరళారావు, నేనూ ఆ పాటలు పాడి — వాటిని టేపు చేయించి, ఆ టేపును తమరంగస్థల ప్రదర్శనలలో నేపథ్యగానంగా వాడుకున్నారు.

అదికాక, నేను మరచిపోలేనిది — మేస్టారు హైదరాబాదులో రవీంద్ర భారతిలో_ప్రదర్శించిన మృచ్ఛకటిక నాటకానికి నాచేత క్రీ. పూ. 1 వ శతాబ్దం నాటి సంగీతాలు, వాద్యాలు ఎలా ఉండేవో నాచేత కల్పింపజేసి, ఈనాడు మనకు దొరికే వాద్యాలపైనే ఆనాటి వాద్యాలపై పలికించిన రాగాలను ఆనాటివిగా స్ఫురించేటట్టు ఆయన నాచేత చేయించిన నేపథ్య సంగీతం.

రాయడం అంటే ఒకదశలో నిర్లిప్త నిర్లక్ష్య భావంతో ఊరికే ఉండిపోలేదాయన. శ్రీశ్రీ చేత ఛలోక్తిగా 'రాయని భాస్కరుడు' అనిపించుకుని అప్యాయంగా నవ్వి ఊరుకున్నా — ఆయన తన క్రియాత్మకతని రంగస్థల నాటక నిర్వహణకు రాష్ట్ర స్థాయిలోను అఖిల భారత స్థాయిలో అభ్యుదయ రచయితలా, అకాడమీలా కార్యకలాప నిర్వహణలకూ వినియోగించారు.

ఆయన 1926 లో వ్రాసిన గేయం 'పాడవే పాడవే బంగారు తల్లి భూమి పై రాలేటి పూవుల్ల పాట' — మా నాన్నా మావయ్యల (వేంకట పార్వతీశ్వర కవుల) కవితా ధోరణిపైన ఆయనకు ఆనాడేర్పడిన మక్కువగా తోస్తూంటుంది నాకు.

ఆయన నదీ సుందరి — దాని నేపథ్య ఖండ కావ్యాలూ మాత్రమే చాలేమో — ఆయన బంగాలీ కథాపదం అయిన వేహులాలక్ష్మీంద్ర గాథను తెలుగు తనం ఉట్టిపడేటట్లు కూర్చిన 'పూర్వప్రేమా' అటువంటి అమూల్య కవితే, ఆయన 50 లలో, తర్వాత 60 లలో రాసిన కవితలూ రవీంద్రుని గేయాలకు తెలుగు సేతలూ చదివితే తెలుగు తనం మీదా తెలుగు నుడికారం మీదా ఆయన కుండే ప్రాభవం తెలుస్తుంది.

'జన్మభూమి జనని కాదు, సామాన్య సుమా ఆయమ —
వసుమతియగు నామె కొరకు వల్లభు లెందరు పెనగిరి ?

అని అనగలిగిన మరొక కవిగాని మరొక హేతువాదిగాని ఏడి ? ఆమాటలలోని 'సామాన్య — వసుమతి' అనే మాటల లోతైన అర్థం సార్థకం అయ్యేటట్లు వాడడం ఆయనకే చెల్లింది.

ఆయన పృథివీ ప్రశంసలో ఛందశ్శిల్పముతో పాటు పృథివీమాత ఐతిహాసిక సౌందర్యంతో Epic beauty దర్శనం ఇస్తుంది.

'నిఖిలలోకేశ్వర స్వామినీ' అని అంబను అర్థించిన అబ్బూరివారు — ఎంతటి హేతువాదియో — అంతటి శాక్తేయుడూ — శ్రీవైష్ణవుడూను.

నాగీతమే పాడులోకానీకమ్ముల లోనలోన నాక
హహాకారముద్భూతమై

శ్రీనారాయణ పాదనీరజ రజాశ్లేషమ్ము కాంక్షించెడిన్" అది ఈశ్వర వాదమూకాదు, నిరీశ్వరమూ కాదు. శంకరాద్వైతం ! తిక్కనగారి వారసత్వం !

నేను గురువుగా భావించే ఒకరిద్దరు అధునిక కవీశ్వరులలో — ముగింపు మెరుపుగా వ్రాసే ఈ పద్యచరణాలు — ఆ ఒకరిద్దరికె సమానంగా సరిపోతాయి.

(2)

"తాను ముట్టని నిత్య నూతనత లేదు,
తన్నుతాకని నవమహోద్యమము లేదు,
తలపులో పల్కులో ఉదాత్తతకు గురుడు,
కేవలకవీశ్వరుడె రామకృష్ణరావు."

ఎ. యల్. నరసింహారావు

# ఆప్తుడు అబ్బూరి

అది 1933 సంవత్సరం అనుకుంటాను. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ మీదనిషేధం ఉంది. అందువల్ల అ పార్టీ రహస్యకార్యక్రమాల సాగిస్తుండేది. ఆ రోజుల్లో కమ్యూనిస్టుపార్టీలో ఎక్కువమంది సభ్యులు లేరు. అంతా ఒక డజను మందికన్నా ఆంధ్రలో ఉండేవారుకాదు. గుంటూరు జిల్లాలో ఒక అర డజనుమంది, కృష్ణా జిల్లాలో ఇద్దరు ముగ్గురు, నెల్లూరు జిల్లాలో ఒకరిద్దరు ఉండేవారు. గుంటూరులోని కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలకు భోజన వసతికి ఇబ్బందిలేకుండా ఉండి, పార్టీ కార్యకలాపాలు సాగించేందుకుగాను "ఫ్రెండ్స్ హోమ్" అనే పేరుతో భోజన హోటలు నడుపుతుండేవారము. కీ. శే. పులుపుల శివయ్య, శ్రీనండూరి ప్రసాదరావు, నేను మరికొందరు ఆ హోటలు నడుపుతుండేవారము.

ఒకనాడు డాక్టర్ వాడపల్లి వెంకటేశ్వరరావుగారింటినుంచి నాకు కబురు వచ్చింది. నేను వారింటికి వెళ్లాను. నాకు అప్పుడు అబ్బూరి రామకృష్ణారావుగారిని పరిచయం చేశారు. రామకృష్ణారావుగారు విశాఖపట్టణంలో ఆంధ్ర యూనివర్సిటీలో తెలుగు అధ్యాపకులుగా ఉండేవారు. ఆయన ఒక్కరే అక్కడ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. ఆయన యూనివర్సిటీ ఉద్యోగి కావడంవల్ల రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనడానికి వీలులేదు. అందువల్ల ఎవరనైనా ఒక హోల్‌టైమ్ వర్కరును పంపమని పార్టీ సెల్‌ను కోరారు. అప్పుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య పార్టీలో ప్రముఖులు. ఆయన పి. శివయ్యకు ఈ విషయం చెప్పారనుకుంటాను. స్వర్గీయ శివయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య మున్నగువారు చర్చించుకుని నన్ను విశాఖ పట్టణం పంపాలని నిర్ణయించుకున్నారు. అందుకని నన్ను రామకృష్ణారావుగారికి పరిచయం చేయడంకోసం డాక్టర్ వాడపల్లి వెంకటేశ్వరరావుగారింటికి పంపారు. డాక్టరుగారికి శ్రీ అబ్బూరి మేనమామ అవుతారు. నన్ను రామకృష్ణారావుగారికి

పరిచయం చేసినప్పుడు, నేను ఆయన బెంగాలీవారని భ్రమ పడ్డాను. ఆయన కట్టు, జుట్టు వేషం అలా ఉంది. కాగితంలో సిగరెట్ పొగాకుపెట్టి ఆ కాగితాన్ని సిగరెట్‌గా చుట్టి, సిగరెట్ కాల్చేవారు.

ఆ తర్వాత కొద్దిరోజులకే నన్ను పార్టీ విశాఖపట్టణం పంపింది. నేను విశాఖపట్టణంవెళ్లి, యూనివర్శిటికి వెళ్లాను. ఆ రోజుల్లో సర్ ఎస్. రాధాకృష్ణన్ గారు వైస్ ఛాన్సలర్‌గా ఉండేవారు. యూనివర్సిటీ విద్యార్థులు ఏదో సందర్భంలో కన్యాశుల్కం నాటకాన్ని ప్రాక్టీసు చేస్తున్నారు. నేను రామకృష్ణారావుగారిని కలుసుకోడానికి యూనివర్సిటీకి వెళ్లిన సమయంలో "కన్యాశుల్కం" నాటకం రిహార్సల్స్ జరుగుతున్నాయి. అబ్బూరివారే దానికి దర్శకుడు. నన్ను చూసి ఎంతో ఆప్యాయతతో పలకరించారు. నాకు కొద్ది రోజులపాటు యూనివర్సిటీ హాస్టలులో గజపతిరాజు అనే విద్యార్థి రూంలో బస ఏర్పాటు చేశారు. హాస్టలులోనే భోజనం కూడా. ఐదారు రోజులు గడిచిన తర్వాత విశాఖపట్టణంలో గోషా అస్పత్రి ముందున్న ఒక గదికి నా బస మార్చారు. ఆప్రదేశాన్ని కవిగారి ఆశ్రమం అనేవారు. మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారిని అంతా కవిగారని సంబోధించేవారు. ఆయన కాంగ్రెస్ ఉద్యమంలో జైలుకు కూడా వెళ్లి వచ్చారు. ఆయనంటే పట్టణంలో మంచి గౌరవం ఉండేది.

## రాత్రి పాఠశాల

ఆ ఆశ్రమం ముందే నా గది. అది మట్టి గోడలు, కింద మట్టి నేల కలిగి ఉండేది. ఆ గదిలో సగభాగంలో అక్కడ ఒక ఆవుల యజమాని వరిగడ్డి పెట్టుకునేవాడు. మిగతా సగ భాగంలో నేను ఉండేవాడిని. కొద్ది రోజులలో మాకు హార్బరు వర్కర్సు కొందరితో పరిచయం కలిగింది. ప్రతి నిత్యం సాయంకాలం అనగా హార్బరులో టైం అయిపోయిన తర్వాత వారంతా మా గదికి వచ్చేవారు. వారంతా ఫోర్టు ఏరియా వాసులు. వారికి రాత్రిళ్లు మేము పాఠాలు చెప్పేవాళ్లము. పలకలు బలపాలు మేమే కొని ఇచ్చాము. ఆ వర్కర్లకు చదువుసంధ్యలు లేకపోయినా, చక్కగా ఇంగ్లీషులో మాట్లాడేవారు. ఆ రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం ఉండేది. హార్బరు లోని పెద్ద అధికారులంతా ఇంగ్లీషువారు. ఫోర్ట్ ఏరియాలో ఆంగ్లో ఇండియన్లు ఉండేవారు. అందువల్ల ఆ సంప్రదాయంలో పెరగడంతో వారికి ఇంగ్లీషులో మాట్లాడటం బాగా అలవాటు. కొన్నాళ్లపాటు రాత్రి పాఠశాల

నడిపాము. ఆ రాత్రి పాఠశాలలో శ్రీరామ కృష్ణారావుగారు కొత్త తరహాలో పాఠాలు చెప్పారు. ఓనమఃలు అ ఆ లు దిద్దపెట్టడం పద్ధతి లేదు. ఒకటో తరగతి పుస్తకంలో బొమ్మలు చూపి, అ బొమ్మ పేరుచెప్పించి, దాని కింద అక్షరాలను గుర్తుపట్టించడం. జనరల్‌నాలెడ్జికోసం ఎకనమిక్ జాగ్రఫి బోధించేవారు.

రామకృష్ణారావుగారు లైబ్రేరియన్ కోర్సు కూడా ప్యాసైనారు. ఆయనకు లైబ్రరీలో ఉన్న గ్రంథాలన్నీ తెలుసు. లైబ్రేరియన్‌గా కూడా పని చేశారు. బ్రిటన్‌లో కార్మికులకు రాత్రిళ్లు పాఠశాలలు నడిపేవారు. ఆక్కడి వర్కర్సు ఎడ్యుకేషన్ పద్ధతిపై గల గ్రంథాలను చదివి, ఆ ధోరణిలో ఇక్కడి పరిస్థితులకు అనుగుణంగా వర్కర్స్ ఎడ్యుకేషన్ గరపాలని ఆయన ఆలోచన. ఆధోరణిలో మేము నడిపిన రాత్రి పాఠశాలలో ప్రయోగం చేశాము. ఈ రాత్రి పాఠశాలకు యూనివర్సిటీ హాస్టలులోని విద్యార్థుల నుంచి నెలకు పావలా వసూలు చేసేవారు. అప్పుడు స్వర్గీయ మామిడిపూడి వెంకటరంగయ్యగారు హాస్టలు వార్డెనుగా ఉండేవారు. ఆయన ద్వారా ఈ డబ్బు వసూలు అయేది. నెలకు పాతిక రూపాయల దాకా వసూలయేది. అందులో నాకు మెయిన్‌టెనెన్సు కింద పదిహేను రూపాయిలు, మిగతాది నైట్ స్కూలుకు ఖర్చయేది. ఇండియా మ్యాపు, ప్రపంచమ్యాపు తెప్పించాము. పలకలు, బలపాలు, వాచకం కొని పాఠాలు నేర్పాము. ఇప్పుడు ప్రభుత్వం వర్కర్స్ ఎడ్యుకేషన్ కింద లక్షలు, కోట్లు ఖర్చుపెడుతున్నది. అనాడు రామకృష్ణారావుగారు పదిరూపాయలతో ఎంతో ఉన్నత స్థాయిలో ఈ వర్కర్సు ఎడ్యుకేషన్ ప్రయోగాన్ని విజయవంతం చేశారు.

ఇలా కొన్నాళ్లు నైట్‌స్కూలు నడుపుతూ ఉన్న కాలంలో హార్బరులో నరసింగరావు అనే ఫిట్టరుని మేనేజ్‌మెంటుతొలగించింది. ఆ నరసింగరావు మా దగ్గరికి వచ్చి యూనియన్ పెట్టాలని ఒత్తిడి చేశాడు. ఆ రోజుల్లో కార్మిక సంఘం నెలకొల్పడం అంత తేలికైన పనికాదు. హార్బరులో ఉన్నది బ్రిటిష్ మేనేజ్‌మెంటు. మేము కమ్యూనిస్టులము. నరసింగరావు మాదగ్గరికి రానారంభించినప్పటి నుంచి, హార్బరు వర్కర్స్ అనేకులు రానారంభించారు. గోషాహాస్పిటల్ పక్కలోనే ఆ సమీపంలో సబ్ ఇన్‌స్పెక్టరు ఉండేవాడు. మా దగ్గరికి హార్బరు వర్కర్లు తరచుగా రావడంతో పోలీసు వారికి కొంత అనుమానం కలిగింది. పోలీసులు మా మీద ఒక కన్ను వేసి ఉంచినట్లు మాకు అనుమానం కలిగింది.

ఆ పరిస్థితిలో మా కార్యక్రమానికి కొత్తరూపం కల్పించి, పోలీసులకు అనుమానం రాకుండా చేయాలని రామకృష్ణారావుగారు ఆలోచించారు. మేము నడుపుతున్న స్కూలుకు నైట్ స్కూలు రూపం కల్పించాలనుకున్నాము. అందు కోసం ప్రారంభోత్సవ కార్యక్రమం ఏర్పాటు చేశాము. ఈ నైట్‌స్కూలు ప్రారంభోత్సవాన్ని మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారిచేత జరిపించాము. శాస్త్రి గారికి కూడా మామీద అనుమానం ఉంది. ఆయన ప్రారంభోపన్యాసంలో ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గానికెక్కుతుందా అని అన్యాపదేశంగా మమ్మ విమర్శించారు.

## కార్మిక సంఘం

రాత్రి పాఠశాల నడుపుతూనే కార్మిక సంఘం ఏర్పాటుకు సన్నాహాలు ప్రారంభించాము. రామకృష్ణారావుగారు యూనివర్సిటీలో పగలు పనిచేసి సాయం కాలం ఇంటికి వచ్చిన తర్వాత పెందరాళే భోజనం చేసి నైట్‌స్కూలు నడుపు తున్న నా రూంకు వస్తుండేవారు. కార్మికసంఘం ఏర్పాటుకు సన్నాహాలు ప్రారంభమైనప్పటినుంచి ప్రతి ఆదివారం వర్కర్లతోపాటు రామకృష్ణారావుగారు కూడా మా గదిలోనే గడిపేవారు. నాతోబాటు నరసింహశాస్త్రి అని మరో కామ్రేడ్ కూడా ఉండేవాడు.

యూనియన్‌ను రిజిష్టరు చేయాలంటే ఏడుగురు కార్మికులు తమ సంతకాలు చేసి అంగీకారం తెలపాలి. ఆ రోజుల్లో శ్రీ పెమ్మరాజు వెంకట్రావు, నెల్లిమర్ల జూట్‌మిల్ వర్కర్స్ యూనియన్ అధ్యక్షుడుగా ఉండేవారు. ఆయనతో సంప్రదించి యూనియన్ నిబంధనావళి తయారు చేశాము. ఆ రోజుల్లో రామకృష్ణారావుగారితోపాటు తిమ్మరాజు సత్యనారాయణరావుగారనే మరో లెక్చరర్ పనిచేస్తుండేవారు. సత్యనారాయణరావుగారికి డాక్టర్ ఎం. వి. కృష్ణారావుగారు బావగారవుతారు. డాక్టరుగారు అప్పుడు బ్రహ్మచారి. కాంగ్రెస్‌లో యాక్టివ్‌గా పని చేస్తుండేవారు. సత్యనారాయణరావుగారి సలహా మీద డాక్టర్ కృష్ణారావుగారిని యూనియన్ అధ్యక్షుడుగా ఎన్నుకున్నాము. ఆ రోజుల్లో వి. వి. గిరిగారిమీద కార్మికులకు ఎంతో గౌరవభావం భక్తి ఉండేది. గిరిగారిని అధ్యక్షుడుగా ఉంచాలని కొందరు వర్కర్లు అన్నారు. గిరిగారు కూడా డాక్టర్ ఎం. వి. కృష్ణారావు గారిని అధ్యక్షుడుగా ఉంచమని తను ఉపాధ్యక్షుడుగా ఉంటానని సూచించారు. అసలు రామకృష్ణారావుగారినే అధ్యక్షుడుగా ఉండమని గిరిగారు ముందు సూచిం

చారు. యూనివర్సిటీకి అభ్యంతరం ఉంటే, సిండికేట్‌లో ఈ విషయం లేవనెత్తి రామకృష్ణారావుగారికి పర్మిషన్ తెప్పిస్తానని కూడా గిరిగారు అన్నారు. కాని రిస్కు తీసుకోవడం రామకృష్ణారావుగారికి ఇష్టం లేకపోయింది.

అప్పటికి నా వయసు 20 ఏండ్లు కూడా లేవు. నన్ను చూడటంతోనే గిరిగారికి అనుమానం కలిగింది. యూనివర్శిటీ లెక్చరరు కార్మికోద్యమంలో తలదూర్చడం, సరిగా 20 ఏండ్లుకూడా నిండని యువకుడు దేశంలోనే ఒక అతి పెద్ద కార్మిక సంఘాన్ని స్థాపించడం గిరిగారికి వింతగాను అనుమానాస్పదంగాను కనిపించింది. గిరిగారు అంతకు పూర్వమే హార్బరు వర్కర్సు యూనియన్ స్థాపనకు విఫలయత్నం చేశారు. ఆయన చేయలేని పనిని మేము చేశాము. ఈ పరిస్థితులలో ఆయన మమ్మ కమ్యూనిష్టులుగా పసికట్టారు. ఆ యూనియన్‌ను ఎలాగైనా స్వాధీనం చేసుకోవలన్న తలంపు వారికి కలిగింది.

అప్పట్లో మాజీ శాసన సభ్యుడు శ్రీ చీకటి పరుశురాంనాయుడు హార్బరులో టాలా క్లర్కుగా పనిచేస్తుండేవారు. ఆయనకు యూనియన్ స్థాపించాలనే కోరిక గలిగి, శ్రీ గిరిగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. ఎప్పుడైతే మేము యూనియన్ స్థాపనకు పూనుకున్నామో అప్పుడు ఆయన మమ్మ కలిశారు. శ్రీనాయుడు అప్పటికే పట్టభద్రుడు. యూనియన్‌కు ఆయన సేవలు ఎంతగానో తోడ్పడతాయని మేము భావించాము.

ఆ రోజుల్లో లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కార్మిక సంఘాల తరపున ప్రతినిధులను ఎన్నుకునేవారు. మద్రాసుకు చెందిన వాసుదేవ్ అనే కార్మిక నాయకుడు ఆలిపురం వాసి ఆయన శ్రీ అప్పలస్వామి రెడ్డి అనే వారితో సంప్రదించి ఏడుగురు సభ్యులతో యూనియన్ రిజిస్ట్రేషన్‌కొరకు పంపారు. రెండు యూనియన్‌లు రిజిస్ట్రేషన్ కొరకు పంపబడటంతో లేబరు కమీషనరు దీనిని రిజిష్టరు చేయలేదు. తర్వాత ఆ విషయం తెలిసి, శ్రీ అప్పలస్వామి రెడ్డితో తమ యూనియన్ రిజిస్ట్రేషన్ ఉపసంహరించుకునేట్లు, ఆయనను మా యూనియన్ ఉపాధ్యక్షుడుగా చేసేట్లు రాజీ కుదుర్చుకున్నాము. తర్వాత యూనియన్ రిజిష్టరయింది.

## కమ్యూనిష్టు పార్టీ

ఆ రోజుల్లో నేటి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ చంద్రరాజేశ్వరరావు విశాఖపట్టణంలో ఎం. బి. బి. ఎస్. చదువుతుండేవారు. అశ్వనీ

కుమార దత్తు అనే మరొకరు బి. కాం. చదువుతుండేవారు. పుచ్చలపల్లి సుందరయ్యగారికి చంద్రరాజేశ్వరారావు తెలుసు. సుందరయ్యగారి సూచన మీద రాజేశ్వరారావు గారిని కలిశాము. ఆయనను, అశ్వనీ కుమార్ దత్తును కూడా పార్టీలోకి తీసుకున్నాము. అలాగే చీకటి పరశురామ్ నాయుడును కూడా పార్టీ లోకి తీసుకున్నాము. పార్టీ సెల్ మీటింగులు చెంగల్రావు పేటలోని అశ్వనీకుమార్ దత్తు గదిలో జరుగుతుండేవి. సుందరయ్యగారు విశాఖపట్టణం వచ్చినప్పుడల్లా మాకన్నా ముందు పోలీసులకు తెలిసిపోయేది. సుందరయ్యగారి పూర్తి పేరు సుందరరామిరెడ్డి. పోలీసులు ఒకసారి సుందరరామి రెడ్డిగారిని గురించి నన్ను అడిగారు. ఆ పేరు నాకు కొత్త అనిపించింది. తర్వాత తెలిసింది సుందర రామిరెడ్డి అంటే సుందరయ్య అని. సెల్ సమావేశాలకు రామకృష్ణారావుగారు అనేక సందులు గొందులు తిరిగి దత్తుగారింటికి చేరుతుండేవారు. ఈ సందర్భంలో ఒక విషయం చెప్పాలి. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపనలో మూల పురుషులలో శ్రీ అబ్బూరికి ప్రథమ స్థానం లభిస్తుంది. అది 1932—33 ప్రాంతం. మీరట్ కుట్ర కేసు ఖైదీలైన డాంగే, నింబ్కర్, జోగ్లేకర్ మున్నగువారు విడుద లైనారు. వారంతా బొంబాయిలో స్థిరపడ్డారు. యూనివర్సిటీలో హిరేన్ ముఖర్జీ ఒక ప్రొఫెసర్. హిరేన్ ముఖర్జీ, రామకృష్ణారావుగారు కలిసి లైబ్రరీకి కమ్యూనిస్టు సాహిత్యానికి సంబంధించిన గ్రంథాలనేకం తెప్పించారు. హిరేన్ ముఖర్జీతో సంప్రదించి, ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ సెల్ నొకదానిని ఏర్పాటు చేయ డానికి రామకృష్ణారావుగారికి కోర్కె కలిగింది. బొంబాయి వెళ్ళి మీరట్ కుట్ర కేసు ఖైదీలను కలుసుకోవాలనుకున్నారు. అప్పటికే జొన్నలగడ్డ రామలింగయ్య, పి. శివయ్య, మాడభూషి వెంకటాచారి మున్నగు వారంతా రామకృష్ణరావుగారికి తెలుసు. వారితోకూడా తన అభిప్రాయం గురించి చెప్పారు. బొంబాయికి రైలు టిక్కెట్టుకొని రైలెక్కబోయే సమయంలో ఆంధ్రలో పార్టీ సెల్ ఉన్నట్లు రామ లింగయ్య ప్రభృతులు రామకృష్ణారావుగారికి చెప్పారు. ఎలాగు టిక్కెట్టుకొన్నాను గదా అని ఆయన బొంబాయి వెళ్లారు.

బొంబాయిలో డాంగే ప్రభృతులను కలిశారు. వచ్చేప్పుడు కమ్యూనిస్టు పార్టీ సాహిత్యం కొంత తనవెంట ఒక ట్రంకు పెట్టెలో పెట్టుకుని తెచ్చారు. వాల్తేరు స్టేషన్‌లో రైలు దిగి, ఆ పెట్టెను ఒక కూలీ నెత్తిన పెట్టి కాలినడకన ఇంటికి బయలుదేరి వెళ్లారు. దారిలో చెముడు ఎస్టేట్ బిల్డింగుల ప్రాంతంలో

సందులు గొందులు తిరిగే సమయంలో కూలీది ఒక దారీ, రామకృష్ణారావుగారిది మరోదారి అయింది. కొంత దూరం వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తే కూలీ కనిపించ లేదట. అప్పుడు రామకృష్ణారావుగారికి హడలెత్తిపోయింది. పెట్టెలో ఉన్న దంతా కమ్యూనిస్టు సాహిత్యం. పోలీసులకు పట్టుబడితే జైలుశిక్ష తప్పదు. ఒక్క సారి గుండెల్లో దడ ప్రారంభమైంది. వెనక్కు వెళ్ళి వెతికితే ఆ కూలీ కని పించాడు. ఆ కూలీని తీసుకుని స్థానాపతి సత్యనారాయణ గారింటికి వెళ్ళి అక్కడ ఆ పెట్టె పెట్టారు. స్థానాపతి సత్యనారాయణగారు గుళ్ళో పూజారి. కవి, పండితుడు. ఆయన రామకృష్ణారావుగారికి అత్యంత విశ్వాసపాత్రుడైన వ్యక్తి. శ్రీరాముడికి హనుమంతుడెటువంటివాడో, రామకృష్ణారావుగారికి స్థానాపతివారు అంతటి భక్తుడు.

కమ్యూనిస్టు పార్టీ కేంద్రకార్యాలయం నుంచి వచ్చే లెటర్లన్నీ ఆయన పేర ఆయన చిరునామాకు వచ్చేవి. వాటిని అతి జాగ్రత్తగా రామకృష్ణారావు గారికి అందచేస్తుండేవారు.

సుందరయ్యగారికి డాక్టర్ ఎం. వి. కృష్ణారావుగారి బావమరిది సత్య నారాయణరావుగారు క్లాస్‌మేటు. ఆ సత్యనారాయణరావుగారి కుమారుడుకే రామ కృష్ణారావుగారి మూడో కుమార్తె నిచ్చారు.

హార్బరు వర్కర్సు యూనియన్ డాక్టర్ ఎం.వి. కృష్ణారావు అధ్యక్షుడుగా, వి.వి. గిరి, దిగుమర్తి రామస్వామి ఉపాధ్యక్షులుగా, నేను ప్రధాన కార్యదర్శిగా మరో ఏడుమంది కమిటీ సభ్యులుగా రిజిష్టరయింది. ఆ తర్వాత యూనియన్‌ను తాము స్వాధీనం చేసుకోవాలన్న తలంపు డాక్టరుగారికి, గిరిగారికి కలిగింది. యూనియన్‌లో చీలికలు ప్రారంభమైనవి. తర్వాత ఒక పాలసీకి సంబంధించిన అంశంమీద నేను, పరశురామ్ నాయుడు, మరికొందరు కార్యవర్గ సభ్యులు రాజీనామా చేశాము.

సుందరయ్యగారొకసారి తర్వాత విశాఖపట్టణం వచ్చారు. సెల్ మీటింగు జరిగింది. నన్ను తిరిగి గుంటూరు వెళ్ళవలసిందిగా ఆదేశించారు. ఫలానా తేదీ నాటికి తను గుంటూరు వస్తానని ఆ తేదీనాటికి నేను గుంటూరులో ఉండాలని అన్నారు. కమ్యూనిస్టు పార్టీలో రాజీనామాలనేవి లేవు. పార్టీనుంచి బహిష్క రించడమే తప్ప సభ్యులు రాజీనామా చేసే ప్రసక్తి రేదు. సుందరయ్యగారి

ఆదేశాన్ని నేను పాటించలేదు. అంటే నేను పార్టీనుంచి బహిష్కరించబడి నట్లయింది. తర్వాత సెల్ మీటింగు ఏర్పాటు చేసి, రామకృష్ణారావుగారిని పిలిచారు. నాతోపాటే ఆయన కూడా పార్టీతో తెగతెంపులు చేసుకున్నారు.

మళ్ళీ హార్బరు వర్కర్సు యూనియన్ ఎన్నికలు జరిగినప్పుడు మేము స్థానిక న్యాయవాది శ్రీ మద్ది పట్టాభిరామిరెడ్డిని (అందరాయనను పట్టాభి మేష్టారు అంటారు) మా అభ్యర్థిగా అధ్యక్షపదవికి నిలబెట్టాలనుకున్నాము. టౌను హాలులో జరిగిన వార్షిక సమావేశానికి వి.వి. గిరిగారు వచ్చారు. ఆయన ఇంగ్లీషులో ప్రసంగం, మల్లెమడుగుల జగన్నాధరావు తెలుగు తర్జుమా, మరొకరు ఉర్దూ తర్జుమా — రెండు గంటలు ఊకదంపుడు ఉపన్యాసం సాగింది. ఎన్నికలు జరిపినట్లు తతంగం చేసేశారు.

## ఎం. ఎన్. రాయ్‌తో పరిచయం

నేను, అబ్బూరి కమ్యూనిస్టు పార్టీనుంచి వైదొలగిన తర్వాత కొంతకాలం ఎట్టి కార్యకలాపాలు లేకుండా ఉన్నాము. ఇదిలా ఉండగా రామకృష్ణారావుగారి కుమారుడు. వాణీ కుమార్ బెనారస్‌లో పరీక్షకోసం వెళ్ళి తిరిగి వస్తూ "ఇండిపెండెంట్ ఇండియా" అనే ఆంగ్ల వారపత్రికను తెచ్చాడు. దాని సంపాదకుడు ఎం. ఎన్. రాయ్. అది 1936 సంవత్సరం. రాయ్ ఆ ఏడాదే జైలులో ఆరేళ్లు గడిపి విడుదలైనారు. విడుదలైన తర్వాత 'ఇండిపెండెంట్ ఇండియా' పత్రిక ప్రారంభించారు. వాణీకుమార్ తెచ్చిన కాపీ చదివినప్పుడు, అందులో అనేక కొత్త భావాలు ఉన్నట్లు కనిపించింది. రాయ్‌ని అంతకుముందు 'రెనిగేడ్'గా కమ్యూనిస్టు పార్టీ చిత్రించింది. రాయ్‌ని గురించిన వాస్తవం తెలీదు. 'ఇండిపెండెంట్ ఇండియా' చదివిన తర్వాత రాయ్ ఒక అపూర్వ వ్యక్తి అనీ, మహా మేధావి అనే అభిప్రాయం రామకృష్ణారావుగారికి కలిగింది. కమ్యూనిస్టు పార్టీ నుంచి బైటికి వచ్చిన తర్వాత మేమిద్దరం ఎలాంటి యాక్టివిటీ లేకుండా ఉన్నాము. ఆ సమయంలో రాయ్ భావాలు మమ్మల్ని ఆకర్షించాయి.

1936లో ఫైజ్‌పూర్ కాంగ్రెస్ జరిగింది. ఆ సభలకు కాకినాడ నుంచి ఎం. వి. శాస్త్రి అనే మిత్రుడు కూడ హాజరైనారు. ఆ సభలో ఎం. ఎన్. రాయ్ కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీ మీద ప్రసంగించారు. ఆ సభలోనే భుల్లాభాయ్ దేశాయ్ కూడా రాయ్‌కి ముందు అదే అంశం మీద ప్రసంగించారు. రాయ్ ప్రసంగం విన్న

ఖుల్లాఖాయ్‌దేశాయ్ రాయ్‌ని అభినందిస్తూ, నేను సరిగ్గా అదే చెప్పదలచుకున్నాను. కాని నాకు ఆ Vocabulary దొరక లేదు. అని అన్నారట. శ్రీ ఎం. వి. శాస్త్రి రాయ్ ప్రసంగంతో ముగ్ధుడై, కాకినాడ వచ్చి 'ఇండి పెండెంట్ ఇండియాకు' ఒక లెటరు పంపారు. Gandhi Vs Roy అనే శీర్షిక కింద ఆ లెటరును వ్యాస రూపంలో ఆ పత్రికలో ప్రచురించారు. కాని శాస్త్రి తన చిరునామా తను పంపిన వ్యాసంలాంటి లెటరులో ఇవ్వలేదు. అందువల్ల ఇండిపెండెంట్ ఇండియా లోనే ఆ వ్యాసం ప్రచురణతోపాటు ఆ వ్యాస రచయిత చిరునామా తెలుప వలసిందిగా కోరుతూ ఒక నోట్ ప్రచురించారు. శ్రీ శాస్త్రి ఆ ఇండిపెండెంట్ ఇండియా సంచిక తీసుకుని విశాఖపట్టణం వచ్చి రామకృష్ణారావుగారిని కలిశారు.

తర్వాత రాయ్ మద్రాసులో జరిగిన ఒక మహాసభకు హాజరయేందుకు వచ్చారు. అది రాడికల్ యూత్ కాన్ఫరెన్సు అని జ్ఞాపకం. రాయ్‌ని మద్రాసు నుంచి స్వర్గీయ వెన్నెలకంటి రాఘవయ్యగారు నెల్లూరుకు పిలిపించారు. నెల్లూరు నుంచి రాయ్‌ని శ్రీ ఎం. వి. శాస్త్రి కాకినాడ పిలిపించారు. రాయ్ కాకినాడ రాగానే శ్రీ శాస్త్రి అబ్బూరి రామకృష్ణారావుగారిని గురించి అంతకు ముందే ఎంతో ఘనంగా చెప్పి ఉన్నందున రాయ్ అబ్బూరిని ఎంతో ఆప్యాయంగా చూశారు. రాయ్‌తోపాటు ఆయన భార్య ఎలెన్ రాయ్ కూడా ఉన్నారు. రాయ్ దంపతులను రామకృష్ణారావుగారు విశాఖపట్టణం ఆహ్వానించారు. రాయ్ ఆరోగ్యం ఆ రోజుల్లో అంత బాగాలేదు. డాక్టర్లు కూడా విశ్రాంతి తీసుకోవలెనని సలహా ఇచ్చారు. విశాఖ పట్టణం సముద్రతీరం కావటాన, ఎంతో ఆహ్లాదంగా ఆరోగ్యంగా ఉంటుందని రాయ్ దంపతులు విశాఖపట్టణం వచ్చారు. వారి వెంట డాక్టర్ ఎం. ఆర్. షెట్టి కూడా వచ్చారు.

అప్పుడు శ్రీ పి. హెచ్. గుప్తగారు ఓరియంటల్ లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ బ్రాంచి సెక్రటరీగా ఉండేవారు. ఆయన జాతీయవాది. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. అబ్బూరికి శ్రీ గుప్త మంచి మిత్రుడు. శ్రీ గుప్తగారికి భార్యా వియోగం సంభవించడంవల్ల ఒక్కరే వాల్తేరు అప్‌లాండ్స్‌లో ఒక మంచి బిల్డింగులో ఉంటున్నారు. మంచి ఆరోగ్యమైన ప్రదేశం. రాయ్ దంపతులకు అతిథ్యం యివ్వడానికి అబ్బూరిగారి కోర్కెపై గుప్తగారు అంగీకరించారు. నిజంగా గుప్తగారు దానినొక ప్రివిలేజ్‌గా భావించారు. రాయ్ దంపతులు గుప్తగారి అతిథ్యంలో విశాఖపట్టణంలో మూడు వారాలు గడిపారు. రాయ్ అప్పుడు శుద్ధ

కాంగ్రెస్ వాదివలె ఖద్దరుపైజమా లాల్చీ, గాంధీటోపి ధరించేవారు. వాల్తేరు స్టేషన్‌లో రాయ్ దంపతులకు నాటి టౌన్ కాంగ్రెస్ కమిటి అధ్యక్షుడు వి. జె. గుప్త, అబ్బూరి, పి. హెచ్. గుప్త, స్వాగతం చెప్పారు. టౌన్ కాంగ్రెస్ కమిటీ వారు రాయ్‌కి టౌన్ హాలులో సన్మాన సభ ఏర్పాటు చేశారు. అప్పుడు స్వర్గీయ ఎ. వి. భానోజీరావుగారు మునిసిపాలిటీ చైర్మన్‌గా ఉన్నారు. ఆయన మొదట్లో జస్టిస్ పార్టీవారు. అప్పట్లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ కూడా పాల్గొన్నది. లెజిస్లేచర్సులో ప్రవేశించాలన్న కాంగ్రెస్ కార్యక్రమాన్నను సరించి కాంగ్రెస్ ఆ ఎన్నికలలో పాల్గొన్నది. కాంగ్రెస్ అభ్యర్థి తెన్నేటి విశ్వ నాథంగారి మీద జస్టిస్ పార్టీ అభ్యర్థిగా పోటీ చేసిన ఎ. వి. భానోజీరావుగారు ఓడిపోయారు. ఆ ఎన్నికల సమయంలో అబ్బూరి రామకృష్ణారావుగారు యూనివర్సిటీలో పనిచేస్తున్నా, కాంగ్రెస్‌కు తనశక్తి కొద్దీ పరోక్షంగా ప్రచారం చేశారు. ఆ సందర్భంలో రామకృష్ణారావుగారు భానోజీరావుగారిని కొంత అవ మానించి ఆయనకు బాధ కలిగించే సంఘటన ఒకటి జరిగింది.

ఎన్నికలలో ఓడిపోయిన తర్వాత కొంతకాలానికి భానోజీరావుగారికి కాంగ్రెస్‌లో చేరాలన్న ఉద్దేశం కలిగింది. అప్పట్లో ఎం. ఎన్. రాయ్ విశాఖ పట్టణం రావడం తటస్థించింది. రామకృష్ణారావుగారు, పి. హెచ్. గుప్తగారు కలిసి భానోజీరావుగారిని కలిసి రాయ్‌కి మునిసిపాలిటీ తరపున పౌరసన్మానం ఏర్పాటు చేయవలసిందిగా కోరారు. భానోజీరావుగారు పాత సంఘటనను మరిచి పోయి రామకృష్ణారావుగారి కోర్కెను పాటించి రాయ్‌కి పౌరసన్మానం ఏర్పాటు చేశారు. భానోజీరావుగారు. చాలా స్పోర్టివ్‌గా వ్యవహరించారని చెప్పాలి. రాయ్ విశాఖపట్టణంలోఉన్నన్నాళ్లు రామకృష్ణారావుగారు యూనివర్సిటీనుంచి సాయంత్రం ఇంటికి వెళ్లేటప్పుడు, గుప్తగారింటికి వచ్చి రాయ్‌ని కలిసి కొంతసేపు చర్చించి వెడుతుండేవారు. గుప్తగారు రామకృష్ణారావుగారు కలిసి కొందరు ప్రముఖులను కలిసి రాయ్‌కి కొంతడబ్బు వసూలు చేసి పర్సు ప్రెజెంట్ చేశారు. ఆ రోజుల్లో ఎం. ఎన్. రాయ్ కాంగ్రెస్‌లో చేరి ప్రముఖ పాత్రవహిస్తూ ప్రాథమిక కాంగ్రెస్ కమిటీలను పటిష్ఠం చేయాలనే నినాదం ఇచ్చారు. ఆ రోజుల్లో విశాఖపట్టణం జిల్లా కాంగ్రెస్ కమిటీకి శ్రీ తాతాదేవకీనందనరావు స్వర్గీయ డి. రామకృష్ణ పరమ హంస అధ్యక్ష కార్యదర్శులుగా ఉండేవారు. వారు యువకులు తెన్నేటి విశ్వ నాథం వంటి హేమాహేమీలపై తిరుగుబాటు చేసి జిల్లా కాంగ్రెస్‌ను స్వాధీనం

చేసుకున్నారు. వారు విశాఖపట్టణం వచ్చి, రాయ్‌ని కలిసి విజయనగరానికి ఆహ్వా నించారు. వారిని చూడగానే రాయ్‌కి ఎంతో ఆనందం కలిగింది. తను చేయ దలచుకున్న పనిని ఈ యువకులు చేసేశారని హర్షం వెలిబుచ్చారు. వారి కోర్కెను మన్నించి రాయ్ విజయనగరం వెళ్లారు. అబ్బూరి, నేను కూడ రాయ్ వెంట వెళ్లాము.

కొద్ది రోజుల తర్వాత యూత్ లీగ్‌ను నేను కార్యదర్శిగా ఏర్పాటు చేశాము. ఆ అసోసియేషన్ తరఫున ఒక సభ ఏర్పాటు, చేశాము. దానికి పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ వి. జె. గుప్త అధ్యక్షత వహించారు. శ్రీ ఎ. వి. భానోజిరావు ప్రధాన వక్త. ఆయన ఆ సభల్లో కాంగ్రెస్‌ను బలపరుస్తూ సభికుల కరతాళధ్వనుల మధ్య ప్రసంగించారు. ఈ సభ ఏర్పాటు ఐడియా అబ్బూరిది. ఆయన తెరవెనక ఉండి నాచే నాటకం ఆడించేవారు. పట్టణ కాంగ్రెస్ కమిటికి నేను పోటీ చేసి నప్పుడు శ్రీ భానోజీరావుగారి గ్రూపంతా నన్ను బలపరచింది. నేను అందరికన్నా ఎక్కువ ఓట్లతో నెగ్గాను. అప్పుడు Single transferable vote పద్ధతి ఉండేది. ఈ ఎన్నిక కూడా అబ్బూరి తెరవెనక ఉండి ఆడించింది. ఇదంతా 1936—37 మధ్య కాలంలో జరిగింది.

శ్రీ భానోజిరావుగారికి కాంగ్రెస్‌లో చేరాలన్న సంకల్పం కలగడంతో ఆయన రామకృష్ణారావుగారిని కలిసి విజయనగరం వెళ్ళి దేవకీనందన్, పరమ హంసలతో మాట్లాడి రావలసిందిగా కోరారు. రామకృష్ణారావుగారు, నేను భానోజి రావుగారి కారులోనే విజయనగరం వెళ్ళి జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులను కలిసి మాట్లాడాము. వారు కూడా మా అభిప్రాయంతో ఏకీభవించారు. అప్పటి నుంచి దేవకీనందన్, పరమహంస, శ్రీ పెమ్మరాజు వెంకట్రావులు కూడా 'రాయిస్టు'లుగా మారారు.

ఆ రోజుల్లోనే స్వర్గీయ చండి జగన్నాధం కూడా రాయ్ భావాలపట్ల ఆకర్షితులైనారు. ఆయన కమ్యూనిష్టు పార్టీలో చాలా ప్రముఖ వ్యక్తి. ప్రముఖ కమ్యూనిస్టు నాయకులతో ఆయనకు సంబంధాలుండేవి. జగన్నాధం కూడా రాయ్ భావాలవైపు ఆకర్షించబడటం, మా ఉద్యమానికి మంచి పుష్టినిచ్చింది.

1937 వరకు నేను విశాఖపట్టణంలోనే ఉండి, 1938లో గుంటూరు వెళ్ళి పోయాను. 1939 సెప్టెంబరు 1వ తేదీ రెండో ప్రపంచ యుద్ధం ఆరంభమైంది.

1941 ఆఖరులోనో 1942 ప్రారంభంలోనో జపాను యుద్ధ విమానాలు విశాఖ పట్టణం రేవులోని ఒక నౌక మీద బాంబులు వేశాయి. విశాఖపట్టణం ఆ చుట్టు ప్రక్కల గ్రామాలు అట్టుడికినట్లు ఉడికిపోయాయి. ఆ తర్వాత 1942లో ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్టణం నుంచి గుంటూరుకు తరలించారు. జపాను బాంబులు పడటం వల్ల అలా తరలించవలసి వచ్చిందో లేదా బ్రిటిష్ మిలిటరీ యూనివర్సిటీ కాంపస్‌ను ఆక్రమించుకోడానికి వీలుగా ఆ పని చేయవలసి వచ్చిందో మొత్తం మీద యూనివర్సిటీని గుంటూరుకు తరలించవలసి వచ్చింది.

1940 జూన్‌లో లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్ మన్‌ను రద్దు చేసి రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని ఏర్పాటు చేయడం జరిగింది. రాడికల్ డెమోక్రటిక్ పార్టీ రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పటి నుంచి బ్రిటన్‌ను ఫాసిజానికి వ్యతిరేకంగా బలపరుస్తూ వచ్చింది. ఈ యుద్ధం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమని ఫాసిజం నిర్మూలనమైతే సామ్రాజ్య వాదం దానంతటదే కూలిపోతుందని ఫలితంగా భారతదేశం స్వాతంత్ర్యం పొందగలదని రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ సిద్ధాంతీకరించింది. సామ్రాజ్య వాదాన్ని బలహీన పరచడానికి ఫాసిజానికి వ్యతిరేకంగా బ్రిటన్‌ను బలపరచాలన్నారు. అంతిమంగా రష్యా రంగంలోకి దిగదని, అసలు ఉద్దేశం కమ్యూనిజాన్ని రూపుమాపడమనీ, బ్రిటన్-జర్మనీల యుద్ధం యాదృచ్ఛికంగా సంభవించినా, ఈ యుద్ధం కొనసాగితే, జర్మనీ రష్యాపై పడగలదనీ రాడికల్స్ వాదించారు.మిత్ర రాజ్యాలైన బ్రిటన్ రష్యాలను బలపరచాలన్నారు. అప్పట్లో కమ్యూనిస్టులు దీనిని సామ్రాజ్యవాద యుద్ధమని కొంతకాలం, రష్యాపై జర్మనీ యుద్ధం ప్రకటించిన తర్వాత రెండు యుద్ధాల సిద్ధాంతాన్ని లేవదీసి గంద్రగోళం పడిపోయారు. చివరకు చరిత్ర రాడికల్ డెమోక్రటిక్ పార్టీ అనుసరించిన విధానమే సరైనదని రుజువు చేసింది. అది వేరే కథ. ఆ యుద్ధకాలంలో మేము గుంటూరులో అనేక బహిరంగ సభలు పెట్టి రాడికల్ డెమోక్రటిక్ పార్టీ విధానాలను ప్రచారం చేశాము. శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు ఆ సభల్లో చాల యాక్టివ్ పాత్ర వహించారు. ఆ రోజుల్లో స్వర్గీయ లావు అంకమ్మ, జి. నరహరి పి. వి. సుబ్బారావు ఆవుల గోపాలకృష్ణమూర్తి గోపీచంద్ మరియు శ్రీయుతులు జె. ఎస్. ప్రసాద్ కోగంటి రాధాకృష్ణమూర్తి, కోగంటి, సుబ్రహ్మణ్యం ప్రభృతులు శ్రీ ఎం. వి. రామమూర్తి శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్ అబ్బూరి వరదరాజేశ్వరరావు మొదలగు వారు పార్టీలో కార్యకలాపాలకు అండగా నిలబడ్డారు.

1942 లో నేను శ్రీ ఎం. వి. శాస్త్రి సూచనపై కాకినాడ వెళ్లాను. 1942 ఆగష్టు 15న క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. అనేక మంది కాంగ్రెసు వారిని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. తర్వాత వీరినందరిని 1944లో విడుదల చేశారు. రాజకీయ ఖైదీల విడుదల తర్వాత కాకినాడలో టౌన్ హాలులో ఒక బ్రహ్మాండమైన బహిరంగ సభ ఈ విడుదలైన వారిని సన్మానించేందుకు ఏర్పాటు చేశారు. ఆసభలో స్వర్గీయ శ్రీమొసలికంటి తిరుమలరావు మాట్లాడుతూ రాడికల్స్‌ను అన్యాపదేశంగా విమర్శించారు. నేను ఆ సభకు హాజరై ఉన్నాను. నేను ఆవేశం పట్టలేక ఎంతమంది కాంగ్రెస్ వారు ఆఫీర్లకు లంచాలిచ్చి ఎ క్లాసులు బి క్లాసులు వేయించుకున్నారో తెలుసా? అని ఒక్క కేక పెట్టాను. దాంతో సభ గంద్రగోళమైంది. కొంతమంది ఖద్దరు దుస్తులు ధరించిన మఫ్టీకానిస్టేబుల్స్ (అంతా యువకులు) నా చుట్టూ చేరారు. నేను వారిని కాంగ్రెస్ వారిగా అపోహపడి. తంతారేమోనని కొంత భయపడ్డాను. సభముగియగానే నేను ఎం. వి. శాస్త్రిగారింటికి వెళ్ళాను. ఆ రోజునే అబ్బూరి రామకృష్ణారావుగారు కాకినాడ వచ్చారు. ఆయన శాస్త్రిగారింట్లోనే ఉన్నారు. ఈ మఫ్టీ కానిస్టేబుళ్లంతా శాస్త్రిగారింటికి వచ్చారు. లతీఫ్ అనే.CID సబిన్‌స్పెక్టరు చాలాగట్టివాడు. అండర్‌వుడ్ అనే ఇంగ్లీషు వ్యక్తి డి. ఎస్. పి. గా ఉన్నారు. వచ్చిన కానిస్టేబుళ్లంతా నాకు చాలా ప్రోత్సాహమిచ్చి నన్ను కాంగ్రెస్ వారి సభల్లో మీ ఇష్టమొచ్చినట్లు అల్లరి చేయండి. మీ ప్రాణానికి మా ప్రాణం అడ్డు వేస్తామని హామీ ఇచ్చారు. అప్పుడు రామకృష్ణారావుగారు కల్పించుకుని మీరు మఫ్టీలో ఉన్న కానిస్టేబుళ్లని తెలిసి ఉంటే నరసింహారావు ఇంకా విజృంభించి ఉండే వాడే. మీరు కాస్త అండగా నిలబడాలని అన్నారు.

అబ్బూరి రామకృష్ణారావు, 1943లో అనుకుంటాను డెహ్రాడూన్ వెళ్ళడం సంభవించింది. రాయ్ దంపతులు అబ్బూరిని ఎంతో అప్యాయంగా ఆదరించారు. అక్కడి నుంచి కలకత్తాలో, పాట్నాలో, జరిగిన రాడికల్ డెమోక్రటిక్ పార్టీ సభకు అబ్బూరి వెళ్ళారు. పాట్నా మహా సభలకు ఆయనే అధ్యక్షత వహించారు.

## నటాలి

1944లో జూన్ ప్రాంతంలో అనుకుంటాను నేను కాకినాడ నుంచి గుంటూరు వచ్చాను. బ్రాడీపేటలోని ఒక హోటల్లో ఉదయం కాఫీ తీసుకుని

బైటికి వచ్చిన సమయంలో రామకృష్ణారావుగారు మరికొందరు హోటలు ముందు ముఖాలు కడుగుకుంటున్నారు. వారంతా ఆ సమీపంలోని ఒక గ్రామంలో 'ప్రతిమా సుందరి' నాటకం ప్రదర్శించి వచ్చారు. మేమిద్దరం ఒకరినొకరు అకస్మాత్తుగా కలుసుకోడంతో ఇద్దరికీ ప్రాణాలు లేచివచ్చినట్లయింది. అప్పుడు నటాలి బృందం తెనాలిలో కేంద్ర కార్యాలయం ఏర్పాటు చేసుకుని ఉన్నారు. మద్రాసులో 'కన్యాశుల్కం' నాటకం ప్రదర్శించారు. మద్రాసు నుంచి చీరాలకు హెడ్ క్వార్టర్స్‌ను మార్చారు. అప్పటి వరకు శ్రీ శ్రీ కూడా నటాలితో సంబంధం కలిగి ఉన్నారు. చీరాలనుంచి తెనాలికి హెడ్ క్వార్టర్సు మార్చారు. నన్ను తనతో పాటు తెనాలి తీసుకుని వెళ్ళారు. నటాలిని పూర్తిగా wind up చేసేవరకు నేను రామకృష్ణారావుగారితో కలిసి నటాలి కార్యకలాపాలలో పాల్గొన్నాను.

## నాటకాలమీద అబ్బూరి వ్యామోహం

రామకృష్ణారావుగారికి నాటకాలమీద మోజు ఉండేది. బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన పాశ్చాత్యదేశాలలో మాదిరిగా ఇక్కడ ఒక నాటక సమాజం ఏర్పాటు చేయాలనీ నాటకాలలో కొత్త ప్రయోగం చేయాలనీ ఆయన ఆశ. యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా ఉన్న రోజుల్లో ఆయనే ప్రయోక్తగా మూడుసార్లు 'కన్యాశుల్కం' నాటకం ప్రదర్శించబడటం నేను చూశాను. ఒకసారి 1934 లో స్టూడెంట్స్ యూనియన్ వార్షికోత్సవమో లేదా మరో సందర్భంలోనో యూనివర్సిటీ కాంపస్ లోనే ప్రదర్శించారు. తర్వాత గుంటూరు తుఫాను (1935) అనుకుంటాను. బాధితుల సహాయార్థం విశాఖపట్టణం టౌన్‌హాలులో రెండు రాత్రిళ్ళు వరసగా రెండు ప్రదర్శనలిచ్చారు. అంతా యూనివర్సిటీ విద్యార్థులే. అబ్బూరి రామప్ప పంతులు పాత్ర ధరించారు. దాడి గోవింద రాజులుగారు మధురవాణి పాత్ర ధరించారు. ఆ సెట్టింగ్స్, దృశ్యాలు అపూర్వం. అగ్నిహోత్రావధాన్లు ఇల్లు రామప్పంతులు చెరువు గట్టుమీద కూర్చొని ముఖం కడుక్కునే దృశ్యం— సినిమాచూసినట్లుంది కాని నాటకం మాదిరిగా లేదు. అబ్బూరి స్వయంగా రాత్రిం బగలు నిలబడి ఆ సెట్టింగ్స్‌ను తయారు చేయించారు. నటులంతా ఎమెచ్యూర్స్. అంతా యూనివర్సిటీ విద్యార్థులే. ఆ టీంవర్కు, రిహార్సల్స్‌లో వారు పడిన శ్రమ ఎంతో ప్రశంసనీయమైనవి.

నటాలి తరఫున రెండే నాటకాలు 'ప్రతిమా సుందరి' 'కన్యాశుల్కం' ప్రదర్శించబడ్డాయి.

ఈ సందర్భంలో నటాలి చరిత్రను గురించి కొంత చెప్పాలి. ఆ రోజుల్లో అనగా రెండో ప్రపంచయుద్ధం సాగుతున్న రోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వంవారు నేషనల్ వార్ ఫ్రంట్ అనే ఆర్గనైజేషన్ ఏర్పాటు చేశారు. అప్పుడు అవిభక్త మద్రాసు రాష్ట్రం ఉండేది. తెలంగాణా నిజాం పాలనలో ఉండేది. స్టేట్ ఆర్గనైజరుగా (అంటే మద్రాసు స్టేట్) జి. టి. బి. హార్వే అనే ఇంగ్లీషు దొర ఉండేవారు. ప్రతి జిల్లాకు ఒక జిల్లా ఆర్గనైజరు ఉండేవారు. యుద్ధ ప్రచారం చేయడం ఆ ఫ్రంట్ లక్ష్యం. అంటే ప్రజలకు యుద్ధ స్వభావం గురించి వివరించి, యుద్ధానికి అండగా ప్రజలను సమీకరించడం ఈ ఫ్రంట్ చేయవలసిన పని.

నేషనల్ వార్ ఫ్రంట్‌తో నటాలి ఒక అగ్రిమెంటు కుదుర్చుకుంది. ఇది ఎలా జరిగిందీ, ఎవరు అందుకు ఇనిషియేటివ్ తీసుకుందీ ఆ వివరాలు నాకూ సరిగా తెలియవు. ఆ అగ్రిమెంటు చాలా సింపుల్‌గా ఉంది.

నటాలి తరఫున ప్రదర్శించే నాటకాలకు వచ్చేనష్టాన్ని నేషనల్‌వార్ ఫ్రంట్ సబ్సిడీగా ఇచ్చి భరిస్తుంది. అదీ లక్షరూపాయల నష్టం వరకు మాత్రమే. ఇది ఏడాది అగ్రిమెంటు. ఈ ఏడాది తాను ఎన్ని నాటకాలు ప్రదర్శించాలి, ఏయే నాటకాలు ప్రదర్శించాలి, నటీనటులు ఎవరుండాలి— ఇలాంటి వివరాలేవీ ఆ అగ్రిమెంటులో లేవు. జి. టి. బి. హార్వేకు మాత్రం రామకృష్ణరావు అంటే విపరీతమైన విశ్వాసం. అభిమానం ఉండేవి. ఈ అగ్రిమెంటుకు రాడికల్ డెమోక్రాటిక్ పార్టీకి ఎట్టి సంబంధం లేదు. అయితే రామకృష్ణారావుగారికి రాడికల్ పార్టీతోను, ఎం. ఎన్. రాయ్‌తోను గల సాన్నిహిత్యం యుద్ధంపట్ల పార్టీ వైఖరి మొదలైనవి హార్వేకు తెలుసు. అంతవరకే.

తమాషా ఏమిటంటే నటాలి ప్రదర్శించే నాటకాలు యుద్ధ ప్రచారానికి తోడ్పడేట్లుగా ఉండాలన్న షరతు కూడా అగ్రిమెంటులో లేదు. ఆ అగ్రిమెంటు ప్రకారం నటాలికి అంటే అబ్బూరికి ఒక రూపాయి లాభంకాని, ఒక రూపాయి నష్టంకాని రావడానికి వీల్లేదు. లాభనష్టాలులేని వ్యాపారం. నటాలిలోని ఆర్టిస్టులంతా కూడా నెల జీతగాళ్లే. ఒక్క వసుమర్తి కృష్ణమూర్తికి తప్ప మిగతా నటీనటులందరికీ వందరూపాయలే జీతం. రామకృష్ణరావుగారు కూడా జీతం

(3)

తీసుకునేవారిలో ఉన్నారు. ఆయనే సర్వాధికారి. అయినా ఆయన తాను యూని వర్సిటీలో లెక్చరరుగ ఎంత జీతం తీసుకున్నారో అంతే జీతం నిర్ణయించు కున్నారు.

వాహినీలో ప్రఖ్యాత నృత్యదర్శకుడుగా పేరు పొందిన పసుమర్తి కృష్ణ మూర్తిని వెలుగులోకి తెచ్చింది నటాలి. కృష్ణమూర్తి కూడా చాలా కష్టపడి పనిచేసే బాపతు. ప్రతిమా సుందరి నాటకంలో బృంద నృత్యం ఉంది. అందు కోసం ఐదారుమంది ఆడపిల్లలకు పసుమర్తి కృష్ణమూర్తి నాట్యంలో శిక్షణ ఇచ్చారు. వాళ్లు ఉదయం 5 గంటలనుంచి 8 గంటలదాకా మళ్ళీ రాత్రి రెండు గంటల నాట్యం నేర్చి వారిని చక్కని నర్తకులుగా తీర్చి దిద్దారు.

నటాలి ఆర్కెస్ట్రా కూడా కొత్త తరహాగా ఉంది. అంతకు పూర్వం నాట కాలలో హార్మోనియం ఒకటే ప్రధానమైన వాయిద్యం. నటాలి మృదంగం వయొలిన్, ఫ్లూట్ మొదలైన వాయిద్యాలను కూడా చేర్చింది. అంతకు పూర్వం నాటకాలలో హరిశ్చంద్ర నాటకం వేసే హరిశ్చంద్రుడు రాజుగా, ఉన్నప్పుడు, కాటికాపరిగా ఉన్నప్పుడు కూడా ఒకే కర్టెను ఉండేది. అలాకాక నటాళి సైక్లో రమా (బ్లాకర్టెను) ప్రవేశపెట్టింది. ప్రకృతి సహజమైన సెట్టింగుల ఏర్పాటు చేసింది.

ప్రతిమా సుందరి నాటకాన్ని అబ్బూరి వరద రాజేశ్వర్రావు రాశారు. అదంతా కేవలం సంభాషణలు మాత్రమే ఉన్న నాటకం. ఆ రోజుల్లో అబ్బూరి సోదరులు, పులిపాటి, అద్దంకి, స్థానం, బందా, డి. వి. సుబ్బారావు, సూరిబాబు రాజేశ్వరి బృందాలు చాలా ప్రసిద్ధిలో ఉండేవి. వారంతా మంచి పాటగాళ్లు. పాండ వోద్యోగ విజయాలు, చింతామణి, హరిశ్చంద్ర వంటి పౌరాణిక సాంఘిక నాట కాలు ప్రసిద్ధి గాంచి ఉండేవి. కొప్పరపు సుబ్బారావుగారి తారాశశాంకం మంచి పేరు సంపాదించింది. ఉద్యోగవిజయాలలో నిమిషానికో పద్యం, దానికి వన్స్ మోర్‌లు — అలా సాగేవి ఆనాటి నాటకాలు. ప్రతిమాసుందరి నాటకంలో పద్యాలు లేవు. కాని సంభాషణలు, పాటలు బృందనృత్యం ప్రేక్షకులను ఆకర్షించేవి. పద్యాలు లేనందున, రెండు మూడు ప్రదర్శన లిచ్చిన తర్వాత, రామ కృష్ణరావుగారు వరద రాజేశ్వరరావు కలిసి నాటకంలో సందర్భాలనుబట్టి నాలుగైదు పద్యాలు రాశారు. దాంతో నాటకం మారింది. బాగా రక్తి కట్టింది.

సెట్టింగుల ఏర్పాటంతా, రామకృష్ణారావుగారి పెద్ద కుమారుడు, వాణీ కుమార్ చూసేవారు. పబ్లిసిటీ బాధ్యత, ఇతర ఏర్పాట్లన్నీ వాణీకుమార్ బాధ్యత వహించి నిర్వర్తించాడు.

మద్రాసు మొదలుకొని పార్వతీపురం వరకు అన్ని జిల్లాలు, అన్ని పట్టణాలేకాక అనేక గ్రామాల్లో కూడా ప్రతిమాసుందరి నాటకాన్ని ప్రదర్శించడం జరిగింది.

ఒకసారి ఏలూరులో ఈ నాటక ప్రదర్శన ఏర్పాటు చేశారు. అప్పటికీ ఇప్పటికీ కూడా నాటకాల పరిస్థితిలో పెద్ద మార్పులేదు. రాష్ట్రంలో నాటకాల ప్రదర్శన కోసం ప్రత్యేకంగా థియేటర్లు లేవు. ఉన్నవన్నీ సినిమా థియేటర్లే. సినిమా థియేటరులోనే ఆ రోజుల్లో నాటకాలు ప్రదర్శించేవారు. నాటకం రోజున సినిమా ప్రదర్శన నిలిపివేసేవారు. సినిమా మూడు ఆటలకు ఎంత కలెక్షన్ వస్తుందో అంచనా వేసుకొని, నాటకం ప్రదర్శనకు అంత ఛార్జి చేసేవారు. ప్రేక్షకుల టిక్కెట్లు కూడా పావలా, అర్ధరూపాయి, రూపాయి— ఆ ధోరణిలో ఉండేవి. ఏలూరు నాటకం ప్రదర్శన కోసం గొప్పగా పబ్లిసిటీ చేశాము. ట్రూపు అంతా నాటకం రోజున ఏలూరు వచ్చారు. ట్రూపు వచ్చిన రాత్రే కడవపోతగా వర్షం ప్రారంభమై మూడు రోజులు కుంభవర్షం కురిసింది. పబ్లిసిటీ అంతా దండగైపోయింది. ట్రూపు రైలు ఛార్జీలు, వారి భోజనవసతి ఖర్చులు, హాలు కిచ్చిన అడ్వాన్సు అంతా దండగైపోయింది. అయితే ఆ థియేటరువారు రామ కృష్ణారావుగారికి బాగా తెలిసినవారు కావడంవల్ల థియేటరు అద్దె విషయంలో కొంత కన్సిడరేషన్ చూపారు.

మూడు నెలలకొకసారి నటాల్లి అకౌంట్స్‌ను మద్రాసుకు ఆడిట్ కోసం తీసుకెళ్లేవాళ్ళము. నేనే అకౌంటెంట్‌గా ఉన్నాను. కాబట్టి నేను వాటిని ఆడిట్ కోసం తీసుకెళ్లేవాడిని. అప్పుడు శ్రీరామమూర్తిగారనే అకౌంటెంట్, హనుమంత రావుగారనే ఆడిటర్ నేషనల్‌వార్ ఫ్రంట్ ఆఫీసులో పని చేస్తుండేవారు. ఇద్దరూ తెలుగువారే. అసలు హార్వే — అబ్బూరి సంతకం చేసి కుదుర్చుకున్న అగ్రి మెంటు డ్రాఫ్టును తయారు చేసింది శ్రీ శ్రీరామమూర్తిగారు. అకౌంట్స్ తీసుకుని నేను ముందు వెడితే, రామకృష్ణారావుగారు నా వెనకే రెండు రోజుల తర్వాత మద్రాసు వచ్చేవారు. నటాలి సిబ్బందికి జీతాలివ్వటానికి, ఇతర రనింగ్ ఖర్చు

లకు వచ్చినప్పుడల్లా పదివేలు అడిగేవారు. అకౌంట్స్ సెక్షన్‌లో పేచీ పెట్టే వారు. నాటకాలు ప్రదర్శించకుండానే డబ్బు అడిగితే ఎలాగనేవారు. నటాలి ప్రారంభించిన ఆరేడు నెలల వరకు అంత పెద్ద సంఖ్యలో నాటకాలు ప్రదర్శించ లేదు.

కాని హార్వే మాత్రం పదివేలడిగితే 'ఇంతేనా' అనేవారు. కాని రామకృష్ణా రావుగారు ఆ పదివేలడగటానికే వెనకముందాడేవారు. ఏలూరు నాటకానికయిన ఖర్చుకు ఆడిట్‌వారు అభ్యంతరం చెప్పారు. నాటకాన్ని ప్రదర్శించలేదు కాబట్టి, ఆ డబ్బు మేమివ్వమన్నారు. తుఫాను అనుకోకుండా వచ్చింది కాబట్టి, మీరే భరించాలని రామకృష్ణారావుగారు గోలపెట్టారు. చివరకు హార్వేను కలిస్తే దానిని మంజూరు చేశారు.

హార్వేకు రామకృష్ణారావుగారి మీద ఎంత విశ్వాసం ఉండేదంటే ఆయన నంది అంటే నంది, పంది అంటే పంది తప్ప మరో మాటమాట్లాడేవారుకారు. నేషనల్ వార్ ఫ్రంట్‌తో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం నటాలి లక్ష రూపాయల వరకు సబ్సిడీ పొందవచ్చు. కాని 73 వేల రూపాయలు మాత్రమే నటాలి డ్రా చేసింది. మిగతా డబ్బు మురిగిపోయింది. దానికి కారణం నాటకాలు తగినన్ని సంఖ్యలో ప్రదర్శించ లేకపోవడమే. నాటకాల ప్రదర్శనకు తగినన్ని థియేటర్లు లేవు. తాలూకా కేంద్రాల్లో కూడా సినిమా థియేటర్లలోను, పెద్దపెద్ద గ్రామాలలో పెద్ద చావిళ్ళలోను నాటకాలు ప్రదర్శించాము. అదే నటాలి కథ. లక్షరూపాయల సబ్సిడీ అంటే ఆ రోజుల్లో పెద్దమొత్తమే. కాని సగానికి మించి సబ్సిడీ తీసుకోలేకపోయాము.

## కన్యాశుల్కం

నటాలి తరపున కన్యాశుల్కం నాటకాన్ని విశాఖపట్టణం, అనకాపల్లి, విజయనగరం మొదలైన పట్టణాలలో మాత్రమే ప్రదర్శించాము. రామకృష్ణా రావుగారికి 'కన్యాశుల్కం' అభిమాన పాత్రమైన నాటకం. అసలు కన్యాశుల్కం నాటకంకాదు, అదొక ప్రహసనం అనేవా రున్నారు. ఒక సందర్భంలో ఒకసారి హైదరాబాద్‌లో ఆయన మూడో కుమారుడు గోపాలకృష్ణ గదిలో ఉండగ నేను అడిగాను. కన్యాశుల్కం నాటకము ప్రహసనమా అని. ఆయన తడుముకో

కోకుండా తక్షణమే అసలు తెలుగులో కన్యాశుల్కం తప్ప నాటకమే లేదన్నారు. ఇది చాలా అతిశయోక్తిగా కనిపించవచ్చు. కొందరు ఈ అభిప్రాయంతో ఏకీభవించక పోవచ్చు. కాని రామకృష్ణారావుగారికి కొన్ని విచిత్రమైన భావాలున్నాయి. అవి ఆయన కన్విక్షన్స్ కూడా. నటాలి ప్రదర్శించిన కన్యాశుల్కంలో గిరీశం పాత్రకే ప్రాధాన్యత లేదు. కన్యాశుల్కం అనే భాగానికి మాత్రమే ప్రాముఖ్యమిచ్చారు. రామప్పంతులు, మధురవాణి, కరటక శాస్త్రి, అగ్నిహోత్రావధాన్లు. లుబ్ధావధాన్లు, మీనాక్షులకు మాత్రమే ఈ నాటకంలో ప్రాధాన్యత ఉంది. గురజాడవారు నాటి సామాజిక సంప్రదాయాలమీద తిరుగుబాటు లేవదీశారు. తన అభ్యుదయభావాలను, సంస్కరణ భావాలను గిరీశం చేత చెప్పించారు. దయ్యాలు భూతాలలో కూడా గురజాడ వారికి నమ్మకం లేదు. పూజారి గవరయ్య ఆసిరిగాళ్ల చేత ఆ భావాలు చెప్పించారు.

## పాత్రలు

కన్యాశుల్కం నాటకంలో డాక్టర్ చంద్రమౌళి సత్యనారాయణగారు (తెనాలి) రామప్పంతులు పాత్ర ధరించారు. కన్యాశుల్కంనాటకాన్ని గురించి రామకృష్ణారావుగారు అతి నిశితంగా, అతి క్షుణ్ణంగా పరిశీలించారు, చదివారు. కీ. శే. గురజాడ అప్పారావుగారి రోజుల్లో విశాఖపట్టణంజిల్లాలోని పరిస్థితులను, సంప్రదాయాలను దృష్టిలో పెట్టుకుని ఆ నాటకంలోనే వర్ణించారు. నిశితంగా విమర్శనా దృష్టితో ఆ నాటకాన్ని రామకృష్ణారావుగారు పరిశీలించారు. మధురవాణి పాత్ర రామప్పపంతులు పాత్ర, లుబ్ధావధాన్లు, కరటక శాస్త్రి పాత్రలు ఎలా ఉండేవో, ఆ నాటకం చదివితేనే గ్రహించవచ్చు. హెడ్‌కానిస్టేబుల్, పూజారి గవరయ్య, అసిరిగాడి దగ్గరనుంచి గిరీశం, మధురవాణి, రామప్పంతులు పాత్రవరకు ప్రతిదీ ముఖ్యమైన పాత్ర. ప్రతిపాత్రను రామకృష్ణారావు ఎంతో శ్రద్ధగా పరిశీలించి జీర్ణం చేసుకున్నారు.

కన్యాశుల్కం నాటకం మొత్తం — 'ఇవాళ పూటకూళ్లమ్మకు నాకు పెద్ద యుద్ధమైపోయింది' ........నుంచి 'డామిట్' కథ అడ్డం తిరిగింది' అనేవరకు రెండు మూడు రాత్రిళ్ల వరసగా ప్రదర్శించాలనే అభిప్రాయం రామకృష్ణారావు గారికి గట్టిగా ఉండేది. ఆ ప్రయోగాన్ని ఎ. ఆర్. కృష్ణ బృందంతో కొనసాగించి ఉంటే బాగుండేది.

తెనాలి సమీపంలోని ఒక గ్రామం మునసబుగిరీ రామకృష్ణారావు పూర్వీకులకుండేది. తిరిగి ఆ మునసబుగిరి తగువు సందర్భంలో రామకృష్ణరావుగారు తరచు తెనాలి వస్తుండేవారు. ఆ మునసబుగిరి గోపాలకృష్ణగారికి రావడంవల్ల తరచుగా తెనాలి రావలసి వచ్చేది. అప్పుడు మా ఇంట్లోనే ఉండేవారు. నటాలి వైండ్ అప్ అయిన తర్వాత మళ్లీ మేము ఈ సందర్భంలోనే తెనాలిలో కలిశాము.

## హైదరాబాద్‌లో

1957 నవంబరు 1వ తేదీన నేను హైదరాబాద్ వచ్చి సెటిల్ అయిపోయాను. 1958 లో రామకృష్ణరావుగారిని మళ్లీ హైద్రాబాద్‌లో కలిశాను. అప్పుడు చిక్కడపల్లిలో గోపాల్ గదిలో ఆయన ఉండేవారు. అప్పుడు రామకృష్ణారావుగారు 'మృచ్ఛకటికం' నాటకం తర్జుమా చేస్తున్నారు. ఆయన డిక్టేట్ చేస్తే నేనూ రాసేవాడిని. ఒక రోజున పక్కవాటాలో ఎక్కడో ఎవరో 'మల్లీశ్వరి' చిత్రంలోని భానుమతి పాట రికార్డు పెట్టారు. నాకు డిక్టేట్ చేయడం అపేసి, ఆ పాట వింటున్నారు. పాటపూర్తయిన తర్వాత 'ఆ! సరే ఎంతవరకు వచ్చాము' అన్నారు. నేను ఉండబట్టలేక 'మాస్టారూ కృష్ణశాస్త్రిగారు, శ్రీశ్రీ, చివరకు విశ్వనాథ సత్యనారాయణగారు కూడా సినిమాలకు పాటలు మాటలు రాస్తున్నారు. మీరు ఎందుకు రాయకూడదు. అది చాలా లాభంకదా అన్నాను. రెండు నిమిషాలు ఆలోచించి ఈ ఛాప్టరుకానీ మాట్లాడదాము అన్నారు. ఆ ఛాప్టరు అయిపోయిన తర్వాత, ఇప్పుడడుగు ఇందాకటి ప్రశ్న అన్నారు.

దానిపై ఒక గంట లెక్చరిచ్చారు. నాటకం ఒక కళ. రంగస్థలనటులు మాత్రమే కళాకారులు, సినిమా అనేది ఒక పరిశ్రమ. దాని పేరే ఫిలిమ్ ఇండస్ట్రీ. ఫిలిమ్ ఆర్టిస్టులు కళాకారులు కాదు. దర్శకుడు ఆడించినట్లల్లా అడే బొమ్మల వంటివారు. సినిమాకు పాటలు మాటలు రాయవచ్చు. చాలమంది అడిగారు కూడా. కాని సినిమాకు మాటలు పాటలు రాసేవారికి స్వేచ్ఛ ఉండదు. దర్శకుడు నిర్మాత, హీరో, హీరోయిన్‌లు పెద్దవాళ్ళయితే వాళ్లు ఎలా చెపితే అలా రాయాలి. కవికి స్వేచ్ఛ ఉండాలి. ఇతర్లు డిక్టేట్ చేసినట్లు కవి రాయలేడు. కృష్ణశాస్త్రిగారికి తెలుసు.

ఒకసారి హైదరాబాద్‌లో రేషనలిస్టు కాన్ఫరెన్సు జరిగింది. తర్కతీర్థ లక్ష్మణశాస్త్రి జోషి ఆ సభకు అధ్యక్షత వహించారు. నేను, రామకృష్ణరావు, జోషి ఆ సందర్భంలో ఒక హోటలులో కాఫీ తాగడానికి వెళ్ళాము. జోషి గొప్ప సంస్కృత పండితుడు. ఆయన రామకృష్ణరావుగారిని ఒక చిన్న ప్రశ్న వేశారు. దాని మీద రామ కృష్ణరావుగారు గంట లెక్చరిచ్చారు. ఇద్దరూ సంస్కృతంలోనే సంభాషణ సాగించడం వల్ల, నా కదంతా గ్రీక్ అండ్ లాటిన్‌గా ఉంది. హోటల్ సర్వర్ వచ్చి ఇంకేం కావాలి సార్ అని అడిగేంతవరకు వాళ్ళిద్దరూ మాట్లాడుతూనే ఉన్నారు. అంతా అయిపోయిన తర్వాత 'రామకృష్ణరావు నీ బుర్ర ఒక గ్రంథమాల' అన్నారు జోషి.

రామకృష్ణరావుగారు లైబ్రేరియన్‌గా పని చేయడంవల్ల కూడా, ఆయనకు ప్రతి సబ్జక్టులోనూ కొంత ప్రవేశం ఉంది. ఆయన సాహిత్య ప్రియుడైనా అన్ని సబ్జక్టులూ ఆయన చదువుతూ ఉండేవారు. లైబ్రేరియన్ కావడం ఒక అడ్వాన్టేజ్ కావచ్చు.

ఆయన మరణ వార్త నాకు ఆశ్చర్యం కలిగించకపోయినా చాల బాధ కలిగించింది. నేను 'ఈనాడు' లో సబ్ ఎడిటర్‌గా ఉండగా, ఒకరోజు మధ్యాహ్నం లంచ్ అవర్ తర్వాత సరిగా 1.30 గంటలకు ఆయన మరణవార్త టెలిప్రింటర్ మీద వచ్చింది.

ఆయన ఢిల్లీలో మరణించారు. దాదాపు నలభైసంవత్సరాలపైకాలం మేమిద్దరం ఎంతో సన్నిహితంగా ఉన్నాము. 1934 నుంచి దాదాపు దశాబ్దన్న రకాలం ఇద్దరి జీవితాలు ఒకే రకంగా సాగాయి. ఒక ఆప్తమిత్రుడిని కోల్పోయి నన్న బాధ నాకు ఆయన మరణ వార్త కలిగించింది.

నార్ల వెంకటేశ్వరరావు

# శ్రీ అబ్బూరి

ఎవరెన్ని గ్రంథాలు వ్రాశారనేది ముఖ్యంకాదు; ఎంతెంత పెద్ద గ్రంథాలను వ్రాశారనేది కూడా ముఖ్యంకాదు. శతాధిక గ్రంథకర్తలందరూ మహా రచయితలు కారు; సహస్రాధిక పుటలతో కూడిన గ్రంథాలను వ్రాసిన వారందరు సాహిత్య సమ్రాట్టులుకారు.

వాల్మీకి వ్రాసింది ఒకే ఒక కావ్యం. అయినా, ఆయన సంస్కృతంలో ఆదికవి మాత్రమేకాదు. మహాకవి కూడా. కీట్స్ వ్రాసింది చాలా తక్కువ. అయినా, ఇంగ్లీషు విమర్శకులలో పెక్కుమంది షేక్స్పియర్ తర్వాత కీట్స్‌కే పెద్ద పీట వేస్తారు.

టాల్‌స్టాయ్ వ్రాసినవి పట్టుమని పది నవలలైనా లేవు. అయినా, ప్రపంచం మొత్తంమీదనే నవలాకారులలో ప్రథమస్థానం ఆయనదే. ఏ రచయితకైనా విలువ కట్టవలసింది అతడి రచనల రాశినిబట్టికాదు. వాటి గుణాన్ని బట్టే. అయినా ఇందుకు భిన్నంగా తరచు జరగడం కద్దు.

ఎంతదూరంవరకో పోనక్కరలేదు; మన తెలుగు గడ్డ పైనే కేవలం వారి రచనల రాశినిబట్టి మహారచయితలుగా, సాహిత్యసమ్రాట్టులుగా కీర్తించబడుతున్నవారు పెక్కుమంది వున్నారు.

ఇంతకంటె విపరీతం మరొకటి వున్నది. మన రాజకీయవేత్తలు, ఇతర ప్రముఖులు పీఠిక వ్రాయవలసిందిగా ఏ అయిదారు వందల పేజీల పుస్తకాన్నో తమకు పంపించగా అది అపూర్వమైనదని, విశిష్టమైనదని, ప్రపంచ భాషలన్నింటిలోకి అనువదించదగినదని దాన్ని ప్రశంసించడం కద్దు. పదేళ్ళనాడు, చివరికి

రెండేళ్ళ క్రితం కూడా యిట్టి ప్రశంసలందుకున్న గ్రంథాలలో పెక్కింటిని ఈనాడు చదువుతున్న వారు కనబడరు. నిజానికి వాటికి పీఠికలను వ్రాసిన వారైనా వాటిని ఎంతవరకు చదివినారో అనుమానమే !

కేవలం రాశికే విలువనిచ్చేవారి దృష్టిలో శ్రీ అబ్బూరి రామకృష్ణరావు కవి కాకపోవచ్చు. ఆయన వ్రాసింది చాలా కొద్ది. ఆ కొద్దిపాటిని కూడా ఆయన ప్రచురించలేదు. ప్రచురించినదాన్ని కూడా పూర్తిగా భద్రపరచుకోలేదు.

అయినా, ఆయన ఉన్నతశ్రేణికి చెందిన కవి; భాషపై అధికారం వున్న కవి; ఛందోరీతులపై అధికారమున్న నూత్న వినూత్న ప్రయోగాలను చేసిన కవి; సంప్రదాయాలు తెలిసినా, వాటికి బానిసకాక, ఆధునిక దృష్టితో ముందుకు నడిచిన కవి; అర్ధశతాబ్ది క్రితంవలె ఈనాడు కూడా కవులకే కొత్త బాటలను చూపగల ప్రజ్ఞా ప్రాభవాలున్న కవి.

దాదాపు అలభ్యమైపోయిన, అక్కడక్కడ చెల్లా చెదురుగావున్న శ్రీ అబ్బూరి రచనలను సేకరించి "ఊహాగానము, ఇతరకృతులు" అనే పేరుతో ప్రచురించినందుకు "కవితా సంస్థ" వారిని (15, సాధువాస్వాని మార్గ్, న్యూఢిల్లీ – 100 005) మేము అభినందిస్తున్నాము. ఈ సంపుటిని (దీని వెల 20 రూపాయలు) శ్రీ అబ్బూరి 78 వ జన్మదినోత్సవ సందర్భంలో (మే 20 వ తేదీని) ప్రచురించడం మరింతగా అభినందించదగు విషయం.

టాగోర్ వద్దనుంచి, అరవిందయోగివద్దనుంచి, ఎం. ఎన్. రాయ్ వరకు శ్రీ అబ్బూరి పయనించారు; ఆయన నిత్యపథికుడు కనుక. మరింత ముందుకు కూడా పయనించగలరు. వృద్ధాప్యం ఆయన దేహానికే, మనస్సుకు కాదు. హృదయానికి కాదు. ఆయనను ఈనాడు కలుసుకుంటే, ప్రపంచంలో ఈనాడు ఏమూల ఏకొత్త చింతన జరుగుతున్నదో, రేపటిపై దాని ప్రభావం ఏమికానున్నదో వివరిస్తారు. మన కవి సమ్రాట్టులు పెక్కు మందివలె ఆయన చూపు వెనుకకు కాదు. ముందుకే. ఆయనకు స్వర్ణయుగం వేదకాలంలో లేదు. ఆర్య ఋషుల సంఘంలో లేదు, అది భావికాలంలో వున్నది. ఏక మానవ కుటుంబంలో వున్నది.

శ్రీ అబ్బూరి కవి మాత్రమేకాదు, పండితుడు, విమర్శకుడు, తాత్త్వికుడు, నటుడు, నాటక ప్రయోక్త, సంభాషణాచతురుడు. అన్నింటిని మించి సమ్యక్ దృష్టివున్న మానవతావాది. ఆయన ఇట్టి జన్మదినోత్సవాలను మరి పెక్కింటిని జరుపుకోవాలని మనసారా కోరుతున్నాము.

(ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక 9-6-73 సంపాదకీయం)

వై. మాధవాచార్యులు

# ప్రఖ్యాపన ప్రసంగము

(ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నలువది ఏడవ పట్టప్రదాన సభయందు 'కళాప్రపూర్ణ' బిరుద ప్రదానావసరమున శ్రీ అబ్బూరి రామకృష్ణారావునుగూర్చి విశ్వవిద్యాలయాధ్యక్షుల సమక్షమున శ్రీ వై. మాధవాచార్యులు గావించిన ప్రఖ్యాపన ప్రసంగము.)

అధ్యక్షమహోదయా !

అద్యతనాంధ్ర భావకవి ప్రపంచంలో ఆద్యులుగా, జాతీయోద్యమంలో అగ్రశ్రేణి సైనికులుగా, రంగస్థల నటకులుగా, నాటక ప్రయోక్తలుగా, అన్నింటినీ మించి మానవతావాదులుగా సుప్రతిష్ఠులైనవారు శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు.

వీరు తెనాలి హైస్కూలులోను, బందరు నోబుల్ కళాశాలలోను, మైసూరు మహారాజా సంస్కృత కళాశాలలోను, శాంతినికేతనంలోను, కలకత్తా సిటీ కాలేజిలోను విద్యాభ్యాసం చేసి పట్టభద్రులైనారు. ఆ తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సంస్కృతాంధ్రాధ్యాపకులుగాను, గ్రంథాలయపాలకులుగాను, గ్రంథాలయ శాస్త్రబోధకులుగాను ముప్పయి సంవత్సరాలు ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించారు. విద్యార్థిదశనుంచీ ఈనాటివరకూ అనేక చారిత్రక సంఘటనలతో కూడిన వీరి పూర్ణపూరుషాయుషజీవితం సాహితీవికాసానికేకాక, సర్వతోముఖమైన జాతి వికాసానికి కూడా అంకితమైంది. వీరు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి 'రామదండు'లో ఒక సేనాని. రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ముఖ్య కార్యకర్త. పాట్నాలో జరిగిన నేషనల్ డెమొక్రటిక్ కాన్ఫరెన్సుకు అధ్యక్షులు.

ఇక సంస్కృతి రంగంలో పరికిస్తే అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం నిర్మాతల్లో ముఖ్యులు. ఇండియన్ రినైజాన్స్ అసోసియేషన్ సంస్థాపకుల్లో ఒకరు. కేంద్ర సాహిత్య అకాడమీ సలహా సంఘ సభ్యులు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యులుగా పదేళ్ళపాటు పనిచేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఏర్పరచిన తెలుగు భాషా సంఘం సభ్యులుగా విద్యారంగంలో వ్యావహారిక భాషా ప్రవేశానికి దోహదంచేసిన ప్రముఖుల్లో వీరొకరు. వంగ దేశీయాంధ్ర సమితికి సర్. సి. వి. రామన్ అధ్యక్షులుకాగా, శ్రీ అబ్బూరి ఉపాధ్యక్షులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నాటక సంఘానికి ఉపాధ్యక్షులుగా ఉండి, ఇక్కడ ఒక ప్రత్యేక నాటక విభాగం ఏర్పడటానికి నేపథ్యం సవదరించిన ప్రముఖుల్లో శ్రీ అబ్బూరి వారొకరు.

వీరు కొన్నాళ్ళు 'ఇండియన్ లిటరేచర్' పత్రికకు సంపాదకులుగా ఉన్నారు. 'అభినవ కవితా ప్రశంస' రూపంగా ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధం అవతరణకూ, కృష్ణా పత్రికలో 'రసమంజరి' శీర్షికా నిర్వహణకూ వీరే కారకులు. ఆంధ్ర విశ్వకళా పరిషదధికార ముద్రికా రూపకల్పనంలో ఆనాటి ఉపాధ్యక్షులు డాక్టర్ సి. ఆర్. రెడ్డిగారికి వీరు సాహాయ్యకులు.

'జలాంజలి', 'మల్లికాంబ', 'ఊహాగానం' ఇత్యాదులు వీరి ముఖ్య పద్య కావ్యాలు. 'నదీసుందరి', 'ధాన్యలక్ష్మి', 'ముఖ్యమంత్రి' అనేవి వీరి స్వతంత్ర నాటకాలు. ఇవికాక, రవీంద్ర నాటకాలను, ఇబ్సన్ 'ప్రజాశత్రువు', చెహోవ్ 'వార్షికోత్సవం', శూద్రకుని 'మృచ్ఛకటిక' నాటకాలను వీరు తెనిగించారు. 'సూర్యరాజుకథలు' అనే కథాసంపుటి, 'మంగళసూత్రం' అనే నవల వీరి ఇతర రచనలు. ప్రధాన సంపాదకులుగా సాహిత్య అకాడమీ పక్షాన వీరు నన్నయ, నన్నెచోడ, తిక్కన పద ప్రయోగకోశాలను రూపొందించారు.

ఇక నాటక రంగంలో నాట్యగోష్ఠి ఉద్యమాన్ని స్థాపించి 'నటాలి' అనే నట సమాఖ్యకు సంస్థాపక దర్శకులుగా అనేక నాటకాలు ప్రదర్శించారు. 'కన్యాశుల్కం', 'ప్రతిమా సుందరి', 'మృచ్ఛకటిక', 'ముఖ్యమంత్రి' నాటకాలను ఆంధ్రప్రదేశమంతటా ప్రదర్శించారు. ప్రయోక్తగానే కాక, నటకులుగా గాల్స్‌వర్ది 'జస్టిస్' లోనూ, షేక్స్‌పియర్ 'జూలియస్ సీజర్' లోనూ, 'కన్యాశుల్కం' లోనూ, 'ప్రతిమా సుందరి' లోనూ పాల్గొన్నారు.

ఈ విధంగా ఆంధ్ర జాతి జీవితంలో అనేక రంగాలలో అపూర్వ కృషి చేసిన సిద్ధహస్తులూ అపార ప్రజ్ఞాధురీణులూ అయిన శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారిని 'కళాప్రపూర్ణ' బిరుదంతో సమ్మానించవలసిందని ఆంధ్ర విశ్వకళా పరిష దధ్యక్షులకు వినయపురస్సరంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

(వాల్తేరు – ఆగష్టు 3, 1974.)

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

# శ్రీ అబ్బూరి వారితో

శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారిని చూడటానికి వెతుక్కుంటూ వెళ్ళడం ఒక సాహిత్యయాత్ర. డాక్టర్ రమేష్‌బాబు చిన్నకారులో లజపత్‌నగర్ నుంచి అబ్బూరి వారి యింటికి జవాహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ న్యూ కాంపస్ ఉత్తర ఖండ్‌కి తరలివెళ్ళాం. అది మెహరోలీ ప్రాంతానికి దగ్గర —— కుతుబ్ మీనార్ కనపడుతూ మాయమవుతూ కవ్విస్తోంది. స్వెట్టర్ల మాత్రపు చలి. యథా ప్రకారం ఢిల్లీ గుమాస్తా నగరపు శీవితో డల్‌గా, బిజీగా, వుంది. అయిదూ అయిదున్నరకే చీకటి పడిపోతుంది.

జవాహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ న్యూ కాంపస్‌లో భవనాలన్నీ పాత ఛందస్సుల్ని విడిచేసిన పద్యాల్లాగున్నాయ్. చీకట్లో, గొంతుక కూర్చున్న మనుషుల్లా అవి స్పష్టాస్పష్టంగా కనిపిస్తున్నాయి.

అబ్బూరి వారిల్లు "అబ్బో" అనేలా మంచివాళ్ళు దర్జాగా కూడా వుంటే ఎలా వుండచ్చో అలా క్వయిట్‌గా నీటుగా వుంది. ఆ యింట్లోకి ప్రవేశించగానే మమ్మల్ని ఆకర్షించినవి వరదగారి నవ్వులూ, కబుర్లూ — ఆ అల్మైరాలకేసి అక్కడ వరసగా పేర్చివున్న డిలాన్ థామస్, టి. యస్. ఇలియట్ వగైరా కవుల యల్. పి. రికార్డులు, పుస్తకాలు, బొమ్మలు, శిల్పాలు, వాటికేసి చూస్తూ, మధ్యమధ్యలో సిగరెట్లు పీలుస్తూ ఎన్ని గంటలయినా సునాయాసంగా గడిపేయ వచ్చు. ఛాయాదేవిగారి ఆతిథ్యం కూడా పైకి కనబడని అంత చల్లగా హృద్యంగా వుంటుంది.

రామకృష్ణరావుగారు నిద్రపోతున్నారు. ఆయన చదివిన పద్యాలటేపులు వింటూ కాఫీలు తాగుతూ కూర్చున్నాం. మచ్చుకు కొన్ని —

రాయప్రోలు కైత రమణీయమగు కూత
పిదప కవులపాలి నుదుటి వ్రాత
తెలుగుతోటమీద దిద్దిన పైపూత
నుడులచేత పలుకుబడులచేత

అలాగే —— సౌందరనందం కవులగూర్చి :

కైతలోన మిన్న కాటూరి వెంకన్న
లక్ష్మికాంతు డతడు సూక్ష్మబుద్ధి
ఒకరికున్న కీర్తి ఒకరికి రాబోదు
జంటకవు లటను ప్రసక్తితప్ప.

యడవల్లి సూర్యనారాయణ నలుని పార్టు పాడు చేసిన సందర్భంలో చెప్పినది —

ఎడవల్లి సూరనారయ
చెడ దొబ్బెను నలునిపార్టు ఛీ ! ఏముండా
కొడు కిచ్చె పీనికిం బలి
చెడుగుడు నాట్యమ్ముకొరకు చీనాంబరముల్ ?

అల్లం మస్తాను అనే ఆయన దమయంతి వేషం కట్టేవాడట. ఆ వేషం ఆనాటకం గొడవ వినండి.

దమయంతీ సతి కృత్రిమ స్తనము లందం బేది యల్లాడ అ
ల్లము మస్తానుల తీసిపోని సకలాలంకారుడౌ నైషధో
త్తము కుస్త్రీలను చూచి బాహుకుని భేతాళప్రతిజ్ఞా మతి
భ్రమణమ్ముల్ కనుగొంటి మైలవరకూప ప్రాయ నాట్యస్థలిన్

ఈ పద్యాలను ప్రకటిస్తామన్నప్పుడు అవి అసభ్యంగా వుంటాయేమో అన్నారు రామకృష్ణారావుగారు. చాటువులకి అసభ్యతేమిటి — అసభ్యాలు కాకపోతే చాటువులు కావు అని నవ్వుతూ అన్నారు వరద రాజేశ్వరరావు. అప్పుడు మా దృష్టిని — 'సులభముగ ఆడినట్టి ఆశువులు గాన — హేళనములు కా వవహేళనములు' అని శ్రోతలకు చెప్పాలి అన్నారు.

మేం కూడా యివి సరదాకు చదువుకుందుకు తీసుకున్నామేగాని వీటిని మరోవిధంగా డామేజీ క్రీడలకు వుపయోగించం అన్నాం. మళ్ళీ నవ్వులు.

సుమారు రెండు మాసాల క్రితం శ్రీ రామకృష్ణారావుగారు బాత్రూంలో కాలోలు పడిపోవడంవలన హిప్ బోను పట్టుతప్పింది బ్యాండేజి వేశారు. మంచం మీద నిద్రపట్టిన సరస్వతిలా తెల్లగా స్వచ్ఛంగా మల్లెపూవులా వున్నారు. బుర్ర చురుగ్గా వాడిగా పనిచేస్తోంది. మాట స్పష్టత తగ్గింది. అన్నీ మంచంమీదే — లేవ లేకపోయినా పద్యాల్ని అందుకోవడంలోనూ పదాల నందించడంలోనూ అబ్బూరి వారి మనసు చేవగా, చురుగ్గా, తాజాగా వుంది. ప్రపంచం అసూయ పడదగిన తండ్రీ, కొడుకులు వారిద్దరూ. అరచేతి వేళ్ళు కూడా పట్టేశాయ్. భోజనం మాత్రం కాస్త మజ్జిగా అన్నం —డాక్టర్ రమేష్‌బాబు పురివండాతో కలిపి తీసిన ఫొటోలు చూపించినపుడు బావున్నాయని మెచ్చుకున్నారు. మా నాన్నగారి చాటువులు అని రాజేశ్వరరావు ఆశువుగా వినిపిస్తోంటే విని రాసుకున్నవి కొన్ని సరదాకి సమర్పిస్తున్నాం —

> పాయని వేడ్కతో కుసుమ బాణములన్ గురిపించె సూర్య నా
> రాయణరాజుపై జయపురమ్మున మన్మథ ధూర్తు డక్కటా
> ఏయమ పున్నె మా యఘమొ యింతయునుం జలియింప లేదు బీ
> ర్యాయలెగాని కామినుల కౌగిళు లక్కర లేదు వారికిన్

అలాగే కళా వెంకన్నపైన మరొక వృత్తం విసురు —

> వంకల్లేని తెలుంగు వైభవ కళాభాగ్యం బభాగ్యంబుగా
> శంక ల్లేపుటయందు నేర్పడిన ప్రజ్ఞాశాలి శ్రీశ్రీ కళా
> వెంకట్రావొక దేగుదెంచె; నితడే వెంకన్న; ఇవ్వానికిన్
> టెంకాయల్ పగులంగ కొట్టు, డిక జాడింపుండు మీ జందెముల్ —

రామకృష్ణారావుగారి ఆరోగ్యం సరిగా లేకపోయినా ఆయన మనసు ఆరోగ్యంగా చురుకుగా వుండడం ఆ విచారంలో కాస్త ఉపశాంతినిచ్చింది. ఆయన ఒక చిన్నారిపై చెప్పిన చిన్న పద్యంతో ఈ గోష్ఠి ముగిద్దాం :

నవ్వు మల్లెపూవు నవనీతము మనస్సు
కప్పురంపు పలుకు కాంతులొలుకు
మూడు లోకములను ముఱుఁకుట్ల కమలకు
సాటి యెవ్వ రాటుపాటులందు ?

(ఆంధ్ర జ్యోతి, సచిత్ర వారపత్రిక — 22–12–78)

# నవ్యాంధ్ర కవిత్వమూ - అబ్బూరి వారూ

శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారిని ఒక సారస్వతసభలో ఉపన్యసించ డానికై ఆహ్వానించడంకోసం మిత్రులతో వెళ్లేను. అది వారి తొలి పరిచయ భాగ్యం.

అంతకు పూర్వం 'వైతాళికుల'లో, 'మహోదయం'లో వారి సుందర కవితా సౌభాగ్యం దర్శించే వున్నాను.

అబ్బూరివారి ప్రత్యక్ష పరిచయం నాలో ఒక అపూర్వ ఉత్తేజనం కల్గించింది. నాటినుంచీ నవ్యాంధ్ర కావ్యావలోకనంలో దీక్షితుడ నయ్యేను. పునః— రామకృష్ణారావుగారి కావ్యరత్నాల మురిపము నన్ను అబ్బుర పరిచింది. ఓహో ! ఏమా కవితా పారవశ్యము ! ఏమి ఆ నిరర్గళ కవితా వాహిని హొయలు!

"యీ అజ్ఞాత మూర్తియా యింతటి ధన్యుడు. యీ మధుర కవితా రచనా పారంగతుడు ! యిన్నేండ్లు మౌనం దాల్చేరేమి ! యీ దీర్ఘకాల అజ్ఞాత వాసానికి కారణమేమై వుంటుంది ?" అని ఆలోచించేను. ఎన్నో సమాధానాలు...

వారి అద్భుత ప్రతిభ తప్పక నేటి యువలోకం తెలుసుకోవడం ధర్మ మనే నా భావన నిజం కాకపోదు. వారి కావ్యావలోకానికి ముందు వారి జీవిత విశేషాలు. అభిరుచులూ తెలుసుకుందాం.

'ఒక పద్యమే వ్రాయవచ్చును. అది ఒక మెరపుతీగవలె మనల క్రమ్మియుండు అంధకారమును పారద్రోలి నూతనలోకమును హఠాత్తుగా గోచరింప చేయవలెను. ఆలోకము ఒక్కనిముషము మాత్రమే యెదుట నున్ననేమి ?

దాని రామణీయకము జీవనమునంతయు ఆక్రమించి మరణించువరకు తదేక ధ్యానములో మునుగున ట్లొనరించును. అట్టిదగు కవితాగుణమునకు ప్రధానము రాశికాదు, అని కట్టమంచివారు వాకొన్నారు.

ఇట్టి కవిత అబ్బూరి వారిది. గుణోత్కృష్టమై ఒప్పిన నిక్కమైన మంచి నీలాల మూడు నాల్గింటినే యీ వరకూ అందించినా మనలను పరవశుల చేసిన రమ్యకవితామూర్తి రామకృష్ణరావుగారు.

అబ్బూరి వారు సహజకవి. జన్మాంతర సంస్కారబలమున కవియై పుట్టిన మనీషి. నవ్యసాహిత్యంలో నాందీభూతు లనదగిన "రాయప్రోలు" ప్రభృతులతోనే వీరూ కవితా సాధన ప్రారంభించేరు. అభినవకవితామండలి "తృణకంకణము" ప్రచురణకాలానికి ఒకటిరెండేళ్ళ ముందువెనుకల రామకృష్ణరావుగారి "జలాంజలి", "మల్లికాంబ" మున్నగు కావ్యాలు ప్రచురణ కాసాగేయి.

అందుకనే నవ్య కవితోదయంలో విభాసిల్లిన కాంతిరేఖ లనెడు ముప్వురు నల్వురిలో రాయప్రోలు, అబ్బూరి, బసవరాజులు పేర్కొనబడక తప్పదు.

అది నవ్యసాహిత్య వసంతోదయ కాలము. మధుర వసంతము. నవ్య వసంత ప్రభాతము.

రామకృష్ణరావుగారిలో ఆజన్మంగా నిబిడీకృతమై వున్న కవితాధార ప్రభవించింది. జన్మాంతరాల సువిశాలసంస్కారము ఉద్బుద్ధమయి రమణీయ కవనముగా రూపొందింది.

1896 లో జన్మించిన అబ్బూరి వారు 1908—9 ప్రాంతాలలోనే పద్యాలల్లడం ప్రారంభించేరు. ఆ పద్యాలు సహజప్రతిభాముద్రితాలైనవి. బాల్యం గడవకముందే వారు వాటిని ఉపాసించేరు. ప్రకృతిమాత వాత్సల్యాన్ని చూరగొన్నారు. ప్రకృతి తనలోని చిత్రమైన శిల్పంతో, కల్పనలతో యీ కవిని భావావిష్టుల చేసింది.

1909 లో 'జలాంజలి' కావ్యం రూపం దాల్చింది. అప్పుడు వారు అయిదోఫారం చదువుతున్నారు. ఆ నవ్య కావ్యాన్ని ఇంకో మూడేళ్ళవరకూ

ఆంధ్ర పాఠకులు దర్శించలేకపోయారు. రామకృష్ణరావుగారు బందరు నోబులు కాలేజీలో చదువుతూవుండే 1913 లో ఆంధ్ర జాతి వైతాళికులలో ఒకరును, శ్రీ పట్టాభి సీతారామయ్యగారి సహచరులును అయిన "మహామతి" శ్రీ కోపెల్ల హనుమంతరావుగారి సంపాదకత్వంలో బందరునుంచి వెలువడే "ఆంధ్ర భారతి"లో ప్రకటితమయిందా కావ్యం.

అప్పటికి ఆంధ్ర సాహితీ పరులు కొందరు రాయప్రోలువారి కవనాన్ని చవి చూచేరు. ఈ నూతనకావ్యమూ క్రొత్తతీరులలో మాధుర్యం గుబాళించి సాహిత్య జిజ్ఞాసువులను ప్రమోదపరిచింది.

రామకృష్ణారావుగారి వంశం పండిత వంశం. వారి పితామహులు కవులు. జనకులు లక్ష్మీనృసింహశాస్త్రిగారు సంస్కృతాంధ్రవాఙ్మయాల్లో అపారమైన పాండితీప్రకర్ష కలవారు. సంస్కృతంలో అనర్గళంగా ఉపన్యసించగల భాషా వేత్తలున్నూ.

తండ్రిగారూ, వారి మిత్రులు నోబుల్ లెక్చరర్‌గా వుండే శ్రీ కె. టి. రామ రావుగారు (వీరే సన్యసించి విమలానంద భారతీస్వాములుగా కురుత్తాళం పీఠాధి పతులయ్యేరు), తరచు సాహిత్యగోష్ఠి జరిపేవారు స్వగ్రామంలో. తిరుపతి వేంకట కవుల పద్యాలు మనోహరంగా చదివి విన్పించేవారు రామారావుగారు.

అప్పుడు 9, 10 సంవత్సరాల ప్రాయంలోనే అబ్బూరికి వారి ఉత్తమ సాహిత్య పరిచయ భాగ్యం లభించింది. ఆంధ్ర సాహితీపరుల్లో విశేషకవితా చైతన్యం కల్గించిన తిరుపతివేంకటకవుల ప్రభావం రామకృష్ణరావుగారిని స్పృశించింది. వారిలో కవితాభిరుచి పాదుకుంది.

ఇంటర్‌మీడియట్ పూర్తికాగానే సంస్కృత కావ్యాలోకనం చేసి, సంస్కృత భాషాసంస్కారమూ పొందాలనే ఆకాంక్ష కల్గింది. ఆ కోరికతో 1915లో మైసూరు సంస్కృత కళాశాలలో చేరారు.

మైసూరు దోహదం :

మైసూరు రామకృష్ణరావుగారి కవితావికాసానికి అద్భుతమైన దోహదకారి అయింది. అందుకు మూలంయిరువురువిద్వన్మణుల పరిచయం. కావేరిపుణ్యనదీ సాన్నిధ్యం.

రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి సహాధ్యాయిత్వం, కట్టమంచి, రాళ్లపల్లి, అబ్బూరి ముప్పురూ తరచూ కలుసుకుంటూండడము, కనీసం వారానికొక మారైనా కవితాగోష్ఠి జరుపుతూండడము చేసేవారు. ఆ గోష్ఠిలో భారతం పదు నెన్మిది పర్వాలు రాళ్లపల్లివారు సహజమధురకంఠంతో విన్పిస్తూంటే ముప్పురూ వ్యాఖ్యానం చేసుకుంటూ వెళ్లేవారు.

రాళ్ళపల్లి, అబ్బూరివారూ 'అనంతరామకృష్ణులు' అను పేరున జంట కవనం చెప్పిన సందర్భంకూడా ఒకప్పుడేర్పడింది. యిప్పటికీ వీరి చెలిమి దివ్యానురాగబద్ధమైవుంది. మూడేళ్ళ అనంతరం 1918 – 19లో కలకత్తా శాంతినికేతనంలో చేరి రవీంద్ర సాన్నిధ్యంలో వున్నారు.

శాంతినికేతన వాసమూ, కలకత్తా విశ్వవిద్యాలయంలో పట్టభద్రత్వమూ రెండూ నెరవేరేయి. 1919లో కలకత్తా నుంచి ఆంధ్రదేశం చేరుకున్నారు.

అవి ఆంధ్ర స్వరాజ్య ఉద్యమాల రోజులు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి రామదండు ఉద్యమం ఎందరెందరు సదాశయమూర్తులనో ఆకర్షిస్తున్నది. రామకృష్ణరావుగారు 1920 – 21 సంవత్సరాల్లో ఆంధ్రరత్న ఆశ్రమ వాసంలో, గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంలో దాదాపు రెండు సంవత్సరాలు గడిపేరు.

యీ యిరవయ్యో శతాబ్దిని భారతీయవిద్యాగురువులైన అరవింద, రవీంద్రుల ఆధ్యాత్మిక సాహిత్య ప్రభావము, ఎమ్. ఎన్. రాయ్ యొక్క సర్వతో ముఖ సంస్కృతీ ప్రభావము రామకృష్ణరావు గారిపై పడ్డదనిపిస్తుంది.

అబ్బూరివారు నిరంతరాయంగా విజ్ఞానాన్వేషణ చేసే జ్ఞానశీలి. ప్రతి జీవితానుభూతిని కళాఖండంగా మలచి ఆనందమయులయే కళాభిజ్ఞులు.

కలకత్తాలో వుంటున్నప్పుడు 1917 – 18లో వీరొనర్చిన ఒక మంచి పని పేర్కొనక తప్పదు —

ఆంధ్రపత్రిక దినదినాభివృద్ధి నొందుతున్న కాలమది. ఆ అభివృద్ధికి విలక్షణ మైన అలంకారం కూర్చింది అబ్బూరివారు. మొట్టమొదటిమారుగా ఆంధ్రపత్రికలో "సారస్వతానుబంధం" పెట్టవలసిందంటూ నాగేశ్వరరావు పంతులుగారికి సూచన చేసింది వీరు.

సారస్వతానుబంధం వీరి 'అభినవ కవితా ప్రశంస' అనే వ్యాసంతోనే ప్రారంభమయింది. ఇలాగే రామకృష్ణరావుగారి వ్యాస పరంపరలతో ఆరంభించిన ఆ నూతన శీర్షిక చిరస్థాయిగా వెలసి ఆంధ్రులకు గొప్ప విజ్ఞానభిక్ష పెట్టింది. ఎన్నో ఉత్తమ కళా సాంస్కృతిక విషయాలు ఆంధ్రజాతి కందటానికి ఆలంబన మయింది.

ఇలాగే 1923 – 24 ప్రాంతాల్లో తెలుగు పత్రికల్లో ఉత్తమ స్థానాన్ని అలంకరించిన కృష్ణాపత్రికలో 'రసమంజరి' అనే క్రొత్త అనుబంధం ప్రవేశ పెట్టించి పత్రికా ప్రపంచాన ఒక నూతనాశయము ప్రతిఫలింపచేసిన ముఖ్యుల్లో రామకృష్ణరావుగారు ఒకరు.

ఆ శీర్షికా అబ్బూరివారి రచనతోనే ప్రారంభమైంది. సుమారు 15, 16 కథలు 'సూర్యరాజు కథలు' అనే పేరున వ్రాసేరు కృష్ణాపత్రికలో. అసలు కథానికా రచనకు ఆంధ్రదేశములో విస్తృతపరిచయమే లేని రోజుల్లో చిన్న కథలు రచించి క్రొత్త తీరులకు నాంది పాడేరు.

గురజాడ మహాకవి 'కన్యాశుల్కం' నాటకానికి ప్రశంసనీయమైన వ్యాఖ్యానం చేసేరు. ప్రదర్శనకు బహుదొడ్డ కృషిచేసేరు.

వీరి బహుముఖమైన శక్తిగురించి సత్కృషిగురించి ఎన్నైనా వ్రాయ వచ్చు. ఇక యిప్పుడు అబ్బూరివారి కవితాంశను పరిశీలిద్దాము :

మైసూరులో ఉంటూండగానే దివ్యకావేరీతీరవిహారకాలంలో రామకృష్ణ రావుగారు 'నదీసుందరి' కావ్యం వ్రాయడానికి పూనుకున్నారు.

ఆకావ్యం అపారమధురము, రసస్ఫోరకమూ అయి, తనువుల పులకింప చేస్తుంది. కావేరి పూర్వజన్మగాథ నదీసుందరిగా రూపాంతరం పొందటం బహురమణీయంగా చిత్రించేరు అందులో.

'నదీసుందరి' నాందిలోనే రామకృష్ణరావుగారు ఇలా పాడేరు :

"రస పిపాసిని నేను పారమ్ము లేని గగనవీధీవిశాలరంగములయందు అందగా రాని తలపుల కందమైన రూపములదిద్ది క్రీడింతురూపసరసి తెలుగు సీమలలో నాల్గు కొనలయందు పూజకై పుట్టి వర్ధిల్లు పూల తోడ ప్రియతమములైన వలపు కోరికలతోడ గ్రంథిలమ్మయ్యె శ్యామలగగనవీధి – ఎన్నడో పూలు పూచె

నాహృదయ మందు కెంపు చివురులు కావేరికీర్తిలతిక ఎన్నడో జీవనోద్యాన హృద్యవాటి కెరలి పాడెను కావేరి కీర్తిపికము బంధురములైన ఆనాటి పరిమళములు పాటలును రూపములు దాల్చి పల్లవించి యుగయుగాంతర వ్యాప్తి వియోగభరము - మోయు కావేరి సంపూర్ణ మూర్తి దాల్చె"

భావవిదులగు రసరాజ్యపాలకులకు అభినవమ్మగు రూపకము అందిస్తూన్నానంటూ ప్రారంభించేరు రసబంధురంగా. కావ్యం అంతా హృదయంగమంగా వుంటుంది.

ఈ కవి వతంసులు చిన్ననాటనే భాషను స్వాధీనం చేసుకొని స్వేచ్ఛగా మలచుకొనే నేర్పు సాధించేరు . ధారా శుద్ధి కలిగి పద్యాలు మృదుశైలిలో సాగిపోతాయి. తేటగీతాలు అబ్బూరి వారి కలంలో స్వచ్ఛ సంగీత సుందరాలై వెలసేయి.

'మల్లికాంబ' కావ్యం విద్యార్థి దశలోనే వ్రాసేరు. విషాదాంతమగు ఒక ప్రణయగాథ 'మల్లికాంబ', ఇందు వర్ణనలు శబ్దాలంకారాలతో మనోజ్ఞంగా వున్నాయి:

దీప్తిరథమెక్కి ధర కరుదెంచుచున్న — చిత్రభానుని స్వర్ణకౌశేయ మదిగొ - ఉదయపవనములం దాడుచుండె దివిని - గగన సీమంతినియు నవ్వు గనుల దెఱచి - నల్గడల గ్రమ్మె సాయంతనంపు టిరులు - నీలకాదంబినీ జవనికల వెనుక - మినుకుమినుకను తారకాగణములెల్ల - మందకళల వెలార్చె నంబరమునందు - రసవదాలాపగతి నొక్క రమ్యగీతి - పాడి పాడి కోకిల తన గూడు చేరె - మంజుగానానురాగప్రియత్తయైన - కాపుకన్నె మందలతోడ కదలిచనియె.

ఈ కావ్య సంపుటిలోనే మరి అయిదు ఖండగీతులు చేర్చబడ్డాయి. అందులో 'విభాతగీతి' ఒకటి. దాని రమ్యత తిలకించండి:

"మావి యిగుళ్ళమెక్కి, సుకుమారతనూశ్రుతి కాననాంతగీతావళి నాలపింప గణికాంగనల న్వడి మేలుకొల్పి, లీలావిధి నిచ్చు పూబఱపులన్ జలియించెడు నా తుషారముక్తావలయమ్ములన్ బసపు కాంతులు నీనెడు నేల రాల్చుచున్— ఊగెడు పారిజాతముల నూయెల లూగుచు, చిన్న కొమ్మలన్ దాగి కుమార

గంధముల నాచికొనన్ బువురేకు లూది లేదీగల జిక్కు-పెట్టి ప్రతతీ యువతీమణి చీరకొంగులన్ లాగుచు నవ్వుతాలకు వనమ్ముల కేగు ప్రభాత వాతమా: అడవుల పూలపాన్పుపయి హాయిగ నిద్దురపోయి, చీకటుల్ విడివడు వేళ మేలుకొని విచ్చిన మొగ్గల నున్న వాసనల్ మెడపయి జారు హారముల లీల దినాధిపు జూడ బోవు సందడి నొకసారి యశ్రుత నినాదములన్ శుభగీతి పాడుమా: నయనయుగమ్ము మూసికొనినాడ ననున్ కొనిపోయి విచ్చుమల్లియల సువాసనావళుల లీన మొనర్పుము, నీ తరంగసంచయముల మీద నెత్తుకొని స్వర్గపు వీధుల ద్రిప్పిరమ్ము జాలయి ప్రవహించు కాంతినదులం దవగాహ మొనర్చు మింపుగన్.

వారి భావములు శుభాగమ కారకాలు. రమ్యభావ విలాస లాస్యాలు.

నవ్య కవితా లోకానికి గురజాడ మహాకవి తర్వాత ఎన్నో క్రొత్త బాటలు త్రొక్కిన వారిలో అబ్బూరివారు ముఖ్యులు. 1914 – 16 సంవత్సరాలలోనే అబ్బూరి వారు నవ్య సాహిత్య వీధుల స్వేచ్ఛగా విహారం చేయ సాహసించేరు. స్వతంత్రపు పోకడలతో ప్రత్యేకశిక్షావిధానంలో రచనం చేయడానికి దారి తీసేరు.

ఈ నవ్య మార్గానువర్తులై అనేకమంది పురోగమించి, నవ్య కవితోద్యా నాలలో బహురమ్యసౌరభ శోభితమయిన వసంతోదయాన్ని వెల్లి విరియించేరు. ఆ తొలివసంతం తొలకరించి తొలిగా క్రొత్త పాటలు పాడిన కవి కోకిలము రామకృష్ణరావుగారు.

'ఊహాగానం' క్రొత్త ఫక్కిలోని ఉత్తమ ఖండకావ్యం. ఆ ఖండకావ్యాల పద్యాన్ని ఆస్వాదించండి మరి.

పూజా శిరీషము లేరుకొంటివి —పోయి వచ్చెదొ జవ్వనీ, తేజో విలీన దృగంచలమ్ముల తేరి చూచెద వెవ్వని? ఆలింపు పాడెద నాంధ్రకోమలి యార్ద్రహైందవగీతులన్ పాలింపు నెల్లెడ భావపుష్పిత నవ్యశయ్యా రీతులన్.

ఓ విశాలావనీ! శోభాతి పావనీ!

ఆరంభ పుణ్యక్షణముల నీకుడు విసరిననాటి నీయాది సౌభాగ్య మెటుల వెల్గెనొ? భవదీయ శాటి........ ఆకుపచ్చని ఆకులో —పండువెల్తురు రేకులో

నిన్ను ప్రశ్నింపగా జాల — నీనాటి ప్రొద్దుటి పూట గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యంపుపాట

ఓ విశాలావనీ! శోభాతిపావనీ!

వలపు నిండార విరిసిన పారిజాత — కుసుమములు నేల రాలు వేకువల యందు ప్రసవశయ్యాపథముల నీపాదయుగళి —కదలెనో, నాదు హృదయమే కలతవడెనా ?

కాని, పలుమారు నా కందరాని వస్తు—వేదియో దూరముననుండి యెలుగు లెత్తు పరిమళపరీతమైన నీ ప్రణయ వార్త—ఘనభోంతరాళమ్ములు పులకరింప— బహుళమందారగంధలోభమున దిరుగు —మధుకరము వోలె హృదయ మున్మత్త మయ్యె—పరవశమ్మైన భావప్రపంచమందు బందినై యెన్ని నాళ్లుండవలెనో యేమొ ? —దీపికలు లేని వాకిళ్ల తెఱచినాదు —తలపు లొక్కొక్కటే నిన్ను తెలియబోయి తిరిగి వచ్చుచునుండు పందిళుల క్రింద—కేళి తిరుగాడు పెండ్లి చుట్టాల రీతి.

రామకృష్ణారావుగారి విశ్వజనీన శుభాకాంక్ష లెంత విస్తృతాలై వున్నవో, మధురమైనవో జగజ్జననీ స్తుతి పరాయణమైన యీ కవిత విశదం చేస్తుంది.

"నీ మహిమార్ణమ్మున మునింగి యనర్ఘరుచి ప్రవాళ ముక్తామణిరత్న ఖండములు దండలుగా సవరించి తెచ్చి పృథ్వీ మహితమ్ములౌ విపణివీధుల లోన అలంకరింతు, నీప్రేమ నెఱుంగ లేని మణివేత్తలు మోహితులై తపింపగన్. నీ కడకంటిచూపుల వనీస్థలిపై రచియించు కల్వపూరేకుల సేకరించి యిరుక్రేవల యుద్ధ మొనర్చు సైనికానీకము మీదరాల్తు, నది నీ నయనామృత మంచెఱుంగగా లేక రణావనిన్ ప్రళయలీలలు మాని సుఖింతు రెల్లరున్. నీయమృత ప్రవాహముల నింపిన తీయదనమ్ము తోడ నేవో యొక రెండు ప్రౌఢపదముల్ పలికింపుము నాదు నోట కొంపోయి భవాంబుధిన్ మునిగి పొక్కెడి వారికి నీవిశాల శోభాయతనమ్ము జేరగ నుపాయము చెప్పెద నెల్లవేళలన్.

"ఉదాత్త భావనములు ఉచితములైన పదగుంభనములు యీయన ప్రత్యేక ప్రతిభ. ఉత్తమ సంస్కృత కావ్యములలోని పరిపూర్ణత, లావణ్యము యీయన పద్యాలలో ప్రతిబింబిస్తవి".

వీరి మరో కావ్యం 'పూర్వప్రేమ' ఇందు ప్రతిపద్యం స్థాయీభావంతో అలరారిన మధురఖండము. కావ్యం అంతారమ్యాలంకారాలలో ప్రకృతి రమణీయ చిత్రాలతో ప్రేమాంతరంగాలాపాలతో పాఠకులను ప్రమోదపరుస్తుంది. వంగ సాహిత్యంలో ప్రసిద్ధికెక్కిన మనసాదేవి గాథ దీనికి యితివృత్తం.

పెక్కు ఖండ కావ్యాలు రచించినా వాటికి వెలుగు నీయ తలచలేదు రామ కృష్ణారావుగారు. వారి అమృతధారాశుద్ధి కల్గిన అనేక చాటుపద్యాలు ఆంధ్ర దేశాన చెదురై వున్నాయి. వాటి వూసేలేదు. వారి వైముఖ్యం అట్టిది. కానీ అబ్బూరివారి విస్తృతకవితాసంసారానికి ఒక సుస్వరూపము ఇవ్వడం అవసరమయి వుంది. విజ్ఞులైన ఆంధ్రుల కర్తవ్యం అది.

శ్రీ రామకృష్ణారావుగారు మహత్తరాశయాంతరంగులు. వారి ప్రతిరచన లోనూ ఒక నవ్య భావావేశము విలక్షణమైన ధ్వని తొణికసలాడుతూ వుంటాయి.

అబ్బూరివారి కవిత ప్రసాదగుణములో, ఏ అంతరాయమూ లేక, వ్యాఖ్యానము అవసరము లేక ఎంతటి విశ్వ జనీనభావాలు కూడా సులభంగా, గ్రాహ్యం చేసుకోవీలైంది.

అట్టివారి ఉత్తమకవితావాహిని అనంతజ్ఞానతృష్ణామహావాహిని గర్భంలో లీనమయి అనేక వత్సరాల అజ్ఞాతజీవనం గడిపింది. మరల తన వ్యక్తిత్వానికి పరిపూర్ణతావిశిష్టమైన నూత్నవిలాసంతో మన కవితాలోకాన ప్రత్యక్షమౌతుందని నా తలంపు.

అందుకు సూచనగా ఇటీవల వారి లేఖినినుంచి వెలువడిన కవితయే తార్కాణము :

వరద వారు కావేరీ
సరిత్తీర వృక్షరాజ
శేఖరముల నీడలలో
మధుర మంజుల మంజీరమ్ములు
మంజు రుతము సేయుచుండ
కనిపించిన మధు మూర్తి
కవితా కల్పనా లతా!

మరల నేడు నా హృదిలో
మరుల కొల్ప దలచావా ?
నీకూ నాకూ మధ్యను
శోకార్ణవ మొకటి పొంగి
లోకాలోకమ్ములలో
లోపల మందిర మందలి
ఒక గవాక్ష మొక కవాట
మోహో ! ఆవిష్కృతమై
వెనుకటి యాలాపమ్ములు
తునకలు తునకలుగా తెగి
ఒక్కచోట చిక్కువడ్డ
చక్కని నాజీవనౌక
అనంతాబ్ధి సాంగత్య
మ్మభిలషించి పయనమయ్యె

అబ్బూరివారి గ్రంథావలోకనాన ఉప్పొంగిన నా హృదయంలోవి రసానం దానికి భావ చిత్రణమే యీ చిన్న వ్యాసం.

రామకృష్ణారావుగారి విశాలకవితావ్యవసాయంగూర్చి, వారి జీవిత విశేషాల గురించి వ్రాయడానికి ఇంకెంతైనా వుంది.

ఇప్పటికిది నా యథాశక్తి.

13 మే 1956

ఏల్చూరి సుబ్రహ్మణ్యం

# పథనిర్దేశకుడు

అబ్బూరివారి ఆపాండితీగరిమ, బహుభాషాధౌరంధర్యం, ఆబుద్ధి నైశిత్యాన్నిబట్టి, శబ్దశాణికుడయిన వీరి సాహిత్య ప్రక్రియలు, ప్రయోగాలనుబట్టి, ఆ సరస పరిహాసరసికత, నిపుణతనుబట్టి మన సాహిత్యమూలాలను తరచి చూచిన వీరికి, అంతప్పుడే, బ్రాహ్మీదత్తవరప్రసాదుడయిన శ్రీనాథుడు లక్ష్యభూతుడై ఉంటాడని బోధపడుతుంది. ఆనాడు పల్నాటి వీరగాథను దేశికవితగా మలచిన శ్రీనాథుని, తన కళ్లముందు జరిగిన దారుణమయిన 'జలియన్‌వాలాబాగ్' హింసాకాండను బుర్రకథగా చిత్రించిన వీరిని జ్ఞప్తికి తెచ్చుకుంటేచాలు. శాస్త్రీయ చారిత్రకదర్శనఉన్న కర్ణధారి వీరు. బళ్ళకెత్తించవలసినన్నిరచనలను చెయ్యడం నిరీక్షణ, విచక్షణ ఉన్నప్పుడు సాగనిపని. నిక్షిప్త నిధులను సర్వ్వేలూ స్వాయత్తం చేసుకొనడానికి తాళము చెవులను చేతికి అందించువారు, రాగభోగా తీతులు. సూత్రప్రాయికమైన రచనలను చేసిన వీరిది ఆకోవ. ఆయన 'నిర్వేదం' ఒక అసిధార. నిస్పృహకూ, దీనికి తారకు తారకూ మధ్యన ఉన్నంతదూరం ఉంది. సహ్యాద్రి పంక్తులందు కాలుమోపిన 'కావేరి' ఉన్నట్టుండి నది:గా మారితే వీరు, ఆగస్త్యుని కోసం 'దేవేరి'గా రప్పించారు కదా? ఈ చిత్రణ, అనుభూతి అనశ్వరమయినవి.

రామకృష్ణరావుగారిని చూచినపుడల్లా అక్కిరాజు ఉమాకాంతంగారు ఎందుకో జ్ఞాపకం వస్తూవుండేవారు. వీరిద్దరికీ ఉన్న సాజాత్యం, వారి పదునైన ఊహలో, శబలభావనలో, విషయ వ్యక్తీకరణలోనిది కాబట్టి అందుకే అట్లాజ్ఞాపకం వస్తున్నారు లెమ్మనిలోపల్లోపల అనుకుంటూ ఉండేవాణ్ణి.

రామకృష్ణరావుగారు తిక్కనగారు తమ కవితావేదికకు 'అమలోదాత్త మనీష నే నుభయ కావ్యప్రౌఢి' ....అనే పద్యాన్ని పాదదీపంగా పెట్టినట్లు, 'నేనే

కాదు సమస్తభూతతతియున్ నిర్వేదభారమ్ముచే నానాభంగుల లాలసీయ గతులన్ నాగీతమే పాడు" అనే పద్యంతో తిమిరాపహారి అయిన ఒక దీప్తిని ప్రసారితం చేశారు. 'తిరుగుబాటు తిరిగిబాటు' మనే తత్వం వీరిది. ఈ పథ నిర్దేశకుని, నిర్లిప్తుని, 'నిర్వేదం' నివేదనమే. విజయోత్సవానికి ముందర జరిగే సమీకరణం వంటిది. ఇది చివ్వరి నివ్వాళి.

(22 ఫిబ్రవరి—1973)
అముద్రితం

శ్రీరంగం శ్రీనివాసరావు

# అబ్బూరి నా విశ్వవిద్యాలయం

నిజానికి నా జీవితంలో ఇద్దరే గురువులున్నారు. ఒకరు మా నాన్నగారు. ఇంకొకరు అబ్బూరి రామకృష్ణారావుగారు. ఇద్దరూ గొప్ప అధ్యాపకులూ ఉపాధ్యాయులే అయినా వారిదగ్గర నేను నేర్చిన చదువు కళాశాలల్లోనూ, క్లాసురూముల్లోనూ కాదు. మా నాన్నగారి దగ్గర చిన్నప్పుడు పాఠశాలలో లెక్కలైనా నేర్చుకున్నాను గాని అబ్బూరి వారి అధ్యాపకత్వంలో ఏ కాలేజీలోనూ పాఠాలు నేర్చుకోలేదు. నా కాలేజీ విద్య పూర్తి అయిన తర్వాతనే అబ్బూరి కక్ష్యలో నేను ప్రవేశించాను. అప్పుడాయన అధ్యాపకుడు కాడు. ఆంధ్రా యూనివర్సిటీ గ్రంథాలయాధికారి. ఆయన చదివించిన గ్రంథాలవల్లనేకాక వారి సాహచర్యం వల్ల కూడా క్షితిజరేఖలు విశాలంగా విస్తరించాయి.

*　　　*　　　*　　　*

చిన్నప్పుడు నాచేత మానాన్న సులక్షణసారం చదివిస్తే, నాలో ప్రాపంచిక చైతన్యం వికసిస్తున్న వయస్సులో నా ఆలోచనల్ని కమ్యూనిజం వైపు మళ్ళించింది అబ్బూరి రామకృష్ణరావుగారు.

"లెనిన్ ఏమన్నాడో తెలుసా? అక్టోబరు విప్లవం విజయవంతమైన తర్వాతా తనకు కనీసం ఇరవై యేళ్లు మరో ప్రపంచ యుద్ధం లేని వ్యవధి కావాలన్నాడు. అంటే ఆవ్యవధిలో ఒక కొత్త తరం రూపొందుతుంది. యువతరం. అదే కమ్యూనిజాన్ని కాపాడే కవచం!"అన్నారు రామకృష్ణరావు గారు.

అలాగే 1917 తర్వాత 22 ఏళ్ళకిగానీ (1939లో) రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాలేదు. లెనిన్ కోరిన దానికంటే ఎక్కువ వ్యవధే లభించింది. ఫలితం అందరికీ తెలిసిందే!

"ఇవాళ పేపర్లో వొరోషిలోవ్ స్టేట్ మెంట్ చదివేవూ!" ఇది '37లోనో 38 లోనో అనుకుంటాను. ఫీల్డ్ మార్షల్ వొరోషిలోవ్ సోవియట్ సర్వ

సైన్యాధ్యక్షుడు." ప్రపంచంలోని అన్ని దేశాల సైన్యాలు ఒక్కసారి దండెత్తి వచ్చినా తిప్పికొట్టగల శక్తి మాకుంది" అన్నాడాయన. ఆ రోజుల్లో సోవియట్ యూనియన్ మాత్రమే సామ్యవాదదేశం.

"ప్రపంచాన్ని కుదిపివేసిన పదిరోజులు" అనే పుస్తకాన్ని, క్రోపోట్కిన్ రచనల్ని నాచేత చదివించింది అబ్బూరివారే. వారి సాహచర్యంవల్లనే చాలా కాలం నేను రాయిస్టుగా చెలామణీ అయ్యాను. కాని విచిత్రం ఏమిటంటే M. N. ROY గ్రంథాలేవీ చదవమని అబ్బూరివారు నాకివ్వనూ లేదు, నేను స్వయంగా కొనిగాని సంపాదించిగాని చదవనూ లేదు. లెనిన్‌తో భుజం భుజం రాసుకొని తిరిగిన వ్యక్తిగా మానవేంద్ర నాథరాయ్ నా కెప్పుడూ మాననీయుడే!

విశాఖపట్టణంలో హార్బరు, విశ్వవిద్యాలయమూ, నాలో యౌవనమూ ఇంచుమించు ఏకకాలంలోనే ఆవిర్భవించాయి. అప్పుడు అబ్బూరి రామకృష్ణ రావుగారే నా హార్బరూ విశ్వ విద్యాలయమూను. సగటున రోజుకో కొత్తపుస్తకం చదివించే వారాయన. వాత్తేరుదాకా నడుచుకుపోయేవాణ్ణి. అబ్బూరివా రిచ్చిన పుస్తకం చదువుతూ సముద్రతీరం మీదుగా ఏరాడకొండదాకా నడచుకువచ్చే వాణ్ణి. చింకిగుడ్డలు. కాళ్లకి జోళ్లుండేవి కావు. అలలు నా కాళ్లనీ షరాయినీ తడుపు తున్నాయనే స్పృహ కూడా ఉండేది కాదు.

భావకవిత్వానికి కడసారిగా గుడ్ బై కొట్టి మహాప్రస్థానం గీతాలు రాస్తున్న రోజులవి. ఒకనాడు అబ్బూరిరామకృష్ణారావుగారు లండన్‌నుంచి వచ్చిన Progressive Writers' Manifesto చదవమని నాకిచ్చారు. అరతావు కంటె ఎక్కువ సైజులేని ఆ పత్రం నామీద చెరగని ముద్రవేసింది. దాని ప్రభావంతోనే "ప్రతిజ్ఞ" అనే గీతం రాశాను. "పొలాలనన్నీ హలాలదున్నీ" ఇత్యాది గేయం. Manifesto సారాంశం అంతా దించేశావని మెచ్చుకున్నారు అబ్బూరివారు. "ఘర్మజలానికి, ధర్మజలానికి, ఘర్మజలానికి" అన్నచోట ఒక్కక్షణం ఆగేరు. ఘర్మజలం పక్కని ఈ ధర్మజలం ఏమిటన్నట్లు అదేదో పాదపూరణం కోసం వేసిన అర్థం లేని మాట అనుకున్నారో యేమో! కాని మరుక్షణమే తేరుకొని "ఔను. 'ధర్మోదకం' అనే ప్రయోగం మన సంప్రదాయం లోనిదే" అన్నారు. ఒక గీతాన్ని అంతగా స్తనశల్యం పరీక్ష చేస్తారాయన.

(ప్రజాతంత్ర 1975)

భద్రిరాజు కృష్ణమూర్తి

# అబ్బూరి మేష్టరుగారు - నేను

రెండో ప్రపంచయుద్ధం అయింతర్వాత 1946 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం గుంటూరు నుంచి వాల్తేరుకు తరలిపోయింది. నేను బి. ఏ. ఆనర్సు రెండో ఏడు చదవటానికి అక్కడికి వెళ్ళాను. 1946 – 47 లో మా అన్నయ్య (పిన్నమ్మ కొడుకు) గారింట్లో ఉండి చదువుకొంటుండేవాణ్ణి. మా అన్నయ్య బాటనీలో ట్యూటరుగా పనిచేస్తుండేవాడు. అతనికి మాచిరాజు కృష్ణమూర్తి గారు, హిందీ లెక్చెరరు, స్నేహితుడు. మా అన్నయ్యద్వారా నాకు పరిచయ మైనాడు. మాచిరాజుకు అబ్బూరి మేష్టరుగారంటే అత్యంత భక్తిస్నేహాలు. 1947 – 48 లో మా అన్నయ్య మరో ఉద్యోగం వచ్చి వాల్తేరు వదిలి వెళ్ళాడు. నేను చిన్నవాల్తేరులో ఒకగది అద్దెకు తీసుకొని సొంతంగా వంటచేసుకుంటూ B. A. (Hons.) ఫైనల్ సంవత్సరం చదువుకొన్నాను. ఆయింటికి వంద గజాల దూరంలో అబ్బూరి మాష్టరుగారి ఇల్లుండేది. మాచిరాజు కృష్ణమూర్తి గారు అబ్బూరి వారికి నన్ను పరిచయం చేశారు. అప్పణ్ణించీ వారి దగ్గరకు వెళ్తూ వస్తూ ఉండేవాణ్ణి. ఒకప్పుడు ఆనర్సు పాఠాలు అబ్బూరివారు చెప్పేవారుట. ఆధునిక తెలుగు సాహిత్యానికి మూలస్తంభాల్లో ఒకరుగా ఉన్న వారి దగ్గరికి వెళ్ళి మాట్లాడాలంటే కాస్త బెరుగ్గానే ఉండేది. కానీ ఆయన చాలా మృదువుగా వాత్సల్యంతో మాట్లాడేవారు.

1946 – 47 లో 'భాష, సాహిత్యం' అనే రెండు విభాగాల్లో ఏది స్పెషల్ సబ్జెక్టుగా తీసుకోవాలని నాకు — నా స్నేహితుడు యల్లంరాజు శ్రీనివాస రావుకు—సందేహం వచ్చింది. 'భాష' ఐచ్ఛికంగా తీసుకొంటే గంటి జోగి సోమ యాజులుగారు పాఠంచెప్పేవారు. 'సాహిత్యం' పింగళి లక్ష్మీకాంతంగారు. పింగళి వారే తెలుగు డిపార్టుమెంటు హెడ్డు. ఆయన చెప్పే సాహిత్యమే పఠనీయంగా అప్పటిదాకా అందరూ తీసుకొనేవాళ్లు. సోమయాజులుగారి సబ్జెక్టు తీసుకొంటే

మార్కులు రావని భయపెట్టారు. ఈ సందిగ్ధావస్థలో మాచిరాజు వారు అబ్బూరి మేష్టరుగారి సలహాతీసుకోమన్నారు. ఆయన మీ అభిమానవిషయం 'భాష' అయితే అదే Special Subject గా తీసుకోండి. సాహిత్యచరిత్ర సొంతంగా అయినా చదువుకోవచ్చుగదా అన్నారు. సరే. మొండికిబడి మేమిద్దరమూ 'భాష'నే ప్రత్యేక పాఠ్యాంశంగా తీసుకొని తెలుగు డిపార్టుమెంటులోనే చరిత్ర సృష్టించాం. 'భాష'లో మేమిద్దరం; 'సాహిత్యం'లో ముగ్గురు ఉండేవాళ్ళు. నా జీవితంలో మొదటి మలుపుకు అబ్బూరి వారు అలా హేతువైనారు. 1948 – 49 లో గుంటూరు హిందూకళాశాల్లో Special tutor ఉద్యోగం వచ్చింది. పింగళివారు రిటైరై సోమయాజులుగారు డిపార్టుమెంటు అధిపతి అయినారు. 1949 ఫిబ్రవరిలో నేను లెక్చెరర్‌గా సెలక్టయినాను. 1949 జూన్‌నించి చేరమని ఆర్డరు వచ్చింది.

* * * *

ఆంధ్రా యూనివర్సిటీలో నేను ఉపన్యాసకుడిగా ప్రవేశించింతర్వాత అబ్బూరి మేష్టరుగారితో మరింత పరిచయం ఏర్పడ్డది. 1948 సెప్టెంబరులో మా తండ్రిగారు చనిపోయారు. నాకు అబ్బూరి వారి మీద పితృభావన ఏర్పడ్డది. అప్పటి కింకా పెళ్ళికాలేదు. పెండ్లికూతుర్ని చూడటానికి పిలిస్తే అబ్బూరి వారిని తీసుకువెళ్ళి పిల్లను చూశాను. తెనుగు ధాతువుల వ్యుత్పత్తినిగురించి పరిశోధన చెయ్యమని సోమయాజులుగారు నాకు Ph. D. విషయం ఇచ్చారు. సంస్కృత ధాతువులనుంచి ఇవి రాలేదని, చిలుకూరి నారాయణరావుగారి వాదన తప్పని నిరూపించమని వారి ఆదేశం. గుడ్డెద్దు చేలోబడ్డట్టుగా నా పరిశోధనవ్యాసంగం మెదలుపెట్టాను. హిందీ శబ్దసాగరంలో ఉన్న ధాతువుల వ్యుత్పత్తులన్నీ ముందు పరిశీలించమని సోమయాజులుగారి ఆదేశం. లైబ్రరీలోనే నేను పుస్తకాలు పెట్టుకుని చదువుకొంటానికి అబ్బూరివారు ఒక Cubicle ఇచ్చారు. తీరిక ఉన్నప్పుడల్లా వారితో కలిసి ఎన్నో సంగతులు చర్చించుకొనేవాళ్ళం. ఆయనతో మాట్లాడితే మనోవికాసం కలిగేది. హాయిగా ఉండేది. పాశ్చాత్య సాహిత్యంలో ఉన్న గొప్పగ్రంథాలన్నీ ఆయన చదివారు. ఆయన సర్వజ్ఞుడు. వజ్ఝలశాస్త్రులు గారిని గురించి తరుచు ప్రశంసించేవారు. శాస్త్రులుగారికి ఏదైనా తెలియకపోతే వెంటనే ఆసంగతి తెలుసుకోటానికి ఏగ్రంథం చూడాలో చూద్దామని అనేవారట. చాలా

మంది పండితులు తమ అజ్ఞానాన్ని గర్వంతో కప్పిపుచ్చుకొంటారే కాని జిజ్ఞాస చూపించే వినయం వాళ్ళ కుండదని అనేవారు. తెలియనిది తెలియదని తెలుసుకోవటమే తెలివి లక్షణమని వారు నేర్పారు.

* * * *

ఈ రకంగా సతమతమవుతున్న రోజుల్లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ నుంచి ఆచార్య థామస్ బరోగారు వాల్తేరు వచ్చారు. వైస్ ఛాన్సలర్ వి. ఎస్. కృష్ణాగారికి రాసివచ్చారట. కృష్ణాగారు అబ్బూరి వారికి ఆసంగతి చెప్పారు. ఆయన 'పర్జి' అనే ద్రావిడ భాషలో విషయసేకరణ పూర్తిచేసుకొని విశ్రాంతికి వచ్చారు. అబ్బూరివారు ఆయన్తో నాకు పరిచయం చేశారు. ఆయనవల్ల అనాగరక ద్రావిడ భాషల్లో జరగవలసిన కృషి చాలాఉందని తెలుసుకొన్నాను. లింగ్విస్టిక్ సర్వేలో 'పర్జి'ని గోండీ మాండలికంగా గ్రియర్సన్ చెప్పాడనీ, అది తప్పనీ, పర్జి కొత్త భాష అనీ ఆయన అన్నారు. (1953లో బరో, భట్టాచార్యగార్ల పర్జి గ్రంథం వెలువడ్డది). నా పరిశోధన విషయంలో ముఖ్యంగా ఎల్. వి. రామస్వామి అయ్యంగారి వ్యాసాలు, ఎమెనోగారి వ్యాసాలు, ద్రావిడ భాషలమీద తాను రాసిన వ్యాసాలు చదవమని చెప్పారు. ద్రావిడ భాషా పరిశోధనలో జ్ఞానకవాటం తెరిచిన వారు బరోదొరగారు; దానికి హేతుభూతులు అబ్బూరివారు. నా పరిశోధన సరైన దారినబడ్డది. ఎండాకాలంలో మద్రాసు పూనాలు వెళ్ళి ఎన్నో గ్రంథాలు, వ్యాసాలు చదివి నోట్సు రాసుకొన్నాను. 'గదబ' భాషను గురించి సాలూరు ప్రాంతంలో విషయసేకరణ చేశాను. నా పరిశోధనకు కావలసిన గ్రంథాలు ఇతర లైబ్రరీల నుంచి అబ్బూరివారు కాలయాపన లేకుండా తెప్పించేవారు.

* * * *

1953లో Fulbright స్కాలర్‌షిప్పు వచ్చింది. కాని యూనివర్శిటీ అధికారులు విస్తుపోయారు. తెలుగులో అమెరికాలో చేసే పరిశోధన ఏమిటని వి. యస్. కృష్ణాగారు సోమయాజులుగారిని అడిగారట. భాషాశాస్త్రంలో పరిశోధనకు ఎన్నోఅవకాశాలున్నాయని అబ్బూరివారునచ్చచెప్పటానికి ప్రయత్నించినా పని కాలేదు. తరవాత సిండికేట్‌లో నాకు అంతకు ముందు అధ్యాపకులైన వల్లభజోస్యుల సుబ్బారావుగా రుండటంవల్ల, గ్విన్ (జిల్లా కలెక్టరు) తోడ్పడటంవల్ల రెండేళ్ళపాటు సెలవు — కుటుంబభృతి — శాంక్షన్ చేశారు.

అమెరికాలో ఒక యేడు పెన్సిల్వేనియాలో గడిపిన తర్వాత కాలిఫోర్నియా వెళ్ళాను. రెండో యేడు రాక్ ఫెల్లర్ ఫౌండేషన్ వాళ్ళు ఫెలోషిప్ ఇచ్చారు. ఎమెనోగారి వద్ద నా సిద్ధాంత గ్రంథం 1955_56లో రాసే అవకాశం వచ్చింది. ఆ కాలంలో రాక్ ఫెల్లర్ డైరక్టరు (నాకు సలహాదారుడు) Chadbourne Gilpatric అనే ఆయన తాను ఇండియా వెళ్ళాలనుకొంటున్నాననీ —అక్కడ ఎవరికి రాస్తే, ఎవరిని కలిస్తే బాగుంటుందని నన్ను అడిగారు. నేను వి. సి. గారిని, రిజిస్ట్రారు గోపాలస్వామిగారిని, లైబ్రేరియన్‌గా ఉన్న అబ్బూరివారినీ కలవమని సూచించాను. ఆయన వాల్తేరులో వారిని కలిసినట్టూ, అక్కడ జరిగిన విశేషాలూ అబ్బూరివారు నాకు రాశారు. వి. ఎస్. కృష్ణాగారిని రాక్ ఫెల్లర్ ఫౌండేషన్ తరఫున అమెరికాకు ఆహ్వానించారు. నా పరిశోధన చాలా బాగా సాగుతున్నదని గిల్ పేట్రిక్ చెప్పినట్లు, అదివిని కృష్ణాగారు సంతోషించినట్టు అబ్బూరివారు రాశారు.

* * * *

1956 లో నేను తిరిగి వచ్చాను. తెలుగు డిపార్టుమెంటులో యథాప్రకారం లెక్చరర్ ఉద్యోగం. కృష్ణాగారు ప్రతిరోజూ మధ్యాహ్నం 2 _ 3 మధ్య లైబ్రరీకి వచ్చి అబ్బూరి మేష్టరుగారితో కాలక్షేపం చేసేవారు. అడపాతడపా నా సంగతులు వచ్చేవి. ఆయన వెళ్ళగానే అబ్బూరివారు నాకు కబురంపించి చెప్పేవారు. వి. సి. కి అబ్బూరివారు సన్నిహితులనీ, అబ్బూరికి నేను సన్నిహితుణ్ణి అనీ గంటివారికి కాస్త అసూయగా ఉండేది. ఒక రోజు సోమయాజిగారు నన్నడిగారు : 'కృష్ణాగారు రోజూ అబ్బూరి రామకృష్ణరావుగారి దగ్గరికి వెళ్ళి మాట్లాడుతుంటారు. ఏమిటి అబ్బూరిలో ఉన్న ఆకర్షణ ?" అని. నే నన్నాను : 'అబ్బూరి మేష్టరుగారు సంభాషణచతురులు. అంటే Conversationalist అన్నమాట. ఆయన చాలా 'విటీ'గా కూడా మాట్లాడుతుంటా రండి. అందుకనే వెళ్తుంటారేమోనని'. వెంటనే సోమయాజిగారు "అదేమిటోయ్ ? నేను ఆ మాత్రం విట్టీగా మాట్లాడలేనా ?" అని తన నిస్సహాయతను వెలార్చినట్టు అన్నారు. ఈ సన్నివేశం గుర్తుకు వచ్చినప్పుడల్లా ఇదే ఒక పెద్ద 'విట్'గా భావిస్తుండే వాళ్ళం.

నా దగ్గర రిసెర్చి చెయ్యటానికి కొందర్ని ఒప్పచెప్పమని వి. సి. కృష్ణగారు సోమయాజిగారికి చెప్పారట. అప్పుడే మెట్టా వెంకటేశ్వరరావు, బూదరాజు

Ph. D. కి నా దగ్గర చేరారు. 1957 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్థాపనకు అబ్బూరిమేష్టరుగారు హైదరాబాదులో రెండు మూడు నెల్లున్నారు. అప్పటి విద్యాశాఖామాత్యులు పట్టాభిరామారావుగారు ఆయన తోడ్పాటు కోరారు. సాహిత్య అకాడమీలో నన్ను సాధారణ సభ్యుడుగానే కాకుండా కార్య వర్గ సభ్యుడుగా కూడా నియమించడానికి అబ్బూరివారే కారకులు. అప్పటికి నా వయస్సు 29 ఏళ్లు. అంతకు ముందే నన్నయ పదప్రయోగకోశం, వృత్తి పద కోశాలు తయారుచెయ్యటం తెలుగుభాషకు అవసరమని, మాచేత కొంత ప్రయత్నం అబ్బూరివారే చేయించారు. ఇలాంటి మౌలికగ్రంథాలను సాహిత్య అకాడమీ తయారుచేయించాలని నిర్ణయించారు. వారితోపాటు కార్యవర్గ సభ్యుడుగా 6, 7 ఏళ్లు పనిచేసే భాగ్యం నాకు కలిగింది. ఆధునిక భాషాశాస్త్ర శిక్షణతో వృత్తి పదకోశ నిర్మాణానికి ఒక పథకం తయారుచేసి ప్రతిపాదిస్తే కార్యవర్గం ఒప్పు కొన్నది. ఈ ప్రయత్నం అబ్బూరివారి ప్రోత్సాహమే లేకపోతే జరిగేదికాదు. సాహిత్య అకాడమీ చేపట్టిన మౌలికగ్రంథాలకు అబ్బూరివారి భావాలు మార్గదర్శకా లైనాయి.

*    *    *    *

నేను 60_61లో అమెరికా వెళ్ళి వచ్చాను. కాలిఫోర్నియాలో ఉద్యోగం. ఆంధ్రా యూనివర్శిటీ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి 1961 సెప్టెంబరులో రీడరుగా వేంకటేశ్వర విద్యాలయంలో ప్రవేశించాను. 1962లో ఉస్మానియాలో భాషాశాస్త్ర విభాగం నెలకొల్పటానికి ఆచార్య పదవికి ఎంపికయ్యాను. ఈ మధ్య కాలంలో ఎన్నో ఇబ్బందుల్లో అబ్బూరిమేష్టరుగారితో సంప్రతించటం, ఆయన సలహాలు తీసుకోవటం జరిగింది.

అబ్బూరివారు ఆంధ్రా యూనివర్శిటీ ఉద్యోగం విరమించి హైదరాబాదు చేరారు. ఆయనా, గోపీ చిక్కడపల్లిలో ఉండేవాళ్ళు. నేను మొదట విద్యానగర్లోను, తర్వాత యూనివర్శిటీ క్వార్టర్సులోను ఉండగా ఎన్నోసార్లు మేష్టరుగారిని కలవటం, సాయంత్రాలు కులాసాగా గడపటం జరిగింది. ఆ తర్వాత వారు మలక్‌పేటకు తరలివెళ్ళారు. అప్పుడప్పుడు కలుసుకొనే వాళ్ళం. తిక్కన పదప్రయోగకోశానికి మాటలు వారే రాయించి అకారాది క్రమంలో పెట్టించారు. సాహిత్య అకాడమీ నించి విరమించుకొన్నారు. వార్ధక్యంవల్ల వారు అట్టే బయటికి వెళ్ళేవారు కాదు.

*    *    *    *

తరువాత సుస్తీచేసి ఢిల్లీ వెళ్ళారు. నేను ఏదో పనిమీద వెళ్ళి చూడటానికి వరదావాళ్ల ఇంటికి వెళ్తే—చిట్టచివరి పద్యం రాసుకోమని చెప్పారు.

"చచ్చిపోయి జీవి ఎచ్చటికేగునో
ఏమి యగునా ఎవరి కెరుగరాదు
ఎరుకలేనివార లేమేమొ చెప్పగా
విని తపించువారు వేనవేలు."

మేష్టరుగారు 1979 ఏప్రిల్ 30వ తేదీన కన్నుమూశారని తెలిసీ చాలా ఆవేదన పడ్డాను. 1985లో అచ్చయిన నా తెలుగు వ్యాకరణాన్ని మేష్టరుగారి స్మృతికి అంకితం చేశాను. నాలాగా ఎందరికో బతుకుబాటలో దివిటీగా నిలిచి నడిపించిన దివ్యజ్యోతి అబ్బూరి మేష్టరుగారు. ఆయన అమరజీవి.

కుందుర్తి ఆంజనేయులు

# అబ్బూరి : మనల్ని విడిచివెళ్ళిన మరొక వైతాళికుడు

భావ కవితోద్యమానికి తొలి రూపురేఖలు దిద్దిన ఆద్యులు, పూజ్యులు అబ్బూరి రామకృష్ణారావు గారి మరణం తెనుగు దేశానికి తీరనిలోటు. ఈ "తీరని లోటు" ఎవరు మరణించినా అనే మాటే గదయ్యా, అంతటి వాడిక్కూడా ఈ వాడిపోయిన, "వాడి" పోయిన మాటే వాడావా అంటే తెనుగు నుడికారంలో మరేం దొరకడంలేదు, చావమంటారా నన్ను ? ఆయన మరణ వార్త రేడియోలో వినగానే మనస్సు మళ్ళీ ఒకసారి ఒకనాటి భావకవితా లోకంలోకి ఎగిరి గంతేసింది.

నన్నయ్య చెప్పిన రెండు ప్రధాన లక్షణాల్లో మొదటిదైన "ప్రసన్న కథా కలితార్థ యుక్తి" ఏనాడో గాలిలో కలిసిపోగా, రెండవది "అక్షరరమ్యత" భావ కవితా యుగంలో సాహిత్య ప్రియులైన ప్రజలందరికీ పంక్తి భోజనాలు పెట్టింది. భావకవితా యుగాన్ని కూడా ఒక విప్లవంగా మనం సంభావిస్తే అది మనకు మిగిల్చిపోయిన ఆస్తి ఈ అక్షరరమ్యతే. అక్షరరమ్యత అన్న దానికంటే "మ్యూజిక్ ఆఫ్ వర్డ్స్" అంటే ఇప్పటి యువతరం వారికి బాగా అర్థం అవుతుంది. మాటలను ఏరుకుని దేని సరసన దేన్ని నిలబెడితే అందంగా వుంటుందో చూసుకుని ఆ విధంగా శబ్దాల కూర్పు సంధించడం అక్షర రమ్యత.

## అక్షర రమ్యత :

దీనిని ప్రయత్న పూర్వకంగా చేసిన వారూ వున్నారు. సహజంగా సొంతం చేసుకున్న వారూ వుంటారు. వారి వారి వ్రాత ప్రతులు పరిశీలిస్తేగాని ఈ సహజ, అసహజత్వాలు మనకు స్పష్టంగా తేలవు. నిజానికి ఈ ప్రాసెస్ అంతా మనస్సులో జరిగేదే కాని కాగితం మీదికి వచ్చాక కూడా తుడుపుళ్ళూ నగిషీలు

చెక్కడం కొందరిలో వుంటుంది. రామకృష్ణారావుగారు పెన్సిల్ పట్టుకొని రాయడం మొదలు పెట్టారంటే మరి దానికి మార్పులేదు. అంతకుముందు మనసులో రాసుకున్న చిత్తుప్రతిని ఫెయిర్ చేసిన దానిలా ఆయన వ్రాత ప్రతి వుండేది. ఈ విధంగా శబ్దాల కూర్పులో ఆయన మాస్టర్ కవి. నిజానికి రామ కృష్ణారావుగారి శైలి విన్యాసం మీద డాక్టరేట్ పరిశోధన జరగవలసివుంది. ఆ యుగంలో ఈ రమ్యాక్షర ఫణితి వ్యామోహం ఎంత దూరం పోయిదంటే చివరకు అర్థస్ఫురణ విషయంకూడా అంతగా పట్టించుకోనంత దూరం పోయింది. అందుకే అనేకమంది భావకవులు అక్కిరాజు ఉమాకాంత విద్యా శేఖరుల దాడికి గురికావలసి వచ్చింది. తన వ్యుత్పత్తి బలం చేతా, పూర్వాంధ్ర సంస్కృత కవితా మర్మజ్ఞతచేతా రామకృష్ణారావుగారికి ఆ దాడివల్ల కూడా అంత భయపడవలసిన పనిలేక పోయింది. 'నేటి కాలపు కవిత్వం'లో విద్యా శేఖరులు అబ్బూరివారి మీదికి పోలేదు. ఒక విప్లవం వచ్చినప్పుడు అందులో నుంచి పుట్టే కొత్తను సంప్రదాయ వాదులు అంత త్వరగా అంగీకరించరుగదా ! "తొడిమ లెడ సేయగా రాలిపడిన పూల వలపు లేవి ?" అన్నప్పుడు రాలిపడేవి పూలే గదా, పూలవలపులనే ఈ పులుము డేమిటి అని ప్రశ్నిస్తారు. ఉద్యమం ప్రజల్లో ప్రాకిన తర్వాత కాలక్రమేణాగాని కొత్త ఎక్స్‌ప్రెషన్ యొక్క అర్థస్ఫూర్తిని అందరూ అంగీకరించేరు.

## పేరుకే భావకవి

రామకృష్ణారావుగారు పేరుకు మాత్రమే భావకవి. భావకవితా యుగంలో ఆద్యుడు కాబట్టి, దానికి తొలి బీజాలు నాటిన వారిలో ఒకరు కాబట్టి, భావకవితా లక్షణాలుగా తరువాత కాలంలో నిర్ణయింపబడిన వాటిని తన కవితల్లో నిక్షేపిం చాడు కాబట్టి ఆయన్ను భావకవి అంటున్నారు.

కాని ఈ విశేషణం ఆయన వ్యక్తిత్వానికి, జీవిత గమనానికి పూర్తిన్యాయం చేకూర్చదు. విశ్వాసాల దృష్ట్యా ఆచరణ దృష్ట్యా, ఆయన అభ్యుదయ భావుకుడు. తన తరువాత ప్రవర్తిల్లిన అభ్యుదయ కవితా యుగ దర్శనం ఆయనకు తప్ప ఆ యుగంలోని భావకవు లెవరికీ లేదు. దేశభక్తి గీతాలూ, ఆంధ్రాభిమాన గీతాలూ అందరు భావకవులు రాశారు. కాని వారి పాత్ర అంతటితోనే ఆగిపోయింది.

ప్రతి తరంలోనూ విప్లవాభిముఖంగా నడిచిన వారుంటారు. దానికి భిన్నంగ మరేదైనా వస్తే వారు దానిని ఆమోదించడానికి సిద్ధంగా వుండరు. ఒక అంగుళం కూడా ముందుకు పోవడానికి గానీ, పోతున్న యువతరం వారి వీపు తట్టడానికి గానీ వారికి మనస్కరించదు. వారందరికీ లేని యీ లక్షణం రామ కృష్ణారావుగారిలో వుండడం ఆయన విశిష్టత.

లండన్‌లో ప్రచురించిన అభ్యుదయ రచయితల మానిఫెస్టో శ్రీశ్రీకి యిచ్చింది ఆయనే. ఇది శ్రీశ్రీ కూడా కృతజ్ఞతతో అంగీకరించిన మాట. ఆ రోజుల్లో యువకులను ప్రోత్సహించాలనే తత్వం శివశంకర శాస్త్రిగారికి కూడా వుండేది. కాని రామకృష్ణారావుగారి ప్రోత్సాహతత్వం యువకులను అభ్యుదయ మార్గానికి త్రిప్పాలనే దీక్షతో కలిసి వుండేది. ఇది మౌలికమైన భేదం. నాలుగు మంచి మాటలు చెప్పి, వీపుతట్టి శిష్యగణాన్ని సమకూర్చుకుందామనే తత్వం చాలా మందిలో వుండవచ్చు. కాని రామకృష్ణారావుగారికి శిష్యగణం అక్కర లేదు. గ్రూపులు, ముఠాలు అవసరంలేదు. ఆయన ప్రయత్నమల్లా ప్రపంచంలో వస్తున్న మార్పును ఆహ్వానించడం, అభ్యుదయ మార్గాన్ని ఆవిష్కరించడం, ఆధునిక కాలంలో, పూర్వంలోవలె కాకుండా త్వరత్వరగా వస్తున్న మార్పులను పసిగట్టి వాటికి దోహం చేయడం—ఆయన వ్యక్తిత్వంలోని ప్రధాన లక్షణం.

## మానవతా వాదం

"కవిత" అనే ఒక సంకలనంలో ఆయన రాసిన గేయం దీనికి ఉదాహరణ. దానిలో ఆయన భావకవిత్వాన్ని దాటి, అభ్యుదయకవిత్వాన్ని కూడా దాటి మానవతావాదం వైపు ప్రయాణం చేశాడు. ఎప్పుడూ ఒకదాన్ని అంటి పెట్టుకుని వుండడం అక్షరాలా మేధావి అయిన వాడికి సాధ్యమయ్యే పనికాదు. దూరదృష్టి, దర్శనం కలవారు ఎప్పుడూ "తరువాత ఏమిటి" అని ఆలోచిస్తూనే వుంటారు. ఋషి అంటే అర్థం ఇదే. ఋషిత్వంలోని ముఖ్య లక్షణం ఇదే.

భావకవిగా పేరు ప్రతిష్ఠలు పొందినవాడైనా, భారత కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరుగా, భారత అభ్యుదయ రచయితల ఉద్యమ ప్రారంభకుల్లో ఒకరుగా వున్న రామకృష్ణారావుగారు తెలుగువారి దృష్టిలో గురజాడ తరువాత గురజాడంతవారు. భావకవుల్లో ఎవరికీ లేనంత విశాల దృష్టి విశ్వమానవ చైతన్య

స్ఫూర్తి, అభ్యుదయ భావన, విప్లవాభిముఖత్వం ఆయనలో వున్నాయనే విష యానికి రావలసినంత ప్రచారం రాలేదేమోనని నేననుకుంటాను. అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్వాహకులు ఇకముందు ఈ భారం వహించవలసి వుంటుంది.

భావ కవితోద్యమానికి ప్రజాదృష్టి లేదు. కవిత్వం కేవలం కొంతమందికే నన్న అపోహలో వారు కూరుకుపోయారు. రామకృష్ణారావుగారిది ప్రజా దృష్టి, అభ్యుదయ దృక్పథం. ఈ రెంటికీ ఎలా పొంతన కుదురుతుంది ? ఈ వైరుధ్యం వల్లనే అనుకుంటాను ఆయన కవితారంగం నుంచి రంగస్థల, నాటక రంగంలో ప్రవేశించారు. నాటకరూపంలో ప్రజల దగ్గరకుపోవడం తేలిక. ఆధునిక సంస్కృతి లోని అత్యున్నతమైన విలువలను ప్రజలకు చేరువగా తీసుకు వెళ్ళడానికి రామ కృష్ణారావుగారు కృషి చేశారు.

బహుముఖ ప్రజ్ఞ

భావకవుల్లో కొందరు టాగూరు శాంతినికేతనానికి వెళ్ళి రావడం మినహా అంతకంటే ఎత్తుకు పెరగలేదు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన రామకృష్ణారావు గారి జీవితానుభవాలలో వారికి శతాంశమైనా లేవు. కట్టమంచి రామలింగారెడ్డి, రాధాకృష్ణ పండితుడు, అరవిందఘోష్, టాగురు, ఎం. ఎన్. రాయ్.... ఇంకా ఇంకా యిలాంటి వందలపేర్లు చెప్పవచ్చు. అంత వైవిధ్య సుందరమైన పూర్ణ జీవితం ఆయనది. హైదరాబాదులో జరిగిన జయంతి సభలో ఎవరో అన్నట్లు సెక్సు నుంచి సాల్వేషన్ వరకు ఆయనకు తెలియని విషయం లేదు. ఆయనతో మాట్లాడడమే—గిరీశం అన్నట్లు—ఒక ఎడ్యుకేషన్. ఆయన ఎన్ని విషయాలను గురించి మాట్లాడగలడు అనే దానికంటే దేనిలో ఆయనకు పరిజ్ఞానం లేదు అని పరిశోధన చేయడం సులభం. అభ్యుదయోద్యమంగాని, పాశ్చాత్య నాటక సంప్రదాయాలుగాని, భారతీయ వేదాంతాది విషయాలు గాని, కమ్యూనిజంగాని, హ్యూమనిజం గాని ఆయనకు తెలియనిదీ, లోతులకు వెళ్ళి చర్చించలేనిదీ లేదు.

రాశిలో తక్కువ రాసినా వాసి కెక్కిన శేఖరుడు అబ్బూరి రామకృష్ణా రావుగారు. నే ననుకుంటాను_ఆయనేగనుక రంగస్థలంవైపు, నాటక ప్రయోగాల వైపు దృష్టి సారించకుండా విశ్వనాథాదులవలె కేవలం కవిగానే జీవితం గడప దలచుకున్నట్లయితే అభ్యుదయ కవితా మార్గంలోకివచ్చి దాన్ని ఎంతగా పరిపుష్టం

చేసే వాడో అని. ఆ అదృష్టం తెలుగు కవితకు లేకుండాపోయింది. అదేకాదు, ఆయనను నే నెన్నోసార్లు ప్రాధేయపడ్డాను. 'జ్ఞాపకాలు రాయండి స్వామీ అని. షార్టుహాండ్ రిపోర్టర్లనో, టేపులనో సప్లయి చేస్తాము. ఏదో ఒకటి మీరు చెప్తూ వుండండి. తరువాత మేము ఎడిట్ చేసుకుంటాం' అని. నేనిలా బలవంతంచేసే నాటికే ఆయన శరీర దారుఢ్యం కోల్పోయి వున్నారు. కాని మనస్సు చురుగ్గానే వుంది. ఆ పని చేయలే దాయన. ఆ విధంగా ఆంధ్రదేశానికి ఒక సంపూర్ణ జీవితానుభవం చిక్కకుండా తప్పించుకు పోయింది.

ఆయన చివరికోర్కె తన చితాభస్మాన్ని డెహ్రాడూన్‌లో రాయ్‌సమాధి వద్ద వుంచాలని. ముందు ప్రచారం లేకుండా ఆయన కుమారులు డెహ్రాడూన్ వెళ్ళి నప్పుడు అభిమాన జనం అప్పటికే గుమి గూడి వున్నారట. ఈ విషయం వరద రాజేశ్వరరావు చెప్పారు. జీవిత ప్రారంభంనుంచి చివరి నిమిషంవరకూ అభ్యుదయ వాదిగా కాలం గడిపిన రామకృష్ణారావుగారు ఆంధ్రులకే కాదు, దేశంలోని అభ్యుదయ వాదులందరికీ ప్రాతస్మరణీయులు.

(ఆంధ్ర జ్యోతి — 1979)

ఏ. ఆర్. కృష్ణ

# జ్ఞాపకాలు - అబ్బూరి నాయన!

సామాన్య మానవుడికి మామూలుగా జ్ఞాపకం వుండేవి — తనపట్ల ఇతరుల జేపిన అవమానాలు, అన్యాయాలు. వీటిని జీవితాంతం మరచిపోలేడు. కానీ సాహిత్యం, కళలు, ముఖ్యంగా నాటక కళలో శ్రమించి జీవితంలో సంస్కృతి సాధించాలన్నా తపన వున్నవారికి తనకి జరిగిన మేలుకొలుపు, మంచీ జ్ఞాపకానికి వస్తాయి. సంప్రదాయ రీతిలో, పాడిపాటే పాడుతూ, పాత ఫక్కీలోనే నాటకాన్ని చూచి అనుకరిస్తూ గొప్ప భవిష్యత్తును నాకు, నాటకానికి గూడా — కలలు కంటున్న రోజుల్లో అబ్బూరి రామకృష్ణారావు మేష్టారుని నేను కలిశాను. ఇది 30 సంవత్సరాల కిందటి మాట! ఆయన సంప్రదాయంలోనుండి బైటపడాలని, తనమీద రుద్దబడిన సాహిత్యం, కవిత్వం, నాటకం పుటలనుంచి క్షీరనీర న్యాయంలో తనదైన పాల సముద్రాన్ని చేరుకున్నాడు. ఆయన వివక్షత, వివేకం ఖచ్చితమైన అభిప్రాయాలు రాజీ ధోరణిలేని మనో దారుఢ్యత నన్ను ఆయనవైపు ఆకర్షించాయి. అయితే నా నాటకాల హడావుడి, గందరగోళం, వ్యక్తులతో, జనంతో రాజీ విధానాలు చూసి —'ఇది గాదురా నాటకం!' అన్నాడు. ఎవరో పురాణ పురుషులు నేతి నేతి నేతి (న ఇతి న ఇతి — ఇది కాదు) అన్నట్లు. "మరేమిటి?" అన్నాను.

''నాటకానికి ముఖ్యం చూసేవాళ్లురా?" అన్నాడు.

"వాళ్ళెవరు?'' అన్నాను.

"నీ చుట్టూ వుండేవాళ్ళే!"అన్నాడు.

"నా చుట్టూ ఎవరుంటారు, నేను ప్రయత్నం చేయకపోతే?" అన్నాను.

"ఒక దుకాణం తెరువు. కావలసిన వాళ్ళు వాళ్ళే వస్తారు" అన్నాడు.

"ఆకర్షణ అక్ఖరలేదా?" అన్నాను.

"ఏమీ అక్ఖరలేదు. (రవీంద్ర భారతిలాంటి) నాటక మందిరం అవసరం లేదు. శాస్త్రీయ సంగీతం, నృత్య అర్భాటాలు అక్ఖరలేదు. వానొస్తే

నాటకం ఆగకుండా ఒక పాక అవసరమేమో! కాకపోతే — నాటకం ఎక్కడన్నా ఆడొచ్చు! జనం కూడేచోట, జనం కూడినచోట, జనం రెక్కాడ్చుకునే చోట, నువ్వెళ్ళి నాటకం వెయ్. నీ నాటకాన్ని రుచి మరిగినవాళ్ళు నువ్వెక్కడ నాటకం ఆడితే అక్కడికొస్తారు. కానీ, కాలక్షేపం మాత్రం వొద్దు. వాళ్ళని, వాళ్ళ ఆలోచనల్ని రేకెత్తించే, నాటకం, రమ్యత గొలుపుతూ నిద్రపోనివ్వని, జోకొట్టని నాటకాన్ని నువ్వేయ్యాలిరా!" అన్నాడు.

"ఒక్క నాటకం పేరు చెప్పండి?" అన్నాను.

"కన్యాశుల్కంరా!" అన్నాడు.

"ఆ జులాయి గిరీశంగాడి కథా?" అన్నాను.

"గిరీశం పాత్ర గురజాడ సృష్టిరా. కానీ Contrast లో గొప్పవాళ్ళు కనిపిస్తారు. గొప్పవాళ్ళనుకున్నవాళ్ళు పడిపోతారు. సంఘ బాహ్యురాలైన బోగంది కథానాయికరా!" అన్నాడు.

కన్యాశుల్కం వేశాం — నేను లుబ్ధావధాన్లు వేస్తాను అనంటే కాదన్నాడు. ఆయన ప్రయోక్త, దర్శకుడు కాబట్టి నేనొప్పుకోక తప్పలేదు. నాకు రామప్పపంతులు వేయడం చాలా కష్టసాధ్యమైన పని. నాప్రవృత్తికి, నా స్వభావానికి రామప్ప పంతులు పాత్ర పూర్తి వ్యతిరేకం! అప్పట్లో ప్రేయసితో సరస మాడడమే తెలియదు. అందునా వేశ్యతో రామప్ప పంతులు సరసం, ఆ తల్లి సత్యరాజకుమారి (విజయనగరం) ఆనాడు ఎంత అవస్తపడిందో ప్రవరాఖ్యుడైన నన్ను జూసి! నా అవస్త నాకే తెలుసు. కానీ, *అబ్బూరి నాయనసాధించారు. నేను మరిచిపోలేని నాటకం* —

అబ్బూరి మేష్టారు తండ్రిలేని నాకు నాయనలాంటి వాడు. నా గురువు; ఆయన మేలుకొలుపుతో నేను నాటక ప్రయోగాల్లో కొత్త ఒరవడి నేర్చుకున్నాను. ఆయన దర్శకత్వంలో 'మృచ్ఛకటికం' ప్రదర్శించాం. ఆనాటి ప్రజకు అర్థమయ్యే తెలుగుభాషలో సంస్కృతం నుంచి అనువాదం చేశాడు ఆయనే! అందులో నాకు ఆయన చారుదత్తుడు వేషం ఇచ్చాడు. మళ్ళీ సత్యరాజకుమారి వసంతసేన. ఆయన నేను ఇప్పటికీ చేసే దర్శకత్వపు హడావుడి ఏమీ చేసేవాడు గాదు. నేతి నేతి — ఇదిగాదు — ఇదిగాదు — అనేవాడు తప్ప. ఆ విధంగా నాలోని, ఇతర నటీనటుల్లోని భావనాశక్తితో మా పాత్రలని మేము మలచుకున్నాం.

హైదరాబాద్‌లోనే గాక ఢిల్లీలో ప్రదర్శనలు....అప్పుడే ఢిల్లీలో ప్రారంభమైన టెలివిజన్ (1965) లో మృచ్ఛకటికం ప్రసారం. అప్పుడు డా॥సర్వేపల్లి రాధాకృష్ణ రాష్ట్రపతి భవన్‌లో మృచ్ఛకటికం ప్రదర్శనం ఆయన్ని సంతృప్తి పరిచాయి.

అబ్బూరి ఇబ్సన్ నాటకం (ఎనిమీ ఆఫ్ ద పీపుల్) తెలుగులో ఆయన ధోరణిలో అనువదించాడు. కానీ ఆ రాతప్రతి నా కందకుండా ఇతరుల పాలైంది. దాన్ని తమ తెలివితేటలతో మార్చి, ఎవరో రచయిత, ఎవరో నటుడు ప్రదర్శించారట. ఆయనకీ, నాకూ ఇప్పటికీ తెలియదు. కాని, అబ్బూరి వివేకం, విచక్షణత, విలక్షణత్వం నేను కొంతవరకు నేర్చుకున్నాను. ఆయన్ని మరచిపోలేను. ఇలా - 60 యేళ్ళు పూర్తికావస్తున్నా నాకుగూడా ఎన్నో జ్ఞాపకాలు వస్తున్నాయి. మంచివే. ఇతరుల్ని బాధపెట్టేవిగావు. సామాన్య మానవుడిగా, నాకొచ్చిన అవమానాలు, కష్టాలు, పతనాలు నేను మరచిపోవాలనే దీక్షతో, సంస్కృతితో. మీకు అవి చెప్పను :

(ఆంధ్రజ్యోతి, 12-10-86)

పన్నూరి రామారావు

# గురువుగారు-శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు

ఆధునికాంధ్ర సాహిత్యానికి ప్రముఖమార్గదర్శి, ప్రఖ్యాతకవి, బహుభాషా వేత్త, నాటకప్రయోక్త, నటుడు, మానవతావాది, మహామనీషి —మేమంతా ఆప్యాయంగా 'గురువుగారూ' అని పిలిచే శ్రీ అబ్బూరి మాష్టారినిగురించి నేను రాయబూనుకోవడం కొంత ఆశ్చర్యాన్ని కలిగించినా, దాదాపు 10_15 సంవత్స రాలు వారితో అతి సన్నిహితంగా గడిపిన కాలం ఆంధ్రనాటక చరిత్రతో ముడి పడి ఉన్నందున ఈ సాహసానికి పూనుకున్నాను.

జనవరి 1954లో, నిజాం కళాశాలలో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవాల్లో నాకు 'ఉత్తమ నటుడు' బహుమతి రావడంవల్ల అదే ఉత్సవాల్లో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పాల్గొన్న కీ శే. మంత్రి శ్రీనివాసరావు (Former Head, Dept. of Theatre Arts, Andhra University), శ్రీ పి. యస్. రామా రావు (Deputy Director, Song and Drama Division, Govt. of India), కీ. శే. తురగా కృష్ణమోహనరావు, కీ. శే. సముద్రాల గోపాల మూర్తి, నాటి INT (Indian National Theatre) ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. ఆర్. కృష్ణగార్లతో పరిచయ మేర్పడింది. అప్పటికింకా హైదరాబాద్ విశా లాంధ్రలో విలీనం కాలేదు. నాటి హైదరాబాద్‌లో తెలుగు నాటకానికి పునాదులు లేవు, ప్రేక్షకులూ లేరు. దురదృష్టమేమంటే — విశాలాంధ్ర ఏర్పడిన 30 సంవత్సరాల తరువాత కూడా రాష్ట్ర రాజధానిలో ఆధునిక తెలుగునాటకానికి ప్రేక్షకుల కరువు ఉన్నది. అయితే ఆ రోజుల్లో పద్యాలతో కూడిన పౌరాణిక నాటకాలను పండుగ ప్రత్యేక ఆకర్షణగా సికింద్రాబాద్‌లో సినిమాహాల్‌లో ప్రదర్శించేవారు. దీనికి ప్రేక్షకుల ఆదరణ కూడా ఉండేది. ఈ కార్యక్రమాన్ని నిర్వహించి, పోషించింది శ్రీమామిడిపూడి ఆనందంగారు.

1954లో ఎ. ఆర్. కృష్ణ, మంత్రి, తురగా, నేను INT ద్వారా నాటకాలు ప్రదర్శించి, నాటకోద్యమాన్ని చేపట్టాలని తలంచి, శ్రీ బెల్లంకొండ రామదాసును పిలిపించి, 'మాష్టర్జీ' నాటకాన్ని రాయించి ప్రదర్శించాం. తరువాత శ్రీ గిడుతూరి సూర్యం తెలుగులోకి అనుసరించిన 'Inspector General' నాటకాన్ని జంటనగరాల్లోనూ, తెలంగాణాలో ముఖ్యప్రాంతాల్లోనూ ప్రదర్శించాం. 1958 గుడివాడ ఆంధ్రనాటక కళాపరిషత్‌లో కూడా ప్రదర్శించాం. ఇందులో నేనే ముఖ్యపాత్ర ధరించాను. 1957లో INT ద్వారా మూడు రోజుల నాటకోత్సవాన్ని కూడా జరిపించాం. దీనివల్ల మాకు తెలిసింది ప్రేక్షకుల ఆదరణ మృగ్యమని. 1957లోనే ఆనాటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంగీతనాటక, సాహిత్య, లలితాకళా అకాడమీల స్థాపనకు పూనుకుంది. ఇందులో శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు ముఖ్య సలహాదారుగా కీలకమైన పాత్రవహించి, అకాడమీల స్థాపనకు అంకురార్పణ చేశారు. అకాడమీలు ఆరంభమైన నాటి రాత్రి ప్రదర్శించిన "నిచ్చెనలు" నాటికలో ఎ. ఆర్. కృష్ణ (నాటక రచయిత కూడాను) మంత్రి, నేను నటించాం. ఆనాటిది శ్రీ అబ్బూరి మాష్టారితో పరిచయం. అకాడమీల వ్యవస్థను గురించీ, సభ్యుల ఎంపిక గురించీ శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు గారింట్లో చర్చలు సాగించేవారు. అప్పట్లో నేను రిసర్చి స్కాలర్‌గా పనిచేస్తూ, నాటకాల్లో విరివిగా పాల్గొంటూ ఉండేవాడిని. మంత్రి, కృష్ణ అకాడమీలో సభ్యులుగా శ్రీ రామకృష్ణరావుగారి సూచనద్వారా ఎంపికయ్యారు. ఆల్ ఇండియా రేడియో 1957లో 90 నిమిషాల జాతీయ నాటకాల ప్రసారం మొదలు పెట్టింది. బరువా అస్సాం నాటకాన్ని శ్రీ అబ్బూరి వరద రాజేశ్వర్రావు తెలుగులోనికి అనువదించారు. ఆ రేడియో నాటకంలో నేనే ముఖ్యపాత్ర చదివాను. నాటకాన్ని INT ప్రదర్శించింది.

పదవీ విరమణ చేసిన శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు 1961 లో మకాం హైదరాబాద్ మార్చారు. అప్పటికే వారబ్బాయి శ్రీ వరదరాజేశ్వరావు న్యూ ఢిల్లీకి వెళ్ళిపోయారు ఉద్యోగరీత్యా. వారి మూడవ కుమారుడు గోపాలకృష్ణ నేనూ కలిసి నాటి జంటనగరాల సాంస్కృతిక కేంద్ర మనదగిన చిక్కడపల్లిలో ఒకే గదిలో ఉంటూ ఉండే వాళ్ళం. గురువుగారు కూడా మాతోనే ఉండే వారు. బ్రహ్మచారుల మైన మాకు హోటల్ తిండే గదా గతి! అయితే అప్పుడప్పుడు గురువుగారి వంటలు తినే భాగ్యం కలిగింది.

తీరిక వేళల్లో ఆయన చెప్పినది వింటూ తెలుగు నాటకరంగాన్ని గురించీన్నీ, ప్రపంచ నాటకరంగాన్ని గురించీ ఎన్నో విషయాలు నేర్చుకున్నాం. గిరీశం మాటల్లో చెప్పాలంటే 'మాష్టారితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్.' రెండు సంవత్సరాలు మేం కలిసి ఉన్నాం. నాటకాల చర్చల్లో కృష్ణ, మంత్రి, గోపి, నేను ఇతర మిత్రులందరం పాల్గొనేవాళ్లం. అసలైన నాటకోద్యమం ఆంధ్ర దేశంలో లేదని ఆయన ఆవేదన చెందేవారు. నాటకోద్యోమాన్ని సమర్థవంతంగా నడిపించడానికి కావలసిన ప్రణాళికలు ఆయనే చెప్పేవారు. పోటీ నాటకాలు ప్రదర్శించి, బహుమతులతో సంతృప్తిపడితే—ఉద్యమానికి ఒరిగేదేమీ లేదని ఆయన నిశ్చితాభిప్రాయం. నటులూ, నాటకరచయిత, ప్రయోక్త, సాంకేతిక సిబ్బంది, ప్రేక్షక సభ్యులతో ఏర్పడిన 'రిపర్టరీ' యే ఉద్యమానికి మూలాధారమని పదేపదే చెప్పేవారు. 'కన్యాశుల్కం' నాటక ప్రయోక్తగా, నటుడుగా ఆయన అనుభవాలను విశదంగా వివరించేవారు. ప్రాచీన సంస్కృత నాటకాలను గురించీ, ముఖ్యంగా ఆధునిక నాటకమనదగిన 'మృచ్ఛకటిక'ను గురించీ, 'సతీదానశూరం' వంటి యక్షగానాన్ని గురించీ వివరించి, వాటిని ఈ తరంవారికి పరిచయం చేయవలసిన ఆవశ్యకతను బాధ్యతను గుర్తుచేసేవారు. ఈ సుదీర్ఘచర్చల ఫలితంగా 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రదర్శనకు ఎన్నుకోవడం జరిగింది. 'కన్యాశుల్కం'లో రెండు నాటకాలు ఇమిడి ఉన్నాయని—'కన్యాశుల్కం' ప్రధానాంశంగా ఉన్న భాగాన్నే ఆయన ఎంపిక చేశారు ప్రదర్శనకు. ఇది అగ్నిహోత్రావధాని ఇంట్లో వెంకటేశం ఇంగ్లీషు చదువుతో ఆరంభమై, 'వెధవాయా, నీ ఇంగ్లీషు చదువులే ఇంతవరకు తెచ్చాయి' అన్న అగ్నిహోత్రావధాన్లు డైలాగ్‌తో అంతం అవుతుంది. వేరొక భాగం 'గిరీశం కథ లేదా ఫార్స్' —ఇది గిరీశం స్వగతంతో మొదలై, 'డామిట్ కథ అడ్డం తిరిగింది' అన్న గిరీశం డైలాగ్‌తో ముగుస్తుంది.

మాలో మరీ ముఖ్యంగా ప్రభావితుడైన మంత్రి శ్రీనివాసరావు 'మృచ్ఛకటిక' అనువాదానికి గురువుగారిని పదేపదే ప్రాధేయపడి, మా గదిలో డిక్టేషన్ తీసుకుంటూ తెలుగు ప్రతిని సిద్ధం చేయగలిగారు. అప్పటికి హైదరాబాద్‌లో ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘ్ ఏర్పడి, ఎక్కువ కార్యక్రమాల్ని నిర్వహిస్తూ ఉండేది. ఎ. ఆర్. కృష్ణ కార్యదర్శి. మంత్రి, బక్షీ శ్రీరామ్, గోపాలమూర్తి, అబ్బూరి గోపాలకృష్ణ, నేను ఈ కార్యక్రమాల్లో కూడా పాల్గొంటూ ఉండేవాళ్లం. శ్రీరామ

కృష్ణారావుగారి మార్గదర్శకత్వంలో నాట్య సంఘ నిర్వహణతో, నాట్య విద్యాలయం రిపర్టరీలు రవీంద్ర భారతి మొదటి అంతస్తులో మొదలయ్యాయి. కీ. శే. సంజీవయ్యగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్ననాడు, ఒక ఉగాది పర్వదినాన పబ్లిక్‌గార్డెన్స్‌లో దాదాపు 5000 ప్రేక్షకులతో క్రిక్కిరిసిన ఆరుబయలు రంగస్థలంలో "కన్యాశుల్కం" ప్రథమ ప్రదర్శన జరిగింది. అందరి అభిమానాన్ని చూరగొన్నది. ప్రేక్షకులందరూ సంపూర్ణంగా హర్షించిన ప్రదర్శన. ఇందులో ఎ. ఆర్. కృష్ణ, రామన్నపంతులు, రామచంద్రకాశ్యప, పాతూరి శ్రీరామశాస్త్రి, దుగ్గిరాల సోమేశ్వరరావు, రాళ్లపల్లి, ఆనందమోహన్, రాజకుమారి, మల్లాది విజయలక్ష్మి, లక్ష్మీదేవదాస్ మొదలగువారు నటించారు. తరువాత 'మృచ్ఛకటిక'ను ఇదే బృందం ప్రదర్శించింది. ఈ రెండు నాటకాలకు, రిపర్టరీ ప్రదర్శించిన ఇతర నాటకాలకు అబ్బూరి గోపాలకృష్ణ రూపొందించిన "రంగాలంకరణ" (Stage designing), వేషాలంకరణ ఒక ప్రత్యేకతను సంతరించుకున్న ముఖ్యాకర్షణలు. మంత్రి, నేనూ సహాయకులుగా వెనక ఉండేవాళ్ళం. కన్యాశుల్కం, మృచ్ఛకటిక సంభాషణల ఉచ్చారణలో గురువుగారు ఎంతో శ్రమపడి – ఆయనకు సంతృప్తి నిచ్చేవరకూ శిక్షణ యిచ్చేవారు. అనేక ప్రదర్శనలకు నోచుకున్నాయి ఈ ప్రదర్శనలు. న్యూఢిల్లీలో నాటి రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ సమక్షంలోనూ, ఇతర నాటకశాలల్లోనూ ప్రదర్శించారు. అక్కడి విమర్శకుల ప్రశంసలకు పాత్రమయ్యాయి.

ప్రఖ్యాత నాటక ప్రయోక్త, నటుడు, విమర్శకుడు, జవాహర్‌లాల్ మెమోరియల్ అవార్డు గ్రహీత, Nominated Member of Parliament అయిన శ్రీ హబీబ్ తన్వీర్ కూడా ఈ నాటకాలను ప్రశంసించారు. కేంద్ర సంగీత నాటక అకాడమీ పక్షాన శ్రీ తన్వీర్, డాక్టర్ సురేష్ అవస్థిలు 1968 ప్రాంతంలో 'రవీంద్ర భారతి' పనితీరులను పరిశీలించడానికి హైదరాబాద్ వచ్చారు. వారిద్దరూ అప్పుడు కలిసింది గురువుగారిని మాత్రమే. 1965లో మైసూర్‌లో నెలరోజులు University teachers కు జరిగిన Drama Camp కు శ్రీ హబీబ్ తన్వీర్ దర్శకుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తరఫున నేనూ పాల్గొన్నాను. ప్రఖ్యాత స్పానిష్ రచయిత Garcia Lorca నాటకం 'The shoemaker's Prodigious wife' అన్న ఇంగ్లీషు అనువాదాన్ని మైసూర్‌లోనూ, బెంగుళూరులోనూ శ్రీ తన్వీర్ దర్శకత్వంలో ప్రదర్శించాం. అనేక పరీక్షల అనంతరం నన్ను

'Shoemaker'గా ముఖ్యపాత్రకు ఎంపిక చేశారు. ఇంగ్లీషు డైలాగ్ శిక్షణ నివ్వడానికొచ్చిన Miss Anita Seal నాయికగా నా ప్రక్కన నటించింది. దీనిని గుర్తు చేస్తూ "I want to meet my shoemaker" అని శ్రీ అబ్బూరితో అంటే "నీ hero నాకు ఆత్మీయుడని" రామకృష్ణరావుగారు, వారిద్దరితో మా యింటికొచ్చారు. అందరం కలిసి ఆబిడ్స్ హోటల్లో భోజనం చేశాం, నాటక రీతులను ముచ్చటించుకుంటూ. వయస్సులో గురువుగారికీ, నాకూ 30 సంవత్సరాల వ్యత్యాసం ఉన్నా నన్నొక స్నేహితునిగా, ఆత్మీయుడిగా చూసుకునేవారు. ఆ దశాబ్దకాలంలో, ఆయనే నాకు 'Friend, philosopher and guide'. నేనే కాకుండా మానటబృందంలోని ఇతర యువనటులైన ఆనందమోహన్, రాళ్ళపల్లి, మంత్రి, సోమేశ్వరరావు, చంద్రశేఖర్‌రావు మొదలైన వారంతా గురువుగారి ఆదరాన్నీ అప్యాయతనూ పంచుకున్నవారే.

నేను పుట్టింది చీరాల. శ్రీఅబ్బూరి 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి సాహచర్యంలో చీరాల—పేరాలలో జరిపిన రాజకీయ ఉద్యమచరిత్ర, లండన్ పార్లమెంట్‌లో కూడా చర్చకు వచ్చిన 'రామదండు'ను గురించీ, ఆంధ్ర రత్న పద్యపఠనారీతినిగురించీ, ఛలోక్తులనుగురించీ విశదంగా చెప్పేవారు. ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా ఏర్పడిన 'రిపర్టరీ' చీరాల్లో మాష్టారి దర్శకత్వంలో, శ్రీ వరద రాజేశ్వరరావు రచన "ప్రతిమా సుందరి" నాటకాన్ని, కీ. శే. నూనె పానకాలుకు చెందిన విశాల భవనాన్ని అద్దెకు తీసుకుని రిహార్సల్స్ చేశారు 1946—47 ప్రాంతంలో. చీరాల పురవీధుల్లో సాయంత్రం షికారుకు వెళ్తున్న మాష్టారు, శ్రీశ్రీ, వరదల గురించి తెలిసినవాళ్లు చెప్పగా మేము ఆనందించాం. ఆంధ్రరత్న పేరుతో "ఆంధ్రరత్న నాట్యమండలి"ని చీరాల్లో 1947 స్థాపించాం. వ్యవస్థాపకుల్లో కీ. శే. పేటేటి వెంకటాద్రి నాయుడు, మా అన్నయ్య పన్నూరి వెంకయ్యగార్లతోపాటూ నేనూ ఉన్నాను. ఈ విధంగా చీరాలకు, ఆంధ్రరత్నకూ, రిపర్టరీకీ, గురువుగారికీ, నాకూ తెలియని సంబంధం ఉంది.

గురజాడ అప్పారావన్నా, జర్మన్ నాటక రచయిత Hauptman అన్నా గురువుగారికి ప్రత్యేకాభిమానం. అందుకే శ్రీ పోతుకూచి సాంబశివరావు ప్రచురించిన 'విశ్వసాహితి' ప్రత్యేకాంగ్ల సంకలనంలో "Apparao-and Hauptman" అనే వ్యాసంలో గురువుగారు ప్రఖ్యాత రచయిత లిద్దరినీ తులనాత్మక పరిశీలన గావించి సమీక్షించారు. చీరాల చేనేతకు ప్రసిద్ధి. నేను పుట్టింది చేనేత

కుటుంబంలో. Hauptman రచించిన 'The weavers' అనే నాటకంలోని విశిష్టతను వివరించి, ఈనాటికీ మన దేశంలో చేనేత కార్మికుల కష్టాలూ, సమస్యలూ, గత శతాబ్దంలో రాసిన ఆ నాటకంలో చర్చించబడిన దానికి దూరంగా లేవని చెప్పారు. ఆ నాటకాన్ని adopt చేయాలనే ఆకాంక్షను వెలిబుచ్చేవారు. గురువుగారు adopt చేసిన Ibsen నాటకం ఒకటి, కొంతమంది స్వార్థపరుల చేతుల్లోనికి పోయి, ఆంధ్రదేశాని కందకుండా పోయింది. 'మృచ్ఛకటిక' తెలుగు సేత ప్రచురణకు నోచుకోలేదు. గురువుగారు అభిలషించిన Hauptman నాటకం అనుసరణకు ఎవరైనా పూనుకుంటే బావుంటుంది.

రష్యన్ నాటక రచయిత Chekhov నాటిక 'proposal' ను 'ప్రధానం' గా శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు adopt చేస్తే, గురువుగారు 'Jubilee' ని 'వార్షికోత్సవం'గా అనుసరణ గావించారు. 1954లో 'ప్రధానం' నాటికలో మంత్రి, పి.యస్. రామారావు, రమాదేవిగార్లు నటించారు. 'వార్షికోత్సవం' నాటికను మంత్రి దర్శకత్వంలో 1964 లో ఆంధ్రనాటకకళాపరిషత్, హైదరాబాద్ ఉత్సవాల్లో ప్రదర్శించాం. దుగ్గిరాల సోమేశ్వరరావు, నేను, లక్ష్మి, మల్లాది విజయలక్ష్మి పాల్గొన్నాం.

మంత్రికి నాటక శిక్షణలో ఆసక్తి మెండు. స్వంతడబ్బుతో, ఉద్యోగానికి శెలవు పెట్టి, బొంబాయిలో ఒక సంవత్సరం Herbert Marshill నిర్వహించిన విద్యాలయంలో శిక్షణ పొందాడు. తరువాత British Drama League, London లో శిక్షణకు వెళ్లడానికవసరమైన ఆర్థికసహాయాన్ని అందించడానికి గురువుగారు, మేమంతా పూనుకున్నాం. NGO ల ప్రియతమనాయకుడు, గురువుగారికి ఆప్తుడైన శ్రీ ఎ. శ్రీరాములు "బొమ్మరిల్లు' గా అనువదించిన Ibsen నాటకం "A Doll's House" ప్రదర్శించాం రవీంద్రభారతిలో. మంత్రి దర్శకత్వంలో శ్రీమతి రాధాకుమారి (మదరాసు), సోమేశ్వరరావు, చంద్రశేఖరరావు, నేను ముఖ్యపాత్రలు ధరించాం. గురువుగారు నాటకాన్ని తిలకించి "ఇబ్సన్ నాటకం చూసినట్టయింది" అన్నారు. అదే మాకు పెద్ద కాంప్లిమెంట్.

1967 తరువాత నాట్యసంఘ్ జిల్లాల, తాలుకాల స్థాయికి ఎదగాలనే ప్రయత్నంలో ఎన్నికలు, పదవులు కోరే పెద్దమనుష్యులతో నిండిపోయింది; రిపర్టరీ, శిక్షణాలయం మూతబడ్డాయి; అసలునాటకం వెనక్కుపోయింది. కృష్ణ అంతర్జా

తీయరంగలో నిమగ్నమయ్యాడు. ఇందువల్లనేమో "నాట్యసంఘ్' పేరుతో కొంత కాలంగా ఏమీ ఉద్యమం జరగటంలేదు. ఎన్నికల నెపంతో — ఉద్యమానికి పునాదులు వేసి, చురుగ్గా పనిచేస్తున్న కార్యకర్తలను తొలగించడానికి వీలుకాని 'ట్రస్టు' గా ఒక వ్యవస్థను స్థాపించడం ఉత్తమమని గురువుగారు అభిప్రాయపడి "నాట్యగోష్ఠి" ని ఒక ట్రస్ట్‌గా ఏర్పాటుచేశారు. గురువుగారితో పాటు, మంత్రి, అందరికీ ఆప్తమిత్రుడు శ్రీ ఫ్రెడరిక్, శ్రీరాములు, నేనూ ఉన్నాం. 'నాట్యగోష్ఠి'లోని సభ్యులందరూ ఒకేచోట నివాసం ఏర్పరుచుకొంటే — ఎన్నో సౌలభ్యాలుంటాయని 1967 ప్రాంతంలోనే గురువుగారితో కలిసి మేమంతా వనస్థలిపురంలో నాటకకళాకారుల గృహసముదాయానికి స్థలాన్ని వెదకడం అరంభించాం కాని ముందుకు వెళ్ళలేకపోయాం. ఇతర భారతీయభాషల్లోని ఉత్తమ నాటకాలని ప్రదర్శింపచేయాలనేది ఒక కార్యక్రమం. ఇందులో శంభుమిత్ర బృందం ప్రథమంగా మూడు బెంగాలీ నాటకాలను ప్రదర్శించింది. రవీంద్రభారతి ప్రేక్షకులతో క్రిక్కిరిసింది ఆ మూడు రోజులు. మంత్రి ఆంధ్ర విశ్వవిద్యాలయానికివెళ్ళడం, అబ్బూరి గోపాలకృష్ణకూడా మంత్రిని అనుసరించడం, మిత్రులూ నేనూ ఉద్యోగ నిర్వహణలో పూర్తిగా నిమగ్నమవడంతో 'నాట్యగోష్ఠి' కార్యక్రమాలు కుంటుబడినాయి.

శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు 1957 — 67 మధ్యకాలంలో ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరంలో నిజమైన నాటకోద్యమానికి ప్రారంభకులైనారు. ఆ దశాబ్దంలో నాటక ఉద్యమానికి మంచి పునాదులు ఏర్పడినాయని నమ్మిన వాళ్ళలో నేనూ ఒకడిని. అయితే ఆయన అనంతరం అది అంతగా ముందుకుసాగలేదు; ప్రగతి సాధించలేదు.

దేవులపల్లి ప్రభాకరరావు

# చెప్పుకోదగ్గ మనిషి

అబ్బూరి రామకృష్ణారావు గారు మహాకవి ముద్రతో ప్రచారం పొందలేదు; అయినప్పటికి ఆయన మహాకవులకు మహాకవి. "నిజానికి నా జీవితంలో ఇద్దరే గురువులున్నారు. ఒకరు మానాన్నగారు; ఇంకొకరు అబ్బూరి రామకృష్ణరావుగారు ... నా కాలేజీ విద్య పూర్తయిన తరువాతనే అబ్బూరి కక్ష్యలో నేను ప్రవేశించాను ... ఆయన చదివించిన గ్రంథాలవల్లనేకాక వారిసాహచర్యంవల్ల కూడా నా క్షితిజరేఖలు విశాలంగా విస్తరించాయి .... నా సమస్త రచనను మెచ్చుకునే ఒక పురిపండా, ఒక జనార్దనరావు, ఒక అబ్బూరి రామకృష్ణరావు ... ఉండగా ఇక నేనెవరికైనా ఎందుకు భయపడాలి ...." అని మహాకవి శ్రీశ్రీ తమ 'అనంతం'లో వెల్లడించినారు. ఆధునిక ప్రచారప్రక్రియలను ప్రయోగించి ఆయన సన్మానాలను కూడా అందుకోలేదు — 'మానములేని వారికి సన్మానము....' అని ఆయన తన సహజ చమత్కార సంభాషణా చాతుర్యంతో, సునిశిత వ్యంగ్యోక్తి వైభవంతో వివరించినట్లు జ్ఞాపకం. అబ్బూరిరామకృష్ణరావు గారిది తెలుగు సాంస్కృతికరంగంలో అనితర సాధ్యమైన, అపూర్వమైన, విశిష్టస్థానం. మహాకవులకు మహాకవి అయినట్లే ఆయన మేధావులకు మేధావి. మనీషులలో సమున్నతస్థాయి మనీషి. స్వయంగా నటించి రామప్పంతులు పాత్రను రాణింపజేసిన మహానటుడేకాదు ఆయన; దాదాపు ఏబది సంవత్సరాల క్రిందటనే కన్యాశుల్కం వంటి నాటకాలను వినూత్నసరళిలో రంగస్థలం మీద రమణీయం కావించిన అత్యుత్తమశ్రేణి ప్రయోక్త అబ్బూరి. సాహిత్య రంగంలో కూడా శ్రీ అబ్బూరి అత్యంత ప్రతిభాసంపన్నుడైన ప్రయోక్త. ముత్యాలసరాల శైలిని ముగ్ధమనోహరం కావించడమే గాక నూతన ఛందోరీతుల నిర్మాణానికి కూడా ఆయన బాటలు వేసినారు.

## అఖిలభారత స్థాయిలో

గురజాడవలె బహుముఖ ప్రజ్ఞాపాటవంతో, శేముషీవిలసనంతో భావిస్తున్న మానవతావాది, అభ్యుదయశీలి, ఆధునికుడు శ్రీ అబ్బూరి. ఆయన కార్యరంగం కేవలం తెలుగుసీమ పొలిమేరలకే పరిమితం కాలేదు. 1896 వ సంవత్సరం మే నెల 20 వ తేదీన జన్మించిన రామకృష్ణరావుగారు బందరు నోబుల్ కళాశాలలో విద్యాభ్యాసం తరువాత (వారి జనకులు లక్ష్మీనృసింహశాస్త్రిగారు సంస్కృత పండితులు) 'కావేరీ నదీతీర కల్యాణ ధరిత్రిమీద పచ్చనిపచ్చిక పరుపుల......' పూజ్యులు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ సహాధ్యాయులై, విద్వన్మణి కట్టమంచి రామలింగారెడ్డి సాహచర్యంలో, ఒకవంక మైసూరు సంస్కృత కళాశాలలో సంస్కృత పాఠాలతోపాటు భారత పారాయణాన్ని, అధ్యయనాన్ని అవిశ్రాంతంగా కొనసాగించినారు. అప్పటికే 'మల్లి కాంబ' రచనతో భావకవితా మార్గానికి - శ్రీ రాయప్రోలుతో పాటు ఆద్యులైనారు; 1917 – 19 సంవత్సరాలలో, శాంతినికేతనంలో, రవీంద్ర కవీంద్రుల సాన్నిహిత్యంలో అంకితమైన కాలం అబ్బూరి జీవితంలో మరొక మహత్తర అధ్యాయం. ఆ అమలిన వాతావరణంలోనే అబ్బూరి లేఖినినుంచి ఇంకొక మహాకావ్యం 'ఊహాగానం' ఆవిర్భవించింది. అక్కడనే అఖిలభారతస్థాయి ప్రముఖు లనేకులతో శ్రీ అబ్బూరి స్నేహం చిగురించింది. 1919 లో ఆంధ్రదేశానికి తిరిగివచ్చిన తరువాత ఆంధ్రరత్న దుగ్గిరాల నాయకత్వంలో అబ్బూరివారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. 1923-24 ప్రాంతాలలోనే రసాత్మకమైన చిన్న కథలను రచించి ఆధునిక కథాసాహిత్యానికి స్పష్టమైన రూపురేఖలను, పరిపుష్టిని కలిగించినారు. కావేరీ తీరపు పచ్చిక బయళ్ళలో అంకురించిన అబ్బూరి 'నదీసుందరి' 1925 నాటికి సమగ్రసుందర కావ్య స్వరూపం ధరించింది. 1926లో ఆంధ్రవిశ్వ విద్యాలయం స్థాపితమయినప్పుడు అందులో ప్రప్రథమ ఆంధ్రాధ్యాపకులు శ్రీ అబ్బూరి వారే. అటు తరువాత అదే విశ్వవిద్యాలయంలో ప్రధాన గ్రంథాలయ నిర్వాహకులుగా శ్రీ అబ్బూరి ముప్పయి నాలుగు సంవత్సరాలు పనిచేసి, స్వయంగా సంచలనాత్మక విజ్ఞాన భాండాగారమై ఎందరో మేధావులకు, మహాకవులకు, మనీషులకు చైతన్యం పంచి ఇచ్చినారు. ప్రేమ్‌చంద్, సజ్జాద్ జహీర్, కె. ఎ. అబ్బాస్, హిరేన్ ముఖర్జీవంటి మహారథుల తోపాటు అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ స్థాపనలో అబ్బూరి అగ్రగామి పాత్ర నిర్వహించినారు. 'నాట్యగోష్ఠి', 'నటాలి' వంటి సంస్థలు అబ్బూరి

నాటకరంగసేవకు మేలి నిదర్శనాలు. 1939 వ సంవత్సరంలో, ఎం. ఎన్. రాయ్, తర్కతీర్థ లక్ష్మణశాస్త్రి జోషి, సచ్చిదానంద వాత్స్యాయన వంటి శేముషీ ధురంధరులతో కలిసి అబ్బూరి స్థాపించిన భారతీయ పునరుజ్జీవన సంఘం భారత సాహిత్యపునర్వికాసంలో ప్రముఖపాత్రవహించింది.

## నిరంతర వైతాళికుడు

సంకుచితమైన సరిహద్దుల చక్రబంధనంలో చిక్కని మానవతావాది శ్రీ అబ్బూరి. సకల మానవాళి సంక్షేమం ఆయన సందేశం — 'మనిషిమాట మరిచిపోయి, మరిచిపోయి మనిషి మాట ... విడివిడిగా, యెడ పెడగా, తడబడగా ముడిపడగా ఆవరించి తీవరించి అవరోధం కల్పించే ఈ చింతా దారిద్ర్యం ఎన్నడు మము వీడి పోవు ?... అని ఆవేదన ప్రకటిస్తూ '....తీరలేదు. అన్నార్తుల కన్నుల తడియార లేదు ...' అని ఆయన వైతాళికుడై నిరంతర జాగరూకతతో హెచ్చరిస్తున్నారు.

23—5—1976, ప్రజాతంత్ర

విద్వాన్ విశ్వం

# అబ్బూరి అస్తమయం

నలుగురు నడిచిన దారిలో నడవడం బహు సులభం.

కానీ, క్రొంగ్రొత్త దారిని వేసుకొని కొత్త గమ్యం వేపు నడవడం చాలా కష్టం.

ప్రబంధ పద్ధతులూ, తప్పితే యక్షగానాదుల మెట్టులూ రాజ్యం చేస్తున్న తరుణంలో, తెలుగు సాహిత్య వాహినిని మఱొక వైపు త్రిప్పడానికి ఓ గొప్ప ప్రయత్నం ఒకప్పుడు జరిగింది.

ఆ ప్రయత్నం చేసిన ఒక రిద్దఱు మేటికవులలో అబ్బూరి రామకృష్ణరావు గారొకరు.

ఒకానొక పాశ్చాత్య వాసనా విలసితమైన భావనా, ఒకానొక రసప్లావిత మైన వ్యక్తీకరణం కావలసివచ్చిన రోజులవి.

ఏదో కొత్త కోసం, ఏదో సహృదయ హృదయానందం కోసం తహ తహ పడుతున్న రోజులవి.

అవే వృత్తాలే, అవే మాత్రాచ్ఛందస్సులే అయినా వాటి పోకడలో ఒక స్వేచ్ఛ, ఒక జిగి బిగి కల రీతిలో వృత్తమూ, దాని ఆవిష్కృతీ భిన్నంగా వ్రాసుకొని వచ్చినవారిలో ఒకరు అబ్బూరి వారు.

ఆయన పద్యం కమ్మెచ్చున తీసిన బంగరుతీవెవలె సాఫీగా సాగిపో తుంది. అలాగే ఆయన భావఝరి ఒక అపూర్వ రాగాలావన చేస్తూ ప్రవహిస్తుంది.

అంతదాకా వస్తున్న అంగాంగ వర్ణనలూ అవీ పోయి స్త్రీ మూర్తి కాక విశిష్ఠ పీఠం వేసిన కాల మది.

కేవలం మోహం, మోజూ కాక ప్రేమా, అనురాగం, వాత్సల్యం వెల్లి విరిసిన కాలమది. ఆ కాలానికి, ఆరీతికి ప్రాణం పోసిన వారాయన.

నాటక రంగంలో ఒక వినూత్నరీతికి దోహదం చేసి, ఆచరణలో చూపించిన వారాయన.

ఛలోక్తులతో, చాటువులతో, ఆత్మీయతతో అనేకులను మిత్రులనుగా చేసుకొన్న వారాయన.

ఆంధ్రదేశంలోని అనేక అగ్రశ్రేణి కవులకు అనుంగు నెచ్చెలికా డాయన.

సహస్రమాసోపజీవియై చిరకాలం సాహిత్య సేవయే పరమావధిగా మనుగడ సాగించి తుదకు కలమాగి రాలిపోయిన రసాలఫల మాయన.

అబ్బూరివారి కిదే మా అశ్రుతర్పణం. వారికుటుంబాని కిదే మా సానుభూతి.

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక — సంపాదకీయం 16 – 5 – 1979)

# నిత్య విజ్ఞానాన్వేషి అబ్బూరి

వయసు పైనబడుతున్నకొద్దీ చాలామందిలో శరీరబలంతోపాటు ఉత్సాహం గూడా సన్నగిల్లుతూ ఉంటుంది. విజ్ఞానార్జనపై కూడ ఆపేక్ష తరుగుతుంది. కాని అబ్బూరి రామకృష్ణరావు విషయంలో ఈ సూత్రం తప్పని రుజువైంది. వార్ధక్యం వచ్చినా ఆయనలో బౌద్ధికంగా మార్పు కనిపించలేదు. చమత్కార సంభాషణలోను, జ్ఞాపకశక్తిలోను, విద్యావ్యసనంలోను ఆయనలో మార్పురాలేదు. ఎనిమిది పదులు పైబడ్డ తర్వాత గూడ వందల వేల పద్యాలు, శ్లోకాలు ఆయన ధారణలో ఉండేవి.

అన్య భాషా సాహితీ పరులతో ఆయనకు ఆత్మీయసంబంధాలుండేవి. బందరులో చదువుకునే రోజుల్లో భోగరాజు పట్టాభిసీతారామయ్య, చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి ప్రభావం ఆయనమీదుండేది. ఆ తరువాత మైసూరులో సంస్కృత కళాశాలలో చదివే రోజుల్లో కట్టమంచి రామలింగారెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మతో స్నేహం కుదిరింది. 1917–1919 మధ్య శాంతినికేతన్‌లో రవీంద్రనాథ ఠాగూర్, అరవింద ఘోష్‌ల ప్రభావం సోకింది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి శిష్యులుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు.

1936లో ప్రేమచంద్, సజ్జాద్ జహీర్, హిరేన్ ముఖర్జీలతోపాటు అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపించారు. ఆ సంఘం నడిపిన 'ఇండియన్ లిటరేచర్' పత్రిక సంపాదక వర్గంలో ఒకరుగా ఉండేవారు. 1939 ప్రాంతంలో ఎం. యన్. రాయ్, తర్క తీర్థ లక్ష్మణశాస్త్రి జోషి, సచ్చిదానంద వాత్స్యాయన్లతో కలిసి ఇండియన్ రినైసాన్స్ అసోసియేషన్ స్థాపించారు.

ఆంధ్రదేశంలోని తొలికమ్యూనిష్టులలో అబ్బూరి ఒకరు. విశాఖపట్టణం రేవు కార్మికులకోసం ఆయన రాత్రి పాఠశాల నిర్వహించేవారు.

అబ్బూరి కవితా రచన ఆయిదోఫారం చదువుతుండగానే మొదలైంది. 1903లో "జలాంజలి" రచించారు. అది 1914లో ప్రచురితం అయింది. అప్పటి నుంచి ఆయన అడపాదడపా రాస్తూనే ఉండేవారు. మల్లికాంబ, ఊహాగానం, నదీసుందరి మొదలైనవి పుస్తకరూపంలో విడిగాను, ఎర్రగన్నేరు, మందార శిశువు మొదలైనవి "వైతాళికులు, మహోదయం, వెన్నెలకుప్పలు" వంటి సంకలన గ్రంథాల్లోనూ ప్రచురితమైనాయి.

రాయప్రోలు, కట్టమంచి వంటి తొలితరం భావకవులతోబాటే అబ్బూరి కూడా ఆధునికకవితాధోరణులను ఆంధ్రదేశంలోవ్యాపింపజేశారు. అయితే తక్కిన వారి భాషాదృష్టి, భావదృష్టి పెద్దమార్పులు చెందలేదు. కాని అబ్బూరి రాజకీయ, సామాజిక సాహితీ భావనలు అనుక్షణం వినూతనత్వాన్ని అన్వేషిస్తూనే ఉన్నాయి.

1919లో రాసిన జలియన్ వాలాబాగ్ (బుర్రకథ)ను అప్పటి ప్రభుత్వం నిషేధించింది. ఈ రచన ఇప్పటికీ దొరకలేదు. 1923–24 మధ్యకాలంలో కృష్ణా పత్రికలో "రసమంజరి" ప్రారంభించి, "సూర్యరాజు కథలు" రాశారు. 1924లో 'మంగళ సూత్రం' అనే అపరాధ పరిశోధక నవలను గూడా రాశారు. అనేక చాటువులు రాశారు.

నాటక రంగంలో గూడ ఆయన విశేషంగా కృషిచేశారు. కన్యాశుల్కాన్ని ప్రదర్శనయోగ్యం చేశారు. ఆయన రామప్పంతులు వేషం వేసి రక్తికట్టించారు.

లోకవృత్తాన్ని ప్రతి ఫలించటమే ఉత్తమసాహితీలక్షణమని ఆయన నమ్మే వారు. లోకవృత్తాన్ని ప్రతి ఫలించటానికి విద్యలన్నీ చదవాలి. కేవలం ప్రతిభ మీద ఆధారపడి పనిచేయలేం అని ఆయన చెప్పేవారు.

అబ్బూరి రామకృష్ణరావు ఎంత ఎక్కువగా చదివారో అంత తక్కువగా రాశారు. ఆయన నిత్య ప్రయోగశీలి. కీర్తికండూతి అంటే ఆయనకు తెలీదు.

గతం మీద కన్న వర్తమానం మీద ఆయనకు శ్రద్ధ ఎక్కువ. భవిష్యత్తు మీద విపరీతమైన ఆశాభావం.

"పైరుపండి రాలినట్లు—
ముసలియై లయించు జీవి
రాలి మరల వచ్చుననుట

రమ్యమైన ఎండమావి
వచ్చేదొక కొత్తపంట
పండేదొక కొత్తపంట
దీనిపైని శ్రద్ధలేక
దానికేల కడుపుమంట ?
ఏమన్నా నేటికన్న
రేపటి విలువే తక్కువ
అందువల్ల కానోపును
అల్పసంఖ్యపై మక్కువ" అని ఖండితంగా చెప్పారాయన.

తన భౌతికకాయానికి మతసంబంధమైన కర్మకాండ చేయవద్దని కోరి ఆయన కన్నుమూశారు.

(అభ్యుదయ—జూన్ 1979)

నండూరి రామమోహనరావు

# అబ్బూరి

నవ్యాంధ్ర సాహిత్యానికి 1910–30 సంవత్సరాల మధ్యకాలం స్వర్ణ యుగం. ఆంగ్ల, వంగ కవిత్వ ప్రభావితులైన ఎందరో యువకవులు తెలుగు కవితను ప్రబంధ బంధాలనుంచి విడిపించి కొత్త గొంతులతో, కొత్త రీతులతో కొత్త పాటలు అలపించిన కాలం అది. ఆ యుగానికి చెందిన ఉత్తమ కవులలో ఒకరు శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు. ఆయన అస్తమయం సాహిత్యాభిమానులకు సంతాపకారణం.

శ్రీ రాయప్రోలుకు శ్రీ అబ్బూరి సమకాలికుడు. ఆయనవలె ఈయన సయితం తెలుగులో ఖండకావ్యప్రక్రియకు ఆద్యులలో ఒకరు. ఆనాడు నవ్య కవిత్వం పేరుతో, భావకవిత్వం పేరుతో వెల్లివిరిసిన తెలుగుకవిత ఇంకా సంప్రదాయ శృంఖలాలనుంచి విడవడనిదిగానే ఈనాటివారికి కనిపించినప్పటికి, చారిత్రక దృష్టితో చూస్తే అది ఆనాటికి విప్లవాత్మకమైన మార్గమే. భావాలలో, భావనలో, భాషలో, శైలిలో, ఛందస్సులో—అన్నిటిలోను ఆనాటి తెలుగు కవిత కొత్త పుంతలు తొక్కింది. దానికి దోహదం చేసిన కవులలో అబ్బూరి వారిది ప్రముఖపాత్ర.

ఆయన బహువ్యాపకుడు. వ్రాసినవి కొద్ది కావ్యాలే. రాజకీయాలలో తిరిగారు. స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. ఎం. ఎన్. రాయ్ సిద్ధాంతాల వ్యాప్తికి విశేషంగా పనిచేశారు. అభ్యుదయరచయితల సంఘస్థాపనకు తోడ్పడ్డారు. నాటకరంగానికి సేవచేశారు. ఈ బహువ్యాపృతులలో ఆయన కవితావ్యాసంగం సన్నగిలినా, ఆయన ప్రభావం ఆనాటి యువకవులపై ఎంతగానో వున్నది. ఆయన పోయినన్ని కొత్త పోకడలు మరెవ్వరు పోలేదు. ఆయన ఛందశ్శిల్పి. శబ్ద చిత్రకారుడు.

అబ్బూరి వివిధభాషా పరిజ్ఞానం, వివిధసాహిత్యాభినివేశం, విమర్శా పాటవం, కవితా వైభవం అటుంచి వ్యక్తిగా ఆయనను ఎరిగిన వారెవ్వరు ఆయన సహృదయతను, సంభాషణాచాతురిని, సరసవాగ్ధోరణిని, మరచిపోలేరు. వృద్ధాప్యం ఆయన మనస్సుకు అంటలేదు. సంప్రదాయం ఆయన మనస్సుకు సంకెళ్ళు వేయ లేదు. ఆయన మూడుతరాల క్రిందటి వారైనా యువకులలో యువకులుగా, నిత్యోత్సాహంతో మెలగేవారు. ఆధునాతన సాహిత్య, తాత్విక, రాజకీయ ధోరణు లను ఎప్పటికప్పుడు ఆకళించుకునేవారు. వాటిపై ఒక ద్రష్టవలె వ్యాఖ్యానించే వారు. కాలంతోపాటు ముందుకు నడిచిన మేధావి శ్రీ అబ్బూరి. నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలో ఆయన స్థానం కలకాలం పదిలంగా వుండిపోతుంది.

(ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకీయం 1979 మే 1 మంగళవారం)

సు మ న

# దాటుకొన్న మేటి రచయిత

అబ్బూరి రామకృష్ణరావు తెలుగు నవ్యకవితా ప్రస్థానంలో రాయప్రోలు గిరిసలు తొక్కుకుంటూ వచ్చిన కవి. "మల్లికాంబ", "ఊహాగానం" వంటి కవితా రచనలతో ఆయన తెలుగు కవిత్వానికి కొత్త పదబంధాలు నేర్పాడు. కొత్త రచనాశిల్ప ద్వారాలు తెరిచాడు. అయితే, యీ తొలి మెరుపులు ఎంతోకాలం నిలవలేదు. జాతీయోద్యమం నుంచి కమ్యూనిస్టు ఉద్యమానికి, మరి దానినుంచి యం. యస్. రాయి నవ్య మానవ వాదానికి— యిలా నిరంతర పథికుడుగానే వుండిన అబ్బూరి, అభ్యుదయ రచయితల సంఘం పుట్టుకలో ముఖ్యపాత్రనే వహించాడు. అయితే దానిలోనూ నిలవలేదు. "నటాలి" వంటి నాటక బృందాలను నిర్మించి కన్యాశుల్కం నాటకాన్ని దేశంలో విరివిగా ప్రయోగించాడు. చివరిదాకా అబ్బూరిలో కొత్తపట్ల సానుభూతి అంతరించలేదు. విప్లవ రచయితల సంఘం హైద్రాబాదు మహాసభ వేదికమీదనుంచి, రచయితలమీద ప్రభుత్వ దమనకాండను తీవ్రంగా ఖండించిన అబ్బూరి, చమత్కారానికి సహృదయానికి పెట్టింది పేరుగా నిలిచాడు. ఆయన అందించిన నికరమైన ఫలసాయం రాశిలో కొద్దిపాటిదే. సాహిత్యపరంగా ఆయన రొమాంటిక్.

(అరుణ తార, జూన్ 1979_ఆగస్టు)

కె. వి. రమణారెడ్డి

# "అబ్బూరి చలివేందిర"లో శ్రీ శ్రీ

జలియన్‌వాలాబాగ్ దురంతాల గురించి బుర్రకథగా అబ్బూరి రాస్తే బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించిందని వినటం తప్ప, ముఖమైనా చూసిందెవరు ఇప్పటిదాకా? అదైనా 1919 తర్వాతి విషయమే. అప్పటికే అబ్బూరి వారబ్బాయికి పాతికేళ్లవయస్సు (జననం 1896).

గుంటూరు జిల్లాలో పుట్టిపెరిగి బందరులోని నోబుల్ కాలేజీలో చదువుకుంటూ వచ్చిన ఈ అబ్బాయి పదనాలుగేళ్ల ప్రాయాన్నే — హైస్కూలు దశలో జలాంజలి రాశారట. కవి వున్నట్టుండి రాజకీయజీవి అయ్యారంటే, 'మట్టిలో నుంచి మాణిక్యాలు' తయారించే మహాశక్తి స్వాతంత్ర్యపోరాటరూపంలో గుండెల్ని తట్టి, ధీరులకే యోగ్యమయిన సహాయనిరాకరణోద్యమంగా సందర్శనం యిచ్చింది. ఒక సంవత్సర కాలం 1921 — 22 రాజకీయ ఆకాశం వురమని పిడుగుల పిండుతో మెరవని సత్యాగ్రహులదండుతో క్రిక్కిరిసిపోయింది. సంవత్సరాలలో స్వరాజ్యం తెచ్చి వొలిచి చేతబెడుతానన్నాడు కొత్తగా 'మహాత్మా' గిరీ పొందిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ.

మన బాలకవి మచిలీ బందరు సువాసనలు వదుల్చుకుని రెండేండ్లకాలం (1917 — 19) చేపలకూర లేందే ముద్దదిగని బెంగాలు రాష్ట్రంలో రవీంద్రుడి శాంతినికేతనంలో వున్నాడు. అలునా తెలుగుదనం విరగలేదు గనక అప్పటికే 'మల్లికాంబ' రాసి, యిప్పుడిక్కడ 'ఊహాగానం' చేశారు. తిరిగివచ్చాక దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను అనుసరించి నడుస్తూవుండగా రాసిందే మొట్టమొదట్లో చెప్పిన బుర్రకథ. ఆ తర్వాత వుద్యమ పరమైన కవితను జానపదభణితులలో మరెన్నడూ రాసినట్టు దాఖలాలులేవు. భావకవిత్వరశ్మి సోకి తళతళమనిపిస్తూ తెలుగు కవిత్వకళకు కొత్త వింత అందచందాలు తెచ్చిపెడుతుండే, రాజకీయ ఉద్యమ కవిత్వమా?

అటుపిమ్మట మైసూర్లో వుంటూన్నప్పుడు 'నదీసుందరి' రచన గాక మరెన్నో. సి. ఆర్. రెడ్డిసారథిగా ఆంధ్ర విశ్వకళాపరిషత్ స్థాపన జరిగాక, మొదట తెలుగు బోధిస్తూ, తర్వాత పుస్తకాల మరుగుకువెళ్లి, మూడు దశాబ్దాలు ఆ స్థానానికి తానూ తనకి ఆ స్థానం సృష్ట్యాదినుంచీ జగత్ప్రళయం దాకా కొన సాగేవే ననిపించారు. అయితే ఈలోపల ఎంత లోకకథ జరిగిపోయిందని!

జలియన్‌వాలాబాగునూ లక్నోకాంగ్రెసు సమావేశానికీ చుట్టు చుట్టరికం వుండేమోగాని జలియన్‌వాలాబాగ్ బుర్రకథకీ "అప్రాప్త మనోహరికీ" గల అను బంధాన్ని ఊహాగానం చేసినా వూహించుకోవడం కష్టమే. బందరులో "మౌనము ద్రాలంకార" ముట్నూరివారి సాంగత్యంలో ఆ పత్రిక అమృతాంజనం కోరకుండా "రసమంజరి" శీర్షికను చొప్పించి చవులూరింపజెయ్యడమేగాక, పేరు మార్చు కుని "సూర్యరాజు కథలు" కూర్చారు. అక్షరాల కూర్పుతాలూకు పనితనం నేర్పులో అబ్బూరికి ఎందరో దీటురారు. అందుకే "వైతాళికులు"లో ముద్దుకృష్ణ అబ్బూరికి కీట్సును పోలికకోసం తెచ్చాడు. సాంప్రదాయిక సాంస్కృతిక వాక్కు నోటికీ తలకూ పట్టికూడా "తిక్కన పలుకు తెలుగు పలుకులు" కలకండ పలు కు లన్నంతగా అబ్బూరి రాశారంటే, ఛందస్సులలో పోకిళ్లు పోయారంటే, అబ్బూరిది సంకీర్ణప్రకృతి అనుకోవాలి. కవిత్వం, కథలు మాత్రమేగాక, "కన్యా శుల్కం" నాటకాన్ని ఎడిట్ చెయ్యకముందే, "నటాలి" స్థాపించి, యాంటన్ చెహోవ్ "సంపెంగతోట" కూడా రంగానికెక్కేలా ప్రయోక్త అయ్యారు.

నేను రాయబూనిన దానికి పూర్వరంగమే ఇదంతా. చర్వితచర్వణం కూడానేమో! అయినా, కానిచ్చానుగా! విల్లువదలిన అంబుని వెనక్కి రప్పిం చడం ఏంపని? రామబాణం అది. ప్రస్తుత విషయానికి వస్తాను. అదీ గత విషయం కావడమే విశేషం.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నాకాయనతో తొలి పరిచయం. శ్రీశ్రీ గురువు గానే గౌరవం. ఒకటి రెండు దఫాలు లైబ్రరీలో ఒకే ఒక్కమారు ఇంటివద్దా కలిశాను. Auden and After పుస్తకం "బారో" చేసి చదివి వూళ్లోని మిత్రుల చేతికిస్తే అది రూపుచెడీ ఫొటోలు పోయీ తిరిగివచ్చాక, లైబ్రరీ వుద్యోగులు దాన్ని అవికృతరూపంలో 'రిసీవ్' చేసుకోక అబ్బూరి వారివద్దకి తీసుకెళ్లారు— మొదట నా మీద ఫిర్యాదునూ, తర్వాత సాక్షాత్ నన్నూ. ప్రసన్నమైన ముఖం

తెలిచిరునవ్వులు, కాసింతలోనే బొమమడితో నన్ను కొంచెం భయపెట్టాయి. ఆయన తరణోపాయం చెప్పారు: "ఇంగ్లాండుకి రాసి కొత్తకాపీ తెప్పిస్తాం ఆఖర్చు నువ్వు ఇచ్చుకోవాలి. ఈ కాపీ నువ్వుంచుకోవచ్చు". "ధన్యోహమ్" అనుకున్నాను. అంత యిష్టం ఆ పుస్తకం నాకు. ఎందుకంటే "హంగ్రీ థర్టీస్" కవులంతా యీ పుస్తకం అట్టల్లోపలేవున్నారాయె! ఆదినాళ్ళలోనే యం. యన్. రాయ్ తన భార్యతో వాల్తేరు వచ్చి యూనివర్సిటీలో సభపెట్టినప్పటిదాకా గూడా అబ్బూరి రాయిస్టు అని నాకు తెలీదు. అంతెత్తు మనిషి రాయ్. మేము వెంపలి చెట్లలా నేలకంటుకున్నట్లు కూర్చున్నాం. ఆకారపుష్టి "యింప్రెస్" చేసిందిగాని —చాలా Slow Speaker—thoughtfull కావచ్చు—దాన్ని చెరిపేసింది.

ఆ తర్వాత యింక కొంతకాలానికి గాని అబ్బూరి రాజకీయ అభినివేశమేవిటో నాకు తెలిసిరాలేదు. అప్పటికే నాది కమ్యూన్టు అభినివేశం. అయినా, యీ వ్యక్తి ఎంత సాధు సుందరమూర్తిగా కనిపించేవారంటే, నా ఆవేశం నాలోనే అణిగి, ఆయన ముందు నేనూ సాధుజీవినౌతున్నానా అని నాకే ఆశ్చర్యం వేసేది. హైదరాబాదు మలక్‌పేటలో ననుకుంటాను, చెరబండరాజుతో కలిసి ఆయన యింటికి వెళ్లాను. అప్పటికి విప్లవ రచయితల సంఘం ప్రారంభం కావడమేకాదు, మావాళ్లు కొందరు జైళ్లలో వున్నారు. రెండో మహాసభ "వీరశైవ" హాస్టలులో జరగాల్సివుంది. దాన్ని పౌరహక్కుల వేదికగా మార్చాలనుకుని, రివిజనిస్టుల మీద భ్రష్టయోగి (మా దృష్టిలో) అయిన యీ మాజీ కమ్యూనిస్టు మేధావిని కూడా మావత్తాసికి రమ్మన్నాం. మరుమాట లేకుండా వొప్పుకున్నారు. ఆ ప్రసంగం లఘుప్రసంగమేగాని, రికార్డు చేసివుంటే తెలిసేది అబ్బూరి గుండె బిగువూ, భావస్వాతంత్ర్య ప్రీతీ, డెబ్బైయెనిమిదోయేట (1972) కూడా ఆయన ఈ సాహసిక చిత్తవృత్తీ, ప్రభుత్వ పశుత్వంపట్ల నిర్భయమైన, నిజాయితీగల ధిక్కారధోరణీ. "చలివేందిర" నుంచి చిచ్చరపిడుగు; "ధిక్కార మహాశంఖం"— "నినదభీషణ శంఖము దేవదత్తమే" అనిపించింది. ఇది కనువిప్పూ, చెవితుప్పు వదలడమూ!

అప్పటికే అబ్బూరిపట్ల నేను అపచారం చేసివున్నానని ఆయనకు తెలీదు, నేటీదాకా నాకాగితం దాటి అచ్చుకి ఎక్కలేదూ. సందర్భం యేమిటంటే ——

అబ్బూరి ఛాయాదేవిగారి సంపాదకత్వాన వెలువడిన 'కవిత' (1)లో

ఆయన తనశిష్యుణ్ణి మాగురువునీ — శ్రీశ్రీ ని — మెత్తగా మందలించి 'భయద మహాప్రస్థానము" మాని, చరిత్ర రథాన్ని వెనక్కు మళ్ళించమనే ధోరణిలో —

పయనమైన పదినాళ్లకె
పదినాళ్ళకె దారితప్పి
పోయావా నానేస్తం
ఆ ! ఏదీ నీహస్తం ?
పొరపాటీ తిరుగుబాటు
తిరుగుబాట తిరిగి చాటు !

అని కోరడం మాకు — ముఖ్యంగా ఆవేశజీవినైన నాకేనేమో ? — కటువని పించింది. ఆయన అందమైన హేళన —

రష్యాగురుదూపంలో
రమణీయపు శివమెత్తిన
రణాచారి గణాచారి
రణగుణాల ధ్వనులు రేగ
రష్యా ఋష్యాశ్రమమున
రాగిల్లిన కావ్యధార
తెలుగుసీమ పొలిమేరల
సెలయేళ్ళయి నాళికలయి
చిరకాలం ప్రవహించే
జీవనదీ మహిమలేక
అంతో యింతో శైత్యం
అంతకు మించిన పైత్యం
అందించిన మాట నిజం
ఔను నిజం ! ఔను నిజం !

నాలోంచి గణాచారితత్వాన్నే రాబట్టింది. తానెలాగూ చెడ్డారు. శ్రీ శ్రీ నీ అతని ధ్వజచ్ఛాయల్లో కలాలుపట్టిన మాతరాన్నంతటినీ యిలా యెద్దేవా చేస్తున్నా

రేవిటనిపించింది. కోపం తెప్పించింది. 'క్రొత్త తిక్కన' శీర్షికతో అలాంటి నడక తోనే నేను జవాబుగా రాసింది నా వద్దే పడివుందని చెప్పాగా ముందే :

అసంబద్ధ రూపకల్ప
నాసక్తుడుగా, స్వాప్నిక
సౌందర్యోపాసి — పిపాసిగా
సరళ సుందరుండనగా —
గణన కెక్కినాడీతడు

అంటూ ఫిరాయింపుదారుగా చూపి,

రాయిని పూజించి, మణిని
ఆవల్రదోసిన నేర్పరి

అన్నాక —

నేడు అబ్బురంగా, తా
నతినవీన యువకుండుగ
భ్రమపడి దానినె సత్యం
బటంచు లోకం ముందర —
రాయిగారి కొంగ్రొత్తది
నవమానవ వాద బోధ
నంది, కావ్యరూపంలో
నిలిపినాడు యీ ఘటికుడు.

అని వైరభక్తి చూపాను. వర్గసంఘర్షణే అరిష్టదాయక మనడం, బకాన్నీ మత్స్యాన్నీ మిత్రు లనడమే, వృకాన్నీ గోవత్సాన్నీ సహజీవుల్ని చెయ్యడమే —

శాంతి, వర్గసామరస్య
స్వర్లోకం, సుశ్లోకం —

అని సిద్ధాంతపరం నేనీనాటికీ నిబద్ధుణ్ణిగావున్న మార్క్సిజం దృష్ట్యా, కల్పిత మానవ ఆదర్శవ్యక్తి భావంతోగూడిన నవ్యమానవతా వాదాన్ని విమర్శించ

బూనాను. కుర్రవాణ్ణి వుద్రేకినీ, కాస్తదురుసుగానే పోనిచ్చాను బండీ. అయితే అదిలోకం బండీ — నా ఒక్కడిదేం కాదు. చెప్పొచ్చిందేమిటంటే, సిద్ధాంతం భేదించినా, అబ్బూరిని అగౌరవించగల అయోగ్యత — అయోగ్యతే — గానీ, కోరికగానీ నాకులేదు గనకనే, మా 1972 నాటి మహాసభకు ఆయనను స్వయంగా పిలిచి మాట్లాడించి, ఎంతో గౌరవంతో తిప్పిపంపడం జరిగింది. జలగం హయాములో, నిజానికి 1946 _50 లలోనే ఆయన కవిత నాకు ఎంతో మెప్పు కలిగించింది — ముఖ్యంగా 'తిక్కన సోమయాజి'. 'కాపుపాట' 'అప్రాప్త మనోహరికి', యింకా హెచ్చుగా 'పృథివీప్రశంస', 'కృష్ణపక్షం' చదువుకుంటూ, నాగదిలో వెక్కి వెక్కి రోదించే నవయవ్వన మది నాకు. శ్రీశ్రీ నుంచి వుత్తేజ వుద్రేకాల జంటగుర్రాలు వస్తే వాటినెక్కి సవారీపోదా మనిపించేరోజులు — మరో ప్రపంచంవైపు

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య చాటువులు మళ్ళీ అబ్బూరిలో చోటుచేసుకుని నిలిచాయినీ, అయితే 'ఆంధ్రరత్న'లో కనిపించే ఖండనమండనాదులు అబ్బూరిలో లలితహాస్యస్పర్శతో కరకుమొరకుదనాన్నే కోల్పోయాయనీ, అటుపిమ్మట చాలా కాలం దాకా తెలీదు. ఆయన బిడ్డలూ అంతే. సౌజన్యమూర్తులు, సరసోక్తిప్రియులు, సు — సహృదయులు, చెరబండ రాజు పనిచేస్తూవచ్చిన హైస్కూలులో అబ్బూరి పుత్రిక హెడ్‌మిస్ట్రెస్ — నాకు పరిచయం లేదుగాని, వరదతో కాస్త, గోపాలకృష్ణతో యింకాస్త వుండేవి. ఈ భరోసాతోనే శ్రీశ్రీ గురించి అడిగి తెలుసుకుందామని ఆయన వద్దకువెళ్ళాను — 1965 లోనే. రిటైరైనా టైరైపోకుండా టైర్‌చెయ్యకుండా — బోర్‌కొట్టే సమస్యే లేదు — ఎంతో ఆప్యాయంగా ఆత్మీయతతో పిలిచి కూచోమని కాఫీపెట్టించి జోకులతో రంగరించి, శ్రీ శ్రీ కవిత్వం భావకవిత్వం తాలూకు కుబుసం పూడ్చుకున్న దశకు చెందిన అంశాలతోబాటు, మొత్తం దేశంలో అభ్యుదయ రచయితల వుద్యమ ప్రారంభ కాలాన్ని కళ్ళకుకట్టించారు, తననోటిమాటలతో, రికార్డుకైనా అవసరం గనక ఆ వివరాలిస్తానిదిగువ. అలాగే శ్రీశ్రీ నాతో తన 'విప్లవ' కవిత్వ ప్రారంభ కాలం గురించి చెప్పిన విషయాల్లో అబ్బూరికి సంబంధించినవీ కొన్ని వున్నాయిగనక వాటిని వీటితో జోడించాలి.

అయితే ఒక్క చిన్న విష్కంభం :

రైతురక్షణ సమితి, కూలి రక్షణ సమితి పేర్లతో తెలుగుదేశంలో గుంటూరు, తెనాలి, నెల్లూరు వగైరా స్థలాల్లో తొలి కమ్యూనిస్టులు అప్పటికే కదలబారారు. వీరికి పోటీగా నిడుబ్రోలులో "ఆచార్య" రంగా రైతాంగ విద్యాలయం నడిపి, "వాహిని" పత్రిక పెట్టి, రైతుకూలీల గురించి పద్యాలూ పాటలూ రాసేందుకు ప్రేరణ యిచ్చి "రైతు భజనావళి"ని 1934 నాటికే తెచ్చివున్నాడు. బందరు వద్ద గల ఎలమర్రునుంచి గద్దె లింగయ్య "ప్రభ" పేరిట "జాతీయ హాస్యరస పక్షపత్రిక పెట్టి, "ఆదర్శగ్రంథమండలి" పక్షాన పన్నెండు పుస్తకాలైనా తెచ్చివున్నాడు. ఇంకా లోగడ, మొదట నెల్లూరు కేంద్రంగా పుచ్చలపల్లి సుందరయ్య "కమ్యూనిస్టు కరపత్రం" పేరున కమ్యూనిస్టు మేనిఫెస్టో ప్రకటించడం జరిగింది. కూలి సంఘాలు, సమ్మెలు.... యివి తమ కవుల్ని— పెండ్యాల లోకనాథం, శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు, చదలవాడ పిచ్చయ్య, తుమ్మల వెంకటరామయ్య, చివరికి కంభంపాటి సీనియర్ యింకా పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి వగైరా— ముందుకు తెచ్చివున్నాయి. ఇదంతా మేధావుల వ్యవహారం కాదు. ఇది ఉద్యమ ఫలితం. శ్రీశ్రీది గ్రంథపఠన ఫలితం. దానికి ప్రేరణ అబ్బూరిది. మరి అబ్బూరికి ప్రేరణ ? శ్రీ శ్రీది గానీ అబ్బూరిది గానీ జీవితం నుంచీ పోరాటం నుంచీ వచ్చిన ప్రేరణకాదు గనక "సెకండరీ" : మీద పేర్కొన్న "అనామధేయ" కవులది "ప్రైమరీ"— నేరుగా జీవితంనుంచీ పోరాటంనుంచీ వచ్చింది. కాకుంటే ఇవి రెండూ ఒకానొక "పాయింటు" వద్ద తారసపడ్డాయి. "సృజన" (నెం 14, 1970 ఫిబ్రవరి) "శ్రీ శ్రీ సాహిత్య సమాలోచన సంచిక"లో, నవీన్, శ్రీపతి, వరవరరావుల ఇంటర్వ్యూ క్రమంలో శ్రీ శ్రీ ప్రకటించిన అభిప్రాయాలు చూద్దాం.

1. "మహాప్రస్థానం" గీతం రాసేనాటికి (12–4–1934)నాకు Marxism తెలియనే తెలియదు. నేను Marxism ను తెలుసుకున్నది సాహిత్యం ద్వారానే గాని రాజకీయాల ద్వారాకాదు (అయితే తన తొలి విప్లవకవిత "జయభేరి" అని శ్రీ శ్రీ అనివున్నాడు. అది 2-6-33న రాసినట్లుంది. అనుమానమేగనక గుర్తుంది.)

2. "మొదట్లో నన్ను ట్రాట్స్కీ బాగా ఇన్‌ఫ్లూయిన్స్ చేశాడు. తర్వాత అబ్బూరి రామకృష్ణా (*Sic*) రావు London Progressive Writers ప్రచురించిన వాళ్ల Manifestoని చదవమని యిచ్చాడు. ఈ Manifesto నన్ను Marxist line లో పడవేసింది".

"కవి వయస్సు ఎప్పుడూ ముప్పై ఏళ్ళే" అనే ఇంకా పెద్ద యింటర్వ్యూని బట్టి ''మరో ప్రపంచం'' రచన నాటికి తనకింకా ''రష్యా విప్లవం గురించి కూడ తెలీదు" ఫ్రెంచి సింబాలిస్టులు, సిసిల్ డెలిస్ (*Sic*)— (Cecil Day Lewis) కొంచం ముందుకి పోయి చూశానుగాని "కవిత్వం ద్వారా నేను మరో ప్రపంచం చూశాను. అదే సామ్యవాద ప్రపంచం అని అప్పటికి నాకు తెలియదు. ఒక విధ మైన సాంఘిక న్యాయం లభించాలని అన్యాయం, అధర్మం పోవాలని ఈనాడు మరికొంచెం ఎక్కువ రూపం తీసుకొని రష్యా, చైనా, క్యూబా దేశాల్లో కనిపి స్తున్నది, నేను భావించిన మరో ప్రపంచం". లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మేనిఫెస్టో— అప్పటి వర్ధమాన రచయితల సంఘం అబ్బూరి రామకృష్ణరావు గారు చూశారు. అది చూసిన తర్వాత "పొలాలనన్నీ హలాలదున్నీ" గేయం రాశాను. ఆ మేనిఫెస్టో అలా దించేశావే అని అబ్బూరి రామకృష్ణరావుగారన్నారు ....ప్రగతి శీల సాహిత్య సంఘం అన్న పేరుతో హిందీలో వస్తున్న ఉద్యమ ప్రభావంతో అభ్యుదయ రచయితలుగా మారారు".

శ్రీ శ్రీ జ్ఞాపకశక్తి యిప్పటికీ(1980) గట్టిదేగాని, అతనిదీ "సెకండ్ హేండ్ యిన్ఫర్మేషన్" గనక నేరుగా అబ్బూరి వద్దకే పోవాలి— తప్పదు. లేకుంటే, శ్రీ శ్రీ బెర్టోల్ఫ్ బ్రెఖ్టా పద్యాన్ని అనుకరించి ''మహాప్రస్థానం'' రాశాడనో మరొకటనో అనుకోవలసి వస్తుంది. అనేక తరుమూలాల నుంచి వచ్చే జీవధారను శ్రీ శ్రీ తన కవితల్లోకి మలిపాడనుకుంటే ఏ చిక్కూ వుండదు. అంతమాత్రాన ఎవ్వడూ ''కాపీయిస్టు" కాడు.

1965లో నేను అబ్బూరిని హైదరాబాదులో శ్రీ శ్రీ భోగట్టా విషయమై కలిసి మాట్లాడానన్నానుగదా ముందే, ఆయన చెప్పిన సంగతి సందర్భాల సార మేమంటే—

ఆంధ్రా యూనివర్సిటీలో హిస్టరీ శాఖలో పనిచేస్తూండిన హిరేన్ ముఖర్జీ (లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ బృందానికి చెందిన మనిషి)తో కలిసి అబ్బూరి లక్నో కాంగ్రెసుకు వెళ్లారు, 1936లో. తాను అప్పటికే కమ్యూనిస్టుగాని హిరేన్ పార్టీలో లేడింకా. లక్నోలో ఆర్. కె. కపూర్ వగైరా వామపక్షమేధావులు విడిగా కలిసి మాట్లాడుకున్నారు. అక్కడే తనకు సజ్జాద్ జహీర్ (లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ బృందం ముఖ్యుడు)తో తొలిపరిచయం ఏర్పడింది. విశాఖపట్నానికి

తిరిగివచ్చి "వర్ధమాన రచయితల సంఘం" స్థాపించేప్పుడు Manifesto తయారీలో శ్రీ శ్రీ హస్తం కూడా పడింది. మరో యింటర్వ్యూ సారాంశం—

ఫ్రెంచి కవుల కవితా గ్రంథాలు గురించి చదివి (వాత్తేరులో) చాలాకొద్ది కాలంలోనే తన ప్రజ్ఞ— వయస్సుకి మించిన ప్రజ్ఞ— ప్రదర్శించ గలిగాడు శ్రీ శ్రీ. సాహిత్యానికి తప్పనిసరిగా సామాజిక ప్రయోజనం వుండాలని గ్రహించాడు. (ఒక యింటర్వ్యూలో తాను దీన్ని అబ్బూరి నుంచి గ్రహించానని చెప్పాడు కూడా) స్వవిషయం చెప్పిందేమిటంటే—

బుఖారిన్ రచన "హిస్టారికల్ మెటీరియలిజం" చదివారు. లెనిన్ రచనల నుంచి కొన్ని భాగాలను (Passages) అనువదించసాగారు. ఒక పార్టీనే నెల కొల్పాలనుకొని బొంబాయిలో కోటంరాజు రామారావు (గొప్ప జర్నలిస్టు) ద్వారా డాంగేని, జోగ్లేకర్‌నీ కలిశారు. ఈ పాటికే ఆంధ్రప్రాంతంలో పార్టీవుందని, కొత్తది అనవసరమని, జోగ్లేకర్ చెప్పాక (తొలిరోజుల్లో పార్టీ రహస్యంగా వుండేది గదా!) సుందరయ్యను కలవడం జరిగింది. తద్వారా ఒక పార్టిసెల్‌లో సభ్యుడు కాగలిగారు. విశాఖపట్నంలో "డాక్‌వర్కర్స్ యూనియన్" కార్యకలాపాలలో తలదూర్చారు. కొన్ని కరపత్రాలూ రాశారు.

లక్నో కాంగ్రెసు (నెహ్రూ అధ్యక్షుడు. తన ప్రసంగంలో వాచ్యంగా సోషలిజం ప్రస్తావన గట్టిగా తెచ్చాడప్పుడు). సభాప్రాంగణంలోనే ప్రగతిశీల రచయితల సంఘస్థాపన మున్షీ ప్రేమ్‌చంద్ అధ్యక్షతన జరిగేముందు, వజీర్ హుసేన్ యింట్లో వామపక్ష రచయితలు విడిగా కలిశారు. రఘువంశ కిశోర్ కపూర్— ఆర్. కె. కపూర్ (అప్పట్లో ఆంధ్రా యూనివర్సిటీ ఇంగ్లీషు శాఖలో అసిస్టెంటు లెక్చరరు). హిరేన్ ముఖర్జీ, సోమంచి యజ్ఞన్నశాస్త్రి (S. M. Y. Sastry) అప్పుడు విద్యార్థి, తాను ఆ బృందంలో వున్నారు. ప్రేమ్‌చంద్ హిందీలో చేసిన అధ్యక్షోపన్యాసానికి భాషా విషయమైన అభ్యంతరం తెలిపారు.

జనాబ్ మొహమ్మద్ ఖాసిమ్ ఖాన్ (తర్వాతి రోజుల్లో శ్రీ శ్రీ నిరుద్యోగిగా బాధ పడుతున్నప్పుడు హైదరాబాదుకి పిలిపించి 'లా' డిపార్ట్‌మెంట్ "రిఫార్మ్స్" సెక్షన్‌లో నౌకరీ యిప్పించి తాత్కాలిక జీవనాధారం చూపాడు— కె. వి. ఆర్.) కృష్ణశాస్త్రికేమి, శ్రీ శ్రీ కేమి, ఆనాటి కవుల్లో అనేకులకేమి సంధానకర్తగా వుండిన ఉల్లి తిరుపతి (అరవిందుని శిష్యుడు)-వీళ్లతో శ్రీశ్రీ కి సాంగత్యం. "హల్లో తిరుపతీ

ఉల్లి తిరుపతీ'' అని గేయం కూడా రాశాడట, శ్రీ శ్రీ. అప్పటికే శ్రీ శ్రీ కి మద్య పానం అలవాటుండేది.

బెనారసులో మెడిసిన్ చదువుతూ చదువుతూ విశాఖపట్నానికి వచ్చేసిన చంద్ర రాజేశ్వరరావును దగ్గరకు తీసి కమ్యూనిస్టుగా తీర్చిదిద్దింది కొంతవరకైనా తానే. (బెనారసులోని ఆంధ్ర విద్యార్థులనేకుల మీద ఆర్. ఆర్. భరద్వాజ ప్రభావం వుండేది— కే. వి. ఆర్. 1937) దాకా కమ్యూనిస్టు వుద్యమ పరిధిలో వుండి పోయి, ఆ సంవత్సరం యం. యన్. రాయ్ ఆంధ్రప్రదేశ సంచార సందర్భంగా రాయిస్టు ప్రభావానికి లోనయ్యారు. (నెల్లూర్లో యువజనసంఘ కార్యకర్తలలో ముఖ్యులైన చుండి జగన్నాధం కూడా అలా రాయిస్టు అయిన వారే— కె. వి. ఆర్.) కాబట్టి కమ్యూనిస్టు వుద్యమంలోనూ, ముఖ్యంగా 1943లో తెనాలిలో జరిగిన అభ్యుదయ రచయితలసంఘ ప్రథమ సమావేశంలోనూ అబ్బూరి వారిపేరు "నస్మరంతి" కావడం ఆశ్చర్యకరమేమీ కాదు. రాయిస్టు లంటే కమ్యూనిస్టులు విరుచుకుపడేవారు. మీదను పేర్కొన్న "రష్యాగురు ధూపం,'' "రష్యా రుష్యాశ్రమం'' వంటి మాటలు సూచించే స్టాలిన్ వ్యతిరేకత, అప్పటి సి. పి. ఐ. కార్యదర్శి జోషీ విధానాల గురించి యీసడింపు, మార్క్సి జాన్ని మానవీయత విషయంలో తలదన్ని పోగలదని తామనుకోసాగిన నవ్య మానవతావాదం— యిలాంటివి శ్రీ శ్రీ కీ అబ్బూరికీ విరోధకారణాలు కాలేదు. ఎందుచేతనంటే, క్రోపాట్కిన్, బకూనిన్, ట్రాట్స్కీ, బుఖారిన్ వంటివాళ్ళనీ లెనిన్— స్టాలిన్‌లనీ ముడివెయ్య గలిగిన సిద్ధాంత అపరిపక్వత, లేదా భావాల అనిర్వ్యంద్వత, అస్పష్టత, శ్రీ శ్రీని 'కమిటెడ్' మార్క్సిస్టుగా మార్చలేదు. ఇంకా 'వామపక్షసమైక్యత' గురించి తనకు భ్రమలున్నాయంటేనే, శ్రీ శ్రీ కి స్పష్టమైన రాజకీయ అవగాహనలేదని తెలుసుకోవచ్చుగదా ! అందుకని అబ్బూరి శ్రీ శ్రీ ఛలోక్తులాడుకునేవారు. పైగా, అబ్బూరి వరద (రాజేశ్వరరావు) శ్రీ శ్రీ కంటే చిన్న వాడైనా చెలికాడే. 'అభ్యుదయ' కవుల్ని కూడా ఎద్దేవా చేస్తూ శ్రీ శ్రీ ఒక పద్యం చెప్పారు :

అభ్యుదయకవుల కొక్కఁడు
రభ్యాసము గలదటందు రది యెట్లన్నన్
సభ్యత చెడ స్టాలిన్ జో
షీభ్యామ్ నమో ! యటంద్రు సిరిసిరిమువ్వా !

ఈ పద్యం చదివితే 'అభ్యుదయ' కవులూ వారి రాజకీయ నేతలూ వూరు కుంటారా ? అందుచేత, ఒకవేపు హేళనచేస్తూనే వీర అభ్యుదయ కమ్యూనిస్టుల బెడద తప్పించుకునేందుకు వెనువెంటనే—

'అని కొందరు దుర్మార్గులు

..................................

**అంటూ** తెలివిగా (క్లెవర్‌గా) Mischievousగా తప్పించుకోవాలనుకున్నది శ్రీ శ్రీయా ? అతని 'సిరిసిరి మువ్వా' శతకంలో యీ పద్యాలు లేవు. చాటువు గానే చాటుగా వుండిపోయిందో ! సిరిసిరి మువ్వా పద్యాలకు అబ్బూరిని Intro రాయమని కోరితే,

అతివాస్తవికాగ్రేసరు
లతులిత శబ్ద ప్రయోజనాతీతులు పం
డితభీరులు అగు కొందరు
మతిచెడి విహరించుచుంద్రు మహిలో శ్రీ శ్రీ !

అని రాశానన్నారు నాతో. అచ్చులో వుందేమో, మొదటి ముద్రణ ప్రతిలో చూడాలి(ఇప్పుడది నా వద్దలేదు — కె. వి. ఆర్).

ఇంకోమాటకూడా చెప్పారు నాకు అబ్బూరి. శ్రీశ్రీ అభిమాని, వాణీ కుమార్ యం. యన్. రాయ్‌కి 'మరోప్రపంచం' గేయం చదివి వినిపించినప్పుడు, ఆయన 'మారో ప్రపంచం' అనేవారట. (సరిగ్గా, శిష్టా 'మారో' శబ్దమే శ్రీ శ్రీ శబ్ద యింద్రజాలంలో 'మరో' గా రూపొందింది — కె. వి. ఆర్.)

1943 — 44 లో అబ్బూరి 'నటాలీ' సంస్థ ప్రారంభించాక, శ్రీ శ్రీ శ్రీరంగం నారాయణబాబూ అందులో దూరారు. సొంతంగా చెరో నాటకం రాయాలని అబ్బూరి, శ్రీశ్రీ అనుకున్నారు. అలాగే Cherry Orchard (చెహోవ్ నాటకం) ను నారాయణబాబూ, Uncle Vanya (చెహోవ్‌దే) వరదా అనువదిం చాలనుకున్నారు కూడా. నారాయణబాబూ చేసిన అనువాదం అబ్బూరికి నచ్చలేదు. (అసలు నారాయణ బాబుకి యింగ్లీషు సరిగా రాదంటే విరుచుకుపడే మహాను భావులు వెనకా వున్నారు, వారితోకలు నేడూ వున్నారు — కె. వి. ఆర్.) గనక

శ్రీ శ్రీ, తానూ కలిసి పునరపి అనువదించాలని నిర్ణయం. అనువాదం కాదు — అనుసరణే. తనకు తీరుబాటులేక ఆ భారం శ్రీ శ్రీ మీద మోపారు. అయితే రెండం కాలు మాత్రమే పూర్తి అయ్యాక 'నటాలి' తో సంబంధం తెగి, శ్రీ శ్రీ మిలిట్రీకి వెళ్ళిపోయాడు. వరద పూర్తి చేసినా నారాయణబాబు పేరు జోడించాలనుకున్నారట గాని శ్రీ శ్రీ వరదలపేరుతో పుస్తకం అచ్చయ్యాక, నారాయణబాబు అనువాదం తెనాలి 'జ్యోతి' లో వచ్చింది.

నటాలి ప్రదర్శనలకు సంబంధించి అబ్బూరి ఒక ముచ్చట చెప్పారు. మద్రాసు క్వీన్ మేరీస్‌లో 'కన్యాశుల్కం' ప్రదర్శిస్తున్నారు. స్టేజి సామగ్రి బాధ్యత శ్రీ శ్రీది. నటులు వేషాలు వేసుకుంటున్నారు. ఇంతలో చేతులూపుకుంటూ 'గ్రీన్ రూము' లోకి శ్రీ శ్రీ ప్రవేశం. 'మాష్టారూ, చేతికర్రా కత్తిపీటా దొరికాయి కావండీ !' ఇదీ ఆయన నిర్వాకం. ఎలా ప్రదర్శించారో ఏమో చివరికి !

'సంపెంగతోట' వివాదం ముళ్ళపొదలా పత్రికల్లో అల్లుకుంది. నారాయణ బాబేమో 'తమ్ముడూ !' అని సంబోధిస్తూ, అబ్బూరివారికి తన అనువాద ఫక్కీ ఎందుకు సరిపడలేదో ఏ మార్పులు చేశారో 'నవోదయ' (1948 జనవరి) పత్రికలో రచ్చకెక్కారు. గ్రంథచౌర్యాన్నీ ఆపాదించారు. 1947 లోనే తెనాలి 'ప్రజా సాహిత్య పరిషత్తు' ప్రచురణగా శ్రీ శ్రీ అనుసరణ వెలువడింది. దరిమిలా శ్రీ శ్రీ 'నవోదయ'లో 'సంపెంగతోట' శీర్షికతో జాబూ, దానికి నారాయణబాబు జవాబూ, చివరికి 'అంపైర్'గా అబ్బూరివారి తుదితీర్పు (నవోదయ' 1948 ఫిబ్రవరి 8) వెలువడ్డాయి. సమదృష్టి చూపెడుతూనే, ఆయన శ్రీ శ్రీ రచనలను తాము 'సాహిత్యదృష్టిలో' ఎక్కువ అభిమానిస్తామన్నారు. తానూ శ్రీ శ్రీ కవితాభావ పరిణతికీ, ఉన్మీలనానికీ ఎలా కొంతైనా దోహదం చేసిందీ ప్రస్తావించారు. 'నేటి కాలపు వాఙ్మయంలో మీకృతులు ఉత్తమోత్తమశ్రేణికి చెందినవని నా అభిప్రాయం'. అయితే 'వారం వారం' శీర్షికలో శ్రీ శ్రీ రాసింది 'కొంత దూకుడుగా' వుండటం వల్ల నారాయణబాబుగారికి కోపం వచ్చిందనుకుంటున్నా నన్నారు. గ్రంథచౌర్యం మాట మాత్రం చాలా అసంబద్ధం అంటూ, రంగప్రయోగానికి తగిన పద్ధతిలో అనువదించాలని, 'నటాలి' వేసుకున్న పథకం నలుగురూ కలిసి పూర్తిచెయ్యదల చింది గనక, చౌర్యానికి వీలెలావుంటుందని ప్రశ్నించారు. తమలో తాము చర్చించుకున్నాకనే నారాయణబాబు అనువాదం ప్రారంభమయిందిగాని, అవి ఆయన స్వకపోల కల్పితాలేమీ కావన్నారు. పైగా ఆయన చాలావేగంగా రాయడం

వల్ల, సంభాషణలు బిగువుగా లేనందువల్ల, ఆయన అనువాదం తనకు నచ్చని మాట నిజమే అయినా, 'అంతమాత్రాన వారి గౌరవానికి గాని, వారి రచనా ప్రాశస్త్యానికిగాని యేమీ లోటు రాబోదు' అని తమ మంచితనం ప్రకటించు కున్నారు. రెండు మూడు రోజులు ప్రయత్నించీ నారాయణబాబు అనువాదాన్ని మార్చలేక శ్రీ శ్రీ ని స్వయంగా అనువదించమన్నానని గుర్తుచేశారు. 'మన మందరమూ తలపెట్టిన నాటకాలేవీ కొనసాగకపోగా తుద కీవీధినాటకంలోకి దిగ వలసి వచ్చింది కదా అని విచారిస్తున్నాను' అనడంలో హాస్యంతోకూడిన బాధను ఎంత లలితంగా ప్రకటించగలిగారో చూడవచ్చు. శ్రీ శ్రీ కి 'జెలసీ' అనీ, మరొక సాటి కవిని ఎక్కరానివ్వడనీ నారాయణబాబు అభిమానులు గుసగుసలనుంచి గలాభాదాకా అంటూనే వస్తున్నారు. అది పరీక్షలోగాని తేలదు. అబ్బూరి విషయం పానకం— యీ వివాదం పుడకే.

మొత్తానికి రాజకీయాలేమైనా, మరొకటేమైనా, శ్రీ శ్రీ కి అబ్బూరి 'చలి వేందిర' కావడం ఆశ్చర్యకరం కానేకాదు. ఇద్దరూ మధ్య తరగతి రేడికల్ బుద్ధి జీవులు. వారిదారులు చీలాయి. శ్రీ శ్రీ మాస్కోకి వెళ్ళముందే విస్కీ సేవిస్తూ 'శ్రీస్కీ' అనిపించుకోవాలని గుక్కిళ్లు మింగుతూనే, రెండో ప్రపంచ యుద్ధకాలంలో సోవియట్ వీరోచిత ప్రతిఘటకు అద్భుతమైన కవితాబింబం కల్పించాడు. అబ్బూరి నవ్యమానవతావాదం ఆకాశ పుద్యావనంగా మారి, తాను సరసుడు గనక రష్యా వ్యతిరేకతని సైతం గుడ్డిగా పెంచుకోకుండా, ఎక్కువగా మౌన ముద్రాలంకారుడు' అయ్యాడు. సాంప్రదాయికతను నవ్యతలో, నవ్యతను మహా చారిత్రకోద్యమాలతో అనుసంధానించడంలో కొంతమేరకు కొద్దికాలం ప్రయత్నించి తర్వాత కవితావైరాగ్యమే పొందారు. ముళ్ళపూడి వెంకటరమణగారిని సంబోధిస్తూ చెప్పసాగిన చాటువుల్ని తప్పిస్తే "వాణి" కోసం చరమ దశలోనూ ఆక్రోశించారు గాని, మళ్ళీ పూర్ణకవితా సాక్షాత్కారం పొందలేదు. ఒకరికి ఒకే ఒక యవ్వనం. అబ్బూరిది అలాంటిది. శ్రీ శ్రీ ది నిత్యయవ్వనం.

శ్రీ. న. చ. రామానుజాచార్యులు

# పరివస్య

ఆంధ్రా యూనివర్సిటీ రిజిష్ట్రారు ఆఫీసులో తాత్కాలికంగా పనిచేస్తు న్నప్పుడు, 1957 వేసవిలో, నేను పనిచేస్తున్న సెక్షనుకి వచ్చి డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి థీసిస్ కాపీ లైబ్రరికి పంపించమని ఆ సెక్షను సూపరిండెంటుని అడిగా రొకాయన. ఆయన్ని చూడగానే, ఆయన యెవరో ప్రముఖులని తోచి, ఆయన యెవరో తెలుసుకోవాలనిపించింది నాకు. పక్కనున్నాయన్ని అడిగాను ఆయన యెవరని. 'మీకుతెలీదా. అబ్బూరి రామకృష్ణారావు గారంటే ఆయనే. యూనివర్సిటీ లైబ్రేరియన్' అని చెప్పాడాయన. అది నేను మొట్టమొదటిసారి శ్రీ రామకృష్ణారావుగార్ని చూడటం. 'వైతాళికులు' సంకలనంలో ప్రచురించిన పద్యాలుతప్ప వారి యితరరచనలతో నాకు పరిచయం లేదు. వారి పేరు మాత్రం విన్నాను.

ఆతరవాత నేను యూనివర్సిటీ ఉద్యోగం మానేసి, వేరే ఫ్యాక్టరీలో పని చెయ్యటానికి చేరడంతో, వాల్తేరు మిట్టకి రావటం తగ్గిపోయింది. నా సహోద్యో గుల పరిచయంతో నేను విశాఖ రచయితల సంఘంలో చేరటం, మరొక నాటక సంఘంతో కాలక్షేపం చేస్తూండటం జరిగింది. రామకృష్ణరావుగారు విశాఖ రచయితల సంఘం సమావేశాలకి తరచుగా వచ్చేవారు. అల్లాగే నాటకాలు వేసే వాళ్ళని కూడా కలుసుకుంటూవుండేవారు. ఆ రెండు చోట్లా నన్ను రామకృష్ణా రావు గారికి పరిచయం చేశారు. నమస్కారాలతో సరిపోయింది. అంతకన్నా ఆయనతో నాకుగాని నాతో ఆయనకు గాని పనియేమీ లేకపోయింది.

ఆ రోజుల్లో శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు తెలుగు భాషా సమితిలో పనిచెయ్యటానికి మద్రాసునించి వాల్తేరు వచ్చారు. వారితో నాకు పరిచయం కలిగింది. వారింటికి వెళ్ళి అప్పుడప్పుడు కాలక్షేపం చేసేవాణ్ణి. నాకు తెలుగు పద్యాలపుస్తకాలతో పరిచయంవుందని శ్రీనివాసాచార్యులు గారికి తెలుసు.

మా కబుర్లలో శ్రీనివాసాచార్యులుగారు చెప్పేవారు "తెలుగులో కవిత్వం చెప్పగలిగిన బహుకొద్దిమందిలో రామకృష్ణారావుగా రొకరు" అని. 1958 చివర్లోనో, 1959 మొదట్లోనో ఒక సాయంకాలం శ్రీనివాసాచార్యులుగారు రీడింగు రూము ప్రాంతంలో యెదురు పడ్డారు. (ఆ రోజుల్లో విశాఖపట్టణంలో వున్నది ఒకటే రోడ్డు. ఆవూళ్ళో వున్నవాళ్ళు ఆ రోడ్డు మీద యెదురుపడి తీరవల్సిందే.) రామకృష్ణ రావుగారు 'నన్నయ పద ప్రయోగసూచి' పనిచెయ్యటానికి నన్ను వారి దగ్గరకి తీసుకు రమ్మన్నారని చెప్పారు. నన్ను రామకృష్ణరావుగారెందుకు పిలుస్తారన్నాను. ఆయనకి మిమ్మల్ని తెలియక పోవటం యేమిటి అన్నారాయన. 'నన్ను గురించి వారికెల్లా తెలుస్తుంది? మీరేమైనా చెప్పారేమీ' అన్నాను. 'సరే ఎప్పు డొస్తారు రామకృష్ణారావు గారింటికి' అని అడిగారు శ్రీనివాసాచార్యులుగారు. 'నేను రాను' అని సమాధానం చెప్పాను. 'అదేమిటి?' అన్నా రాయన నవ్వుతో. "రామకృష్ణా రావుగారు రోడ్డు మీద యెదురు పడితే 'విష్' చేస్తే బదులు చెప్పలేదు రెండు మూడు సార్లు. పెద్దవారితో పరిచయాలంటే నాకు సరదా లేదు' అనిచెప్పాను. శ్రీనివాసాచార్యులుగారు వదల్లేదు. 'మీరు రాకపోతే రామకృష్ణారావుగార్ని మీ రూముకి తీసుకు వస్తాను' అన్నారు. దానితో నేనుదిగివచ్చి 'రామకృష్ణారావుగార్ని నా రూముకి తీసుకు రావద్దు, నేనేవస్తాను' అని చెప్పి, ఆ వారంచివర శ్రీనివాసాచార్యులుగారితో రామకృష్ణారావుగారి దగ్గరకివెళ్ళి, నన్నయ భారతంలోంచి 16 పేజీల ఫారం ఒకటి తీసుకొని, వారు యేర్పరుచుకున్న సూత్రాలప్రకారం ఆ 16 పేజీలలో మాటలూ కార్డుల మీదరాసి, వారం రోజుల్లో తిరిగి యిచ్చేశాను. నన్నయ పదప్రయోగసూచిలో నావంతు పని అయిపోయిందనుకున్నాను.

అప్పట్లో భారతప్రభుత్వం దేశం అంతటా "విజ్ఞాన మందిరాలు" నెలకొల్పాలని సంకల్పించి, అందుకు విజ్ఞానమందిరాఫీసర్లూ, అసిస్టెంటు విజ్ఞాన మందిరాఫీసర్లూ కావాలని పత్రికలలో ప్రకటన ఇచ్చింది. ఆ వుద్యోగాలకి దరఖాస్తు పెట్టాలని నేనూ, మా నాటకమిత్రులూ అనుకున్నాం. నాకు నాటకాలతో, సాహిత్యంతో పరిచయం వున్నట్టు యేమీ సాక్ష్యాధారాలు లేవు. అందుకని రామకృష్ణరావుగారి దగ్గర ఒక సర్టిఫికెట్టు తీసుకొని, దానినకలు నా దరఖాస్తుతో జతపరిచి పంపాను. 1959 ఏప్రిల్ 28వ తేదీన యిచ్చిన సర్టిఫికెట్ యింకా భద్రంగావుంది. దాంట్లో "He has been recently assisting me in the compilation of a Concordance of the famous Telugu

Poet Nannaya of the 11th Century" అని రాసి యిచ్చారు రామ కృష్ణరావుగారు. 16 పేజీల నించి ఆరోపాలూ (entries), ప్రయోగాలూ, పర్వ ఆశ్వాసపద్య సంఖ్యాలూ రాసి పెట్టిన మాత్రానికి యింతటి సర్టిఫికెట్ యిచ్చి నందుకు నాకు యెంతో కృతజ్ఞత కలిగింది. అంతకుమునుపు నేను మద్రాసు రాష్ట్ర సర్వీసు కమీషను పరీక్షకి దరఖాస్తు పెట్టాలనుకున్నప్పుడు, నాకు తెలుగొచ్చునని సర్టిఫికెట్ తెచ్చుకోమని సర్వీసు కమీషను వారు నన్నాదేశించారు.

తరవాత యేదో సమావేశం తటస్థపడ్డప్పుడు, శని, ఆదివారాల్లో పదప్రయోగ సూచి పనిచెయ్యటానికి వారింటికి వస్తూండమని పిల్చారు రామకృష్ణారావుగారు. అప్పటినించీ నన్నయ పదప్రయోగసూచి వ్రాతప్రతి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారికి అచ్చుకి అప్పజెప్పే వరకూ ప్రతి శని, ఆదివారాలూ వారింటికి వెళ్ళి, ఆ పని చేస్తూవుండే వాణ్ణి, పనితొందరగా ముగించవలసి వచ్చినప్పుడు 45 సెలవులూ పెట్టి పనిచేశాను. వారితో మొదటే చెప్పాను "నేను తెలుగు వ్యాకరణం, భాషాశాస్త్రాలు చదువుకోలే" దని. "అదేమీ అక్కర్లేదు. తెలుగుమాట యేదో దానికి అర్థం యేమిటో తెలిస్తేచాలు. అర్థం తెలియకపోయినా మాట గుర్తు పట్టగలిగితే, అర్థం యేమిటో తరవాత చూడొచ్చును" అని నన్ను ప్రోత్స హించి నాచేత పనిచేయించారు. "పదప్రయోగ సూచి" పనికి తమకి వీలైనప్పుడు డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు, శ్రీ తూమాటి దొణప్పగారు, శ్రీ బూదరాజు రాధాకృష్ణగారు, శ్రీ మెట్టా వెంకటేశ్వరరావుగారు, శ్రీనివాసాచార్యులుగారు వస్తూ వుండేవారు. కొన్ని వారాలు గడిచిన తరవాత క్రమక్రమంగా అందరూ రావటం తగ్గించారు. చివరకి నేనొక్కణ్ణే మిగిలాను పనిచెయ్యటానికి. ఎవరి పనులు వారి కున్నాయి. అందువల్ల "నా పని" అంటూ యేమీ లేనివాణ్ణి నే నొక్కణ్ణే మిగి లాను. ఆ పని చేసే రోజుల్లో రామకృష్ణరావుగారికి నేను సన్నిహితుణ్ణయ్యాను. నాకు వారిమీద గౌరవం (గురుభావం) పెంపొందింది.

ఒకనాడు రామకృష్ణారావుగారితో యెవరో, యెక్కడో జరిగిన "భువన విజయం" కార్యక్రమాన్ని గురించి చెబుతున్నారు. ఇటువంటి కార్యక్రమాలు జరుగుతయ్యనేది నేను కొత్తగా వింటున్నానప్పుడు. వారు అక్కడున్న వారిలో చనువు తక్కువే అయినా చటుక్కున "ఈ Tomfoolery యెప్పుడు మొద లైంది మేష్టారు" అన్నాను. తొందరపడ్డానేమో అని జంకాను. రామకృష్ణారావు గారు నవ్వి, "నటులు కాని వాళ్ళు, పద్యాలు బాగా చదవటం రానివాళ్ళు, విచిత్ర

వేషాలు వేసుకొని స్టేజిమీద అస్తవ్యస్తంగా వ్యవహరిస్తూ వుంటే, అది యేమి వినోదమో జనానికి !" అన్నారు. ముప్ఫైయేళ్ళ పైనే గడిచిపోయినా ఆ వెర్రి యింకా వెర్రి తలలు వేస్తూనేవుంది.

"పదప్రయోగ సూచి" ని గురించి చాలా సంగతులు నాతో మాట్లాడుతూ వుండేవారు. డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారూ, రామకృష్ణరావుగారూ, మరి కొందరూ, 1935లో ఇంగ్లీషులో వున్న Concordance ల వంటివి తెలుగులో చేయించాలనీ, ముందుగా మొదటి తెలుగు గ్రంథానికి (భారతం రెండున్నర పర్వాలకీ) తయారు చేయించాలనీ అనుకున్నారట. పాతికేళ్ళ వారి సంకల్పం నెరవేరుతున్నందుకు యెంతగానో సంతోషపడేవారు. విశాఖ రచయితల సంఘంలో మొదలు పెట్టిన పదప్రయోగసూచి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ యేర్పాటైన తరవాత, అకాడమీ తరఫున ఈ పని చేయించటానికి ఒప్పించటానికి శ్రమపడవలసి వచ్చిందని చెప్పేవారు. ఆనాటి అకాడమీ సభ్యులలో శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు తప్ప తక్కిన వారెవరూ తమకి మద్దతు యివ్వలేదనే వారు. ఎల్లాగో తమ పలుకుబడివల్ల రూ. 3000/–లు మాత్రం మంజూరు చేయించుకోగలిగారు. యూనివర్సిటీ లైబ్రరీకి పుస్తకాల పార్సిళ్ళతో వచ్చిన అట్టలూ రేపర్లూ కత్తిరింపించి, ఆరోపాలు (entries) రాయటానికి కార్డులుగా వాడు కున్నారు. కార్డుల మీదరాసిన ఆరోపాలన్నీ సరిగా వున్నదీ లేనిదీ చూసి, లేని ఆరోపాలు రాసేపని అంతా నేనే చేశాను. తెలుగు సాహిత్యంతో పరిచయం వున్న నా సోదరుడు శ్రీనివాసాచార్యుల్ని విశాఖపట్నం పిలిపించి, కార్డులన్నీ కొంత కొంతగా నా రూముకి తీసుకువెళ్ళి అన్నీ చదివి దిద్దుబాట్లు చేశాను. సుమారు 70 వేల కార్డులు అకారాది అనుక్రమణికలోకి తీసుకరావలసినప్పుడు, లైబ్రరీలో పని చేస్తున్నవారు పది, పన్నెండుమంది వచ్చి సాయంచేశారు. వారిలో శ్రీ వాసుదేవ రావుగారూ, శ్రీ ప్రకాశరావుగారూ. శ్రీ జోగారావుగారూ నాకు జ్ఞాపకం వున్నారు. వాళ్ళు మొదటి రెండక్షరాల వరకూ విడదీసి యిచ్చారు. తక్కినక్రమం అంతా చాలావరకూ నేనూ, మేష్టారూ (నేను రామకృష్ణారావుగార్ని అల్లాగే పిలిచేవాణ్ణి) కూర్చాము. వ్రాత ప్రతిలో సుమారు 3, 300 పేజీలు వారూ నేనూ కలిసి తయారుచేశాం. అందులో సుమారు 2,500 పేజీలు నేను తయారుచేశాను. రాయ టానికి నా మిత్రులు ఒకరిద్దరు తోడ్పడ్డా, వారు రాసినది నేను మళ్ళీ చదివి తప్పులు దిద్దే బాధ్యత నామీద పెట్టుకొని, వారిచేత రాయించాను. మిగిలిన రెండు

వందల పేజీలు రాయవలసినవి అకాడమీ వారికి హైదరాబాదులో అప్పజెప్పి రామకృష్ణరావుగారు ఢిల్లీ వెళ్ళారు.

సుమారు రెండున్నర సంవత్సరాలకాలం విశాఖపట్టణంలో వారితో తరచుగా కలుసుకోనే రోజుల్లో యెన్నో సంగతులు దొర్లినయి. అవి యెక్కడా గుర్తు రాసిపెట్టుకోలేదు. ఒకనాడు మేష్టారితో తెలుగు లెక్చరరు యెవరో ఒకరు, మరొక తెలుగు లెక్చరరు ఊళ్ళో లేరనీ Extension Lectures యివ్వటానికి వెళ్ళి వున్నారనీ చెప్పారు. అది వినగానే నేను Extension Lecture ని "అధిక ప్రసంగం" అని తెలుగు చేశాను. అందరూ నవ్వారు. మేష్టారు మెచ్చుకొని, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు యిల్లాంటివి చెప్పేవారంటూ Municipality ని "పానాపాన పరిపాలన" అనేవారని ఉదాహరించారు.

ఏటవాలుగా వున్న కొండమీదికి వెళితే, యెంత యెత్తుకు వెళ్ళామో తెలియనట్టే, మేష్టారితో క్రమంగా యేర్పడ్డ సాన్నిహిత్యంవల్ల, వారి ఔన్నత్యం వారితో వున్నవాళ్ళకి స్పృహలో వుండదు. ఎంత యెత్తున వున్నా కళ్ళు తిరగవు. పక్కన వున్న కొండల్ని చూస్తే, తామువున్న కొండ యెంతయెత్తుగావుందో తెలుస్తుంది. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యతోనూ, డా॥ కట్టమంచి రామలింగారెడ్డితోనూ, యం. యన్. రాయ్‌తోనూ, మరెందరో జగత్ప్రసిద్ధులైన పండితులతో, కవులతో, నటులతో, గాయకులతో, రాజకీయ నాయకులతో, వ్యాపారస్థులతో, వారికున్న ప్రగాఢ పరిచయాన్ని చూస్తే, మేష్టారి ఔన్నత్యం గుర్తుకువస్తుంది.

భారతం స్వర్గారోహణ పర్వం చివరి పద్యం

"పరమపదాప్తిహేతువగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరగు చొప్పునఁ జెప్పిన వారు మోదసం
భరితతఁ బొంది యక్కథకుఁ బ్రాతిగ నర్చితుఁజేసి రర్మిలిన్"

అని భారతకథ చెప్పటం అయిపోయిందనిచెప్పి, విన్న వాళ్ళు మెచ్చుకున్నారన్న తరవాత,

"హరిహరనాథ సర్వభువనార్చితనన్ గృపఁజూడు మెప్పుడున్" అని తిక్కన సోమయాజి పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి, సంవత్సరాల తరబడి విడవ

కుండా చేసినపని ముగిసినందుకు యెంతవిశ్రాంతి ననుభవించాడో అని రామ లింగారెడ్డిగారు అంటూండేవారు అనేవారు మేష్టారు. నన్నయ పదప్రయోగసూచి పని ముగించేటప్పుడు పదేపదే యిదే అనేవారు.

ఎం. ఎన్. రాయ్ విశాఖపట్టణంలో వున్నరోజుల్లో, ఆయనతో మేష్టారెకి సన్నిహిత సంబంధం యేర్పడ్డది. రాయ్‌తో సంభాషణల్లో యెప్పుడో హరీంద్ర నాథ చట్టోపాధ్యాయ ప్రస్తావనవస్తే, మేష్టారు హరీన్ ఛటర్జీనిగురించి 'he made a mess of his life' అని వ్యాఖ్యానించారట. వెంటనే రాయ్ ప్రశ్నిం చాడట : 'What welse do you want him to make his life'. అని ప్రశ్నించి, నువ్వింత వివేచనతో, శ్రద్ధతో, జాగ్రత్తగా జీవితం నిర్వహించి యేమి సాధించావు. నేనేమి సాధించాను. మానవ జీవితాన్ని మన యిష్టం వచ్చినట్టు నడపటానికి వీలుపడదు. అదిఅంతే" అన్నాడని చెప్పేవారు.

'నన్నయ పదప్రయోగసూచి' పనిచేసే రోజుల్లోనే ఒకరోజు మేష్టారు వివిధ భాషల రచయితల్నిగురించి మాట్లాడుతోంటే, నేను "మేష్టారూ ! మీరు యూని వర్సిటీ లైబ్రేరియన్ అయిన తరువాత చాలాపుస్తకాలు చదివా రనుకుంటాను" అన్నాను. వెంటనే ఆయన నవ్వి "మిఠాయి కొట్టువాడు కారాకిళ్ళీలేసుకు కూచుం టాడు. లైబ్రరీకి రాకముందే చదివాను, నేను చదివిన దంతా" అన్నారు.

"నన్నయ పదప్రయోగ సూచి" వ్రాతప్రతి తయారుచెయ్యటానికి అకాడమీ డబ్బు మంజూరు చేసింది కాని, అచ్చువెయ్యటానికి మొదట్లో మంజూరు చెయ్య లేదు. వ్రాతప్రతి తయారు అవుతూవుండగా, ఒకసారి అకాడమీ మీటింగుకి హైదరాబాదు వెళ్ళివచ్చి, అకాడమీ వారు అచ్చువేయించటానికి కూడా నిర్ణయించా రని చెప్పారు. ఆ మాట చెబుతూ "రామాంచార్లూ, మొన్న మీటింగు అయిన తరువాత గోపాలరెడ్డిగారు, "నన్నయ పదప్రయోగసూచి" పుస్తకంమీద మీ పేరుతోబాటు దివాకర్ల వేంకటావధానిగారి పేరు కూడా వేయిద్దాం. అవధానిగారు తయారు చేయిస్తున్న నన్నెచోడ పదప్రయోగకోశంమీద మీ పేరు కూడా వుంటుంది. ఏమంటారు ? 'అని అడిగారు. 'సరే, పెద్దవాడు గోపాలరెడ్డిగారు చెబుతున్నారు కదా అని, వారి మాట తీసెయ్యలేక, నేను ఒప్పుకున్నాను' అని చెప్పారు. నాకు గతుక్కుమన్నది. 'మేష్టారూ, మీ పేరుతోబాటు నా పేరు పుస్తకం మీద వేయించమని నేను అడగటం లేదు. కాని, యింతపని నేను చేసింతరవాత,

యేమీ చెయ్యని దివాకర్ల వేంకటావధానిగారి పేరు నన్నయ పదప్రయోగ సూచి మీద వెయ్యటం నాకు అంగీకారం కాదు' అని చెప్పాను. నేను యెంతనొచ్చుకున్నానో, నొచ్చుకోటానికి నాకు యెంత హక్కు వుందో తెలిసిన మేష్టారు ఆరోజు నన్ను చాలసేపు ఊరడించారు. ఇంత అయిన తరవాతకూడా నేను పని మానెయ్యలేదు. శ్రద్ధ సడలించలేదు.

'నన్నయ పదప్రయోగకోశం' అనే పేరు మేష్టారికి సమ్మతంకాదు. అచ్చుపని వారు పర్యవేక్షించలేదు గనుక, అకాడమీని ఆశ్రయించుకున్న మూడు లెవరో అటువంటి పేరు పెట్టి అచ్చువేయించారు. ఆ పుస్తకం వెలువడి ఇరవయ్యేదు సంవత్సరాలపైనే అయినా, నన్నయ భాషమీద కూలంకషమైన పరిశోధన యేమీ జరిగినట్టు లేదు, ఉత్తనొల్లు వ్యాసాలు రాయటం తప్ప, ఆంధ్రదేశంలో నన్నయ భారతభాగం ప్రతిమాట పట్టి పట్టి చూసినవాళ్ళం, మేష్టారూ, నేనూ. ఇప్పుడు మేష్టారు లేరు. ఈనాడు ఆంధ్రదేశంలో నన్నయని గురించి చెప్పటానికి యెక్కువ అధికారం వున్నవాణ్ణి నేనే.

నన్నయ పదప్రయోగకోశం తయారుచేసే రోజుల్లోనే, దాని తరవాత తిక్కన పదప్రయోగకోశం, ఎర్రన పదప్రయోగకోశం చేయించాలనీ, అన్నమాచార్య పదప్రయోగకోశం తయారయితే పద్యకావ్యాలలో దొరకని యెన్నో మాటలకి అర్థం నిర్ణయం చెయ్యటానికి పీలుపడుతుందనీ అనేవారు. నన్నెచోడ పదప్రయోగకోశం తయారు చెయ్యాలనే సంకల్పం మేష్టారికి యెప్పుడూ లేదు. దానిమీద వారి పేరు వున్నందుకు చింతించేవారు. కుమారసంభవ కర్తృత్వాన్ని గురించి వారికి యెప్పుడూ సందేహం వుండేది. ఇటీవల నన్నెచోడుడు— కుమారసంభవం అంతా కూటసృష్టి అని ప్రొ॥ కొర్లపాటి శ్రీ రామమూర్తిగారు నిర్ధారణ చేశారు.

అల్లాగే, ఆ రోజుల్లో నా పెళ్ళినిగురించి, వారితో నేను చెప్పేవాణ్ణి. నా పెళ్ళినిగురించి యితరులు వారితో చెప్పినవని నాకు చెప్పేవారు. అప్పుడే, నేను వారి దగ్గరకి రాను అన్నమాట శ్రీనివాసాచార్యులుగారు చెప్పారని చెబుతూ 'నువ్వు రోడ్డుమీద యెదురుపడి నమస్కారం అంటే నేను బదులుచెప్పలే దనుకున్నావట. సాయంకాలం పూట చూపు ఆనక, బదులు చెప్పలేదు గాని, నాకు అతిశయమూ లేదు. యెవరి మీదా తిరస్కారం అంతకన్నా లేదు' అన్నారు.

నాకు చిన్నతనం నించీ శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి శాలివాహన గాథా సప్తశతీసారం అంటే చాలామక్కువ. మేష్టారికి శర్మగారితో మైసూరులో చదువుకొనే రోజుల్లో స్నేహం అని తెలిసిన తరవాత, శర్మగారిని గురించి నాకున్న గౌరవం వెలిబుచ్చాను. మైసూరులో శర్మగారు వుండగా, రామలింగారెడ్డిగారు తాము రాసిన వ్యాసాలు శర్మగారికి యిచ్చి, అరసున్నాలూ, పరుషసరళాలూ దిద్దిపెట్టమనేవారు. అల్లాగ రెడ్డిగారి వ్యాసాలు సవరిస్తూ శర్మగారు రెడ్డిగారి చమత్కృతిని, శైలినీ అలవరుచుకున్నారనీ చెప్పారు. శర్మగారికన్నా కూడా, వారి అన్నగారు శ్రీమాన్ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులుగారు, సరస సంభాషణాచతురులనీ, వారితో యెంతసేపు ముచ్చట్లు చెప్పుకుంటూ కూచున్నా, యిట్టే పొద్దు పోతుందనీ చెప్పేవారు.

పదప్రయోగ సూచికల పనికి డబ్బు యివ్వటంలేదు. గనక యెవ్వరూ రారనీ, జీతాలు యేర్పాటుచేసి పనికి పిలిస్తే, యింతమంది వస్తారని, వారి బట్టతల మీద చెయ్యిపెట్టి చూపుతూ అన్నారు మేష్టారు. నేను నవ్వు ఆపుకోలేక పోయాను. 'చాలామంది' అని చెప్పటానికి, నెత్తిమీద జుట్టువున్న రోజుల్లో చేసే అభినయం, బట్టతల అయిన తరవాత కూడా చేశారని నవ్వాను నేను. వెంటనే మేష్టారూ నవ్వి' "నవ్వకు, 'ఇంతమంది' అంటే, నెత్తిమీద జుట్టువుంటే యెన్ని వెంట్రుకలుంటయ్యో, అంతమంది అని అర్థం" అన్నారు.

'ముందు — వెనక' అనేమాటల్ని గురించి మేష్టారికీ నాకూ అభిప్రాయభేదం వస్తూవుండేది. నన్నయ భారతంలో ప్రయోగం వెదుకుతూవుంటే, ముందు వుంటుంది చూడమనేవారు. అంటే నేను వెదుకుతున్న భాగానికి తరవాత భాగం చూడటంమొదలు పెట్టేవాణ్ణి. ఆయన వుద్దేశం నేను చూస్తున్న భాగానికి పూర్వమే అని చెప్పేవారు. అల్లాగే 'వెనక' అన్నాకూడా. ఇంకా వెనక చూడు అన్నాకూడా నేను తరవాత భాగం వెదుకుతుంటే, మళ్ళీ వేరేమాటల్లో వారు యెక్కడ వెదకమనేదీ చెప్పేవారు. ఈ చిన్నమాటల్లో వారొకటి చెబితే, నాకు యింకొకటి అర్థం అవటం గమనించి నవ్వుకుంటూ వుండేవాళ్ళం. శబ్దానికీ అర్థానికీ మధ్యవున్న సంబంధాన్ని గురించి నాకున్న శంకలు, నిశ్శంకగా వారితో చెప్పేవాణ్ణి.

తెలుగు నాటకాన్ని గురించి మేష్టారితో ప్రస్తావిస్తే, తెలుగువాళ్ళకి నాటకం అంటే యేమిటో తెలియదని నిర్ద్వంద్వంగా చెప్పేవారు. తెలుగువాళ్ళకి నాటకం

అంటే తెలీదు గాబట్టే, కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం లాంటి ఉత్తమ నాటకాన్ని, పిల్లలమర్రి పినవీరభద్రుడు ప్రబంధంగా తెలుగు చేశాడు అనిచెప్పేవారు. ఈ మాట చెబితే తెలుగువాళ్ళంతా మండి పడతారు అనికూడా అనేవారు. అల్లాగే నన్నయ రచన అంత ఉత్కృష్టమైనది కాదు. మన కర్మకాలి నన్నయ తెలుగులో మొదటి కావ్యం రాశాడు గనక, ఈ పదప్రయోగసూచి మనంచెయ్యాల్సి వచ్చింది. ఆమాట మనం అంటే మన మీద విరుచుకుపడతారు అనేవారు. మంచి తెలుగు నాటకం రాయటానికి పెద్దమొత్తం బహుమతి ప్రకటిస్తే, యెవరైనా రాస్తారని శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు అనేవారట. లక్షరూపాయల బహుమానం ప్రకటించినా, యెవడూ రాయలేడన్నది ఆయనకి అర్థం అయ్యేట్టు చెప్పలేకపోయాను అనేవారు మేష్టారు. తెలుగులో నాటకం రాయాలంటే, నాటక ప్రదర్శనచూసి ఆనందించగల సామాజికులు వుండాలి. నాటకప్రదర్శన అంటే యేమిటో తెలియనివాళ్ళకి యేం చూపించినా, చూసేసివెళతారు. పద్యాలో, పాటలో పాడితే విని సంతోషించి వెళ్ళిపోతారు. మనదేశంలో ఒకనాడు సలక్షణమైన సంస్కృతనాటకాలు ప్రదర్శిస్తే చూసి ఆనందించేవారు. దేశభాషల్లోకి ఆనాటక కళరాలేదు. ఐరోపాదేశాల్లో, నాటక కళ గ్రీకునాటకకళనించి నేర్చుకొని వృద్ధిపొందింది. నాటకం అంటే కొన్ని పాత్రలు కొంచెంసేపు, రంగస్థలంమీద మాట్లాడుకొని వెళ్ళిపోవటం కాదుగదా. పాత్రల ప్రవేశ నిష్క్రమణాలూ, రంగస్థలంమీద వాటిప్రవర్తన, సంభాషణలకీ సంచరణానికీ సమన్వయం, ఇదంతా అయింతరవాత, చూసినవాడిక అందించ దలచుకొన్న అనుభూతి అందించా లేదా అన్నది ముఖ్యం. సామాజికులు లేనిది నాటకంరాయటం జరగదు. మంచినాటకాలు ప్రదర్శిస్తేగాని సామాజికులు తయారు కారు. ప్రదర్శించటానికి మంచినాటకాలు యేవీలేవు. పెళ్ళికుదిరితేగాని పిచ్చి కుదరదు. పిచ్చికుదిరితేగాని పెళ్ళికుదరదు. మరి పరిష్కారం యేమిటని అడిగాను. మేష్టారు సూచించిన పరిష్కారం యేమిటంటే —రంగస్థలంమీదికెక్కి సామాజికుల్ని రంజింపజేసిన సంస్కృతనాటకాలూ, గ్రీకునాటకాలూ, తక్కిన పాశ్చాత్య నాటకాలూ, వాటిపథకం చెక్కుచెదరనివ్వకుండా, తెలుగు నుడికారంతోవున్న సంభాషణలతో ప్రదర్శించి, సామాజికులకి నాటకాభిరుచి కలిగేటట్లు చెయ్యాలి. సామాజికులు తయారయితే నాటకాలు వాటంతట అవే ఉద్భవిస్తాయి అని చెప్పేవారు మేష్టారు. నాటకాన్నిగురించి వారిఅభిప్రాయాలు ఒకనాడు చెప్పినవికావు. కొన్నిసంవత్సరాలలో అప్పుడప్పుడు చెప్పినవి ఒకచోట చేర్చాను.

నాటకాన్ని గురించి మేష్టారి అభిప్రాయాలు ఆకళించుకున్న తరవాత నాకు An Enemy of the People తెలుగు చేద్దామనే ఆలోచన వచ్చింది. ఆ మాట మేష్టారితో చెబితే, వారెప్పుడో "ప్రజావిరోధి" అనే పేరుతో తెలుగు చేశామని చెప్పి వ్రాతప్రతి నాకు యిచ్చారు. ఆ నాటంలో అన్నదమ్ములు చైర్మనుకీ డాక్టరుకీ రామవర్మ లక్ష్మణవర్మ అనే పేరుతో, అక్కడక్కడో చాలాకొద్ది మార్పులతో తెలుగుచేశారు. నా చిరకాలమిత్రులు శ్రీ భానుప్రకాశ్‌గారు ప్రదర్శిస్తారనే ఉద్దేశంతో ఆ పుస్తకం తీసుకున్నాను. కారణాంతరాలవల్ల ప్రదర్శించే ప్రయత్నం జరగలేదు. పుస్తకం తిరిగి మేష్టారికి యిచ్చేశాను. తరవాత కొంతకాలానికి యెవరో తీసుకువెళ్ళి మరి తిరిగి యివ్వలేదు. ఆ విధంగా, ఉన్న ఒక్క ప్రతీపోయింది. అది మరొక రూపంలో మరొకరి పేరుతో వెలువడుతుందేమో. లేక అప్పుడే వెలువడ్డదో.

1961 మే నెలలో తిరుపతిలో సభలు జరిపి, నన్నయ పదప్రయోగ కోశం విడుదల చేశారు. ఆ సభలకి నాకూ ఆహ్వానం వచ్చింది. శ్వశురగృహం నించి తిరుపతి వెళదామనుకున్నవాణ్ణి, నూతన దారసంగ్రహం కావటంవల్ల, వెళ్ళలేకపోయాను. మేష్టారు తిరిగి వచ్చిన తరవాత నేను కలుసుకున్నప్పుడు 'నువ్వు సభలకి రాలేదు. నిన్ను అక్కడ అందరికీ పరిచయం చేద్దామనుకున్నాను'' అన్నారు.

1962 చివర్లో యెప్పుడో, తిక్కన పదప్రయోగకోశం (సూచి అనే మాట విడిచిపెట్టేశారు) పని మొదలు పెట్టారు. అప్పటికి మేష్టారు ఒక్కరూ మకాం హైదరాబాదుకి మార్చారు. వారి కుమారుడు శ్రీ గోపాలకృష్ణగారితో చిక్కడపల్లిలో వుంటూ వుండేవారు. తిక్కన పదప్రయోగకోశం పని చెయ్యటానికి నన్ను హైదరాబాదు రమ్మన్నారు మేష్టారు 1963. మార్చిలో నేను సికింద్రాబాదులో దిగి, చిక్కడపల్లి వెళ్ళాను. రోడ్డుమీద అన్ని షాపులు చూసి, అది చిక్కడపల్లి అంటే నమ్మలేక పోయాను. 1952, 53లో నారాయణగూడా వంతెనకీ, ముషీరాబాదు పోస్టాఫీసుకి మధ్య రోడ్డుమీద అన్న షాపులుగాని, యిళ్ళుగాని లేవు. మేష్టారున్న యిల్లు కనుక్కొని వెళ్ళాను. గోపాలకృష్ణగార్ని కలుసుకోవటం అప్పుడే. ఆ రోజు సాయంకాలం, ఆంధ్రసారస్వత పరిషత్తు భవనాల్లోవున్న అకాడమీకి మేష్టారూ నేనూ వెళ్ళాం. అప్పటికి డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్ర విభాగానికి అధిపతిగా వున్నారు.

తిక్కన పదప్రయోగకోశ సంపాదకవర్గం— రామకృష్ణారావుగారూ, కృష్ణమూర్తి గారు, దివాకర్ల వేంకటావధానిగారు, నేను హైదరాబాదు చేరిన మర్నాడో మూడో రోజో, తిక్కన పదప్రయోగకోశం పనిచేసేవాళ్ళ సమావేశం జరిగింది. సంపాదకులు ముగ్గురూ తమతో పనిచేసేవాళ్ళని పరిచయం చేశారు. కృష్ణమూర్తిగారి ఆదేశంతో పనిచేసేవాళ్ళు, అరడజనుమంది పి హెచ్. డి. విద్యార్థులూ, లెక్చరర్లూ, అవధానిగారి ఆదేశంతో పనిచేసేవాళ్ళు మరో అరడజనుమంది, పి హెచ్. డి. లు, లెక్చరర్లు, మేష్టారివంతు మూడోవంతు పని చెయ్యటానికి నేనొక్కణ్ణి. వచ్చిన పండితుల్లో మరొక యిద్దర్నో ముగ్గుర్నో తీసుకోమన్నారు మేష్టార్ని. మేష్టారు వద్దన్నారు. 'నా వంతుపని రామానుజాచార్యులు ఒక్కడే చేస్తాడు. ఈయన రోజంతా యిదేపని చేస్తాడు గనక, తక్కినవాళ్ళు అయిదారు గురు తీరుబడి వేళతో చేసేవనికి సరిపోతుంది అన్నారు. ఆ పండితులకి కృష్ణ మూర్తిగారితోనూ, అవధానిగారితోనూ యూనివర్సిటీలో పనిపడుతుంది గనక, వారు అప్పజెప్పిన పని శ్రద్ధగా చేస్తారుగాని, మేష్టారితో వాళ్ళకి యెవళ్ళకీ యేమీ అవసరం వుండదు గనక వాళ్ళు శ్రద్ధగా చేస్తారనే నమ్మకం మేష్టారికి లేదు. అప్పటికే రాసి పెట్టివుంచిన ఆరోపాలకార్డులు సరిచూడటం పని. ఆపని చేసిన వాళ్ళపేర్లు తిక్కన పదప్రయోగకోశంలో రాయలేదు. అందరిపేర్లూ నాకు గుర్తులేవు. డా॥ తంగిరాల వేంకట నారాయణశాస్త్రిగారి పేరూ, డా॥ అమరేశం రాజేశ్వరశర్మగారి పేరూ నాకు గుర్తు వున్నయి. నారాయణశాస్త్రిగారితో వా లేరులోనే పరిచయంవుంది.

డా॥ నారాయణశాస్త్రిగారు సంస్కృతాంధ్రాలలో పండితులు. చక్కటి దస్తూరి. వారు రాసిన కార్డులు నేను పరిశీలించాను. కార్డులు రాసిన వారందరి లోనూ శాస్త్రిగారే బాగారాశారు. ఆరోపమూ, ప్రయోగమూ పర్వ, ఆశ్వాస, గద్య పద్య సంఖ్యలూ తీర్చి దిద్దినట్టు రాశారు. వారు ఉద్యోగపర్వంలో నాలుగో ఆశ్వాసంలో పద్యం అన్వయంలో పొరపాటుపడ్డారు. అది వారి పొరపాటు కాదు. బహుజనపల్లి సీతారామాచార్యులుగారి పొరపాటు. బహుజనపల్లి వారిది పొరపాటు అని అనుకోలేకపోవటంవల్ల శాస్త్రిగారు పొరపాటు పడ్డారు.

> "అమర సైన్యములును దమయంత వర్తింపనేరకునికి నా కుమారు మొగము
> నానర్పవలసెగాదె సమస్తసేనలను నీవ యరసి నడుపవలయు.

(ఉ_4_144)

శబ్దరత్నాకరంలో "మారు–దే.వి. ప్రతి" అని అర్థంయిచ్చి, పై పద్యం ప్రయోగం యిచ్చారు. శబ్దరత్నాకరంలో యిచ్చిన అర్థం తప్పనీ, వారు చేసిన అన్వయంకుదరదనీ నాకు అంతకుముందే తెలిసివుండటంవల్ల శాస్త్రిగారు చేసిన పొరపాటు వెంటనే కనుక్కున్నాను. ఆకార్డులు మేష్టారికి చూపించి, శబ్దరత్నాకరంలో తప్పు కూడా తీసి చూపించాను. "ఆ కుమారు మొగముగా నొనర్పవలసెగాదె"అని అన్వయం చెప్పాను. ఆ సాయంకాలం శాస్త్రిగారు వచ్చినప్పుడు ఆయనకి చూపిస్తే, సహృదయతతో తమ పొరపాటు అంగీకరించారు. "తలచుట్టువార కన్నులు గలిగిన పద్యంబు తప్పుగా దనవశమే" అనే నా స్వభావాన్ని మేష్టారు నువ్వెంత వాడివి అని అణచివెయ్యకుండా ప్రోత్సహించారని చెప్పటానికి ఈ ఉదంతం.

తిక్కన పదప్రయోగకోశం ఆరోపాలు సరిచూసేపని అయిదు నెలల్లో పూర్తి అయింది. నేను తిరిగి విశాఖపట్టణం వెళ్ళిపోయిన తరవాత, మేష్టారు అకాడమీతోనూ తిక్కన పదప్రయోగకోశంతోనూ, సంబంధం వొదులుకున్నారు.

1965 చివర్లో నేను విశాఖపట్టణంలో ఉద్యోగం వొదిలిపెట్టి, హైదరాబాదులో మరొక ఉద్యోగంలో చేరాను. అప్పుడు మేష్టారు మలకపేటలో వుండేవారు. ఎప్పుడైనా శనివారమో, ఆదివారమో వారింటికి వెళ్ళి వస్తూండేవాణ్ణి. ఆ తరవాత రెండు మూడేళ్ళలో నాకు తెలుగు యం. ఏ. పరీక్షకి వెళదామని కుతూహలం కలిగింది. ఏ యూనివర్సిటీ వారైనా నన్ను పరీక్ష రాయనిస్తారో లేదో తెలుసుకోకుండానే, నా ఉద్దేశం మేష్టారికి చెప్పాను. "యం. ఏ. ప్యాసయితే మీ ఆఫీసులో ప్రొమోషను యిస్తారా ?" అని అడిగారు. 'ఏమీ యివ్వరు' అని చెప్పాను. అప్పుడు చెప్పారు వెలకట్టటానికి వీల్లేని సలహా. "నీకు వొచ్చినంత తెలుగు వొచ్చును. నీకు తెలుగొచ్చునని యెవడూ సర్టిఫికెట్ యివ్వక్కర్లేదు. ఇప్పుడు చేసుకుంటున్న పర్చేజ్ డిపార్టుమెంటు ఉద్యోగమే చేసుకుంటూ వుండు. ఏవో నాలుగు ఇంగ్లీషు ముక్కలు గొలికితే, నీ పైవాడు అల్లాకాదు, యిల్లా రాయమంటే, యిల్లాగే రాయి. ఆ జీతం రాళ్ళు తెచ్చుకోని కాలం వెళ్ళదియ్యి. అంతే గాని, యెప్పుడూ తెలుగుకి సంబంధించిన వుద్యోగం యేదీ చెయ్యకు. నీ పైవాడు యేదో చెబితే, వాడికి తెలియదని నువ్వు చెప్పాల్సి వస్తుంది. దానితో పేచీ. నీకు రోజు గడవటం దుర్భరమైపోతుంది. యం. ఏ. పరీక్షా వొద్దు, యేమీ వొద్దు" అని చెప్పారు. అంతటితో ఆ ఆలోచన పూర్తిగా మానుకున్నాను. మా గురువుగారు యిల్లాగ

సలహాయిచ్చారని, తోటి వాళ్ళతో యిప్పుడెప్పుడైనా చెబితే, వీళ్ళంతా 'చాలా అమూల్యమైన సలహా' అని మెచ్చుకుంటున్నారు.

1973–74 ప్రాంతాలలో మేష్టారు మలక్ పేటలో వుండగానే నారచనలు కొన్ని తీసుకువెళ్ళి చదివి వినిపించాను. అంతకుమునుపు యెప్పుడూ నేను రాసిన వేవీ వారికి చూపలేదు. "అజ్ఞాన సర్వస్వం" అనే పేరుతో వచనగేయాల సంకలనం తయారు చేదామని నాలుగైదు రాశాను. అవి చదవగా విన్న తరవాత నాకొక హితం చెప్పారు. వచనం గేయం అనేదేవారు అంగీకరించలేదు. ఛందస్సు లేనిదే మాటలకూర్పు గుర్తుపెట్టుకోవటం సాధ్యంకాదు గనక యేదో ఒక Rythm వుండాలి. ఈ వచనగేయం రాసినవాడుకూడా రెండు పంక్తులకన్నా యెక్కువ గుర్తుపెట్టుకొని మళ్ళీ చెప్పలేడు. నువ్వు చెప్పేది ఫరవాలేదుగాని, యేం చెప్పినా యేదో ఒక ఛందస్సు, Rythm ఉండేటట్టు చెప్పమని హితంచెప్పారు. తరవాత నా "అజ్ఞాన సర్వస్వం" ముందుకుసాగలేదు.

ఆ రోజుల్లోనే ఒకసారి మేష్టారితో "విశ్వనాథ సత్యనారాయణగారికీ, శ్రీరంగం శ్రీనివాసరావుగారికీ ఉన్న అజ్ఞానం మీకు లేకపోవటంవల్ల మీరు యేమీ రాయలేక పోతున్నారనుకుంటాను" అన్నాను. మేష్టారు వెంటనే నవ్వి" 1937 దాకా ఆంధ్రసాహిత్యం నన్నునడిపించింది. ఆతరావాత నేను ఆంధ్ర సాహిత్యాన్ని నడిపిస్తున్నాను" అంటున్నాడు శ్రీ శ్రీ. యెంత అజ్ఞానమో చూడు' అని తమ 'కవిత' లోనించి

"అజ్ఞాతాజ్ఞేయాలకు అజ్ఞానంతో నేస్తం"

అన్న పంక్తిని ఉట్టంకించారు. మానవజాతి తరతరాలుగా పోగు చేసుకున్న అజ్ఞానం అజ్ఞాతాల చుట్టూ, అంతకుమించి అజ్ఞేయాల చుట్టూ అల్లుకున్నది. ఆనాడు మేష్టారికి లేదన్న "అజ్ఞానం" (అప్పట్లో నాకూ లేనిది) నన్ను ఆవరించటంవల్ల యిప్పుడు నేను రాస్తున్నాను.

మల్లాది రామకృష్ణశాస్త్రి

# నా కవి మిత్రులు

## శ్రీ రామకృష్ణారావుగారు

నాట్యము యొక్క విశిష్టలక్షణము అవస్థాను కరణమని ధనంజయుని నిర్వచన మున్నది. నటుడి కన్న ఒక మెట్టు ఎక్కువ కవి: ఇంచుమించుగా తన్మయత్వానికి సమానమైన అవస్థను పొంది ఉత్తమ నటుడు తాను అర్థము చేసుకుని అభినయించ దలచిన అనుభావాల్ని ప్రదర్శించి కృతార్థు డవుతున్నాడు. కవి, తన మానసిక ప్రవృత్తులకు శబ్దార్థశరీరాన్ని కవ్పించి, రసపోషణతో చైతన్యాన్ని ఏర్పరస్తున్నాడు: వర్ణసంఘటనాధర్మములైనా, ఆనందవర్ధనాదుల మతంలో, మాధుర్యాది గుణములు వన్నె కెక్కుతున్నాయి.

ప్రసాదమూ, మాధుర్యమూ, సత్యాశ్రయుడి కాలం నుంచీ కూడా తెలుగు కవితకు పెట్టని సొమ్ములై మెరసిపోతున్నాయి. నన్నెచోడుడి మొదలు శ్రీనాథుడి దాకా కవులందరూ స్వతంత్రించి కొత్త దోవల పోయినా, పెద్దన్నగారు, నగిషీ కవిత్వం పనికిరాదని....పూత మెరుంగులు, పసరు పూప బెడంగులు చూపెవి కైతలు కావని....త్రోసివేసి, బాతిగ పైకొన గలిగినదే సరసులు విని మెచ్చదగిన కవిత్వం అని నిర్దేశం చేసిన తరువాత, పాతదోవ చాలావరకూ సాఫీగా తయారయింది:

మహావిద్వాంసులు ధిషణా విశేషంచేత సర్వతంత్ర స్వతంత్రులు కాగలిగినా ....కవి సర్వస్వాతంత్ర్యము ఏ కష్టమూ లేకుండానే సంపాదించ గలిగాడు: దానికి తోడు నిరంకుశత్వము ఒకటి ఒనగూడింది...మమ్మటుడు నియతి కృత నియమ రహితమని, మహాకవి భారతిని ప్రశంసించినా కవికూడా కొన్ని కట్టుబాట్లకు లోను కావాలని తరువాత వాళ్ళు ఏర్పాటుచేసి....కావ్యాలాపాంశ్చ వర్జయేత్....అన్న తలకట్టు క్రిందికి, ఆ హద్దులను మీరి నడచిన కావ్యాలని తీసుకు వచ్చారు....మల్లినాథ మహోపాధ్యాయుడు అసత్కావ్యానికి ఉదాహరణంగా ముద్రా

రాక్షసాన్ని పేర్కొన్నా... అజాతిలో చేరేవి చాలా అప్పటికి, ఇప్పటికీ, ఉన్నా యని పోల్చి చూసుకోవచ్చును.

ఆ అవాంతరాలన్నీ గడచి....కల్పించిన కావ్య రూపాలకీ....తమకూ పేరు సంపాదించుకున్న కవులు....మొదటి పాయాలో ఎన్నుకుని గౌరవించ దగినవారు. నవీనుల్లో కూడా ఉండటం చాలా విశేషం....కవి అన్న గౌరవం సార్థక పరచుకో గలిగి...చక్కని రచనలు...తెలుగు వారికి అందించి వారి మన్నన లకు పాత్రులయే భాగ్యం లభించిన వారిలో, శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారు ఎన్నదగినవారు...

అప్పటికప్పుడే రాయప్రోలు సుబ్బారావుగారు...తమ సహజ రచనా వైదగ్ధ్యంతో'విపిన బంధురవృక్ష వాటిక నుపనిషన్మధువొలికె నిచ్చట'నని, తెలుగు దేశాన్ని మెచ్చుకుంటున్నారు : శ్రీ రామకృష్ణరావుగారు ఆ ప్రబోధాన్ని గమ నించి, తమ విపంచికను కూడా మేళవించి, చామభూపాలుని కన్నడ రాజధాని నుంచి, తెలుగులో 'ఊహాగానం' తెలుగు వారు విని ఆనందించాలని మొదలు పెట్టారు. చక్కని ఊహతోను, దానికి అందం తెచ్చే పదవైభవముతోనూ అఖం డంగా, ఖండకావ్యాల్ని రచించి, వాటిని ఒక్కమారుగానే ఆంధ్ర పాఠక లోకా నికి అందిచ్చారు....

'పూజా శిరీషము'లని మొదలిడి 'ఏరుకొంటివి పోయివచ్చెదో జవ్వనీ : తేజోనిలీనదృగంచలమ్ముల తేరిచూసెద వెవ్వనీ' అని భావకవిత్వానికి మొదలు వేసి, వారు ఊహించిన ఆ నాయికను పలుకరించారు : కవిభావానికి వన్నె తెస్తున్నది ఆ ఊహాగానము : సరిగా అనుసరించలేక పోయినా...'అనుకరించ లేకపోయినా....తరువాత వచ్చే చిన్న సైజు కవులందరికీ, ఆ త్రోవ రాజబాట అయి పోయింది.. కాని, ఆ సాఫీ...సాధారణంగా కనబడటం అరుదుగా ఉంది : పాత పద్ధతిని, పాతవృత్తాల్లో సంధానపరచినా... 'కాపుపాట' యీ రోజున విన్నా క్రొత్తగానే కనబడుతూన్నది :'యః కౌమారహరః....అన్న శిలాభట్టారికా రచనలో ఉన్న సిద్ధాంతం ఆదరణ వహించినంత వరకూ, శ్రీరామకృష్ణరావుగారి 'ఊహాగా నాని'కి...ఆమాదిరి వాటిలో ఇంచుమించు ఆదికావ్యమనే గౌరవమే కాకుండా, మనసునూ, సంతోషపెట్టే సత్తాతో పొలుపారుతూంటుంది : పాడుట కొప్పు కుండా, ఊహాగానం సరిపుచ్చి...కవి... పడవ ల్నడపించెడి ఏటిదారులు, చూడ

మని ఆనతిచ్చినా...అది సంతోషంగానే ఉంటుంది...మనం మామూలుగా చూడ లేనివి కవి, తాను, చూసి ఆనందించి....మనకు సాక్షాత్కరింప చేస్తాడని : రవి కన్న....కొన్ని విషయాల్లో కవి చాలా మెరుగు...

మహీశూర రాజకళాశాలలో వ్యాకరణం అభ్యసించే అవకాశంలోనే, శ్రీరామకృష్ణరావుగారికి, కన్నడ భాషాపరిచయమూ కలిగింది : వ్యాకరణ శాస్త్ర మంతా, కాలక్రమంగా....వాడిక లేక మరచిపోతూన్నా : ఆ వేళా విశేషం చేత, కన్నడానికి ఆ గాలి సోకలేదు : కైలాసంగారి ప్రహసనాలు కొన్ని తెలుగులోకి తీసుకు వచ్చారు : మరీదోస్తీ ఉన్నవారు ఏ నలుగురు ముగ్గురో విని ఆనందిం చడం తప్ప....వాటిని ప్రచురించాలనే ఉద్దేశమే ఆయనకు లేకపోయింది : ఇప్పటికి ఆ ప్రతులు కూడా సాఫ్‌గా అంతర్ధానమయి ఉంటాయి : ఈ మాదిరి నుస్తీ సహించ కూడనిది : అయినా, మనకు ఆ ఆచారం అమరేశ్వరుడినాటినుంచీ... ఇంకా అంతకు పూర్వంనుంచీ కూడా వస్తూనే ఉంది : అలాటి అశ్రద్ధ మరీ బలిస్తే ఒకొక్కప్పుడు మహాకవి అయినా...తరువాత కాలానికి పేరు మాత్రం.... అదీ చూచాయగా మిగులుతుంది...

కలకత్తాలో బాంగ్లభాషాభ్యాసనానికి వీలు చిక్కింది...చదువు చాలించి.... తిరిగి మన దేశంలోకి వచ్చేటప్పటికి శ్రీ రామకృష్ణరావుగారికి సంస్కృతాంధ్రా లతో అదివరకున్న పరిచయమూ, హూణభాషావాసనా— పట్టభద్రయోగం— కాకుండా మరి ఒకటి రెండు భాషలతో కూడా చక్కని పరిచయం ఏర్పడినది : కాని ... బాంగ్లాభాషమీది లక్ష్యంచేతనూ ... తనవితీరక ఇంకా చదవాలనే ఊహతోనూ... చదువుకుని అర్థం చేసుకు ఆనందించే ధోరణిలోనే ఎప్పటికప్పుడు ఉంటారుగాని...ఆయన పట్టుమని...బంగాలీలోంచి తెలుగులోకి తీసుకు వచ్చి నవి ఏమీలేవు...శారద ప్రచారంలో ఉన్న రోజుల్లో.. రవీంద్రుని 'రక్తకరవీర' అనువదించడానికి మొదలుపెట్టి నా....సగంలో ఆగిపోయింది ఆ ప్రయత్నం.... అప్పటికీ ఇప్పటికీ, అది పూర్తి చేయడంకాని....పోనీ అలాటి వేవైనా కొన్ని మంచివి తెలుగులోకి తీసుకురావడంకాని చేయలేదు. చదువుకున్న చదువూ.... సామర్థ్యమూ చక్కగా వినియోగించకుండా బద్ధకించి ఊరుకుంటే...మరు జన్మలో...అందరాని అడవిలో మామిడిచెట్టయి పుడతారని....మన వాళ్లలో ఉన్న ప్రతీతి...శ్రీ రామకృష్ణరావుగారికి తెలిసే ఉంటుంది.

అందరికీ తెలుగులో అందుబాటుగా వుండాలని....అలంకార సర్వస్వ మొకటి సంకల్పించి... ఆ ప్రయత్నం మీద యీ ప్రాంతాలకు...చదువు మానిన చాలా కాలానికి మళ్ళా జేరుకున్నారు, శ్రీ రామకృష్ణారావుగారు. రసగంగాధరం తోను...కావ్యప్రకాశముతోనూ కొంతకాలము దోస్తీచేసి...అంతలో వానిమీద మనను మరల్చుకుని...మొదటి ప్రయత్నాన్నే మానేసి...'సజయతి పింగళనాగో శివప్రసాదా ద్విశుద్ధమతిః' అని జపించుకుంటూ...పింగళ నాగాచార్యునీ, కేదార భట్టునీ....ఛందో విషయంలో కొంతకాలము తరచి చూశారు; ఆ తరువాత....

...'సూర్యరాజు కథలు' మొదటినుంచీ కూడా ఆంధ్రజనుల ఆదరాతిశ యాన్ని బడసినవి...సంక్షేపించి ఊరుకున్న తరువాతకూడా, చాలాకాలందాకా మళ్ళా వస్తాయేమోనని...అవి ప్రచురింపబడిన పత్రిక తిరుగవేస్తూండే వాళ్లు యెరుగున్నవారందరూ...కాని ఒకసారి ఆపి మళ్ళా మొదలిడుదామనే ఉత్సాహము కాని, సంకల్పముకాని ఆయనకు అలవాటు లేని ఆపోసనము : ఆ కథల విషయంలో చాలా చిక్కు వచ్చింది. చదువుకుందా మనేవాళ్ళకు....చూస్తూ మరిచి పోవడానికి మనసొప్పదు....ఒకచోట...ఏ పుస్తకరూపానో.... అవి లభించే అవ కాశమూలేదు...గనక మనసుకు వ్యతిరేకంగాఅయినా...మరచిపోలేక...మరవాలిసి వస్తూంది.

'రామనగరీ నరేంద్ర' అని ఎత్తుకుని, ఆంధ్రరత్న శ్రీ గోపాలకృష్ణుడు... శ్రీరామునికైనా కీర్తి తెచ్చాడని అనుకున్న పద్ధతిని...అక్కడ అంతకు ఎక్కువ పనులు జరుగక పోయినా...శ్రీ రామకృష్ణరావుగారు...సూర్య రాజుకు రామనగ రాన్ని విడిదిగా చేసి... సారస్వతరీతుల్లో కూడా ఆ పేరు...ఆ మహామహుని సంకల్పావస్థితచ్ఛాయా రూపాన్నైనా ...ఎన్నడూ మరువనీయకుండా చేశారు : సత్కార్యా చరణచణుడైన... మహామనీషికైనా...సత్కవి సాహాయ్యము చేసేది .. ఈ విధంగానే :

కావేరి...అగస్త్యుని వీడి...సహ్యజగా మారిపోయిన కథ 'నదీ సుందరి'గా నాటక రూపాన వెలసింది శ్రీరామకృష్ణరావుగారి మూలాన : రూపకమంతా ఒకటే అంకము...ఒకరిద్దరు కన్న ఎక్కుడు పాత్రలులేరు...అర్థవంతమైన భాష... రసవంతమైన పోకడలూ... రచనాను... చదువుకుని ఆనందిచడం కన్న ... సుప్రసిద్ధ నటవతంసు లెవరైనా అభినయించగా జూసే వీలు ఒనగూడితే

బాగుంటుంది: వచనంలో నాటకాల్లో... చక్కని అవకాశమూ, పొందికలూ ఉన్న రూపకాల్లో... 'నదీ సుందరి'ని మొదట ఎన్నుకోవచ్చును.

చాల పూర్వపు కన్నె అయినా . కవి అప్పుడప్పుడే సారస్వతలోకం పొలిమేరలు అతిక్రమించి లోనకు వస్తున్న నూతనుడయినా, ఆనాటికే 'మల్లికాంబ' నూతన సోయగముతో పొడసూపింది :—కథలో విశేషం లేదు. ఆ కావ్య రచనలోమరీ ఎన్న తగినది మరేమి అంత లేదు...ఎంచి చూచి ...ఎన్నతగిన విశేషము లేకపోయినా...'మల్లికాంబ'తోవకు వెలిగాకుండా, చెంగున దుమికే సెలయేటి నాజూకుతనాన్ని తలపిస్తూంటుంది ..ఆ ఊహాగానంతో ...నిజంగా చాలా చక్కని కావ్యము.

ఎంతకాలమైందో శ్రీ రామకృష్ణరావుగారిని 'ద్రాక్షావీధి'ని చూసి...అప్పటి నుంచీ...మళ్ళా కనబడితేనా ? వచ్చే వసంతవేళ . వాసంతీకుసుమ సౌకుమార్యమన్నా...మళ్ళా ఆయనను మేల్కొలుపుతుందేమో ?

—కృష్ణాపత్రిక, 3–12–1932

శ్రోణంకి అప్పలస్వామి

# నేనెరిగిన అబ్బూరి రామకృష్ణారావుగారు

ఆఖరి నలభైలలో అనుకుంటాను నేను అబ్బూరి రామకృష్ణారావుగారిని మొదట చూశాను. ఎవరితోనో ఇప్పుడు జ్ఞాపకంలేదు. కాని కొత్తపల్లి వీరభద్ర రావుగారితో గాభోలును విశాఖపట్నం పోయినప్పుడు మేమిద్దరం పొద్దున్న తొమ్మిది గంటలకు చినవాల్తేరులో నివసిస్తున్న రామకృష్ణారావుగారి ఇంటికి వెళ్ళాం. మాట్లాడుతూ ఉన్నపుడు ఇల్లు చాలకుండా ఉన్నదని ఎక్కువ అద్దెచెల్లించ వలసివస్తోందని ఆయన అన్నట్లు నాకు జ్ఞాపకం. ఆ రోజుల్లో రామకృష్ణారావు గారు తెలుగు డిపార్ట్‌మెంట్‌లో ఉండేవా రనుకుంటాను. మా సంభాషణలో ఏ విధంగానో టి. ఎస్. ఇలియట్ పేరు దొర్లింది. రామకృష్ణారావుగారు కవిత్వ మంటే 'A raid on the inarticulate' అన్న ప్రవచనాన్ని మిక్కిలిగా కొనియాడారు. నేను చాలా సంతోషించాను. అంతకుముందే ఇలియట్స్ four quarltes ను నేనధ్యయనం చేశాను. వీరి మాటలు నా హృదయంలో నాట్య మాడుతూ ఉంటాయి. ఆ కారణంచేత రామకృష్ణారావుగారు చదువుకున్న వారని నేను నిర్ణయించుకున్నాను. తర్వాత అప్పుడప్పుడు ఆయన విజయనగరం వస్తూ ఉంటే నేను చూసేవాణ్ణి. మా కళాశాల సాంస్కృతికోత్సవాలకు ఆయనవచ్చి ఉపన్యసించేవారు. పాశ్చాత్య సాహిత్యంగురించిన విషయాలు చాలమటుకు తెలిసిన వారు. మార్క్సిజం, కమ్యూనిజం గురించికూడ ఈయన చదువుకుని ఉన్నారు. చాలా మందికంటె బాగా ఈయనకు ఇంగ్లీషు వచ్చేది. ఎమ్. ఎన్. రాయ్ అంటే ఈయనకు చాలా యిష్టం. ఎందుకోకూడా ఆయన చెప్పడానికి వెనుదీసేవారుకారు. చదువుకున్నవారితో మైత్రి సలపడం ఆయనకు ప్రీతి. నా తమ్ముడు ఒకడు ఆ రోజుల్లో రాయిస్టుమాటలు ఆడుతూ ఉండేవాడు. అందుచేత మా తమ్ముడు, రామకృష్ణారావుగారు అప్పుడప్పుడు కలుసుకునేవారు. రెండవ మహాప్రపంచ సంగ్రామ సందర్భంగా బ్రిటీషు ప్రభుత్వంవారు మంచి వేతనాన్నిచ్చి ప్రచారకునిగా

ఉపయోగించుకున్నారు. అయితే దీనికి కారణం అతనికి కమ్యూనిజంవైపు, రష్యా వైపు ఉన్న మొగ్గు ఒకటి. ఆయనకు ఆంగ్లసాహిత్యం పైని అభిరుచి, ఆంగ్లజాతి స్వభావంలో కొన్ని గుణాలు ఆకర్షణీయంగా ఉండడం. వేరొకటి ఆయన మిత్ర మండలి విజయం ప్రపంచపురోగతికి అత్యవసరమని నమ్మడంచేత ప్రభుత్వాన్ని సమర్థించారు. డబ్బుకోసం కాదు. ప్రసంగం కన్యాశుల్కంవైపు తిరిగిందంటే సరి ఆయన ఆవేశపరు డయ్యేవారు. ఆ నాటక ప్రత్యేకతను గొప్పతనాన్ని సోదాహరణంగా కొనియాడ్డంలో ఆయన ఉద్దండుడు. ప్రచారకునిగా నాటికా నాటక ప్రదర్శనలు చేయవలసి వచ్చేది. కన్యాశుల్కనాటక మంతటిని సమర్థవంతంగా ప్రదర్శింపచేశారు, ఇతర ప్రదర్శనలతోపాటు. కన్యాశుల్కం రంగస్థలికి అనువైనదికాదనే కొందరి అభిప్రాయం, సరియైనది కాదని రుజువుచేశారు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. రామకృష్ణారావుగారు చీఫ్ లైబ్రరియన్ అయారు. ఇప్పుడు ప్రెస్సు ఉండే భవనంలో విశ్వవిద్యాలయం లైబ్రరీ ఉండేది. నేను విశాఖపట్నం పోయినప్పుడల్లా లైబ్రరీకి వెళ్ళి రామకృష్ణారావుగారితో ఇష్టాగోష్టి చేస్తూ ఉండేవాణ్ణి. ఆయన పేర పుస్తకాలు కూడా తెస్తూ తిరిగియిచ్చేస్తూ ఉండేవాణ్ణి. నేను నలభై యాభై తెలుగు కవితలను ఆంగ్లంలోకి అనువదించాను. ఆ సందర్భంలో "కాపుపాట" అనే కవితను అనువదించాను. అది ఒక విధంగా స్వేచ్ఛానువాదం. నా కవిత పాటగా మారింది. పాడుకోవలసిన అన్ని హంగులతో మూలంలోని వృత్తశయ్యకు దూరమయింది. అయితే మూలంలోని భావ పరంపర చెడనీయలేదు. ఇప్పు డీవిషయం అప్రస్తుతంగావి ఫ్రెంచిభాషలో అనువాదానికి సంబంధించి ఒక సుభాషితం కద్దు. అనువాదాలు స్త్రీలవంటివి. అందమైనవైతే నమ్మవలసినవికావు; నమ్మవలసినవి అయితే అందవిహీన మైనవన్న మాట. రామకృష్ణారావుగారు నా అనువాదాన్ని స్వీకరించారు. వరద రాజేశ్వర రావు పొయిట్రీ 'తెలుగు' అని ఒక అనువాద సంకలనాన్ని ప్రచురించారు. అందులో ఈ అనువాదంతో సహా మరినాలుగైదు అనువాదాలు నావి అచ్చువేశారు.

రామకృష్ణారావుగారు మిక్కిలి రసికులు. విరామ సమయంలో ఆయనతో కూర్చుంటే ఆయన మాటలు వింటూఉంటే వినేవారిని పరవశత ఆవహించేది.

రామకృష్ణారావుగారు విశాఖపట్నంలో స్థిరనివాసం ఏర్పరచుకుందామని గాబోలు పట్టణంనుంచి యూనివర్సిటీకి పోయే సిరిపురం మలుపులో గృహనిర్మాణం

చేసుకున్నారు. అక్కడికి పోయినప్పుడల్లా రాత్రి అతని యింట్లోనే బసచేసేవాణ్ణి. మేమిద్దరం ఆంగ్లసాహిత్యాన్ని తెలుగు సాహిత్యాన్ని బేరీజు వేస్తూ ఉండేవాళ్ళం. ఆయన బెంగాలీ భాషలో 'సన్నెట్' అన్న ఐరోపీయ ప్రక్రియ చాలాకాలం నుండి స్థిరత నందిందని చెప్పేవారు. తానుకూడా ఈ ప్రక్రియను తెలుగుపరం చేయ నిశ్చయించి కొన్ని సానెట్లు రాసారు. రిటైరయిన తరువాత విశాఖపట్నంలో ఏ కారణంచేతనో ఉండలేక పోయారు. ఉండి ఉంటే ఆయన శరీరారోగ్యం సడలక పోయి ఉండు ననుకుంటాను. సముద్రతీరనివాసం ఆరోగ్యానికి అనువైన దను కుంటాను.

రామకృష్ణారావుగారు తెలుగులోను, ఇంగ్లీషులోను కూడా రేడియో ప్రసం గాలు చేసేవారు. ఆ రోజుల్లో విశాఖపట్నంలో రేడియో స్టేషను లేదు. అంచేతను రామకృష్ణారావుగారు పదిహేను రోజులకొకసారి విజయవాడో మద్రాసో వెళ్తూ ఉండేవారు.

రెండు సంవత్సరాలు దాటిందనుకుంటాను. ఒకనాడు విశాఖపట్నంలో ముత్తుస్వామిగారు అబ్బూరి రామకృష్ణారావుగారు ఊళ్లోకి వచ్చిఉన్నారని ఎవరో తనతో అన్నారని నాతో అన్నారు. నేను వీరిని వారిని అడిగి రామకృష్ణారావుగారు ఈస్ట్‌పాయింట్ కాలనీలో విశ్వవిద్యాలయంలో థియేటర్ ఆర్ట్సులో ఉద్యోగిగా నున్న తన కుమారుని యింట ఉన్నారని తెలుసుకున్నాను. కుమారుని పేరు గోపాలకృష్ణ అనుకుంటాను. పొద్దున్నే కాఫీతాగి ఈస్టుపాయింట్ కాలనీకి వెళ్లాను. సముద్రానికి సమీపంలో ఒక ఇంట్లో రామకృష్ణారావుగారు సాక్షాత్కరించారు. ఆయన ఆరోగ్యం బాగులేదు. శరీరం కృశించిపోయింది. ఆయనకు కూర్చోవడం, కూర్చుని లేవడం కష్టంగా ఉండేది. మేము కూర్చుని పూర్వ స్మృతులను తిరుగ దోడుకున్నాం. ఆయన దగ్గర ఒక సమకాలిక ఫ్రెంచి కవితానువాద సంకలనం చూశాను. పుచ్చుకుని తిరగవేస్తూ ఉంటే "గియోం అపొలినేర్‌ల జాలిరూస్" అన్న కవిత కనిపించింది. కవితలోని చివరిఘట్టం అతనికి వినిపించినట్టు చదివాను అంగ్లంలో. వెనువెంటనే ఫ్రెంచి మూలాన్ని ఆలాపించాను. రామకృష్ణారావుగారు మెచ్చుకున్నారనుకుంటాను. మీకు భాషలు వచ్చి తెలుగువారికి తెలుగుభాషకు పనికివచ్చేటట్టుగా ఏమీ ఆ భాషలనుండి అనువదించడం లేదని ఆ భాషల గూర్చి రచన సాగించడంలేదని విచారాన్ని వెలిబుచ్చారు. నాలుగైదుసార్లు

ఆయనను చూడడానికి కుమారుని యింటికి వెళ్ళాను. తరువాత ఆయన విశాఖ పట్నం విడిచిపెట్టి పోయారు.

ఆరుమాసా లయిందనుకుంటాను. హైదరాబాదులో తెలుగు అకాడమీలో ఉద్యోగిగానున్న అమ్మాయి టెక్కలిలో మా ఇంటికి వచ్చింది, కొన్ని భాషా విషయాలు చర్చించేందుకు. ప్రాసంగికంగా రామకృష్ణారావుగారు ఢిల్లీలో అతని కుమారుడు వరద రాజేశ్వరరావు గారింట ఉన్నారని చెప్పింది. పడిపోయి రామకృష్ణారావుగారు దెబ్బతగిలి కదలడానికి వీలుకాని స్థితిలో ఉన్నారని కూడా అంది.

నేను అబ్బూరి రామకృష్ణారావుగారు కోలుకుంటారని ఆశించాను. మళ్ళీ ఆయనను విశాఖపట్నంలో చూడడం సంభవిస్తుందని అనుకున్నాను. ఆయన పరమపదించారన్న వార్తవిని పూర్వస్మృతులనన్నింటిని జ్ఞప్తికి తెచ్చుకొని విలపించవలసి వచ్చింది.

అబ్బూరి వరద రాజేశ్వరరావు

# మా నాన్నగారూ - యం. యన్. రాయ్‌గారూ

మానాన్నగారు కమ్యూనిస్టుపార్టీలో చేరిన కొత్తల్లోనే ప్రచ్ఛన్న సాహిత్యంలో యం. యన్. రాయ్‌గారి పేరు అడపా దడపా వినవస్తూండటం చూసేవారు. అయితే ఆయన్నిగురించి ఆరోజుల్లో యెక్కువగా యెవరికీతెలిసే అవకాశం ఉండేదికాదు. యం. యన్. రాయ్‌గారిని గురించి తగినంత భోగట్టా సంపాయించాలనే కుతూహలం మానాన్నగారి కుండేది.

1936 సంవత్సరంలో Progressive Writers Conference ను లక్నోలో సమావేశపరిచారు. అదే ఆరంభసభ. అదేసమయంలో ఆ నగరంలో కాంగ్రెసు మహాసభకూడా జరుగుతోంది. అలాంటి తరుణాల్లో యం. యన్. రాయ్‌గారి అనుచరులు రాయ్‌గారి గురించిన సాహిత్యాన్ని తీసుకువచ్చి ప్రముఖులయినవారికందచేస్తూండేవారు. రహస్యంగా వారితో సంబంధాలు పెట్టుకునేవారు. Progressive Writers Conference కు హాజరయిన ముఖ్యప్రతినిధులందరూ కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టుసానుభూతిపరులూ కావటంచేత రాయ్‌గారి అనుచరులు ఆసమావేశంమీద మరింత నిఘా పెట్టారు. ఆకాలంలో రాయ్‌గారు డెహ్రాడూన్ జయిల్లో నిర్బంధంలోవుండి దేశంలో పలుప్రదేశాల్లోజరిగే రాజకీయ సమావేశాలకు సంబంధించిన విశేషాలను మిత్రులద్వారా సేకరిస్తూండేవారు. అలా ప్రోగ్రెసివు రైటర్సు కాన్ఫరెన్సుగురించి కూడా విశేషాలను గ్రహించారు. కాన్ఫరెన్సు ప్రారంభోత్సవంలోనే మానాన్నగారికీ, మున్షీ ప్రేమ్‌చందుకీ మధ్యజరిగిన వాదోపవాదాలు రాయ్‌గారి దృష్టికివచ్చినయి. దక్షిణాదినుంచి వచ్చిన యీ యువ రచయిత యెవరో కనుక్కోమని లక్నోజయిల్లోవున్న రాజేంద్రదత్త నిగంగారికి రాయ్ రాశారుట. నాకు దత్తాగా రావిషయం 1942 లో లక్నోపోయినప్పుడు చెప్పారు. రాయ్‌గారుకూడా నాతో చాలారోజుల తరవాత ఓసారి మానాన్నగారి గురించి మాట్లాడుతూ, లక్నోసంఘటన ప్రస్తావించి అప్పట్లో అలాంటి సమావేశాల్లో

మానాన్నగారు ప్రవర్తించినతీరు సాహసోపేతమనీ, కమ్యూనిస్టుల సాంప్రదాయక శిక్షణకు వ్యతిరేకమనీ చెప్పారు. ఆనాటినుంచే మానాన్నగారి మీద ఆయనకోవిధ మయిన అనురాగగౌరవాలు యేర్పడినయి. అంతేకాక మానాన్నగారు సంస్కృత, వంగభాషల్లో నిష్ణాతులని రాయ్‌గారు విన్నారు.

మానాన్నగారు లక్నోనుంచి బయలుదేరేముందు కపూర్ రెస్టారెంటు అనే భోజనశాలలో ఒక అపరిచిత వ్యక్తి కనిపించి రాయ్‌సాహిత్యాన్ని కొంత మానాన్న గారి చేతిలోపెట్టి మానాన్నగారి చిరునామా అడిగారుట. మానాన్నగారికి అనుమానం వేసి పేరుచెప్పి తప్పించుకున్నారుట. తరవాత ఆ అగంతకుడు హెచ్. ఆర్ మహా జని అనే రాయిస్టు అని మేం వినటం లీలగాగుర్తు.

మానాన్నగారు వాల్తేరు తిరిగి వచ్చింతరవాత కొన్నాళ్లకు పార్టీసెల్‌లో రాయ్‌గారి ప్రసక్తి వచ్చినప్పుడు, రాయ్ సిద్ధాంతాన్ని చర్చించాలని పట్టుబడితే, యితరులు అంగీకరించక రాయ్ చర్చనీయాంశం కాకూడదని రాయ్‌ని ఆడిపో శారుట. మానాన్నగారు కమ్యూనిస్టు పార్టీనుంచి మెల్లిగా వేరయిపోయారు. ఈలోగా ములుకుట్ల వెంకటశాస్త్రిగారు ఫైజుపూరు కాంగ్రెసుకు మదరాసునుంచి కుందూరి ఈశ్వర దత్తుగారి సంపాదకత్వాన వెలువడే పీపుల్స్‌వాయిస్ అనే పత్రిక తరఫున మానాన్నగారి సిఫారసుమీద హాజరయి రాయ్‌గారక్కడ యిచ్చిన ఉప న్యాసానికి ముగ్ధులయి మానాన్నగారికి చెప్పారు.

రాయ్‌గారు మొదటిసారిగా మన రాష్ట్రానికి (అప్పుడు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఉండేది) 1937 ఆగస్టులో వచ్చారు, వెన్నెలకంటి రాఘవయ్యగారి ఆహ్వానం మీద ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీల మహాసభను నెల్లూరులో ప్రారం భించటానికి. అక్కణ్ణించి శరీరస్వాస్థ్యం తప్పి ములుకుట్ల వెంకటశాస్త్రిగారి ఆహ్వా నం మీద కాకినాడ వచ్చారు. కాకినాడకు రాయ్‌గారి సతీమణి ఎల్లెన్ కూడా రాయ్ అస్వస్థతగురించి తెలుసుకుని బొంబాయినుంచి వచ్చేసింది. మానాన్నగారు వెంటనే కాకినాడవెళ్ళి మొదటిసారిగా రాయ్‌గారిని కలుసుకున్నారు. అప్పటికే మానాన్న గారిని గురించి యెంతో విన్న రాయ్‌గారు మానాన్నగారిని చూడగానే పక్కమీంచి లేచి నిలబడి కావలించుకుని ఆదరించారు. వైద్య సహాయానికీ, విశ్రాంతికీ అను వుగా వుంటుందనీ, వాల్తేరులో కొన్నాళ్లుండిపొమ్మనీ మానాన్నగారు రాయ్‌గారిని ఆహ్వానించారు. రాయ్‌దంపతులు వాల్తేరు వచ్చారు. అలావచ్చి ఓ నెలన్నర

పాటు విశ్రాంతి తీసుకుని బొంబాయి వెళ్ళిపోయారు. మానాన్నగారూ ఆ ఆరు వారాలూ రాయ్‌గారితో దేశంలోని రాజకీయ పరిస్థితులగురించీ, అంతర్జాతీయ పరిస్థితుల గురించీ కూలంకషంగా చర్చించేవారు. రాయ్‌గారికి మానాన్నగారిమీద అమోఘమైన అనురాగమేకాక గౌరవంకూడా యేర్పడింది. రాయ్‌గారి అపారమేధాశక్తికి మానాన్నగారు సమ్మోహితులైపోయారు. అప్పట్నుంచీ మానాన్నగారు రాయ్‌గారి అనుచరులుగా మారి వారి నాయకత్వం కింద రాజకీయాల్లోనూ, పునరుజ్జీవనోద్యమంలోనూ పరిశ్రమించారు.

ప్రపంచయుద్ధం ప్రకటించిం తరవాత 1940లో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని రాయ్‌గారు ప్రారంభించారు. ఆ పార్టీ కేంద్రకార్య నిర్వాహక వర్గసభ్యులుగా మానాన్నగారిని రాయ్‌గారు నియమించారు. తరవాత ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో పార్టీనీ, రాయ్‌గారి ఆధ్వర్యంకింద యేర్పడిన ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరునీ విస్తరింప చేసేందుకు మానాన్నగారిని Provincial Organiserగా యం. యన్. రాయ్‌గారు మదరాసుకి పంపారు.

మానాన్నగారు మూడు నెలలు యూనివర్సిటీలో సెలవుపెట్టి పార్టీ తరఫున పని చెయ్యటానికి మదరాసులో మవుంటురోడ్డుకానుకుని ఉన్న 77 బి. హారిస్ రోడ్డులో మేడమీద ఒక భాగం అద్దెకు తీసుకుని పార్టీ కార్యాలయం ప్రారంభించారు. ఆయనతోపాటు యిప్పటి ప్రసిద్ధ మలయాళీ రచయిత యం. గోవిందన్, కుంజునాయర్ అనే యువకులు పార్టీ కార్యకర్తలుగా పనిచేసేవారు. అప్పటికే రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ ప్రపంచ యుద్ధంలో భారతదేశం పాల్గొనాలని నిర్ణయించింది. ఆ సందర్భంగా మా నాన్నగారు యుద్ధానికి అనుకూలంగానూ, పార్టీ లక్ష్యాలను ప్రచారం చేసేందుకు మదరాసు సముద్రతీరాన బహిరంగ సభలు నిర్వహించేవారు. మా నాన్నగారిక్కానీ, గోవిందన్‌కు కానీ తమిళం వచ్చేది కాదు. అంచాత సుందరం అనే కార్మిక యువకుణ్ణి పట్టుకొచ్చారు, తమిళంలో ఉపన్యసించేందుకు. ప్రతిరోజూ పార్టీ ఆఫీసులో గ్రూపు మీటింగులు జరుగుతుండేవి. అలా ఒక సమావేశానికి సి. యన్. అన్నాదురై వచ్చారు. ఆ రోజుల్లో అతను రామస్వామి నాయకర్ అనుచరుడుగా ఉండేవాడు. మొదటి సమావేశంలోనే మా నాన్నగారికి సన్నిహితుడయి పోయాడు. అన్నాదురై తమిళంలో మహావక్త. అతన్ని ముఖ్యోపన్యాసకుణ్ణిగా పెట్టి మా నాన్నగారు బహిరంగ సభల్ని

పార్టీ తరపున నిర్వహించేవారు. రాను రాను అన్నాదురైను చాలావరకు బ్రాహ్మణ వ్యతిరేకోద్యమంనుంచి పతిత పీడిత జనోద్ధరణకూ, భారతీయ పునరుజ్జీవనంకూ మా నాన్నగారు మళ్ళించ కలిగారు. చాలా యేళ్ళ తరవాత ఆయన తమిళనాడు ముఖ్యమంత్రిగా ఉన్న రోజుల్లో ఓసారి యాదృచ్ఛికంగా ఢిల్లీ తమిళనాడు భవనంలో నేను కలుసుకోవటం తటస్థించింది. నేను ఫలానా అని చెప్పుకోగానే నన్ను కావిలించుకుని నాకు రాజకీయ వికాసాన్ని ప్రసాదించింది రామకృష్ణరావే అని అంటూ మా నాన్నగారి క్షేమ సమాచారాలు అడిగారు.

మా నాన్నగారు పార్టీ వ్యవహారాల్లో దక్షిణ భారతం విషయంలో రాయ్ గారికి ఆంతరంగిక సలహాదారుడుగా ఉండేవారు. మా నాన్నగారి అభిప్రాయాలను ఆయనెంతో మన్నించేవారు. ఇతర రాష్ట్రాల్లో ప్రాంతీయ మహాసభలు జరిగినప్పుడు మా నాన్నగారిని ప్రారంభించేందుకో, అధ్యక్షత వహించేందుకో పంపించేవారు. అలా ఓసారి బీహారులో నేషనల్ డెమోక్రాటిక్ ఫ్రంటు మహాసభ జరిగినప్పుడు ఆ సభను ప్రారంభించేందుకు పంపించారు. ఆ రోజుల్లో ఆయన ఉపన్యాసం దేశంలోని వివిధ పత్రికలూ ప్రచురించినయి.

1940 ప్రాంతంలో అనుకుంటాను, యం. యన్. రాయ్‌గారు Indian Renaissance Association అనే సంస్థను ప్రతిపాదించారు. అందులో నిర్వాహక సభ్యులుగా లక్ష్మణశాస్త్రి జోషి, సచ్చిదానంద వాత్సాయన, ఎల్లెన్ రాయ్, మానాన్నగారూ నియమితులయారు. మా నాన్నగారికి మొదట్నించీ నాటక రంగంలో అభిరుచి యెక్కువ అని రాయ్‌గారికి తెలుసు. ఈ సమాజాన్ని స్థాపించిన తరవాత రాయ్‌గారు మా నాన్నగారితో అంటూండే వారు, నాటకరంగాభ్యుదయాని క్కూడా నువ్వు యిహ శ్రమ చెయ్యమంటూ. అయితే ఆ రోజుల్లో రాజకీయ కార్యక్రమంతోనే వున్న వ్యవధి అంతా తీరిపోయేది.

మా నాన్నగారు మదరాసులో పార్టీ Provincial Organiser గా ఉన్నప్పుడు అక్కడ నేషనల్ వార్ ఫ్రంటుకు Capt. జి. టి. బి. హార్వేగారనే ఆంగ్లేయుడు Provincial Organiser గా వుండేవారు. ఓసారి ఆయనతో మదరాసు రాష్ట్రంలో యుద్ధ సహాయం యెలా జరుగుతోందో చర్చించటానికి మా నాన్నగారు వెళ్లారు. ఆ చర్చలో యెన్నో విషయాలు, ముఖ్యంగా యం. యన్. రాయ్‌గారి కార్యక్రమం గురించీ చర్చించిన తరవాత ప్రసంగవశాత్తు

నాటకరంగం ప్రసక్తి వచ్చింది. అంతే అన్నీ మరిచిపోయి యిద్దరూ ప్రపంచ నాటకరంగాన్ని పరిశీలనగా విశ్లేషించుకోవటం జరిగింది. మరో రెండు రోజుల తరవాత హార్వేగారు మా నాన్నగారిని యింటికి భోజనానికి ఆహ్వానించి బాగా పొద్దు పోయే దాకా నాటకరంగం గురించే మాట్లాడుకున్నారు. హార్వేగారి సతీమణి కూడా నాటకరంగాభిమాని, ఇద్దరూ లండనులో బ్రిటిష్ డ్రామాలీగ్‌తో ప్రత్యక్ష సంబంధం వున్నవారు. నాటకంలో మా నాన్నగారికున్న ఆసక్తికీ, అభిరుచికీ వారిద్దరూ ముగ్ధులయి తెలుగునాట నాటకోద్యమానికి పూనుకోమని ప్రోత్సహిస్తూ తమకు తోచిన సహాయం చేస్తామన్నారుట.

కొన్నాళ్లకు యుద్ధసన్నాహానికి యెలాంటి సహకారం ఇవ్వగలమో సూచనలిమ్మని మా నాన్నగారిని హార్వేగారు అధికార రీత్యా అడిగినప్పుడు, అందుకు జవాబుగా మా నాన్నగారు, యుద్ధానికి పెద్ద సహాయం, ప్రజల్ని ప్రశాంత చిత్తుల్నిగా వుంచేందుకు ప్రయత్నించటమేనని జవాబు చెప్పారుట. అందుకొక సాధనం నాటకరంగం అనీ, మంచి నాటకాలద్వారా ప్రజలకు వినోదం కల్పించవచ్చుననీ సూచించారుట. వెంటనే హార్వేగారు మా నాన్నగారిని అందుకు పూనుకోమని ప్రభుత్వం తరఫున ధనసహాయం కల్పించారు. అయితే 'మా నాన్నగారు' తలపెట్టిన నాటక ప్రణాళికకూ, యుద్ధ ప్రచారానికీ యెటువంటి సంబంధమూ లేదు: తదనుగుణంగా ప్రభుత్వంతో మా నాన్నగారు ఒప్పందం కుదుర్చుకున్నారు. ఓ సంవత్సరంపాటు మా నాన్నగారికి ప్రభుత్వ ఆదేశానుసారం యూనివర్సిటీవారు సెలవు మంజూరు చేశారు. ఈలోపున మా నాన్నగారు యం. యన్. రాయ్‌గారిని కలుసుకుని ఆయనకి నచ్చచెప్పి నాటకరంగంలో తిరిగి ప్రవేశించారు. మా నాన్నగారు 1936లో ప్రారంభించిన నాట్యగోష్ఠి ఉద్యమానికి అనుబంధంగా 'నటాలి' అనే నాటక సమాజాన్ని స్థాపించి నాటకాలు తెలుగు నాట నాలుగు చెరగులా ప్రదర్శించారు. మదరాసులో చూసిన తరవాత 'కన్యాశుల్కం' ప్రదర్శన తిలకించేందుకు కెప్టెన్ హార్వేగారు ప్రత్యేకంగా విశాఖపట్నం వచ్చారు. కళింగ ప్రాంతంలో ఆ నాటక ప్రదర్శనకు ప్రేక్షకులు యెలా స్పందిస్తారో చూసేందుకు వచ్చారు. 'నటాలి' ఆ రోజుల్లో అపురూప సంచలనం కలిగించింది. అది వేరే కథ.

మా నాన్నగారు పార్టీలో కార్యకర్తగానే కొనసాగారు. రాయ్‌గారితో సన్నిహితంగా పని చేస్తూనే ఉండేవారు. 1948లో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని

రద్దుచేసి రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమాన్ని ప్రారంభించారు రాయ్‌గారు. అందులో కూడా మా నాన్నగారు ప్రముఖపాత్ర వహించారు. యం. యన్. రాయ్ గారు 1954లో పరమపదించారు. ఆయన జీవితకాలంలో ప్రతి సంవత్సరం దేశం అంతా పర్యటిస్తూ వాల్తేరు వచ్చి కనీసం ఒక వారంరోజులన్నా ఉండి పోయేవారు. ఉన్నన్నాళ్లూ మా నాన్నగారితో కాలక్షేపం చేసేవారు. రాజకీయ తాత్త్విక సంబంధమైన విషయాలను మా నాన్నగారితో ప్రతీ ఉదయం, సాయం కాలం చర్చిస్తూండేవారు. మా కుటుంబానికి చాలా సన్నిహితంగా ఉండేవారు. మా నాన్నగారికి 1937 నుంచీ రాయ్‌గారు ఎన్నో ఉత్తరాలు రాశారు. 1940 ప్రాంతంలో మా యింటి మీద పోలీసు దాడి జరిగినప్పుడు కొన్ని ఉత్తరాలు పోయినయి. దొరికినవన్నీ నేను స్వయంగా ఢిల్లీలోని నెహ్రూ మ్యూజియం వారికివ్వగా వారు భద్రపరిచారు.

అబ్బూరి వరద రాజేశ్వరరావు

# మా నాన్నగారు

1919 ప్రాంతం. కలకత్తాలో బౌ బజారు వీథిలో ఒక సభా ప్రాంగణం. అక్కడ వంగ దేశీయాంధ్ర సమితి వార్షికోత్సవం జరుగుతోంది. ఆ సమితికి అధ్యక్షులు (సర్) సి.వి. రామన్‌గారు. ఉపాధ్యక్షు డొక విద్యార్థి. అలాంటి సమా వేశాలకు ఆంధ్రులందు ఆదరమూ, అభిమానమూ కలిగిన ఒక ప్రఖ్యాత వంగ పండితుణ్ణి సమితివారు ఆహ్వానిస్తుండేవారు. ఆ ఏడు విఖ్యాత తర్క విద్యావేత్తా, "ఎ హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్" అనే మహాగ్రంథానికి కర్తా అయిన సతీశ చంద్ర విద్యాభూషణులు అధ్యక్ష స్థానం అలంకరించారు. సి. వి. రామన్‌గారు ఓ రెండు ముక్కలు మాట్లాడారు. ఆ తరవాత ఉపాధ్యక్షు డయిన విద్యార్థి ఓ అరగంటసేపు అనర్గళంగా సంస్కృతంలో సభాసదుల నుద్దేశిస్తూ ఉపన్యసించాడు. సి. వి. రామన్‌గారికీ కొంచెం సంస్కృత జ్ఞానం ఉన్నది. ఉపన్యాసానంతరం రామన్‌గారు ఉపాధ్యక్షుణ్ణి భుజంమీద తట్టి దక్షిణ భారత గౌరవాన్ని నిలబెట్టావని అభినందించాడు. సదస్యులలో ఆసీనులై ఉన్న సహ విద్యార్థులు, మాగంటి బాపినీడూ, ఉప్పల లక్ష్మణరావు ఆనందంతో కరతాళధ్వనులు చేస్తూనే ఉన్నారు. ఆ తరవాత సతీశచంద్ర విద్యాభూషణులు ప్రసంగిస్తూ ఆంధ్రుల ప్రాచీన వైభవాన్ని ప్రశంసిస్తూ, తెలుగు మేధావులెంత ప్రతిభానంపన్నులో గుర్తించాలంటే అప్పుడే ప్రసంగించిన ఉపాధ్యక్షుడి వైదుష్యాన్ని పేర్కొనవచ్చునన్నారు. ఉపాధ్యక్షుడి పేరు అబ్బూరి రామకృష్ణరావు —మా నాన్నగారు.

ఆ సభలో ప్రత్యేకంగా ఆహూతులైన వారిలో హేరంబ మైత్రగారు ఉన్నారు. హేరంబ మైత్రగా రారోజుల్లో ప్రసిద్ధికెక్కిన సిటీ కాలేజీలో ప్రిన్సిపాలుగా పని చేస్తున్నారు. మా నాన్నగా రక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. హేరంబ మైత్రగారు అత్యంత ప్రముఖ విద్యావేత్తగా వంగ రాష్ట్రంలో పేరుపొందినవారు. బ్రహ్మసమాజాభిమాని.

1916 సంవత్సరం దాకా ఓ రెండేళ్ళు మైసూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేసి కలకత్తాకు వచ్చారు మా నాన్నగారు. మైసూరులో ఉండగా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సంస్కృత కళాశాలలో సహాధ్యాయిగా ఉండే వారు. సంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడే మా నాన్నగారు రాసిన "మల్లికాంబ'' ప్రచురితమయింది. కట్టమంచి రామలింగారెడ్డిగారు ఆ రోజుల్లో మైసూరు ప్రభుత్వంలో విద్యాశాఖలో ఉద్యోగం చేస్తుండేవారు. ఓ రోజున ఓ "మల్లికాంబ" ప్రతి ఆయన కళ్ళపడ్డది. వెంటనే ఇంటికి తీసుకుపోయి పదే పదే చదివారుట. అనంతకృష్ణశర్మగారికి కట్టమంచి రామలింగారెడ్డిగారితో సన్నిహిత పరిచయం అప్పటికే ఉంది. ఆ మర్నాడు శర్మగారు తన్ని చూడటానికి వచ్చి నపుడు, రామలింగారెడ్డిగారు "మల్లికాంబ'' ప్రతిని చూపించి తెలుగు కవిత్వానికి మాంచి భవిష్యత్తుందని గ్రహించానని చెప్పారుట. ఆ గ్రంథకర్త ఎక్కడి వారో ఎవరో తెలుసుకో మన్నారుట. అనంతకృష్ణశర్మగారు చటుక్కున "ఆ అబ్బాయి మన కళాశాలలోనే చదువుతున్నాడండీ" అని చెప్పటం, మరి కొన్ని రోజులకే ఆయనతో పాటు మా నాన్నగారు రామలింగారెడ్డిగా రింటికి పోయి సన్నిహిత వర్గంలో ఒకరై పోవటం జరిగింది. ఆ తరవాత ఆ ముగ్గురూ కలిసి కవిత్రయం రాసిన మహాభారతాన్ని పారాయణం చేసి పునః పరిశీలించటం చేసేవారు. అప్పటికే మా నాన్నగారు కవిగా లబ్ధప్రతిష్ఠులు.

ఆ రోజుల్లో ''ఆంధ్ర భారతి'' అనే ఓ సారస్వత పత్రిక ఉండేది. అందులో గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, మా నాన్నగారూ తమ కృతులను ప్రకటించేవారు. ఆంధ్ర భారతి తరవాత "ఆంధ్ర గ్రంథాలయ సర్వస్వం" అనే పత్రిక వచ్చింది. అందులోనూ ఈ ముగ్గురూ రాసిన ఖండ కావ్యాలను ప్రచురించేవారు. ఆ పత్రికా సంపాదకులు అయ్యంకి వెంకట రమణయ్య గారు. ఓసారి—1962 ప్రాంతం అనుకుంటాను— వెంకటరమణయ్యగారు నాకు బెజవాడలో కనిపించారు. నే నాయన్ను శైశవం నుంచీ ఎరుగుదును. ఆ మాటా, ఈ మాటా వచ్చి ఆధునిక కవిత్వానికి గురజాడ. రాయప్రోలు, అబ్బూరి కవిత్రయం లాంటి వారన్నారు. ఆధునిక కవిత్వానికి ముగ్గురూ మార్గదర్శకులు కావటమే కాక, వారి రచనలు ఒకే కాలాన ప్రచురితం కావటం విశేషం.

మా నాన్నగారు కలకత్తాకు వచ్చేటప్పటికి ఇరవై సంవత్సరాల వయస్సు. సోదరాంధ్రులలో ఆయన పేరు అప్పటికే సుపరిచితం కావటంవల్ల ఆయన

కలకత్తాలో వంగదేశీయాంధ్ర సమితికి ఉపాధ్యక్షులుగా ఎన్నికయారు. మా నాన్నగారికి పూర్వం అదే పదవిని అక్కిరాజు ఉమాకాన్తంగారు నిర్వహించారు. ఆయన ఆ రోజుల్లో నవద్వీపంలో సంస్కృతం అభ్యసించి పేరు సంపాయించారు.

వంగదేశయాంధ్ర సమితి వార్షికోత్సవం అయిన అయిదార్రోజులకి హేరంబ మైత్ర మా నాన్నగారిని తన గదిలోకి పిలిపించుకుని ఆయన సంస్కృతోపన్యాసాన్ని అభినందించారుట. అంతేకాదు. అక్కడే ఉండిపొమ్మని సలహా చెప్పారుట. రవీంద్రనాథ ఠాకూరుగారితో హేరంబమైత్రగారికి సన్నిహిత పరిచయం ఉండేది. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని, విశ్వభారతిలో కూడా చదువుకోవచ్చుననీ, ఆర్థిక సమస్య లుండవని సూచించారుట.

మా నాన్నగారు నవ్వి ఊరుకున్నారు. అప్పటికే తెలుగుదేశానికి తిరిగి పోవాలని తాపత్రయపడుతుండేవారు. తెలుగువారి మధ్య బతకాలనే కోరిక అనుక్షణం ఆయన్ని వెంటాడుతూండటంవల్ల ముందుగా ఆనర్సులో చేరి, తరవాత ఒక్క బి. ఏ. నే నిర్ణయించుకోవటం జరిగింది. హేరంబ మైత్రగారి గదినుంచి కళాశాల ఆవరణలోకి వచ్చారు. అటూ ఇటూ ఎత్తుగా 'తమాల వృక్షాలు—ఆకాశం వంక చూస్తూ ఏం చెయ్యాలనే ఆలోచనలో పడి నడుస్తున్నారు. అంతలోకి తను కలకత్తాలో కాలు పెట్టకముందు రాసిన పద్యాలు గుర్తుకొచ్చినాయి.

నోటినిండ భుజింపఁగా నోఁచికొనము
ఉదయగీతుల పాడ నోపెదము కాని
కన్న తల్లుల ప్రేమమార్గమ్ముఁ గనము
లలితగతి వీణ వాయింపఁగలము గాని
తొడిమ లెడసేయగా రాలి పడిన పూల
వలపు లేవి ? భిక్షాం దేహి భవతి : భవతి !

స్వాదు కృష్ణానదీ జలస్నానములను
పులక లొలయఁగ వినయాంజలులు ఘటించి
నవ్యగీతాశుభాధ్యయనమ్ముఁ జేయు
సోదరకుమారకు లెదురుసూచుచుంద్రు,

తడవు సేయక మాతృవాత్సల్య మింత
తిరుగు బిడ్డల కిమ్మింక, మరలి యరుగ
వలయుఁదల్లి! భిక్షాందేహి భవతి! భవతి!

* * * *

మా నాన్నగారు కలకత్తా విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉన్నపుడే ఆయన పద్య సంకలనం మదరాసునుంచి వెలువడింది. ఆ పుస్తకం పేరు 'ఊహాగానం —పూర్వప్రేమ'. ఈ పుస్తక ప్రచురణ 1918. ఆ రోజుల్లో ఆ పుస్తకం బహుళ రసికామోదం పొంది ఆధునికాంధ్ర కవిత్వానికి శ్రీకారం చుట్టిన కొద్ది పుస్తకాల్లోనూ ఒకటయింది. "ఊహాగానం" వ్యాకరణరీత్యా దుష్టసమాసం. 'ఊహగానం' అని ఉండాలి. అయితే శ్రవఃపేయంగా ఉండేందుకు మా నాన్నగారలా స్వతంత్రించి ఉపయోగించడంవల్లనూ, ఆయన సంస్కృత జ్ఞానాన్ని శంకించలేకపోవడంవల్లనూ, అందరికీ అంగీకారయోగ్యమై, ఒక వినూత్న రూఢపదం అయిపోయింది. ఈ రోజుల్లో పత్రికలు వాడే పదజాలంలో కూడా చోటు చేసుకుంది.

ఈ పద్య సంకలనంలో మా నాన్నగారు తెలుగుపద్య ప్రచురణలో ఒక విప్లవాత్మకమైన పద్ధతి ప్రారంభించారు. తెలుగు వాఙ్మయంలో మొదటిసారిగా పద్యాల పేర్లు తీసిపారేశారు. ఆ రోజుల్లో అదో విడ్డూరం. తరవాత తతిమ్మా కవులు తమ పుస్తకాలు అచ్చవుతున్నప్పుడు ఈ పద్ధతినే అనుసరించారు.

ఈ సంకలనంలో ఆ కాలంలో అంతర్జాతీయ ఖ్యాతి పొందిన కోడి రామమూర్తి మీద మా నాన్నగారు రాసిన పద్యం ఉంది. మా నాన్నగారు కలకత్తాలో విద్యార్థిగా ఉన్నప్పుడు కోడి రామమూర్తిగారు కలకత్తాలో ప్రదర్శన లిచ్చేవారు. వరసగా ఓ రెండు, మూడు నెలలు ప్రదర్శనలు నడిచేవి. ఆయన మీద అభిమానం కొద్దీ మా నాన్నగారు "ఆంధ్రవీర కంఠీరవ" అనే పద్యాన్ని రాసి రామమూర్తిగారికి పంపారు. రామమూర్తిగారు వెంటనే మా నాన్నగారున్న ఇంటికి వచ్చి చూసి, ఆయన అంత చిన్నవారని ఆశ్చర్యపడి పోయారట. ఆ పద్యాల్ని సిలుకు రుమాళ్ళమీద అచ్చొత్తించి తెలుగువారికి పంచిపెట్టారుట రామమూర్తిగారు. "నీ యశఃపారిజాతమ్ముల మాల" అనే పంక్తితో ప్రారంభమవుతుందీ

పద్యం. ఈ ఒక్క పంక్తినీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి తెలుగు దేశంలో ఆనాటి ప్రతి కవి ముందూ చదివేవాడు. 'యశఃపారిజాతమ్ములు' అనే పదసందోహం ఒక అబ్బూరి రామకృష్ణరావుకే చేతనవు ననేవాడు. మా నాన్నగా రంటే శాస్త్రి కెంత అభిమానం! కోడి రామమూర్తిగారు తన ప్రదర్శనల్లో ప్రత్యేకాహూతులకు వేరుగా, ముందుగా ఆసనాలు వేయించి ఉంచేవారు. ఆయన ప్రదర్శనలకు గవర్నర్లూ, మహారాజులూ, ఆంగ్లేయ ప్రముఖులూ హాజరయేవారు. అలా ఆసనాల పక్కగా మా నాన్నగారికీ, మా అమ్మగారికీ రెండు కుర్చీలు ప్రతీ రోజూ కేటాయించి ఉంచేవారు ఓ రోజున గవర్నరుగారి కుటుంబం వచ్చి మా నాన్నగారికి కేటాయించిన రెండు కుర్చీలూ తీసుకుంటామన్నారుట. రామమూర్తిగారు ఒప్పుకోక, 'ఆ కుర్చీలు అలా ఉండవలసిందే, లేకపోతే ప్రదర్శన కంతరాయం కలుగుతుందని గవర్నరుగారి కార్యదర్శికి కబురు పెట్టారుట! మా నాన్నగారి మీద అంత అభిమానం రామమూర్తిగారికి!

కలకత్తా విశ్వవిద్యాలయంలో డిగ్రీ పుచ్చుకున్న తరవాత కొన్నాళ్ళు శాంతినికేతనంలో గడిపి ఆంధ్రప్రదేశానికి తిరిగి వచ్చారు మా నాన్నగారు. తెనాలిలో కాపురం పెట్టారు. ఆయన బాల్యస్నేహితులైన గోవిందరాజుల సుబ్బారావు, పిల్లలమర్రి సుందరరామయ్య, పోతుకూచి శ్రీరామమూర్తి, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య తెనాలిలోనే ఉన్నారు. వెంకటసుబ్బయ్య మా నాన్నగారికి సాహిత్యంలో అత్యంత సన్నిహితుడు. మా నాన్నగారి చేత కవిత్వం రాయించటమే వెంకటసుబ్బయ్య ధ్యేయం. మా నాన్నగారు పద్యాన్ని ముందుగా మనస్సులో అల్లిన తరవాత కాని కాగితంమీద పెట్టేవారు కాదు. శుద్ధప్రతి రాసినట్లు రాసేవారు. అది కూడా చెయ్యనియ్యకుండా వెంకటసుబ్బయ్య ఆపని తనే చేసేవాడు మా నాన్నగారిచేత పద్యాలు చదివించుకుని. వెంకటసుబ్బయ్య కూడా ప్రతిభావంతుడయిన కవి. అయితే మా నాన్నగా రంటే అతనికి వెర్రి వ్యామోహం.

కలకత్తా నుంచి కొత్తగా తిరిగి వచ్చిన రోజుల్లో మా నాన్నగారు చెప్పిన ఆరు పద్యాలు రాసిపెట్టాడు (ఇప్పుడు ఇందులో మూడు పద్యాలే మిగిలినయి). అచ్చు కాకపూర్వం ఈ పద్యాలు స్నేహితవర్గాల్లో బహుళ ప్రచారం పొందినయి. ఇందులో ఓ పద్యాన్ని నేను అమెరికాలో ఉన్నప్పుడు ప్రసిద్ధ కవి డబ్ల్యు. హెచ్. ఆడెన్‌గారికి తతిమ్మా పద్యాలతోపాటు వినిపించటం జరిగింది. ఆయన ఆ పద్యం

విని అలా ఆలోచిస్తూ కూచుండిపోయి "ఎన్నాళ్ళయిందో ఇలాంటి పద్యానికి నా హృదయం స్పందించటం" అన్నారు.

ఈ యతిలోక మోహన మహీతల మందున తోడులేక పా
ధేయము లేక సిగ్గిలి మదీయ మనోహర భావపల్లవ
చ్ఛాయలలోన వ్యర్థపు విచారముతో ననవాప్తకామ్యముల్
రోయుచు భగ్నమాలికలు ప్రోవులు సేయుచు సంచరించెదన్.

నేనే కాదు సమస్త భూత తతియున్ నిర్వేద భారమ్ముచే
నానా భంగుల లాలనీయగతులన్ నా గీతమే పాడు లో
కా నీకమ్ములలోన లోన నొక హాహాకార ముద్భూతమై
శ్రీ నారాయణి పాదనీరజ రజాశ్లేషమ్ము కాంక్షించెడిన్.

ఇవి రాసిం తరవాత ననుకుంటాను—కొన్నాళ్ళకి వెంకట సుబ్బయ్యగారికి పారమార్థిక చింతన ప్రారంభమై హఠాత్తుగా అందరికీ దూరమై ఏ అగమ్య సీమలకో పయనమైపోయారు. మా నాన్నగారు వెంకటసుబ్బయ్యను ఆఖరి క్షణం దాకా తలచుకుంటూ ఉండేవారు.

ఓసారి తెనాలిలో ఉన్న రోజులలో మా నాన్నగారు బజారుకని ఇంటినించి బయలుదేరారు. దారిలో కూరలమ్మే మనిషి ఓ ఇంట్లోకి వెళ్ళాడు. అతని కోసం నిరీక్షిస్తూ రోడ్డుమీద మా నాన్నగారు నిలబడిపోయారు. ఆ ఇంటి కెదురింటి పక్క నున్న మరో ఇంట్లో నుంచి ఎవరో అద్భుతంగా పద్యం పాడుతూండటం విని పించింది.

నా కాఠిన్యము నాపయిన్ విడిచి, నగ్నమ్మైన నా ముగ్ధ వాం
ఛా కళ్యాణ పదమ్ములం జెరిపి; స్వేచ్ఛాకీరమున్ పంజర
స్వీకారమ్మున ద్రోసిపుచ్చి యిపుడే వీధీ విటంకమ్ములన్
బ్రాకం బోయెద పీ వయో విరహభారశ్రాంతి మోయించుచున్...

ఆ పద్యం మా నాన్నగారు రాసిందే! అలా పాడే దెవరా అని విస్మ యంతో వింటుండగా మా నాన్నగారికి స్ఫురించింది. ఆ ఇంట్లో సహాధ్యాయి

పోతుకూచి శ్రీ రామమూర్తి ఉంటున్నాడని. మెల్లిగా లోపలికి ప్రవేశించారు. శ్రీ రామమూర్తిగారు నవ్వుతూ లేచి ఆ పద్యం పాడిన వ్యక్తిని మా నాన్నగారికి పరిచయం చేశారు. ఆయన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య! ఆ పరిచయంతో మా నాన్నగారి జీవితంలో ప్రారంభమైన పరివర్తనం ఇంతా అంతా కాదు.

* * * *

దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంతో మా నాన్నగారి రచనా వ్యాసంగం తగ్గిపోయిందనే చెప్పాలి. ఎంచాతనంటే గోపాలకృష్ణయ్యగారి కున్న సాహిత్య ప్రీతి ఆయన ఆరాధించే దేశవిముక్తి ముందు బలహీనమై రాజకీయ కార్యరంగం ప్రముఖమయింది. మా నాన్నగారు గోపాలకృష్ణయ్యగారిని అనుసరించారు. గోపాలకృష్ణయ్యగారి దగ్గర ఎన్నో సాహిత్య గోష్ఠులు జరిగినా, రచనా వ్యాసంగం మాత్రం, ఆయన చేత ప్రభావితులైన లబ్ధ ప్రతిష్ఠులైన కవులకు అందరు ఆశించినంతగా సాగలేదు. రాయప్రోలు సుబ్బారావుగారిని గోపాలకృష్ణయ్యగారు సిఫారసుచేసి హైదరాబాదు పంపించేశారు. మిగిలింది మా నాన్నగారూ, బసవరాజు అప్పారావుగారూను. కేవలం గోపాలకృష్ణయ్యగారి వ్యక్తిత్వంతోనూ, ప్రతిభతోనూ ఆయన సాహచర్యంలోనూ సంతృప్తి పడి ఎక్కువగా రాయలేదు. మా నాన్నగారికి మరో అంతరాయం ఏర్పడింది. ఆయన మనసులోనే కవిత్వాన్ని అల్లి ఎన్నాళ్లకోకాని కాగితంమీద పెట్టేవారుకాదు. అలా ఆయన రాయదలుచుకున్న గీతాలు మరో రెండు సంపుటాలయేవి. గోపాలకృష్ణయ్యగారి సాహచర్యంలో ఆయన వాటి ప్రసక్తికి మళ్లీ పోక రాజకీయరంగంలో పరిశ్రమించారు.

అంతకు పూర్వం ఆయన తెలుగు కవిత్వంలో చెయ్యగలిగినన్ని వినూత్న ప్రయోగాలు చేశారు. మొదటిసారిగా ఉర్దూలోని గజల్ ఛందస్సును తెలుగులో ఉపయోగించి చూశారు. రూఢిలో లేని భుజంగప్రయాతాన్నీ, మధ్యాక్కరనీ, రగడనీ విభిన్న ధోరణిలో ప్రయోగించారు. ఇంతచేసినా, అక్కిరాజు ఉమాకాన్తం గారు ఓ నాలుగయిదు సంవత్సరాల తరవాత అభినవాంధ్ర కవిత్వంమీద రాసిన నిశిత విమర్శ "నేటి కాలపు కవిత్వం" అనే అపురూప గ్రంథంలో మా నాన్నగారి రచనల్ని స్పృశించలేదు. ఆనాడు లబ్ధప్రతిష్ఠులైన కవుల్నందరినీ ఆయన ఎద్దేవా చేశారు. విమర్శించారు. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు ఉమాకాన్తం

గారిని అడిగారుట— "ఏమండీ ! అబ్బూరి రామకృష్ణరావుగారి రచనల్లో ఏం లోపాలూ తమరికి కనిపించ లేదా, ఆయనొక్కణ్ణి వదిలేశారే !" అని.

ఉమాకాన్తంగా రన్నారుట— "అంతే-ఆయనకి చక్కని భాషాజ్ఞానమూ, అలంకారజ్ఞానమూ, కవనప్రజ్ఞా ఉండటంవల్ల నే నెదురు చూసిన లోపాలు కనిపించటం లేదు" అని.

మా నాన్నగారు గోపాలకృష్ణయ్యగారు ప్రారంభించిన చీరాల సత్యాగ్రహంలో ఆయన కుడి భుజంగా నిలబడి అహోరాత్రులూ పని చేశారు. ఆ కార్య నిమగ్నతలో పిత్రార్జితానికి కరారావడి చుట్టేశారు. ఆ కాలంలో ఆయన రాసింది గాంధీగారిని చూట్టానికి పోయినపు డో శ్లోకం, జలియన్ వాలాబాగ్ జంగం కథా (ప్రభుత్వం నిషేధించింది), చాటువులూ. అంతే. చీరాల సత్యాగ్రహం విఫలమైన తరవాత మదరాసు పోయి ''చందమామ'' అనే పత్రికను బాలల కోసం ప్రారంభించే ప్రయత్నం చేశారు. ఆ పత్రిక్కి, దేశంలోని అగ్ర చిత్రకారులందరూ బొమ్మలు గీసి పంపించారు. అందులో రహ్మాన్ చూగ్తాయి, గుర్రం మల్లయ్య, ప్రమోదకుమార చటర్జీ ప్రభృతులున్నారు. అయితే ఆయన ప్రత్యేకంగా విదేశాల నుంచి తెప్పించిన ఖరీదైన కాగితం ఆంధ్రపత్రికా ముద్రాలయంలో ఉంచితే, కర్మంకాలి చెద పట్టిపోయింది. ఈ పత్రిక గురించే చక్రపాణికి నేను చెప్పి చెప్పి, బి. యన్. కె. ప్రెస్సు ఆచారప్పను వీధిలో ఉన్నప్పుడు ఆయనచేత పిల్లల పత్రిక మరొదాన్ని ప్రారంభించేందుకు ప్రోత్సహించాను. "చందమామ" ముఖపత్రం—అదొక్కటే అచ్చేయించారు అప్పటికి— చాలాకాలం మా దగ్గిర ఉందది. ఆయన పెట్టిన పేర్లన్నీ జయప్రదమయేవి. ''ఈనాడు" అన్న పేరును కర్నూలు మిత్ర బృందం వారు దిన పత్రికను ప్రారంభిద్దామనుకున్నప్పుడు మా నాన్నగారు సూచించి వారిచేత డిక్లరేషను తెప్పించారు. ఆ తరవాత ఆ పత్రిక ప్రారంభం కానప్పుడు మరొకరు వాడుకోవడం జరిగింది.

చీరాల, మదరాసు తరవాత బందరు పురాణం సూరిశాస్త్రిగారి ఆహ్వానం మీద వెళ్ళారు. బందరులో కొంత రచనా వ్యాసంగం తిరిగి చేపట్టారు. అక్కడే కృష్ణా పత్రికలో "రసమంజరి" అనే సాహిత్య విభాగం ఏర్పరించి "సూర్యరాజు కథలూ", ''నదీ సుందరి'' అనే నాటకం, కొన్ని ఖండకావ్యాలూ రాసి, ప్రచురిం

చారు. బందరులో ఉండగానే "మంగళసూత్రం" అనే నవల కూడా రాశారు. కౌతా శ్రీరామశాస్త్రిగారు నిర్వహించిన "శారద" అనే మాస పత్రికకు కూడా రాసేవారు. అయితే రాశి తక్కువ. ఆయన మనస్సెప్పుడూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారు ప్రారంభించిన నవసమాజ నిర్మాణం మీద ఉండేదని అప్పటి ఆయన సహ చరులు నాతో చెప్పగా విన్నాను. అంచాతనే కేవలం రచనా వ్యాసంగానికి ఆయన మనస్సు అంకితం కాలేకపోయింది.

అయితే మళ్ళీ ఆ స్వల్ప కాలంలో ఆయన రాసినవి కొన్నే అయినా అవన్నీ ఆధునికులకు ఆరాధ్యాలై అనుసరణీయా లయినయి. ఆయన "నదీ సుందరి" చదివిన తరవాతనే విశ్వనాథ సత్యనారాయణగారు "కిన్నెరసాని" రాయటం జరిగింది. ముందుగా నదీసుందరి నాటకాన్ని కృష్ణాపత్రికలో చదివి తనెంత ముగ్ధులయారో సత్యనారాయణగారే నాతో ఓసారి చెప్పారు. "రామకృష్ణా రావు అలాంటి మనోరహమైన కథాంశాన్ని కావ్యంగా ఎందుకు రాయలేదు. రాస్తే ఎంత బావుణ్ణు" అని అనుకున్నారుట. అంచాతనే తను మరొక ప్రక్రియను అవలంబించి ప్రయోగం చేశారుట—ఇంచుమించు అలాంటి కథాంశాన్ని.

ఓసారి బందరులో విశ్వనాథ సత్యనారాయణగారు మా ఇంటి కొచ్చారుట. అప్పటికే నాగేంద్రరావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, కౌతా శ్రీరామశాస్త్రిగారు మా ఇంట్లో ఉన్నారు. ఆ రోజుల్లో సత్యనారాయణగారు సాహితీ సమితితో విభేదాలు వచ్చి విడిగా "జయంతి" పత్రిక నడుపుతున్నారు. సత్యనారాయణగారు మా నాన్నగారిని ఏమన్నా రాయమనటానికి వచ్చారు. ఎక్కువ శ్రీ రామశాస్త్రిగారిని చూసి మాట్లాడలేకపోయారు.

కొంతసేపయిన తరవాత మా నాన్నగారి నుద్దేశించి "రామకృష్ణరావుగారూ! మీరు బొత్తిగా రాయటం మానేశారు. ఈసారి ఓ బృహత్కావ్యాన్ని రాయండి— ఆధునిక కవిత్వానికి తగినంత ప్రశస్తి లభిస్తుంది" అన్నారు.

మా నాన్నగారు చిరునవ్వు నవ్వుతూ "అసలు నే నెందుకు రాయాలి?" అన్నారుట.

''అదేంటండీ, అలా అంటారు, చదివే వాళ్లకోసం కదా" అన్నారుట పింగళి నాగేంద్రరావు.

"నేను రాసింది నచ్చని వాళ్ళసంగతీ! వాళ్ళకోసం నేను రాయాలా— అది కాదు—నా కోసం రాసుకుంటాను. నే నెందుకు రాయలన్నది నా సమస్య" అన్నారు మా నాన్నగారు.

మదరాసులో ఉండగా ఓసారి పింగళి నాగేంద్రరావుగారు కనిపించి 'మీ నాన్న ఘటికుడయ్యా — ఒకంతట రాయడు" అంటూ ఈ సన్నివేశాన్ని చెప్పారు.

ఆ తరవాత నేను అమెరికాలో విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయంలో తెలుగు సాహిత్యాచార్యుడిగా వెళ్ళుతున్నప్పుడు విశ్వనాథ సత్యనారాయణగారిచేత పద్యాలు చదివించి రికార్డు చేసి నాతో తీసుకుపోయాను.

సత్యనారాయణగారు— "మఱల నిదేల రామాయణ మన్నచో" అనే సీస పద్యం చదువుతున్నారు. మధ్యలో ఆపి, ''ఈ పద్యం రాస్తున్నప్పుడు మూడు నాలుగు దశాబ్దాల క్రితం మీ నాన్న నాతో అన్న మాటలు గుర్తుకొచ్చినయి. ఆ తాత్పర్యమే పరోక్షంగా ఈ పద్యంలో కనిపిస్తుంది. మీ నాన్న రాయవలసిన బృహత్కావ్యాన్ని నేను రాశాను'' అన్నారు.

బెజవాడలో ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రారంభమైనప్పుడు మా నాన్న గారు బందరు వదలి వచ్చేశారు. యాదృచ్ఛికంగా జూన్ నెలాఖరవుతోందనగా బెజవాడ వచ్చారు. బందరులో ఆయన రాసిన ఆఖరి పద్యం :

రసిక హృదయము లోలలాడే
　　మనుపు దినములు మరలి వచ్చెను
మిసిమి మబ్బులు క్రాలు మేలిమి
　　ముసుగుతో నాకసము విచ్చెను!
తరలిరా, ఆషాఢ లక్ష్మి!
　　మెరపు తీవలు తొలకు రథమున,
మురిపెమున దిక్కాంత లలరగ
　　తరలిరా! మేఘముల పథమున!

ఇవన్నీ ముత్యాల సరాలు. ఇందులో కూడా ఓ వినూత్న ప్రయోగం చేశారు. మళ్ళీ ఓ పాతికేళ్ళదాకా మా నాన్నగారు కవిత్వం రాయలేదు. రాశారేమో—కాగితమ్మీద పెట్టలేదు.

*　　　　*　　　　*　　　　*

బందరు నుంచి కట్టమంచి రామలింగారెడ్డిగారి ఆహ్వానం మీద బెజవాడ వచ్చేశారు మా నాన్నగారు. అక్కడ ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని అప్పుడే నెల కొల్పారు. బెజవాడలో నాలుగైదేళ్ళున్నారో లేదో, విశ్వవిద్యాలయం వాల్తేరుకి తరలిపోయింది. దాంతోపాటు వాల్తేరుకు మా నాన్నగారూ మకాం మార్చ వలసివచ్చింది.

బెజవాడలో ఉన్నప్పుడు అక్కడ ప్రఖ్యాతి పొందిన కళాకారులందరూ మా నాన్నగారిని చూడటానికి వచ్చేవారు. కపిలవాయి రామనాథశాస్త్రి, పారుపల్లి సుబ్బారావు, అద్దంకి శ్రీ రామమూర్తి ప్రభృతులతోపాటు బసవరాజు అప్పారావు గారు తరుచూ వస్తుండేవారు. శ్రీ రామమూర్తిగారు, అప్పారావుగారూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి అభిమానులు. శ్రీ రామమూర్తిగారు గోపాలకృష్ణయ్యగారు పద్యం ఎలా చదివేవారో, పాటని ఎలా పాడేవారో విని తన్మయులై, అలాగే తనూ చదవాలనీ, పాడాలనీ సాధన చేసేవారు. అలాగ శ్రీ రామమూర్తిగారు సంగీత ఫణితి ఒక విశిష్టమైన బాణీగా తెలుగు నాటకరంగంలో ప్రఖ్యాతమైంది. శ్రీ రామమూర్తిగారి సంగీత సాధన చాలాసార్లు మా ఇంట్లో చేసి మా నాన్నగారి ఆమోదముద్ర వేయించుకునేవారు. ఆయన మా ఇంట్లో కూచుని మా నాన్నగారి ముందు పాడుతూన్నప్పుడు జనం ఇంటిచుట్టూ పోగయేవారు.

బసవరాజు అప్పారావుగా రోసారి మా ఇంటికొచ్చినప్పుడు శ్రీ రామమూర్తిగారు పాడుతున్నారు. ఆయన వచ్చి కూచున్నాడో లేదో, మా నాన్నగారు శ్రీ రామమూర్తిగారిని "యమునా కళ్యాణి"లో పాడమన్నారు ఓ శ్లోకాన్ని. అప్పారావుగారు గొంతెత్తి.

ఏలపాడే నింక యమునాకళ్యాణి, నే
లీలామానవుడు గోపాలుడు లేడాయే

బంగారు గనులలో
చెంగలించే వేళ
పిడుగు బోలిన వార్త
వినిపించినారయ్యో ॥ఏల॥

చెడు వార్త వినగానె
చెవులు గింగురుబోయె
ఎంత చించుకున్న
గొంతు పెగలదాయె ॥ఏల॥

ఈనాటి యీ నేస్త
మే జన్మకో తిరిగి
కన్నీళ్లు గారవకె
కడుపు చెరువయ్యె నే

నేలబాడే నింక యమునాకళ్యాణి, మా
లీలామానవుడు గోపాలుడు లేడాయె

అని ఆలపించారు.

రెండు రోజుల క్రితమే దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు దివంగతులయారు. ''గోపాలకృష్ణయ్యగారికి యమునా కళ్యాణి అంటే అత్యంతాభిమానం. చెవులు కోసుకొనేవారుట ! శ్రీ రామమూర్తిగారు రాగాలాపన మానేసి మా నాన్నగారి వంక చూసి వలవలా ఏడ్చారుట.

మా నాన్నగారూ కన్నీళ్ళు కార్చారుట. గోపాలకృష్ణయ్యగారికి తన అభిమానుల మీద అంత ప్రభావం ఉండేదన్న మాట. ఆయన సాహచర్యంలో కవిత్వాన్ని అనుభవించేవారు. కవిత్వంలో జీవించేవారు ఆయనా, ఆయన సన్నిహితులూను. తెలుగుదేశ దౌర్భాగ్యంవల్ల గోపాలకృష్ణయ్యగారికి జరగవలసిన సంస్మరణ సత్కారం జరగలేదు. అంచాతనే బసవరాజు అప్పారావుగా రారోజుల్లోనే గోపాలకృష్ణయ్య మరణానంతరం రాసిన గీతాల్లో,

కాలచక్రము గతి గడచి తెనుంగు
భావి భాగ్యమెల్ల పండిన వెనుక
ఆనాటి కెవరైన నడుగక పోరు
గోపాలకృష్ణ దేగోష్ఠి వాడటంచు

భాగ్యవశమ్మున భావికాలాన
అమృతతుల్యమ్ములు నతిభావభరిత
ములునైన నా గీతముల వినినంత
గోపాలకృష్ణుని గొప్ప దీపించు

అంటూ చెప్పుకున్నారు.

మా నాన్నగారు, గుమ్మడిదల సుబ్బారావు, నడింపల్లి లక్ష్మీనరసింహారావు కలిసి గోపాలకృష్ణయ్యగారి జీవితాన్ని సమగ్రంగా గ్రంథస్థం చేయసంకల్పించారు కాని, విధి అనుకూలించలేదు.

మా నాన్నగారు బెజవాడలో ఉన్నప్పుడే గుడిపాటి వెంకటచలంగారు బదిలీ మీద రావటం తటస్థించింది. మా నాన్నగారికి మరో స్నేహితుడలా దొరికారు. వెంకటచలంగారు సాయంకాలంపూట షికారుకు పోయినప్పుడల్లా మా ఇంటివేపోసారి వచ్చి వెళ్ళేవారు. వెంకటచలంగారిల్లు ఓ సాహిత్య సత్రంగా ఉండేది. అక్కడికొచ్చేవాళ్ళు మా ఇంటికొచ్చి మా నాన్నగారిని చూసి పోతూండేవారు. ఆ రోజుల్లోనే ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయానికి ఒకే ఒక పుస్తకం, ఒకే ఒక బల్లా, ఒకే ఒక కుర్చీతో మా నాన్నగారు శంకుస్థాపన చేశారు ! కాలక్రమేణా దేశంలోని ఉత్తమ గ్రంథాలయాలతో సమానంగా దాన్ని తీర్చిదిద్దారు. అంతేకాదు. బ్రిటిష్ పాలనలో సమస్త ప్రపంచ వామపక్ష రాజకీయ సాహిత్యం—ముఖ్యంగా మార్క్సిస్టు సాహిత్యం—ఒక్క ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయంలోనే—సమగ్ర శ్రేణిమీద చోటు చేసుకుంది. ఆ సాహిత్యాన్ని అతి మెళకువతో విదేశాలనుంచి సేకరించింది మా నాన్నగారే ! యుద్ధకాలంలో బ్రిటిష్‌ప్రభుత్వం పసిగట్టి కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఉన్నప్పుడు ఆ సాహిత్యాన్ని గ్రంథాలయంనుంచి తొలగించింది.

ఆ రోజుల్లోనే బళ్ళారి రాఘవాచారిగారు మా నాన్నగారిచాత ఓ నాటకం రాయించి వేయించాలని విశ్వప్రయత్నం చేశారు. నెల నెలా ఓ కార్డు ముక్క బళ్ళారి నుంచి రాసేవారు. రాఘవాచారిగా రప్పుడు బళ్ళారిలో పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉండేవారు. నాటక ప్రదర్శనల కోసం సర్కారు ప్రాంతాలకు వచ్చినప్పుడల్లా బెజవాడలో దిగి నాన్నగారిని చూసి పోయేవారు. ఆయన పోరు పడలేక "తెలుగు సంసారం" అనే నాటకం రాయటం ప్రారంభించి ఓ అంకం మాత్రం పూర్తి చేశారు. దాని రాతప్రతిని ఊరికి తిరిగిపోతూ రాఘవాచారిగారు పోగొట్టుకున్నారు. మా నాన్నగారు నాటకం జోలికి మళ్ళీ పోలేదు. అయినా రాఘవాచారిగారి ఒత్తిడి మాత్రం తగ్గలేదు.

అదే కాలంలో ఓసారి వెంకటచలంగారు నవ్వుతూ తనో నాటకం రాస్తున్నాననీ, వీలైతే చింతా దీక్షితులుగారి సహకారం కూడా తీసుకుంటాననీ అంటూండేవారు. మా నాన్నగా రాయన మాట నమ్మి ఓసారి పోలేపెద్ది సుబ్బారావుతో "ఒరే, వెంకటచలం చాత నాటకం రాయించరా, చూద్దాం" అన్నారు.

ఓ అయిదార్నెల్ల తరవాత సుబ్బారావు కనిపించి— "వెంకటచలం రాసేది పేరడీ— అసలు నాటకం కాదు. దానికితోడు నీ పద్యం ఒకదాన్ని వాడేశాడు" అన్నాడు.

తరవాత కొన్నాళ్ళకు వెంకటచలంగారి రాతప్రతిని చూశారు. అందులో అప్పుడు ప్రచారంలో ఉన్న తెలుగు చాటువులన్నిటితోనూ కలిపి ఓ హాస్యనాటికగా వెంకటచలంగారు రూపొందించారు. అందులో మా నాన్నగారు చీరాలలో ఉన్నప్పుడు ఆశువుగా చెప్పిన పద్యాన్ని— దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని సంబోధిస్తూ వెంకటచలంగారు తమ నాటికలో వాడుకున్నారు. పండితరాయల్ని గోపాలకృష్ణయ్య పేరడీ చేస్తే ఆయన్ని మా నాన్నగారు పేరడీ చేశారు.

ఉపమాపై పెసరట్టుపై యిడిలిపై
హుమ్మంచు చూపించు నీ
జపసంబద్ధ పరాక్రమ క్రమ కటా
క్షశ్రేణి మన్నించి శు

ప్రభవు జిల్లేబి పకోడి ల ద్వగయిరా
పై కొంత రానిమ్ము శ్రీ
చపలాపాంగ సితాంగనా హృదయపా
శా : పూజ్య వస్తుప్రియా :

పండితరాయలు ఢిల్లీ దర్బారులో చదివిన శ్లోకంలో 'లవంగీ కురంగీ దృ గంగీకరోత్వు' అన్నారు. దాన్ని 'ఫరంగీ ఫిరంగీదృ గంగీకరోతు' అంటూ గోపాల కృష్ణయ్యగారు పేరడీ చేశారు. దీనికి జవాబుగా పైపద్యం చివరి పంక్తి మా నాన్నగారు వాడారు.

ఇంతకీ వెంకటచలంగారి రాతప్రతిని పోలేపెద్ది సుబ్బారావు తనతో తీసుకుపోతూ పారేసుకున్నాడు :

*   *   *   *

మనసులోని యాలాపము
మాటలలో మారిపోవు
ఎత్తిన కవితాదీపము
వత్తి కుమిలి యారిపోవు :

ఎలుగులేని వెలుగు లేని
హేమంత మ్మోయి పుత్ర :
ఈ చీకటి రాజధాని
కేలా యీ దండయాత్ర ?

బెజవాడనుంచి విశాఖపట్నం తరలివచ్చిం తరవాత అక్కడి కవిత్వ పరంగా శ్రీ రంగం శ్రీనివాసరావుని మా నాన్నగారు పెంచుకున్నారు. అంచాతనే శ్రీ శ్రీ తన కిద్దరు నాన్న లంటూ రాసుకున్నాడు. పై పంక్తు లతన్ని ఉద్దేశించి మా నాన్నగారు రాయప్రోలు రాజశేఖరు పట్టుదలమీద రాసిన ఓ సుదీర్ఘ కవిత లోనివి. ఈ కవితను, ఆయన హైదరాబాదు వచ్చినప్పుడు రాజశేఖరు రేడి

యోలో ఉద్యోగం చేస్తూ మా నాన్నగారిచేత పట్టుపట్టీ రాయించాడు. ఒక్క గంటలో రాసిపెట్టారు. తరవాత రేడియోలో మా నాన్నగారిచేత చదివించాడు.

అప్పటికి మా నాన్నగారు కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒక రవటం, అందులో విశ్వాసం సడలి నవ్యమానవవాదిగా మారిపోవటానికి రమారమి రెండు దశాబ్దాలు పట్టింది. శ్రీనివాసరావు మా నాన్నగారు ఆశించినప్పుడు కాక యుద్ధానంతరం కమ్యూనిజంలో విశ్వాసం కుదుర్చుకున్నాడు. 'పొరబాటీ తిరుగుబాటు, తిరుగుబాట తిరిగి చాట' మని మా నాన్నగారతన్ని హెచ్చరించారు. అతన్ని మళ్ళీ మంచి కవిత్వం రాసుకోమని అర్థించారు. అతను వినకపోయినా, మా నాన్నగారి కతనిమీద అభిమానం పోలేదు. మా నాన్నగారి మీద అతనికి గౌరవమూ తగ్గలేదు.

ఓసారి మా నాన్నగారు మదరాసు పోవలసి వచ్చింది. అక్కడ మా నాన్నగారు ఊళ్ళోకి వచ్చారని తెలిసి శ్రీనివాసరావు అయన్ని చూడ్డానికి వచ్చాడు. ఇద్దరూ కలిసి ఎక్కడో భోంచేసి సాయంకాలం సముద్రతీరానికి పోయారు. మా నాన్నగారు తన చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుంటూ పోయారు. మదరాసు ఓ విశిష్టమైన సాంస్కృతిక కేంద్రంగా ఎలా ఉండేదో, ఇప్పుడెలా మారిపోయిందో చెబుతున్నారు. శ్రీనివాసరావు నిజమే నన్నాడు. అంచాతనే తనకు తిరిగి విశాఖపట్నం వెళ్ళి, అక్కడే శేషకాలం గడపాలని ఉందనీ చెప్పాడు.

"కేవలం శేషకాలం కోసమేనా ?'' అన్నారుట మా నాన్నగారు.

"కాదు, నేను రాయదలచుకున్న వన్నీ అక్కడే పూర్తి చేస్తాను. ఈ ఊబిలోంచి ఎలా బయట పడాలో తెలీటంలేదు'' అన్నాడు.

మా నాన్నగా రప్పటికి హైదరాబాదుకి మకాం మార్చలేదు. మారుద్దామనుకుంటున్నారు.

"నాకూ విశాఖపట్నం మీద మోజు తగ్గుతోంది. అక్కడా మంచి ఎరిగున్న వాతావరణం లేదు. అంతా మారిపోయింది. హైదరాబాదు కూడా పోవాలని లేదు. మరోచోటికి పోగలమేమో చూడు" అన్నారు.

శ్రీనివాసరావుకి తలకాయ పని చెయ్యలేదు. శ్రీనివాసరావు మదరాసు వద ల్లేదు. మా నాన్నగారు విశాఖపట్నం వదిలేశారు. హైదరాబాదు వచ్చినా అక్కడి వాతావరణం సాహిత్య వ్యాసంగానికి అనుకూలంగా లేదని గ్రహించారు. అంచా తనే ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకుని,

ఏనాడో రావలసిం దీవారణపురికి మనం
ఆ విశాల వటవృక్షం నిశ్చల నిభృతాగారం
ఇంకా నిలిచే ఉన్నది. నాడు మనకు చిన్నతనం
అల్లదుగో : స్వర్ణశిఖర దేవమందిర ద్వారం
నిన్నూ నన్నూ యెరుగరు నేటి కొత్త పూజారులు
పరిచిత కంఠస్వరాలు చెవులకు పండుగ చేయవు
అటూ యిటూ నిర్మించిన కొత్త కొత్త రహదారులు
ఆ వెనకటి సుధాస్మృతులు వేరొకరుతి వినసీయవు
అసంబద్ధ యశోవాంఛ పరచింతాపరాఙ్ముఖత
ప్రబలే యీ నగరంలో ఏమున్నది తుదకు ఫలం ?
అంతులేని ధనపిపాస అనాగరక నాగరకత
ఈ రొదలో ఎలా మనం మనుగడ సాగించగలం ?
గతం గడిచిపోయిందని ఏలా యీ అనుతాపం ?
కాలం నర్తకి, బహుశా మారుస్తున్నది రూపం !

అనే సానెటు రాశారు.

ఈ పద్యాన్ని శ్రీనివాసరా వెంతో మెచ్చుకుంటూ, "అలాంటిదే నేనూ రాద్దామనుకున్నాను. రామకృష్ణారావుగారిలా నేను రాయలేకపోదును. ఆయన ఎంపిక చేసిన ఛందస్సు అపురూపం'' అన్నాడు.

మేము 'కవిత' ప్రారంభించి మొదటి సంపుటం అచ్చయిం తరవాత రుక్మిణీనాథశాస్త్రి తను ఓ పద్యం రాస్తున్నట్టూ, రాయగానే పంపిస్తున్నట్టూ ఉత్తరం రాశాడు. అందులో 'మీ నాన్నగారు మరి రాయనంటూ రాసిన గీతం ఒక్కటి చాలు ఆయన ప్రతిభ పదికాలాలపాటు నిలిచేందుకు'' అని మా నాన్నగారి గీతం లోని చివరి భాగాన్ని తిరిగి రాశాడు.

నీ వధిరోహించిన యీ అల
నిత్యం శాశ్వతము సుమా
నే కల్పించిన యీ కల
నిజం నిజం వాస్తవికం
అంతులేని యీ జీవన
కాంతారాంతరముల నీ
చింతాదీపం బెంతటి
చిన్ని చిన్ని వెలుగిడినా
అంతెచాలు నంతెచాలు
అంతకన్న లేదు మేలు
ఈ యనంత పరిష్వంగ
మెచ్చటి కచ్చటికె సరి
అజ్ఞాతాజ్ఞేయాలకు
అజ్ఞానంతో నేస్తం
హేకవేర కుమారికా
శ్రీకర శ్రోతః శీకర
లాలిత నిటలాలక ! హే
లాస్య చరణ సంచారిణి !
నందనవాసిని ! కవితా
సుందరీమణీ ! రమణీ !
అన్యాశ్రయములలో నీ
సన్యాసిని మరచిపొమ్మ
నీ నికుంజ సీమలలో
నిన్నారాధించే జనములు
భావుకులూ బంధువులూ
భావియనక భూతమనక
కలకాలం కలల వోలె
వెలిగింతురు నీదు తోట
అమరలోక సంవాసిని !
అమృతహాసినీ ! వాణీ !

ఆఖరి రోజుల్లో ఢిల్లీ వచ్చారు మా నాన్నగారు. అక్కడ ఉంటున్నప్పుడు స్నానాల గదిలో పడి కాలు విరుచుకున్నారు. అవసానదశ అంతా మంచంలోనే గడిపారు. ఆ రోజుల్లోనే మిత్రుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ వచ్చి ఆయన చాటువు లన్నింటినీ పోగుచేసుకుపోయాడు. మా నాన్నగారు మంచంనుంచే సుబ్రహ్మణ్యశర్మ కోరినట్టుగా వాటిని తన పత్రికలో ప్రకటించేందుకు అనుమతించారు. ఆ అవస్థలో రోజూ ఆయనకి దినపత్రికలూ, ఆయన కోరిన పుస్తకాలూ చదివి వినిపించేవాళ్ళము. ఓసారి ఎజ్రాపౌండు జైలుజీవితం మీద ప్రకటితమైన పుస్తకాన్ని చదివించుకున్నారు. పౌండు అంటే ఆయనకి ఎనలేని గౌరవం.

మరోసారి ఆల్డస్ హక్స్లీ ఆఖరి రోజుల మీద ఆయన భార్య లోరా రాసిన విపుల గ్రంథాన్ని చదివించుకున్నారు. హక్స్లీకి మన ఆధ్యాత్మికచింతనంలో విశ్వాసం ఉండేది. పరలోకం మీద ఆలోచన లుండేవి. మరణించిన వారితో మాట్లాడటం సంభవమని నమ్మేవాడు కూడాను. ఆ పుస్తకాన్ని చదవటానికి మాకు రెండు, మూడు రోజులు పట్టింది. పుస్తకం అంతా విని "హక్స్లీ కూడా ఇలాంటి వాడయితే ఏంచెయ్యగలం?" అన్నారు మా నాన్నగారు. అప్పుడప్పుడలా చెప్పినట్టే ఓ పద్యం చెప్పారు.

> చచ్చిపోయి జీవి యెచ్చటి కేగునో
> ఏమియగునొ ఎవరి కెరుగరాదు
> ఎరుకలేనివార లేమేమొ చెప్పగా
> విని తపించువారు వేనవేలు!

అదే ఆయన ఆఖరి పద్యం.

—ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక, సెప్టెంబర్ —అక్టోబర్ 1987.

గోపాలకృష్ణ అబ్బూరి

# కొన్ని జ్ఞాపకాలు

ఒకరోజు రవీంద్రభారతి నుంచి నేనూ మా నాన్నగారూ రాత్రి పదిగంటల ప్రాంతంలో రిహార్సల్స్ తరవాత ఇంటికి వెళుతూ ఆనాటి రిహార్సల్స్ గురించి మాట్లాడుకున్నాము. శకారుడి వేషం ప్రవర్తనల విషయంలో కాబోలు చర్చించుకుంటున్నాం. నా దృష్టిలో మృచ్ఛకటిక నాటకం క్రీస్తుశకం మూడో శతాబ్దం కన్నా ముందుది. అందువల్ల శకారుడిని శకజాతీయుడిగా నేను భావించాను. మా నాన్నగారేదో అభ్యంతరం తెలియజేస్తూ శూద్రకుడి విషయంలో ఎన్నో వివాదాలున్నాయనీ, కాలం స్పష్టంగా తెలియదనీ అంటూ ఏదో చెప్పబోగా నేను తీవ్రంగానే నాకు తోచిన జవాబిచ్చాను. మాతోపాటు వస్తూన్న కీ. శే. మంత్రి శ్రీనివాసరావు నేను తీవ్రంగా మాట్లాడటాన్ని నిరసించాడు. అప్పుడు మా నాన్నగారు "నేనెప్పుడూ నా కొడుకుల మీద నా భావాలను రుద్దలేదు. వాళ్ళనీ నా స్నేహితులుగానే చూశాను. మీ అందరికీ ఉన్నట్టుగానే గోపాలకృష్ణకీ నన్ను విమర్శించే అధికారముంది" అంటూ సర్దిచెప్పారు. ఆ తరవాత అసలు సమస్యని ప్రశాంతంగా చర్చించుకుని నిర్ణయం తీసుకున్నాం. మా యింట్లో మా నాన్నగారికీ మాకూ బంధుత్వం కన్నా ఆత్మీయ స్నేహగుణమే ప్రముఖంగా ఉండేది. ఆ కారణంగా ఆయన్ని జ్ఞాపకం చేసుకునేటప్పుడు స్నేహితుడైన మహా మనీషిగా మాత్రమే భావించి నాకు తెలిసిన కొన్ని విషయాలను నేను అక్షరబద్ధం చేస్తున్నాను.

నాకు మా చిన్నతనంలో మా అక్కయ్య పంపిన గ్రీటింగ్ కార్డులను చూసి చిత్రలేఖనం మీద అభిమానం కలిగింది. నేను బొమ్మలు గీయడం ప్రారంభించాను. చినవాల్తేరులో గోడలమీదా కాగితాలమీదా బొగ్గుతో ఆకుపసరుతో ఎర్రమట్టితో నేను వేసిన బొమ్మలు మా నాన్నగారి దృష్టి నాకర్షించడంతో నా జీవితంలో కొత్త ద్వారం తెరుచుకున్నట్టయింది. వొక రోజున నన్ను కూర్చో

పెట్టుకుని అజంతా చిత్రాల గురించీ, రాజస్థానీ మొగల్ చిత్రకళల గురించీ, శాంతినికేతనంలో అవనీంద్రనాధ్ ఠాగూరు, నందలాల్ బోస్, ప్రమోదకుమార్ ఛటర్జీల గురించీ కథలుగా చెప్పడం ప్రారంభించారు. ఆయన చెప్పేతీరువల్ల కాబోలు అందుకు సంబంధించిన చిత్రాలనన్నిటినీ చూడాలని అనిపించింది. అప్పటికి నాకు పది సంవత్సరాల వయసుంటుంది. మర్నాడు నన్ను ఆంధ్రా యూనివర్సిటీ లైబ్రరీకి తీసుకువెళ్ళి, మాడర్న్ రివ్యూ, విశ్వభారతి క్వార్టర్లీ, శారద వంటి పత్రికల్లో ప్రచురితమైన వర్ణ చిత్రాలనీ, ఇ. బి. హావెల్, విన్సెంట్ స్మిత్, పెర్సీ బ్రౌన్‌ల గ్రంథాలనూ చూపించి వివరించారు తీరిక సమయాల్లో. అజంతా చిత్రాలు నాకు అందంగా కనబడ్డాయి గానీ జామినీ రాయ్, ప్రమోద్ కుమార్ ఛటర్జీవంటి చిత్రకారుల చిత్రాలు ఒక పట్టాన కొరుకుడు పడలేదు. తన లైబ్రరీ టిక్కెట్లమీద కొన్ని పుస్తకాలను ఇంటికి తీసుకొచ్చి, వాటిల్లో కొన్ని భాగాలని చదివి వినిపించి, చిత్రాలను వివరించి నా అభిరుచిని సరైన మార్గంలో పెట్టారు. ఆ చిత్రాలను చూసి నేను ప్రతికృతులను తయారుచెయ్యడం మొదలు పెట్టాను. రంగుల విషయంలో రేఖల విషయంలో నన్ను ఆయన సరిదిద్దుతుండే వారు. కొన్నాళ్ళకి ఆయన నన్ను మద్రాస్ పంపి అక్కడి స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో చేర్పించాలనుకున్నారు గాని కుటుంబ ఆర్థిక పరిస్థితి అందుకు అడ్డం వచ్చింది. అయితే మిత్రుల ద్వారా విజయనగరంలో శ్రీ అంట్యాకుల పైడి రాజుగారు వొక స్కూల్ నడుపుతున్నారని తెలిసి నన్ను వొక రోజున విజయనగరం తీసుకెళ్లారు. అక్కడ శ్రీ పైడి రాజుగారి చిత్రాలను చూసి మా నాన్నగారు ఆనందించారు. ఆ రోజుల్లో పైడి రాజుగారి చిత్రాలమీద దేవీ ప్రసాద్ రాయ్ చౌధురి ప్రభావం ఎక్కువగా ఉండేది. చివరకి విజయనగంలో నేను శ్రీ పైడి రాజుగారింటనే వుండి నాలుగేళ్ళపాటు చిత్రలేఖనం అభ్యసించాను.

అవకాశం దొరికినప్పుడల్లా మా నాన్నగారు నా చిత్రాలను విమర్శించి మంచి చెడులను చెబుతూవుండేవారు. ఆ మాటల్లో ప్రముఖ చిత్రకారుల గురించిన ముచ్చట్లు చెబుతూవుండేవారు. అవనీంద్రనాథ ఠాగూర్ 'అలంగీర్' అన్న చిత్రాన్ని చిత్రిస్తూండగా తాను చూశానని వొకసారి చెప్పారు. కర్ర పట్టుకొని కొంచెం ముందుకు వంగి నిలచిన ఔరంగజేబు చిత్రం అది. వీపుమీద రేఖను చిత్రించే సమయంలో అవనీంద్రనాథ్ చిత్రాన్ని గోడకానించి నిలబెట్టి గట్టిగా కుంచెని పట్టుకుని ఆయన కూర్చుని లేస్తూ అతిసున్నితమైన రేఖని చిత్రించారట.

వెంటనే నేనూ అలాగ చిత్రించాలని ప్రయత్నించి అది యెంత కష్టమైన పనో గ్రహించాను.

మరొకసారి మనసులోని భావాలను చిత్రరూపంలోకి మార్చేటప్పుడు ఎదుర్కొవలసిన ఇబ్బందులను సోదాహరణంగా వివరించారు. ఒకసారి అడివి బాపిరాజుగారు "జీవుడు—మృత్యువు" అన్న విషయం మీద చిత్రం రచించాలని అనుకుని ఎన్నో ప్రయత్నాలు చేశారట. కాని చిత్రం రూపొందలేదు. చివరకి ఆయన గురువుగారూ మా నాన్నగారికి మిత్రుడూ అయిన ప్రమోదకుమార్ ఛటర్జీ చెప్పారట, అలాంటి ఆబ్‌స్ట్రాక్ట్ భావాలని ప్రతీకల ద్వారా చెప్పాలని. చివరకి ఆయన సూచించిన జీమూత వాహనుడి కథను తీసుకుని విశాలంగా రెక్కలను జాపిన గరుత్మంతుడి ముందు నిలిచిన జీమూత వాహనుడి చిత్రాన్ని చిత్రించారట బాపిరాజుగారు. ఈ చిత్రం "శారద" పత్రికలో అచ్చయిన "హనుమంతరాయ చిత్రకళా మందిరము" అన్న వ్యాసంతోపాటు అచ్చయింది. ఆ వ్యాసాన్ని మా నాన్నగారే రాశారు. "శారద"లో చిత్రకళా ప్రదర్శనల సమీక్షలను మా నాన్న గారే రాసేవారు. ఆంధ్రజాతీయ కళాశాలతో మా నాన్నగారికి సన్నిహిత సంబంధాలుండేవి. ఆ కళాశాలలో కళావిభాగాన్ని ప్రారంభించాలని అను కున్నప్పుడు కోపల్లె హనుమంతరావుగారు మా నాన్నగారిని సంప్రదించగా అనాటికి ప్రచారంలోవున్న రవివర్మ సంప్రదాయాన్నిగాక శాంతనికేతనం కేంద్రంగా కొత్తగా వ్యాపిస్తూన్న జాతీయకళా సంప్రదాయాన్ని అనుసరించాలని చెప్పగా, అందుకు తగినవ్యక్తిని ఎంపికచేసే బాధ్యతను మా నాన్నగారి మీదే పెట్టారట. అప్పుడు కలకత్తా వెళ్లి అబనీంద్రనాథ ఠాకూరును కలిసి నందలాల్ బోసును ఆంధ్రదేశానికి పంపమనగా ఆయన నందలాల్‌ను వదులుకోవడానికి తిరస్కరిం చారట. ఇతర చిత్రకారులలో ఎవరూ నచ్చక పోవడంతో అబనీంద్రనాథ్ అనాటికి ప్రపంచానికి అంతగా తెలియని ప్రమోద్‌కుమార్ ఛటర్జీని పరిచయం చెయ్యగా ఆయన చిత్రాలు బాగుండడంవల్లా, చక్కగా మాట్లాడగలగడంవల్లా ఆయన్ని జాతీయ కళాశాలకు ఆహ్వానించారు మా నాన్నగారు. కృష్ణాపత్రిక అక్షరాలనూ, శారద ముఖచిత్రాన్ని, లోపలి చిత్రాలనూ చిత్రించింది ప్రమోద్‌కుమార్ ఛటర్జీ గారే. తెలుగు అక్షరాలకు కొత్త అందాలను ఆయన సంతరించారు. కళకు సంబంబంధించిన ఏ వ్యాసాన్నయినా, పుస్తకాన్నయినా తాను చదివి నచ్చితే వెంటనే నాచేత చదివించేవారు మా నాన్నగారు. పాబ్లొ పికాసోవంటి ఆధునిక

చిత్రకారుల చిత్రాలనూ భావాలనూ నాకర్థమయ్యేలా వివరించేవారు. హెర్బర్ట్ రీడ్ ఎరిక్ న్యూటన్‌ల గ్రంథాలను చదివించారు.

యూరప్‌లో రినైజాన్స్ యుగంతో ప్రవర్తిల్లిన రాఫేల్, లియొనార్డో డావిన్చి, మైకెలెంజిల్, బొటిసెల్లి వంటి చిత్రకారుల ప్రస్తావన వచ్చినప్పుడు యూరప్‌లో వచ్చిన రినైజాన్స్ యుగంలో ప్రారంభమైన సాహిత్యరీతుల్ని గురించి కూడా చెప్పడంతో సాంస్కృతిక రంగంగురించి నాకొక సమగ్రమైన అవగాహన కుదిరేలా చేశారు. ఆ కారణంవల్లనే నేను రంగస్థలం మీద మృచ్ఛకటిక, కన్యాశుల్కం, అంటిగనీ నాటకాలకు చేసిన దృశ్యకల్పన వేషభాషల విషయంలో నాటకాలకు ప్రాణమైన సాహిత్య శైలులనూ అంతర్గతంగా దాగివుండే భావాల సంకేతాలనూ అర్థం చేసుకోగలగడంవలన నా రూపకల్పనలు శంభుమిత్రా వంటి ప్రముఖుల ప్రశంసలకు పాత్రమైనాయని నా విశ్వాసం.

* * * *

వాక్క సంగీతం తప్ప మిగిలిన అన్ని కళలలోనూ నాకు కొద్దోగొప్పో ప్రవేశం ఏర్పడడంతో, హైదరాబాదులోని ప్రభుత్వ లలితకళల కళాశాలనుంచి పట్టాన్ని స్వీకరించినా చిత్రలేఖనంలో నేను ఏకాగ్రతను నిలుపుకోలేక మా నాన్నగారి మందలింపులకు చాలాసార్లు గురయ్యాను. చివరకి నాటకరంగంలోనే స్థిరపడవలసి రావడంతో ఆయన సమాధానపడక తప్పిందికాదు.

నాటకం రిహార్సల్స్ జరుగుతూన్నప్పుడు ఆయన ఏనటుడినీ ఇలా చెయ్యి అని ఆదేశించేవారు కారు. ఆ పాత్రయొక్క నడవడికనూ, ఆలోచనా సరళినీ విమర్శించి చూపి, ప్రపంచంలో అలాంటి వ్యక్తులను గురించి చెప్పి వొక అవగాహన కలిగించి, పాత్రచిత్రీ కరణమాత్రం నటుడికే వదిలివేసే వారు. ఆర్గానిక్ డెవలప్‌మెంట్‌ను ఆయన కోరుకొనే వారు. మెకానిల్ డెవలప్‌మెంట్‌కు బద్ధ విరోధి. మెకానికల్ డెవలప్‌మెంట్‌లో నటుడు కళాకారుడు కాలేడని ఆయన అనేవారు. మన నటుల్లో భావనాశక్తి లేని వాళ్ళకి ఇదంతా ఇబ్బందికరంగా తోచేది. చెప్పిందే చేస్తాం అనే నటుల్ని ఆయన వీలైనంత వరకూ తన నాటకాల్లో ఉండనిచ్చేవారు కాదు.

అయితే నటీనటులను 'సూపర్ మారియొనెట్స్'గా భావించే ఎడ్వర్డ్ గార్డన్ క్రెయిగ్ భావాలు ఆయనకు నచ్చేవి. ఆ పద్ధతిలో కూడా నటీనటులు కళాకారులై

ఉండాలని వాదించేవారు. మృచ్ఛకటికలో ఆఖరి దృశ్యంలో జనసమూహాలను డైరెక్ట్ చెయ్యడం కష్టంగాకా, నేను అందుకు పూనుకుని నటుల్ని కేవలం కొన్ని భంగిమలతో నిలబడటం, తక్కువ పరిధిలో నడవటం చేయించాను. చూడటానికి దృశ్యం బాగున్నా, నాటకంలోని అంతరార్థాన్ని నటులు అర్థం చేసుకోకపోవడం వలన యాంత్రికంగా తయారై, చివరకి మా నాన్నగారి భావాలే కరెక్ట్ అని వొప్పుకొనేటట్టు చేశాయి. మనోధర్మ సంగీతంలో, మనోధర్మ నాట్యంలో సాహిత్యంలో నటీనటులు సాధన చేసితీరాలని మా నాన్నగారు అంటూండేవారు.

*　　*　　*　　*

ఒకసారి గిడుగు రామమూర్తిగారు ఆంధ్రా యూనివర్సిటీ లైబ్రరీలో మా నాన్నగారిని కలవడానికి వచ్చారట. ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ బల్ల మీద ఉన్న సుభాషితాల సంకలనాన్ని యథాలాపంగా చేతిలోకి తీసుకు తెరిచి అందులోని వొక శ్లోకాన్ని చదివారట. ఆ శ్లోకంలోని భావం — ఒక వేశ్య సర్వాంగ సుందరంగా అలంకరించుకుని ఉండగా తండ్రి చనిపోవడంతో దుఃఖిస్తు పెదిమెలకు రాసుకున్న అరుణ వర్ణపు లేపనం చెరిగిపోకుండా, పెదిమెలు కలవకుండా జాగ్రత్త పడుతూ తాత, తాత ! అంటూ విలపిస్తోంది—అని. ఈ శ్లోకాన్ని చదవగానే గిడుగు వారు అన్నారట మన గ్రాంథిక వాదులు కూడా ఇలాగే ఏడుస్తూంటారని ! వెంటనే మా నాన్నగారు ఆ శ్లోకాన్ని చదివి గుర్తుంచుకున్నారట. ఓసారి ఎం. ఎన్. రాయ్ గారికి చెప్పగా ఆయన ఆనందించి నోట్ చేసుకున్నారట. తర్వాత ఓ సభలో ఆయన ఆ శ్లోకాన్ని చదివి 'మన కమ్యూనిస్టులు కూడా ఎర్ర రంగు చెరిగిపోకుండా ఇలాగే ఏడుస్తూంటా'రని వ్యాఖ్యానించారట. ఢిల్లీలో మరణశయ్య మీద ఉండగా మా నాన్నగారు ఈ శ్లోక విషయాన్ని గిడుగు, రాయ్ గార్ల వృత్తాంతాన్ని చెప్పగా కీ. శే. డాక్టర్ రమేష్‌బాబు కోరిక మేరకు ఆయన ప్రచురించ తలపెట్టిన గిడుగు సంచిక కోసం రాసిచ్చాను. డాక్టర్ రమేష్‌బాబు మరణంతో అది అంతరించినట్లున్నది.

*　　*　　*　　*

ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో ఏదోసభ జరుగుతోంది. విశ్వనాథ సత్యనారాయణగారూ, మా నాన్నగారూ ఆనాటి వక్తలలో ఉన్నారు. విశ్వనాథ

వారు తెలుగు పద్యాన్ని గురించి మాట్లాడుతూ ఆవేశపడిపోయి మన తెలుగు పద్యంలాంటిది ప్రపంచంలోనే లేదన్నారు. అంతేకాకుండా యతులు ప్రాసలు గురించి ప్రస్తావించి అసలు తెలుగు మాటల్లోనే మహాశక్తి వొకటి ఉందనీ అంటూ తన అద్భుతమైన బాణీలో కొన్ని పద్యాలు చదివి ఫలానా మాటలో ఫలానా అక్షరంలో ఇంతశక్తి ఉందంటూ మాట్లాడారు. ఆ తరువాత ప్రసంగం చెయ్య వలసిన మా నాన్నగారు లేచి అక్కడి సభలో వొకరిదగ్గరున్న వార్తాపత్రికను తీసుకుని సంపాదకీయాన్ని రాగవరసలో చదివి కొన్ని మాటల్లోవున్న కొన్ని అక్షరాలలో విశ్వనాథవారు చెప్పిన శక్తి ఉందనీ, నన్నయ్యో విశ్వనాథవారే కాకుండా ఎవరైనా ఇలాగ రాయగలరనీ విమర్శించి అక్కిరాజు ఉమాకాన్తం గారు తెలుగు ఛందస్సును విమర్శించడాన్ని గురించి చెప్పారు. ప్రసంగం ముగియ గానే విశ్వనాథ వారు మళ్ళీ మైక్ అందుకుని అద్భుతంగా కవిత్వం చెప్పిన రామ కృష్ణరావు పాశ్చాత్యవిద్యతో చెడిపోయినాడంటూ విమర్శించారు. మా నాన్నగారు నవ్వేసి ఊరుకున్నారు. సభలో అందరికీ ఇంక వీళ్లు మాట్లాడుకోవడం కూడా మానేస్తారన్న భావం కలిగింది. అయితే సభ ముగియగానే ఇద్దరూ కలిసి ఓ రిక్షా యెక్కి నవ్వుకొంటూ వెళ్ళిపోవడం ఆశ్చర్యం కలిగించింది అందరికీ.

*　　　*　　　*　　　*

పబ్లిక్ గార్డెన్స్‌లో కొత్త తరహా రంగాలంకరణతో తెరలూ అవీ లేకుండా కన్యాశుల్కం వేస్తున్నాం. ఆనాటి ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్యగారికి అది అభిమాన గ్రంథం. ప్రభుత్వం ధనసహాయం చేస్తానని మాటిచ్చింది. డబ్బు చేతికి రాకుండానే మా ప్రయత్నాలు మొదలుపెట్టేశాము. అందులో మీనాక్షి పాత్రధారిణి మల్లాది విజయలక్ష్మిని రిహార్సల్స్ పూర్తయిన తర్వాత ఇంటి దగ్గర దింపిరావలసిన బాధ్యత అసిస్టెంట్ డైరెక్టర్ డాక్టర్ పన్నూరి రామారావుకి వప్పగించారు మా నాన్నగారు. అందుకు ఖర్చులకోసం ఇరవైరూపాయ లిచ్చారు రామారావుకు. ఇచ్చిన మర్నాడే రామారావు విజయలక్ష్మితో మా నాన్నగారి యెదట వినయంగా నిలబడ్డాడు. ఏమిటి సంగతని అడగ్గానే రామారావు "ఋణ బాధ లావుగా వుండడంచాతనూ, వ్యవహారాల తొట్రుబాటుచాతనూ, పిల్ల కట్టు దప్పి వుండడంచాతనూ..." అంటూ ప్రారంభించాడు కరటకశాస్త్రి మాటల్లో.

అక్కడున్న అందరికీ అర్థమైపోయింది. ఇచ్చిన డబ్బులు ఖర్చై పోయాయని. మా నాన్నగారు "దారిఖర్చు కోసం తెచ్చిన రూపాయలు మీకు

దాఖలు చేశాను. మరి బుర్ర గోరిగించుకుందావంటే దమ్మిడీలేదు'' అంటూ కరటకశాస్త్రి మాటల్నే చెప్పి మరో పదిరూపాయ లిచ్చారు. సంభాషణల్లో కన్యాశుల్కం మాటల్నే వాడడం మా నాన్నగారి సరదాల్లో వొకటి.

*   *   *   *

మా నాన్నగారు నన్నాశీర్వదిస్తూ పద్యం వొకటి చెప్పారు.

ఒకనాడెన్నటికైన చిత్రరచనోద్యోగంబునన్ మిన్నవై
అకలంకమ్మగు రూపకల్పనలచే ఆశాంతముల్ నిల్పువే
దిక యౌగావుత నీయుపజ్ఞ గని నిర్దీవించి డావిన్చివం
టి కళావేత్తవు నీవు కావలయునంటే కోర్కి గోపాలకా.

బలమైన ఆశీర్వాదమే అయినా ధ్యేయాన్ని సాధించలేకపోయాను.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

# విషాదాంతకావ్యాలూ - అబ్బూరి రామకృష్ణరావుగారు

ఆంధ్రంమీద ఆంగ్ల వాఙ్మయ పరిచయ ప్రభావము కట్టమంచివారి 'ముసలమ్మ మరణం'తో ప్రారంభమైన దనిపిస్తుంది నాకు. ఆంగ్ల వాఙ్మయము లోని కావ్యములను రామలింగారెడ్డిగారు అనుకరించారనికాదు. విషాదాంత కావ్యములు తెలుగులోనూ, సంస్కృతములోనూ ఎక్కువగాలేవు. ధర్మవిజయమును చిత్రించడముతో రచయిత చదువరులలో ఆదర్శాభిమానాన్ని పెంచుతాడు. త్యాగాన్నీ బలిదానాన్నీ చిత్రించడముతో కల్మషక్షాళనము చేస్తాడు. ఇవి రెండూ రచయితకు రెండు కళ్లు. రెండో విధపు రచనలు మనకెన్నోలేవని గుర్తించి రామలింగారెడ్డిగారు 1899 వ సంవత్సరములోనే 'ముసలమ్మ మరణము' అన్న చిన్న కావ్యమును రచించినారు. బుక్కరాయ సముద్రమనే పల్లెలో ఒకప్పుడు ఆకాశము తూటుపడిందా అన్నట్టుగా వానలు వచ్చినవి. ఆ యూరి చేరువనున్న సరస్సు కట్టను తెంచి వూరిని కబళించునేమోయని జడిసి, వూరివారు పోలేరమ్మకు పొంగళ్లు పెట్టి ప్రార్థించారు. ఆకాశవాణి 'బసిరెడ్డి కడకోడలు ముసలమ్మ బలిగా పోయినచో మీకు కష్టము కలుగదని' చెప్పినది. ఈ వార్తను తెలుసుకొని పాపమా బాల భర్తతోనూ, అత్తమామలతోనూ చెప్పి బిడ్డను భర్త కప్పగించి ప్రజలను దయజూడమని శుభమూర్తి శివునకు మ్రొక్కి చెరువు నీట బ్రవేశించెనట. నాకేమో రెడ్డిగారి వంటి ఉపజ్ఞావంతులు పారంపర్యముగా మరొక రూపముతో వచ్చిన కథలు ఈ రూపముతో రచించడము నచ్చలేదు. నిండిన చెరువును చూడవచ్చిన వారితో ఒకరికి పూనకమువచ్చి 'గర్భిణీ స్త్రీని బలిఇచ్చిననే గండిని పూడ్చుటకు —గండి పడినదనే కథ—సాధ్యమౌనని చెప్పినట్లునూ, ఆ వార్తనువిని ముసలమ్మ పేరిటి చిన్నది తానే బలి కావడానికి సిద్ధమైనదనీ, ఆమెపోయి గండిలో కూర్చోగానే వూరి వారందరూ రాయీ బెడ్డామట్టీ విసరిగండిని పూడ్చిపెట్టినారనీ నేను

విన్నకథ. రెడ్డిగారి కథవింటే 'ఆకాశవాణికి బసిరెడ్డి కోడలుపైన అనుగ్రహము ఎందుకు కలిగిందీ?' అన్న ప్రశ్నా, దాని వెనువెంటనే 'పాపము ముసలమ్మ బ్రదుకుతోపాటు ఆమె చేసిన ఘనత్యాగముకూడా బుక్కరాయ సముద్రము నీటిపాలైనదే' అన్న విషాదమూ ఆవరించాయి నాకు. రెడ్డి కోడలు ఘనత్యాగాన్ని రెడ్డిగారు పల్చన చేశారేమో అనిపించిదది. నిజ మేదయినప్పటికీ, కట్టలో అసాధారణపు వంపు ముసలమ్మ కట్ట-తో అనంతపురపు చెఱువుకట్ట నేటికీ ముసలమ్మ త్యాగాన్ని చూపిస్తోంది.

రెడ్డిగారు సంస్కృత సమాస జటిలమైన శైలితో, ఉత్ప్రేక్షలతో, సీస పద్యాల వర్ణనలతో, వచనాలతో 'దేవా యవధరింపవలయు' వంటి పురాణపు హెచ్చరికలతో; పాత పద్ధతిలోనే రచించినప్పటికీ, వర్ణనలు నడిపే ఉత్సాహముతో కథన చైతన్యమును జార్చివేయక, బిగుతైన మాటలతో కథా ప్రకారమునకు వెలిగాని భావములతో రచించినా రీకావ్యమును. అయితే, వ్యక్తుల భావదౌర్బల్యమును తత్వ దర్శనముతో వెలిగించగలమేధావస్తువు ఆయన. కనుక పిచ్చి నమ్మకాల గుండెలను చీల్చే సన్నివేశము ఈ కథలో లభించినా ఆయన ఆ సన్నివేశాన్ని, ఆ ఉద్దేశ్యముతో సానబట్టక చిరునవ్వుతో దాటుకుపోయినారు. వారి పలుకులన్నీ మానసపుత్రికలే అయి హృదయాన్ని స్పృశించ యత్నించనేలేదు. ముసలమ్మ బిడ్డను ముద్దాడునప్పుడు మాత్రము జాలివేస్తుంది. 'అయ్యో పాపము' అని. 'ముసలమ్మ మరణము' ఈ పేరు అనాకర్షకమౌటవల్లనో, ఇది ఇటీవలి ప్రబంధములో ఒక ఆశ్వాసమువలె కానవచ్చుటచేతనో, నవ్యత ఎంతో మెరవక పోవుటవల్లనో, ఎక్కువగా ప్రచారము కాలేదు. దుఃఖాంత మౌటవల్ల కాదనుకుంటాను. ఆశుకవిత్వ ప్రచారము కొంత కారణమై యుండవచ్చును.

అయితే రెడ్డిగారి శుభ ప్రారంభము విషాధాంతగాథ, కావ్యరచనలో రాయప్రోలువారి డోరా, కష్టకమల, తృణకంకణము, స్నేహలతాదేవి; అబ్బూరివారి మల్లికాంబ, నదీసుందరి: రామిరెడ్డి నలజారమ్మవంటి కావ్యములుగా రూపొంది అందగించినవి. గురజాడవారి పూర్ణమ్మ, కన్యకా విషాద సౌందర్యాన్నికాక, సందేశాలను వహించి సాగినట్టివి. పై కావ్యాలలో సందేశము చాలా చాలా గౌణము. రాయప్రోలువారి స్నేహలతాదేవి సౌందర్యసాధనకే ఎక్కువగా రూపు దిద్దుకొన్నదంటాను. అందుకే కావ్యార్థసూచిగా 'నిత్య సాంధ్యకుమారీమణీమతల్లి కట్టుచీర చెరంగులు కాలు పోల్కి' అని ప్రారంభించింది.

అబ్బూరి రామకృష్ణారావుగారికి రామలింగారెడ్డిగారి సాంగత్యము మైసూరులో సమకూడినది. 'ముసలమ్మ మరణము' లోని అన్యాయమునుబట్టి స్ఫురించిన వేరొక అన్యాయమును చూపుటకని వారు "మల్లికాంబ''ను రచించినారు. రెడ్డిగారు బ్రౌనుద్వార ప్రచురించిన "అనంతపురచరిత్ర'' లోనుంచి ముసలమ్మ కథ గ్రహిస్తే ఆంగ్ల పత్రికనుండి రామకృష్ణరావుగారు "మల్లికాంబ" కథ గ్రహించారు. అసలు కథను ఈయన మార్చినట్లున్నది. మల్లికాంబ, కమల స్నేహితులు. కమల తన ప్రియుడు వ్రాసిన ఉత్తరాలను "కోరికలు చెడునేమో" యని మల్లికాంబకు దాచనిచ్చెను. మల్లిక ''నాదు భర్తకునుగూడ దొరకని రహఃప్రదేశమందు'' దాచియుంచెదనని ఆమె కభయమిచ్చెను. ఇక్కడ భర్త చూచినచో ? అన్న కావ్యార్థసూచియగు అనుమానము మనకు మెరపు కొట్టుతుంది. "మల్లికాంబ కమల ఉత్తరములను" ఒక మోహనంపు పేటికన్ బడవెరుగని విధమున డాచెంగాని గ్రహియించె నది మల్లికాంబ భర్త ! అతడా జాబులను చూచుటా, బాధపడుటా, కత్తితో భార్యను చంపనేగి భార్య సమీపమున విలపించుటా, అతని ఉద్యమమును గ్రహించి మల్లికాంబ 'అసువుల బాయు'టా కొన్నాళ్లకు కమల తన జాబుల కొరకు వచ్చుటా, అతడు నిర్విణ్ణుడై "ఎక్కడికో'' పోవుట ఇదీ కథ. రెడ్డిగారి కథలోని విషాదమును ఆయనగారి నిశితమైన ఆలోచనలు పరిహరించెనంటిని. ఈ కథలోని విషాదమును, ఈయన మెత్తని రచన చక్కగా కప్పిపెట్టినది. కథలోని వారందరూ ఈ లోకపు వ్యక్తులుకారు. మరి కవితాలోకపు వ్యక్తులు. నా దృష్టి కిది 'కవిత్వపు ఓపెరా' అనిపించింది. ఓపెరాలో కథాగమనానికంటె నృత్యగానాదుల కెక్కువ స్థానము. దీనిలో కవి ఊహా పావురపు రెక్కల చప్పుడులు కథా గమన అనుభవాన్ని మింగివేసినవి. అట్టి పెద్ద చప్పుడు కొక ఉదాహరణము 'పాడి పాడి కోయిల తన గూడు చేరె'. కోయిలచేత గూడు కట్టించింది ఈయన భావనా సైరంధ్రి ! ఇంకొక ఉదాహరణము : ఉత్తరాలకోసము వచ్చిన కమల 'వచించు నొక్క విషయమ్మునకు ఎన్నియొ వింతయర్థముల్'' తోచినవట మల్లికాంబ భర్తకు ! కవితావ్యక్తి మరి ! పగిలేగుండెని చేతితో పట్టుకుని కవి చెప్పినట్లు వింత అర్థాలు లోపించుకోవలసినదే, కవిత్వాలూ రాయవలసిందే ! రాశాడు లేఖలో ! ప్రబంధ కవులు ఉత్ప్రేక్షలూ, భ్రాంతిమంతాలూ, అతిశయోక్తులూ నింపి రచిస్తే ఈయన అర్థాంతరన్యాసాలూ సమాసోక్తులూ విరజిమ్మి రచించారు. కథ యొక్క జాలి పలకరింపులకంటె రచనా కోలాహలము లావై పోయింది.

దువ్వూరి రామిరెడ్డిగారి "నలజారమ్మ అగ్నిప్రవేశము" కూడా విషాదాంత కావ్యములోనిదే. రామలింగారెడ్డిగారి "ముసలమ్మ మరణము"లో రెడ్డి పడుచు చేసిన ప్రాణత్యాగము రామిరెడ్డిగారిచేత అలాటిదే అయిన ఈ కథ చెప్పించింది. అయితే ముసలమ్మ మరణముకంటె నలజారమ్మ భర్త మరణము చాలా విడ్డూరముగా ఉన్నది. పక్కపొలములోని జొన్నకంకులు కోసుకున్నందుకు "తురుష్క భూపతులమాట లతిక్రమణంబు సేయగా జనదని"న్నీ, ఒక మానిసి చౌర్యముసల్ప గొర్తయే దవిలిన శిక్ష యనిన్నీ నిశ్చయిస్తే నలజారమ్మ భర్త ఆత్మహత్య చేసుకోడానికి వెళ్ళిపోతాడూ, ఆమె గుండానబడుతుంది! ఈ కావ్యములో రామిరెడ్డిగారు ప్రబంధ పద్ధతిని మురాంతక విఘ్నపతి నల్వరాణిస్తుతులూ, సత్కవిస్తుతీ, కాకవి నిరాసనమూ, గోపుర సమాశ్రితపుర— భూసురోత్తమ, వైశ్య హాలిక— వర్ణనలూ చేస్తూనే ప్రారంభించినా, రామలింగారెడ్డిగారి వర్ణనా పద్ధతులు నచ్చడమువల్ల కాబోలు స్వాభావిక వర్ణనలు కూడా చేశారు. గాంధి మహాత్ముడు రాకముందే రాట్నము త్రిప్పించారు, ఈనాటి హాలికుల కాంతలచేత. ప్రకృతి వర్ణనపట్ల ప్రబంధ రీతులవైపే వీరి మ్రొగ్గు, ఉత్ప్రేక్షల కోలాహలము ఎక్కువై పోయినది.

రాయప్రోలువారి కావ్యాలతో అభినవ కవితామండలి స్థాపన అయింది. పత్రికలలో జి. వి. కృష్ణారావుగారు, చెన్నాప్రగడ భానుమూర్తిగారు, ఇతరులూ ఆంగ్లకవుల ఖండ కావ్యాల్ని తెలుగు చేయడము ప్రారంభించారు గురజాడవారి తేటతెలుగు భాషనుగాని, మాత్రాచ్ఛందములనుగాని, సహజ వర్ణనలనుగాని సందేశగర్భితకథానకములనుగాని వారి తరువాతివా రనుకరించినట్లు కానరాదు. రాయప్రోలువారి పద్య ప్రవాహ మాధుర్యమూ, హ్రస్వ సంస్కృత సమాన వైవిధ్యమూ, ప్రేమ గీతోపదేశమూ, విషాదగాథాకథనమూ, కొత్త కవులను ఆకర్షించి, వారి దారిలోనికి మళ్ళించినని. రచనలు కూడా రాయప్రోలు వారి పద్ధతిలోనే పెరిగినవి కథాకావ్యాలూ, ఖండకావ్యాలున్నూ.

అబ్బూరి రామకృష్ణరావుగారి "పూర్వప్రేమ—ఊహాగానము" అన్న రచనలు ఈ నిజానికి మొదటి ఉదాహరణములు. వీరి ఆధ్యయనము కలకత్తా— మైసూరు లలో ప్రవాసములో జరిగినది. ఈ కాలములో తెలుగునాట 'నవ్యగీతా శుభాధ్యయనమ్ము జేయు సోదరకుమారకుల' ఉత్సాహము నందుకొని వీరూ నవ్యరచన

చేశారు. ఊహాగానము అన్న పద్యమంజరుల సంపుటియే వీరి తొలి యత్నమని పీఠికనుబట్టి అనిపిస్తోంది. దీనిలోని శీర్షికలు గురుజాడవారి ఖండకావ్యాలకంటె వైవిధ్యము హెచ్చుగా గలిగినవేకాని, వాటికున్న కావ్యత్వసిద్ధి వీటి కన్నిటికీలేదు.

కావ్యముయొక్క ప్రమాణము ఎంతది అయినా, దానిలోని కథకుగాని, భావానికిగాని అవిరతి ఉండాలి. చదువరి పఠనము ప్రారంభించినప్పటినుంచీ ఆ కావ్యము ఆపేక్ష కల్పిస్తూ, తనకు జీవమయిన భావము చదువరికి కలిగేదాకా లాగుకుపోయి ఆభావవేశములో వదలాలి చదువరిని. గురజాడవారి ముత్యాల సరములు, లవణరాజుకల, కన్యక, డామను పీథియసు, పూర్ణమ్మా, లంగ రెత్తుము, అలాటి కావ్యాలు. వాటిలో ఒక్కపద్యము తగ్గించినా చదువరి భావని శ్రేణిలో ఒక మెట్టు తగ్గినట్టే అవుతుంది. వాటిలో సూత్రములాగ సాగిపోయే భావమునకు విరతీ విచ్ఛేదమూ ఉండదు. కనుక చదువరికూడా ఆ భావ స్రవంతిలో ప్రయాణించి చివ్వర తన్మయుడై సద్యఃపర · నిర్వృతి చెందగలుగు తాడు. ఆంగ్లకవులు కీట్సు, బైరను, వర్డ్సువర్తు రచించిన ఖండకావ్యాలు కూడా ఈ జీవము గలట్టివే. ఘన శతకాలలోని పద్యములకు ముఖ్యముగా కాళ హస్తీశ్వర శతకములోని చాలా పద్యాలకు దేనికి దానికి చదువరికి భావము కలిగించే గుణముంటుందికాని జండా పరుగుపందెపు వేగమువలె— ఒక భావా నికి దానికంటె పై మెట్టుకుచేర్చే భావమూ, దానికి అంతకన్న పై అంతస్తు కు లాగే భావమూ చేర్చుకుంటూ చదువరికి ఏకాగ్రతా, తన్మయతా కలిగిస్తూ తీసుకుపోయి, అతనిని భావనా ప్రపంచములో విసరగల కావ్యత్వసిద్ధి ఆ పద్యా లకు ఉండదు. చాటూక్తులకూ అంతే. వాటిలో భావాలుంటాయా, ఆ భావాలకు మన హృదయాలు జల్లుమంటాయి. అయితే అవి పూల గంపలు, హారములుకావు. స్వరజతులు, రాగములుకావు. స్కెచ్చిలు, సమావేశచిత్రాలు కావు. పద్యమంజరు లకూ, స్వరావళులకు రంజకత్వము ఉండవచ్చునుకాని, కళాసిద్ధిలేదు. రచయిత భావావేశాన్ని చదువరికి సంక్రమింపజేయగల వరుసతోనూ, శక్తితోనూ వెలువడు భావాలుగల రచనయే ఖండ కావ్యమౌతుందిగాని, కావ్యఖండములు కూర్చిపెట్టిన పద్య సమూహము కావ్యము కాజాలదు. చిన్నదైనప్పటికీ ద్రాక్షపండు ఫలమే. మేలెడైనా మామిడిపండ్ల ముక్కలు పండుకావు. పద్యమంజరులు ఖండ కావ్యముగా కూడిననే వాటి చేరికకు కావ్యత్వసిద్ధి చేకూరుతుంది. లేకుంటే వాటి చేరిక సార్థకముకాదు. అవి నాలుగైనా, అయిదైనా, వంద అయినా అవి పద్యాలే

అవుతాయి. కావ్యములుకాలేవు. కులకము లన్నవి గుప్పెడు పద్యాలూ, దోసెడు పద్యాలూ, బుట్టెడు పద్యాలూ, తట్టెడు పద్యాలూ, కావడములో శోభలేదు. చిన్న దండా, వనమాలా కావాలి కులకములు. అప్పుడూ వాటికి కావ్యత్వసిద్ధీ, నిత్యత్వమూ సిద్ధిస్తుంది. ఎవరు ఎప్పుడు చదివినా అవి సద్యః పరనిర్వృతి కలిగిస్తాయి.

అబ్బూరి రామకృష్ణరావుగారి 'కాపుపాట' 'సోదరస్మృతి' (మూడో పద్యములేని)'బాల్యస్మృతి' ఖండకావ్యములనిపించాయి నాకు. సాధుగీతి "Where is thy market my song, where is thy market'' అన్న రవీంద్రుని ఖండకావ్యములో రెండు భావాల్ని వేర్పరచి ఇచ్చినట్లున్నది. 'భవతి ! భిక్షాం దేహి'లో మొదటి పద్యము లేకపోతే, రెండోది జన్మభూమికి తిరిగివచ్చే తమక మును చక్కగా చూపిస్తుంది. మొదటి దానితో చేరితే దానిలోని నిస్పృహతో చేరిన రెండో పద్యము కాందిశీకుని తత్వము చూపిస్తోంది నాకు. 'తిక్కన సోమ యాజి' నాలుగు పూలపూజ. 'అరవిందఘోష' మూడు పూలపూజ. "అప్రాప్త మనోహరి"కి అని శీర్షికను కూడా కావ్య వస్తువుతో ముడిపెట్టక ఆ "అప్రాప్యము" ఎట్లు వచ్చినదో కొద్దిగా వినిపించి, తరవాత ఈ భావాలు వినిపిస్తే ఇది ఖండ కావ్యము అయియుండును. ఇప్పుడిది అలాటి ఖండకావ్యపు కొసాఖండము అనిపి స్తోంది నాకు. "మహాకవి తిక్కన"లోని రెండో పద్యమూ, మూడో పద్యమూ, ఆరో పద్యమూలోని ప్రశ్నలు మొదటి పద్యపు "విసురు"ను భావశయ్యలో ప్రవ హించనీయక గట్టుకొట్టేస్తున్నాయి. ఏడో పద్యములోని ఆత్మ పరీక్ష లేకపోతే నష్టమేమీలేదు సరిగదా— తిక్కనను గురించిన భావాలు ముందుకు ప్రవహించ డానికి ఇప్పుడున్న అడ్డంకి తప్పుకుంటుంది. ''పుస్తక సాంగత్యము" మూడు పద్యములు దాటి తెగింది. తరవాత నాలుగు పద్యాలదీ ఇంకొకదారి.

అయితే, ఆకాలానికి తెనుగులో పద్యాల ఉపజ్ఞానిర్మితములగు ఖండ కావ్య ములు రాలేదు. ఇలాటివే తొలిఖండ కావ్యములు. రామకృష్ణరావుగారు "స్ఫురించు తలంపులనెల్ల జెప్పనోపని తమి" వల్ల తన నుడులు ఉండవలసినట్లు లేవని అను మానించినారు. నాకు చూడగా "చెప్పనోపని తమి" వల్ల కాదేమో, దిద్దితీర్చని ప్రాలుమాలికవల్ల నేమోననిపిస్తుంది. తమియుండినదేమో నిజము. "స్వాదుకృష్ణా నదీజల స్నానములను పులక లొలయగ వినయాంజలుల ఘటించి, నవ్యగీతా శుభాధ్యయనమ్ముజేయు సోదర కుమారకు లెదురు చూచుచుందు"రని ఈయన

మరలివచ్చినారు. ఆర్ధ్రి హైందవ రీతులను భావపుష్పిత నవ్యశయ్యా రీతులలో పాడ నుద్యమించారు. అధ్యయనకాలములో నీయన గీర్వాణాంగనా జైత్ర నిధ్వానముల నాసక్తితో ఆలకించినారు. అయితే మహాకవి తిక్కన మహనీయగానరమణీయతను వీనుల గ్రోలియుంటచే వీరిలో సంస్కృత సమాసలౌల్యము కాక, భావబంధుర రచనాసక్తి మించినది. రాయప్రోలువారి సంస్కృత సమాసపు బుటాల జిలుగు తెరనుగానీ, గురజాడవారి తేట మాటల శైలినిగానీ వీరు అవలంబించక తెలుగు పదముల మందగమనముతో శ్రోణీభారాదలసగమనయైన పలుకుబడిని అలవరుచుకున్నారు. కళ్లెములను సడలించక తనకు కావలసిన దారిలో నడిపేదు పద్యపు గుర్రాల్ని. నాటికీ, నేటికీ సౌరుమాయక ధవళ గోవ్రాతపు గ్రహమున సౌందర్యాన్ని నింపుకున్న వీరిశైలి నవకవుల పంక్తిలో వీరికి పీటవేసినది. ప్రవాసములోనుండి పుట్టినింటి ప్రేమను తలుచుకుని కలలుగన్న కారణముచేత కాబోలు కన్నులకు, వీనులకూ అందిరాని సౌందర్యాన్ని భావనా సువర్ణ వాగురులచే పట్టిలాగడము వీరికి అలవాటయింది. గంభీర గంగానదీ శీతగర్భమున నడంగిన గానమూ, గాలి నడగిన కోయిల కూతా, పూయని పూవులం దడగు పుప్పొడి సుగంధమూ, నడియెండల బారిపారి సోలెడు హరిణాంగనను కవుగలించెడు నీడల చల్లదనమూ, మాతృశాదముల్రకేవన్ నల్లనైపోయి కానుపింపని రెల్లుపూల ధావళ్యమూ, పలుకలేని పూవులమౌనమూ, సందె చీకటుల్ మూయనివేళ శ్యామల నభోమణియందలి కానరాని తారాయువదీప్తులూ వీరి భావనాబలమువల్ల నవకవిత్వములో నిక్షిప్తములైనవి. తన దృష్టికందిన కొత్త అందాలు విడివిడు టోర్వజాలని నవీనమనఃప్రణయాలూ, నర్మదా శుభ్ర వీచీకణమ్ము లందు నిండిన ఋషుల స్వమాతృ స్తవములూ, గుమ్మడి పూవుతేనియల మాధురులూ, హిమవదుపాంతపుం బొడుపుటేళ్ల సితాంబువులం గదల్చు హంసములూ, ఆరిపోయిన బయళ్ల నొకప్పుడు ప్రవహించిన స్రవంతీజలమూ, ఈయన మనకు చూపించారు. విశేషించి మనదృష్టికి తగలని 'తెల్లగ నల్లగా నల్లిన ఆనందవస్త్రాలూ, కవిప్రేమ పుష్పింపగాజేయు కృష్ణా స్రవంతీ తరంగాంతరంగమూ, రాగారుణ్మమైన చింతాఝురుల్ వారు నాత్మా, కనబడని భావముల సువాసనలూ, కోరికల జిక్కువడిన మూర్ఖుల మనమ్ము లనుచు నార్తుల సందేశములూ, గుర్తించి చెప్పినారు. కాబట్టి 'స్ఫురించుతలంపులవెల్ల' ఈయన చెప్పనోపరన్నది నమ్మడము కష్టము. 'అయితే వీరి పద్యమంజరులకు నిండు సౌందర్యమే సమకూడలేదా ? అన్న ప్రశ్నకు

'నవ్యరీతుల'లో యత్నించి పాడనుంకించిన తమకముయొక్క 'ప్రాలుమాలికవల్ల' ననిపిస్తున్నది నాకు.

ఊహాగానము 1917వ సంవత్సరములో వచ్చినది. అప్పటికే అందులోని పద్యములు చాలావరకూ రెండు సంవత్సరముల ప్రాయముగలవి. రాయప్రోలు వారి తృణకంకణమూ, గ్రంథాలయ సర్వస్వములో దేశభక్తి పద్యాలూ, ఆంధ్ర భారతిలోని ఖండకావ్యాలూ వచ్చాయి. "పూచియు పూవకున్న సుమముల్ సుడి గాడ్పుల విచ్చుపోల్కి, స్వేచ్ఛాచలనమ్ములందు నవశమ్మగు లేతమనమ్ము తోడ, చెల్లాచెదరైన సాధములన్ దమకమ్మున చక్కబెట్టుకో జూచి'నారు కవి కుమారులు చాలామంది, వారిలో అబ్బూరి రామకృష్ణరావుగారొకరు.

వీరి వర్ణనాపద్ధతి అటు సంస్కృత పద్ధతినీ, ఇటు ఇంగ్లీషు పద్ధతినీ తెచ్చుకుని తెలుగుతో పేనుకొన్నట్టిది. సంస్కృత కవిత్వములో అన్వయమునకు కర్త కర్మక్రియ వరుసఅంటూ విధించే నియములేదు. 'ఇవ మానదండః' చివ్వరికి తోసినా ఆక్షేపణలేదు సంస్కృతములో. రామకృష్ణరావుగారు 'మిన్నుల బాడ గోకిలల్' గాలి నడిగిన కోకిలగానమట్లు' 'కేళిలోలనై యుండగన్' నయవేత్తల్' 'భారతమహాహవమందలి జీవగీతులన్' అన్న తునకలను పద్యాల చివరకునెట్టి సంస్కృతాన్వయమును తెలుగులోకి దింపినారు. పావనరాగము, హృదయపదము, పలుకరాని గీతిక, పొడుచువెన్నెలతేట, కవితా మాధురి, పూనవ్వు, కోకిలపాట, కవులపాట, రాగములు పుష్పింపంగ, గానము ల్వేదజల్లు, లేతమనమ్ము, వెన్నెలలు రాలు (ట), ధోరణులు చిమ్మెడు మాధురులు, వికసించిన వెన్నెల, బాధా మలినమ్ములు, వంటి ఆంగ్లకవితా సంప్రదాయాన్ని ప్రవేశపెట్టి కావ్యభాషను అటూ పెంచారు.

అయితే సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర సంప్రదాయాల్ని కలిపి నవ్యరీతులలో పోతపోసే తమకములో ఖండకావ్యాలలోని భావము సహజంగా నిర్విరామంగా సద్యః పరనిర్వృతి కలిగించేటట్లు సాగిపోతోందా లేదా అని చూసుకుని చిన్న మెలకువ జారిపోయిం దనుకుంటున్నాను. లేకుంటే సాధుగీతి రెండు పద్యాలతో ఆఖరవదు. ప్రణయశాంతి తెలిసిన తలపులతో తెలియని భావమువైపు వేలు చూపించుతూ ఉండదు. 'భవతి భిక్షాం దేహి' తొడిమ లెడసేయంగా రాలిపడిన పూల వలపులేవి?' అని భావాన్ని మబ్బుల వెనక్కి విసరక, 'తొడిమ లెడయైన

పూలెల్లు యెడదవలపు పడయనౌను భిక్షాందేహి భవతిభవతి' అనో ఇంతకంటె ఇంపైన విధంగానో రెండో భాగముతో మేళవించి యుండును. కాపుపాటలోని రెండో పద్యము 'వ్రాలిన సంజలన్ మరలి వచ్చెడు గోవుల పాలుతీయగా తోలెడు దాక, త్రాడులను దుత్తలు నావలబెట్టి, సిగ్గులన్ సోలెడు చిన్నదాన, యెటు చూచిన నెవ్వరులేనిచోట యుయ్యాల నెక్కి-యూగ మనసయ్యెడు నీవును నేను వేడుకన్' అన్నది, ఇప్పటివలె' వ్రాలిన సంజలన్' అని ప్రారంభిస్తూ అన్ని సంజలనూ పేర్కొని, 'ప్రేయసి లేచిరమ్ము' అని ఆహ్వానించిన కుమారకర్షకుని తమకమును అనవసరంగా సంజలన్నిటికీ పఱచి పల్చనచేయక 'వ్రాలెడు సంజలో' అని నడిచి ఆనాటి కాలవిరామాన్ని మట్టుకు పేర్కొని, మూడో పద్యములోని ఊహకు దారిచేసియుండును. 'అరవింద ఘోష'లోని మూడో, ఆరో, ఏడో, పద్యాలు విడిచిపెట్టేసి, ఇప్పటి అనవసర సంచారమును మాని తిక్కనమీదనే దృష్టిని నిలిపియుండును. 'బాల్యస్మృతి' రెండో, మూడో, పద్యాలు పడవేసి రూపు తీరి నిలబడియుండును. 'మృతప్రేమ', ప్రశ్నలను మోసినదెవరు ? అనే ప్రశ్నకు "శ్రీరికనైన నేను" అని అనడానికి మాత్రమే కాకుండా కావ్యరూపములోనే తలా తోకా కనబడేటట్లు ప్రవేశించియుండును. క్రొత్తదనము సాధించే తమకములో రచనా జాగరూకత సడలినట్లు 'తొడిమ లెడసేయగా రాలిపడిన పూలవలపులేవి ? అన్వయమైత్రి అందుకోని "ధవళగోవ్రాతము, నవనవనీతము, ఒక్క 'మావి ఊడు"కు "నీవు నేనును" అని యిద్దరిని పోల్చడమూ "సంపాదినై...నాయెద కానందముగూర్చి లక్ష్మి విడివోయెన్" అనడమూకూడా తెలుపుతూన్నాయి.

రాయప్రోలువారి 'ప్రేమ' ప్రచారము వీరినీ లోగొన్నది. నాలుగు పద్యాలు వ్రాసి వీరు "అప్రాప్తమనోహరికి"చ్చి తరువాతికవుల అప్రాప్తమనోహరికి మూలవిరాట్టును సృష్టించారు. మాతృప్రేమ, క్షణికప్రేమ, పూర్వప్రేమ, అన్నవి ప్రేమ వృక్షమునకు వీరుచేర్చిన కొత్తశాఖలు. రాయప్రోలువారి హేయరక్తిం దగులాని ప్రేమరుచికి వెలి" కాకూడదనే సందేశము వీరి "మోమున మోముజేర్చి నిను ముద్దిడు కోరికలేదు, నీదు వక్షోమృదుశయ్యపైన శిరమున్ గెడవాలిచి, వ్రేలు మల్లికా దామ సువాసనామధురత ల్పరికింపగ గాంక్షలేదు, నా ప్రేమకు దారిజూపగ వరించితి న్యాయలరించు నెచ్చెలీ"లో చిత్రమైన దారి తొక్కింది. ఏమీ అక్కరలేక పోయినా అన్నీ వున్నచోట చూచుకొని వరించినా డీయన సృజించిన ప్రేయసుడు.

అన్నాడుగదా యుగంధరుడు "అందుచేత పాడుపొట్టకు అన్నమే వేతమురా'
అని ?

రాయప్రోలువారి "నిండారబోరు" పద్యాలు వీరికి గట్టిగా తాకినవి. అందులో గోదావరీ, తుంగభద్రా ఉన్నవి. వీరు కృష్ణా స్రవంతీ తరంగాం తరంగము, కృష్ణవేణీ స్తవము, స్వాదు కృష్ణానదీ జలము, కృష్ణవేణీ తరంగిణి నున్న ఝరి, పాడుబడిన కొండల పి.డబ్ల్యు.డి. వారు కంకరకోసము కొట్టిస్తే పాడుపడిన కొండలై యుంటాయి ఇవి. ఈనా డున్నాయి ఇవి విజయవాడలో. సమీపమునబారుకృష్ణవే. విషాద సంగీతగతులు వినిపించి వినిపించి కృష్ణామల తోయమందలి ప్రశాంతపు "రాగము"లు కవితా మృదూక్తుల నాప్యాయము చేయు టలో తిక్కనగారి మహనీయ గానరమణీయతతో సరిపోలునని సూచించినారు. రాయప్రోలువారి "పాడైన పెనుకోట గోడలు" కాకతి ప్రాభవమ్మునకు శయ్య లైతే వీరికి "రాయచూరు విభవమ్ముల నిల్చిన జీర్ణ భిత్తికలు, ఉదాత్తపూర్వ కథాగాయకులైనాయి. రాయప్రోలువారి "వృద్ధవృక్షము" హరిణపుత్రి, హిమ కుమారుడు వంటి ఆంగ్ల కవితా సంప్రదాయ ప్రయోగము లీయనకు నచ్చినవి. సోదర కుమారకులు, బాల వెన్నెలలు, యువదీప్తులు, గీతాకుమారులు వంటి ప్రయోగములు చేసినారు. రాయప్రోలువారి అప్రాప్తప్రేమ 'అసంపూర్ణప్రేమ' లకు వీరు పూర్వప్రేమలో ఈ జన్మానికి సంబంధించిన పూర్వజన్మమునాటి ప్రేమను కలిపేరు.

'పూర్వప్రేమ' అన్నది ఒక కావ్యఖండము. దీనిలో పూర్వకథా అనంతర కథా విడువబడినవి. లక్ష్మీంద్రుని వేహుళ వివాహమాడి, అతనిని తొలిసారి కలుసుకున్న రాత్రిలోనే అతడు మనసాదేవి శాపమువల్ల సర్పదష్టుడై మరణించి నాడు. ఆమె సావిత్రిని మించిన సాధ్వీశీలముతో అతనిని పునర్జీవితుని చేయు నుద్యమించి, ఈ కష్టమునకు కారణమైన మనసాదేవిని స్తుతించినది. ఇదీ కథ. దీనిని వేహుళయొక్క పూర్వ ప్రేమనుచూపే ఉద్దేశ్యముతోనే ఖండముగా రచించా రనిపిస్తుంది. లక్ష్మీంద్రుని తండ్రి కులక్రమాగతమైన మనసాదేవ్యారాధనమును మాని ఎన్నిబాధలు పెట్టినా మారకపోవడమువల్ల మనసాదేవి లక్ష్మీంద్రుల కుమారుడు శోభనవేళ రాత్రి సర్పదష్టుడై మరణించునని శపించిన కథా, శాప మును తప్పించుటకని లక్ష్మీంద్రునికి ఇనుపమేడ నిర్మించుటా, మనసాదేవి దానిలో ఒక రంధ్రమును కల్పించుటా కవిగారు 'పూర్వకథ'గా చెప్పేశానన్నారుకాని,

కావ్యములో చెప్పలేదు. వేహుళ మనస్తాపమును ప్రారంభించినట్లు చూపినారుకాని, అనంతరగాథను చెప్పలేదు. కనుక కేవలము వేహుళ పూర్వ ప్రేమను చూపడమే ఆయన ఉద్దేశ్యమని తెల్లము.

ఈ కథా రచనలో అపేక్షను పోషిస్తూ, చక్కగా తీసుకుపోతా రీయన చదువరిని. రాయప్రోలు కథనములో ఆయన అభిప్రాయాలు అడపా దడపా ప్రవేశించి కథా సాంద్రతను పలచన చేస్తాయి. రామలింగారెడ్డిగారి కథనములో పాత్రలు ఆయనగారి మేధాశక్తిని సూచించే మాటలు—తమ నైజమును దాటి సుదూరము దాటిపోయినట్టివి—పలికి, రచయితని జ్ఞాపకము చేస్తాయి. పూర్వ ప్రేమలో వీరి కథనము సూటిగా సాగిపోతుంది. పూర్వకథను కావ్యరూపంగా చెప్పకపోవడమువల్ల కానలేము కాని తన శాపాన్ని తప్పించడానికి కట్టిన ఇనుప మేడ గదికి మనసాదేవి ఒక రంధ్రము కల్పించె ననే సంగతి" రంధ్రము నొక దానినుండి కిరణమ్మొకడా గదిలోని నేలపై తెమలుచునుండె" నన్న సూచనా వాక్యమునుబట్టి మనకి స్ఫురించి బాధపెట్టుతుంది. "పాండువయి తెల్లని సర్పము ప్రాకు పోలికన్'' అన్న తరువాత వాక్యము, ఆ రంధ్రమునుండి సర్పము ప్రవేశించగదలని సూచించి విధిబలీయతను ధ్వనిస్తుంది.

(గురజాడవారు కన్యక కథలో "నాడు గుడిలో మండె గుండం మంట మింటిని ముట్టియాడగ' నన్న వాక్యంతో జరగబోయే ఘోరత్యాగాన్ని సూచిస్తారు. రాయప్రోలువారు స్నేహలతాదేవిలో "నిత్య సాంధ్యకుమారి కట్టుచీర చెరంగు కాలుపోల్కి"వల్ల ముందే ఇదేదో "విషాదకథనము"అని సూచించారు. అంతకన్న ఇక్కడలాగ కథలో నిమిడ్చినవే కావ్యార్థసూచి ఉత్కంఠను పోషించగలదు. రాయప్రోలు "కష్టకమల"లో ఒడ్డాణము ఉరిత్రాడులాగ కనబడిందన్న వాక్యానికి హఠాత్సంభవమైన కమల జడ ఉరికి సూచన కాగలిగిన శక్తిలేదు) రాత్రి ఒక జాము గడవగానే వేహుళ లక్ష్మీంద్రుని విదాహశమనము చెయ్యడానికి పానకము వండితెస్తూ, ఆ కిరణము మాయము కావడము గుర్తించి, పైకి చూచి, "మే నాదిగి యొదింగివచ్చు మలినోరగముం"గనెనట. 'మలినోరగము' గొప్ప వ్యంజనాశక్తిగల పదము. జరగబోయే విపరీతమును గురించిన కవిభావమూ, మన తిరుగుబాటూ కూడా "మలిన" అన్న పదములో— విత్తనములో చెట్టులాగ గింజుకుంటాయి. ఆ "మలినోరగము'ను గని: విషోరగమునుకాదు. పానకము

నానెడువేళ వేహుళ గుడ్డపీలికలు పేనిన తాడు కరాళ దర్వీకర కంఠగోళమును బిగించినదట! గొంతుక్కాయ బిగించేశింది. దేని గొంతుకాయనూ? పాము గొంతుక్కాయను! ఇక్కడ కవి యుత్కంఠనూ, మన యుత్కంఠనూ చక్కగా పోషిస్తోంది 'కంఠగోళమ'న్న మాట. కంఠనాళము అనవచ్చునుగదా? "గోళము" అనడములో భావోద్వేగ రచనాశక్తి ద్యోతక మౌతున్నది. వీరు వృత్తాలను అమోఘముగా నడపగలరు గాని, వీరి రచనా చైతన్యానికి వృత్తముకాక, ద్విపదయే అనుకూలమేమోనని వేహుళ గంగాప్రయాణ ఘట్టము చదివితే నా కనిపించింది. వారు ఆ కథను ద్విపదలోనే పూర్తిచేయలేదేమని నేను బాధపడ్డాను. వారలాగ పూర్తిచేసివుంటే కలకాలమూ నిలిచే కావ్యమొకటి తెలుగునాటి కావ్యాలకు చేరి యుండేది. ఇప్పటి భాగమేనా, వజ్రపు తునుక, రామకృష్ణారావుగారి రచనలకు జయపతాక.

(భారతి—డిశంబరు, 1962).



1. కమ్యూనిష్టుగా కలకత్తాలో (శ్రీ వి.ఎల్. నరసింహారావుగారు తెచ్చి యిచ్చిన చిత్రం - 1933)

2. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 'కన్యాశుల్క' ప్రదర్శన (1933) కరటక శాస్త్రి - శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి ; వెంకటేశం - శ్రీ బలిజేపల్లి చంద్రశేఖర శాస్త్రి ; గిరీశం - శ్రీ పి. కృష్ణారావు





3. పై ప్రదర్శనలో మరో దృశ్యం.



4. పై ప్రదర్శనలో మరో దృశ్యం లుబ్ధావధానులు: శ్రీ అయ్యగారి వీరభద్రరావు; మధురవాణి - శ్రీదాడి గోవిందరాజులు నాయుడు ; రామప్పంతులు - శ్రీ అబ్బూరి రామకృష్ణారావు.



5. ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో పనిచేస్తున్నప్పటి చిత్రం (1934)
కూర్చున్నవారు (ఎడమనుంచి): 1. శ్రీ గంటి జోగిసోమయాజి, 2. శ్రీ విస్సా అప్పారావు, 3. శ్రీ పింగళి లక్ష్మీకాంతం; 4. శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి, 5. శ్రీ గుత్తి వెంకటరావు, 6. శ్రీ అబ్బూరి రామకృష్ణరావు ; నిల్చున్నవారు (ఎడమనుంచి): 1. శ్రీ కాకర్ల వేంకటరామ వరసింహం, 2. శ్రీ జ్ఞానాభరణం, 3. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు.



6. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని సాహితీ బృందంతో- (1934)
(ఎడమనుంచి) ఎ.ఎస్. రామన్, జనమంచి రామకృష్ణ, అబ్బూరి, వి.వి. రామనాథం, రజనీకాంతరావు వగైరాలు.



7. కాకినాడలో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవాల సందర్భంగా (1935).

(కూర్చున్న వారు): 1. వింజమూరి లక్ష్మీనరసింహరావు. 4. బుఱ్ఱా శేషగిరిరావు, 5. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, 7. వేమవరపు రామదాసు పంతులు. 9. చిలకమర్తి లక్ష్మీనరసింహం. 10. పెద్దాడ రామస్వామి, 11. తాపీ ధర్మారావు, 12. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, 13. ముళ్లపూడి పళ్లం రాజు. (నిల్చున్నవారిలో చివరి వరస): 1. దేవులపల్లి కృష్ణ శాస్త్రి, 2. తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, 3. రాయప్రోలు సుబ్బారావు, 4. అబ్బూరి రామకృష్ణ రావు, 5. కోలవెన్ను రామ కోటేశ్వరరావు, 6. అడవి బాపిరాజు.



10. న్యూఢిల్లీ లో జరిగిన ఈస్ట్ - వెస్ట్ థియేటర్ కాన్ఫరెన్స్ సందర్భంగా (1966)
(ఎడమనుంచి): అబ్బూరి, 2. అల్కాజీ, 3. రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్



11: పై సమావేశం సందర్భంలో (1966)
(ఎడమనుంచి): 1. మృణాళినీ సారాభాయ్, 2. తృప్తి మిత్రా, 3. అబ్బూరి



12. దూరదర్శన్ ఇంటర్వ్యూ సమయంలో, న్యూఢిల్లీ (1966).
(ఎడమనుంచి): 1. సచ్చిదానంద్ వాత్స్యాయన్, 2. ప్రిన్సిపల్ కన్వీర్, 3. అబ్బూరి



13. న్యూఢిల్లీ లో నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా స్నాతకోపన్యాసం చేసిన తరవాత అభిమానులతో (1970)





24. న్యూఢిల్లీ లో వరదరాజేశ్వరరావు ఇంట్లో చివరి రోజులు గడుపుతూ (1979)



25. డెహరాడూన్లో ఎం.ఎన్. రాయ్ సమాధి దగ్గర నిర్మించిన అబ్బూరి సమాధి దగ్గర - ఎడం వైపు కుమారులు వరదరాజేశ్వరరావు, గోపాలకృష్ణ.

**ANDHRA EDUCATION SOCIETY**
**NEW DELHI**
**Pays homage**
**to**
**Abburi**
**on**
**11-5-1979**
**at 5 p.m.**

Venue :
**A.E.S. Higher Secondary School,**
**1, Rouse Avenue,**
**New Delhi.**

Speakers :

1. **Prof. Hiren Mukherjee**
2. **Shri V.M. Tarkunde**
3. **Shri C. Rajeswara Rau**
4. **Prof. B.S. Kesavan**
5. **Prof. R.M. Paul**
6. **Shri Habib Tanvir**
7. **Shri Rajinder Nath**
8. **Shri R.C. Rajasekhar.**

***RSVP***
**274306**

26. ఢిల్లీ లో జరిగిన స్మారక సభ ఆహ్వాన పత్రిక నకలు (11.5.1979)



27. ఢిల్లీ లో జరిగిన స్మారక సభా దృశ్యం (11.5.1979)
(వక్త) ప్రొఫెసర్ హీరేన్ ముఖర్జీ; (ఆసీనులు): సి.వి. సుబ్బారావు, బుర్రా వెంకటప్పయ్య.



28. స్మారక సభా దృశ్యం మరోటి:
(వక్త): బుర్రా వెంకటప్పయ్య; (ఆసీనులు): సి.వి సుబ్బారావు, హీరేన్ ముఖర్జీ, తార్కుండే, రాయప్రోలు రాజశేఖర్, బి.ఎస్. కేశవన్.

విన్నపాలు

ప్రతిదియు నన్నారి వెన్న
చప్పన నాకే మెరుగవ
వేద! యీ యల్ప సంఖ్యపై
ఏలా నాకే మరుగవ?

అనవేదాం కాళిదాసు
తన విలాపగానలోన
"మరణము ప్రాణులకు ప్రకృతి
జీవితమే వికృతి, కాన

క్షణమైనా శ్వాసించినా
జీవించె మొదల ప్రాణి
మహాలాభమను కావలె
అనె బుధోత్తముల వాణి."

పైరు పండి రాలినట్లు
ముసలివై లయించు జీవి
రాలి మరల వచ్చునంట
వచ్చునైన మెండుమాని.

29. అబ్బూరి దస్తూరి నకలు.

కోవెల సుప్రసన్నాచార్యులు

# పొరపాటి తిరుగుబాటు

1955 ప్రాంతాలలో అబ్బూరి ఛాయాదేవి సంపాదకత్వాన "కవిత" అనే రెండు సంచికలు వెలువడ్డవి. వాటిల్లో తొలిసంచికలో అబ్బూరి రామకృష్ణరావు "కవిత" ఒకటి ఉన్నది.

అబ్బూరి రాయప్రోలుతో బాటు తెలుగు కవిత్వంలో నవయుగాన్ని ప్రవర్తింపజేసిన వారిలో భావకవిత్వోద్యమం రూపుకట్టడానికి పూర్వమే రచనచేసి, తమ స్వల్పరచనల ద్వారానే విశిష్టమయిన రచనా ముద్రను నెలకొల్పిన కవి. తాము ఏ మార్గానికి చెందినా నాటినుండీ తెలుగు సాహిత్యరంగంలో ప్రవర్తిల్లిన అన్ని ఉద్యమాల అంతస్తత్త్వం ఎరిగినవారు సాధారణంగా తమ సమకాలీనుల లాగా తాము తెచ్చిన తిరుగుబాటుతోనే తృప్తిచెందక కొత్తదనాన్ని అర్థంచేసుకుంటూ భవిష్యత్తును భావిస్తూవచ్చిన కవి ఆయన.

"కవిత"లోని ప్రసక్తమయిన ఈ కవిత "అనామిక"యే. ఇది నాలుగు ఖండాలుగా విభక్తమైంది. కవి తాను కవితాదర్శనంచేసి, కవిత్వంలోని పరిణామాన్ని భావించి, నూత్నత్వాన్ని స్పష్టంగా నిర్దేశించిందీ కవితలోనే.

మొదటి ఖండం ఆరంభం కవి తాను కవితాసుందరిని దర్శించడంతో ప్రారంభమవుతుంది. కావేరీ నదీతీర కల్యాణ ధరిత్రిమీద పచ్చిక పచ్చని పరుపుల పవళించిననాడు కవితాసుందరి దర్శనమిచ్చింది.

> "నాజీవన గగనసీమ నాలుగు దెసలందు నిండి
> నా మానుషదేహంలో నాకలోకసౌభాగ్యం
> కదలినట్లు మెదలినట్లు కడలివోలె మ్రోగినట్లు
> కలలుగాంచి కళవళించి కలలో నీకమనీయత —"

గాంచి తనువు పులకించిన వేళ అది. ఆ మాధురీదర్శనం నీ భక్తులకనువైనది' సహృదయులు కోరింది. భావించింది. దానివల్ల ఆనందాన్ని పొందినాడు. ఉద్వృతంగా వచ్చిన కాల్పనిక కవిత్వోద్యమం తెలుగు కవితాచరిత్రలో నూతన శకోదయం. అది తెలుగులో కొత్తజీవాన్నీ కదలికనూ తెచ్చిపెట్టింది. దాన్ని గూర్చి కవి ఇలా వర్ణించారు—

"తెలుగుదారి వెలిగించే వెలుగుదారి తెలిగించే
క్రొత్తప్రాత మాటలతో మెత్తనిపదముల నాడుచు"

సాగింది గురజాడ చెప్పిన 'ప్రాతక్రొత్తల మేలుకలయిక'. ఆకాలంలో సాగిన మధుర సుకుమార రచనా మార్గం ఆయన ప్రస్తావించినారు. ఈ ఉద్యమంలో అంతర్భాగంగా ఆంధ్రరాష్ట్రోద్యమంకూడా కవితావస్తువై ఆంధ్రమహామహీజనని యశోగీత మాలపించి' నా రీకవులు.

ఈ ఉద్యమం ప్రధానంగా కలలో కానవచ్చిన కమనీయతను సాక్షాత్కరింపజేయడం కోసం మధుర సుకుమార రీతిలో సాగిన రచనా వైలక్షణ్యం కలది. హృదయం స్పందించిన ఈ హృదయానుభూతి ప్రధానమైన ఈ ఉద్యమం ఎక్కువ రోజులుగా సాగలేదు. "సాహితీసమితి" రూపొంది సాగించిన ఈ మార్గం 1930 తరువాత దాని ఆకర్షణ కోల్పోయింది. గతానుగతికమైన ప్రవృత్తిగల కవులు దాన్ని కొనసాగించే ప్రయత్నం చేశారు. సాధారణంగా మానవుల్లో ఉండే బలహీనత ఇది. ఒక క్షుణ్ణమైన మార్గాన్ని వదలి నూతన మార్గాన ప్రవేశించలేరు. అందుకు సాహసం అవసరం. తిరుగుబాటు చేసిన వాళ్లుకూడా తాము చేసిన తిరుగుబాటే ఒక సంప్రదాయంగా రూపొందినప్పుడు దాన్ని కాదని ముందుకు సాగిపోలేరు. వారిలో ఉన్న తిరుగుబాటు ప్రవృత్తి లోపిస్తుంది. మానసికంగా వాళ్ల వృద్ధులే. పాతబడ్డ ఆరీతులే సజీవంచేసే ప్రయత్నంలో ఉంటారు. కాని చైతన్యం ప్రవాహం. అది నిత్యమైన జీవనది. అందువల్ల ఆ తిరుగుబాటు తప్పదు. దీన్నే అబ్బూరి తరువాత వివరించారు. ముడుతలుబడి చినిగిపోయిన ఆ వెనుకటి వేషాన్నే మళ్ళీ మళ్ళీ కొందరు ఆధునికులు పెళ్ళికొడుకుల్లా ధరించారు.

ఈ వేషం వెనుకటిదే ఏమీలే దావేశం
ప్రయోగాలులేని నుడులు అయోమయపు పలుకుబడులు

ఈ స్థితిలో తెలుగుజాతి ఈ నదిలో ప్రతిఫలించదు. ఈ పనిలో పరిమళించదు. అంటారు ఈ కవి.

ఇలాంటి స్థితిలో కాల్పనికోద్యమంమీద శ్రీ శ్రీ 1935లో తిరుగుబాటు చేశాడు. శ్రీ శ్రీ పూర్వోద్యమంనుండి మారి పునర్జన్మ ఎత్తినవాడు. ఈ ప్రగతి వాదవిప్లవం నూతనమయిన సామ్యవాద భావనతో రష్యాలో స్థాపితమయిన కొత్త సోషలిస్టురాజ్యం ఆదర్శంగా ప్రవర్తించింది. శ్రీ శ్రీ మహాప్రస్థానంతో ఆరంభ మయిన ఈ ఉద్యమం నలభైలలో అభ్యుదయ కవిత్వోద్యమంగా రూపొంది తెలంగాణాలో కమ్యూనిస్టుల ఉద్యమపర్యంతమూ సజీవంగా సాగింది. అనుభూతి ప్రధానమయిన కాల్పనికోద్యమం మీద ఆవేశం ప్రధానమయిన ఈ ప్రగతివాదం పూర్తిగా దెబ్బకొట్టింది.

"ఎత్తండోయ్ రక్తకేతు పొత్తండోయ్ రణశంఖం
రక్తారుణ రణపతాక ధిక్కార మహాశంఖం
రష్యాగురుధూపంతో రమణీయపు శివమెత్తిన
రణాచారి గణాచారి రణగుణాల ధ్వనులురేగ"

ఈ ఉద్యమం ప్రవహించింది. ఈ వాక్యాలలో ఈ ఉద్యమం వెనుక వున్న తాత్త్విక రాజకీయ తత్త్వాన్ని కవి స్పష్టంగా నిర్దేశించినారు. ఈ వుద్యమం కూడా 1953 ప్రాంతాలలో పరివర్తన పొందింది. 1955 నాటికి స్పష్టమైన తిరుగుబాటు ప్రగతి వాదోద్యమంపై వచ్చింది. ఈ విషయాన్నే అబ్బూరి రష్యా ఋష్యా శ్రమమున రాగిల్లిన కావ్యధార జీవనదీ మహిమ లేనిది— అంటే అదీ శుష్కమ యిందని. అది కొంతకాలం నదీధర్మాన్ని నెరవేర్చినమాట నిజమే. 'అంతో యింతో శైత్యం, అంతో యింతో పైత్యం అందించినమాట నిజం. ఔను నిజం ఔను నిజం' ఇక్కడ కవితాధర్మమయిన ఆనందాన్ని శైత్యమూ, ఉద్యమధర్మ మయిన ఆవేశాన్ని పైత్యమూ సూచిస్తున్నవి. చివర ఔను నిజం ఔను నిజం అన్నమాటలు 'రక్తకేతువు, రక్తారుణ రణపతాక, ధిక్కార మహాశంఖం' అన్న మాటల్లో ఎగరేసిన ఎర్రనిజండా, తిరుగుబాటు మావేదాంతం మొదలైన మహా ప్రస్థాన వాక్యాలు వినిపించడం లేదూ.

అయినా ఈ యుగంమీద తెరపడ్డది. మార్పు తప్పదు. ఈ పరిస్థితిని

ఎరుకతో గుర్తించి అబ్బూరి మళ్ళీ నూతన మార్గానికి మలుపు తిరగవలసిన స్థితిని ఉద్బోధించుతూ రచించిందే ఈ కవిత.

ఒక వైపు సంప్రదాయ కవితా సమయాలలో పాత చట్టాలలో బంధించి కవిత్వాన్ని వ్రాసే కోవిదకవులూ ప్రపంచానికి దూరంగా, లోకపు బాటల కవ్వల చీకటులూ— వెలుతురులూ సగం సగం కలసి మలిసి— కుహనా లోకం లోపలి గుహలలోన కూజించే కోమలకవులు ఒక వంకా— ఉండగానే వారికి అందక కవితాసుందరి అంతర్ధానమయింది. అలాగే ప్రగతివాదకవిత కొంత కాలం ప్రవర్తిల్లినా దాని అంతశ్శక్తి అంత చిరంతనం కాకపోవడంవల్ల అదీ దారి తప్పింది. ఎంత కేకలువేసినా ఎన్ని బాకా లూదినా ఈ మహాప్రస్థానం దారి తప్పింది.

"శతసహస్ర యోజన సంచార కుతూహల చంచల
భావనాకురంగమెక్కి ప్రస్థానం ప్రస్థానం
భయద మహాప్రస్థానం—
పయనమైన పదినాళ్ళకె, పదినాళ్ళకె దారి తప్పి
పోయావా నానేస్తం ఆ : ఏదీ నీహస్తం
పొరపాటీ తిరుగుబాటు, తిరుగుబాటు తిరిగిచాటు"

ఇది చాలా దీర్ఘప్రయాణం. కాని కొద్దికాలానికి కవితా ఉద్యమంనుంచి కవిత్వం మటుమాయమయింది. కవిత్వం తొలగి కవిత్వేతర పదార్థం దాన్ని ఆదరించింది. రాజకీయ తత్త్వం అధికారం చేసింది. ఇలా ఇది దారి తప్పింది. ఈ తిరుగుబాటు లాభంలేదు. ఇది మారాలి. కొత్తమార్గం కావాలి. అందుకే కవి తన స్నేహ హస్తాన్నిచాచి నూతన శకోదయానికి కృషిచేయమని అహ్వానిస్తున్నాడు.

అబ్బూరి తన కవితలో మొదటిఖండం ఈ విధంగా చారిత్రక పరిణా మాన్ని సూచిస్తూ ప్రగతివాద కవితా మార్గంనుండి క్రొత్త మార్పును ఆహ్వానిస్తూ పూర్తిచేశారు.

తరువాత మూడు ఖండాలు తాను దర్శించే నూతన కవితారూపం ఎలా ఉండాలో ఏది ఉండకూడదో భావించి నిరూపించేవి.

ఇందువల్ల అబ్బూరి ప్రగతివాద కవిత్వం రంగంమీదనుంచి నిష్క్రమించడాన్ని చూచి దానినుండి వచ్చే మలుపును ఊహించి స్పష్టంగా చెప్పిన తొలి తెలుగు కవీ— విమర్శకుడూ—

రెండో ఖండం ఒక దశనుండి వేరొకదశకు మారుతూవున్న స్థితిని వర్ణించేది. కవితా పురంధ్రి మరపుతెరల మాటుమణిగి మాయమయిన వేళ ఆ స్థితిని వర్ణిస్తూ కవి—

"మనసులోని ఆలాపము మాటలలో మారిపోవు
ఎత్తిన కవితాదీపము వత్తి కుమిలి యారిపోవు
ఎలుగులేని వెలుగులేని హేమంతమ్మోయి పుత్ర !
ఈ చీకటి రాజధాని కేలా నీ దండయాత్ర"

అంటాడు. కవిత్వం దాని స్వస్వరూపంలో ఆవిష్కరింపబడే స్థితిలేదు. అది ఉజ్జ్వలంగా ప్రకాశించడంలేదు. ఈ స్థితి నిశ్శబ్దమయిన తమోమయమయిన హేమంతం. హేమంతం జడత్వానికి నిశ్చైతన్యానికి ప్రతీక. అదీ ఎలుగు లేనిది. వెలుగులేనిదీ. ఇలాంటి లక్ష్యం ప్రయాణించ యోగ్యమయింది ఎలా అవుతుంది ?

ఈ నిశ్చేతన స్థితిలో కవి తాను ముందు దర్శించిన కవితా మధుమూర్తిని దర్శించాడు. మంజులమంజీర మధుకరరుతాలలో దర్శనమిచ్చిన ఆ మూర్తిని మళ్ళీ సాహిత్యరంగంలో ప్రతిష్ఠించుతున్నాడు. ఇంతకాలంగా తనకూ కవిత్వానికీ నడుమ ఒక శోకార్ణవం పొంగి తనను కవిత్వానికి చాలా దూరంగా ఉంచింది. తనలో ఒక నూతన గవాక్షం ఆవిష్కృతమయింది. తన జీవననౌక చిక్కుల నుండి తప్పుకుని అనంతాబ్ధి సాంగత్య మ్మభిలషించి పయనమైంది. జీవితానికి ఒక సాఫల్యం లభించింది.

ఈ విధంగా తాను పొందిన కవితను— మళ్ళీ పూర్వమార్గంలో పయనింపజేసే ప్రయత్నం కవిచేయలేదు. దానికొక సార్థక తత్త్వాన్ని నూతన చైతన్యాన్ని ప్రసాదించే ప్రయత్నంలో విపులమయిన చర్చ చేస్తున్నాడు. ఆనాడు తమకు ప్రేరణయిచ్చిన 'అతిలోక విహారమ్ముల బ్రతికే రోజులు' ఇవికావు. అల్లాగే

మానవుడి దారిద్ర్యాన్ని, జీవన సౌభాగ్యాన్నీ వదలిన వట్టి దేశభక్తి కూడా స్వీకార్యం కాదు. 'మట్టినేలపైని మమత మానవు లన వైముఖ్యం' తగదంటాడు. దేశమును మాతగా ఆరాధించడంకన్న మానవుడిని ఆరాధించమని కవి ఉద్బోధిస్తున్నాడు.

"జన్మభూమి జననికాదు సామాన్యసుమా ఆయమ
వసుమతి యగు ఆమెకొరకు వల్లభు లెందరు పెనగిరి"

జన్మభూమిని జనని అనే భావం నుండి సామాన్య— వేశ్య— అనే భావన చేయడం సాధారణమయిన విషయమేమీ కాదు. అందుకోసం—

"నాదేశం నారాష్ట్రం నాపట్నం నా జిల్లా
మట్టిగడ్డ కాదు కాదు మానవజాతి పురోగతి"

మనదృష్టి ఏ విధంగా పరివర్తన చెందవలసి ఉన్నదీ కవి నిర్దేశించాడు. సంకుచిత జాతీయవాదం నుంచి సమగ్రమయిన మానవతావాద దృక్పథం ప్రపంచించాడు. అబ్బూరి 'భయద మహాప్రస్థానం'లో దారితప్పిన నేస్తాన్ని ఈ ఉజ్జ్వల మానవతా మార్గాన పయనించమని ప్రతిపాదిస్తున్నారు. మానవుడి చుట్టూ ఉన్న మహిమా సముద్రాన్ని మధించి— ఈ యుద్ధజ్వాలావృతమయిన లోకంలో (మండుతున్న అరణ్యాన) శాంతిజ్యోత్స్నలు ప్రసరింపజేసి (పండు వెన్నెలను) ధాత్రిని సస్యశ్యామలంగాజేసి ఆకలిని ఖండించి సాగిపోయే మానవుడికి జయం పలుకుతున్నాడు కవి.

ఈ మానవతాదృక్పథంలో కవి మనుష్యుల్లో మనుష్యలక్షణాన్ని విస్మరించి వాళ్ళల్లో వాళ్ళకు విద్వేషాన్ని కల్పించి, వర్గపోరాటం ద్వారానే లోకశ్రేయస్సును కల్పింపజూచే సిద్ధాంతాన్నీ తిరస్కరించాడు.

"మనిషిమాట మరచిపోయి—మరచిపోయి మనిషిమాట
కార్మికులూ కర్షకులూ ధార్మికులూ ధనపతులూ
విడివిడిగా యెడపెడగా తడబడగా ముడిపడగా

ఆవరించి తీవరించి అవరోధం కల్పించే
ఈ చింతాదారిద్ర్యం ఎన్నడు మము వీడిపోవు"

మానవుడిలోని సహజసౌమనస్యాన్ని ఆధారంగా — నిరంతర కృషి ఆధారంగా నిర్మించబోయే నవసమాజాన్ని ఆహ్వానించి ఈ ఖండం ముగించాడు కవి.

మూడో ఖండం వ్యర్థమయిన ఆశయాలకోసం అన్వేషించి విఫలమనోరథులైనవారిని గూర్చి ప్రారంభమవుతుంది. ఎప్పుడూ తమ కోర్కె ఫలించేందుకు ఎదురుచూచి వేసారిన వారి కేకలు ఎప్పుడూ వినిపిస్తూనే ఉంటవి. జగత్ తత్త్వం తెలియని సన్యాసులు— నిజంకానిదేదో భౌతికాతీతమయిన దానిని భావిస్తారు. ఇది గగనకుసుమమధువు నాస్వాదించడం. వీళ్ళ కలల్లో కథల్లో కనిపించే సుఖం, ఆనందం ఇదిలౌకిక జీవితంలో సాక్షాత్కరించదు. లోకంలోని దుఃఖితులూ, వ్యథితులూ, బాధితులూ ఈ అలౌకిక స్వాప్నికానందమును భావించితే వాళ్ళకు శోకం తగ్గదు.

"కలలలోన కథలలోన కలిపించే యెండమావి
దప్పిగొన్న సంసారుల తనువులు నిలబెట్టేనా ?
శోషిల్లిన శ్రమజీవుల శోకము పోగొట్టేనా ?...

అంటారు కవి.

లౌకిక దుఃఖస్పర్శలేని ఈ అలౌకిక ఆనందాకాంక్షుల నుద్దేశించి 'నీడలేని వెలుగునకై ఈడేరని కాంక్షలూర పరితపించి భ్రమియించే భ్రాంతులార ! బంధులార!' అని సంబోధించి దేవుడు, మతము మొదలైన అధ్యాత్మిక మార్గసంచారులను పిలిచి ఒక నూతన సందేశం ఇస్తున్నాడీకవి.

"మాయలేని, మహిమలేని
మానవుడే మన దైవము''

ఈ కవితకంతటికీ మూలభూతమయిన సందేశం ఇది. మానవుడి ఔన్నత్యాన్ని ఔదార్యాన్నీ, ఔజ్జ్వల్యాన్నీ సమారాధించే అతనికి కవిసృష్టిలో అతనికి సర్వోన్నత స్థానాన్ని కల్పిస్తున్నాడు.

కాని మానవుడి సందేశాన్ని అందుకొనే దశకు ఇంకా చేరుకోలేదు. కొందరు పరమార్థము వర్ణించలేక ఈ కవితా చైతన్యాన్ని తమ భావనాబలానికి అందినంతలో ఊహించి మాతృదేవతగా అర్చిస్తున్నారు. ఈ మానవ లోకం అనేది భావసంఘర్షణలతో బందీకృతమయి ఉన్నది.

''నరలోకపు చెరసాలకు నలువైపుల కటకటాలు''. ఈ కటకటాలు— ఎన్నో అవరోధాలు, విరోధాలు, అంతరాయాలు, సంతమసం, సంఘర్షణ— ఇలా ఎన్నో సంశయాల సందోహాలు ఇదంతా మనస్సులో ఒక సంకీర్ణ స్థితికి కారణ మౌతున్నది.

ఈ సంశయాలు మానసికంగా— లౌకిక మయినవేకాక సృష్టినిగురించీ, జననమరణాల గురించీ విశ్వనిర్మాణము తారాగోళాలు, అణువున దాగిన విలయ భయంకరనృత్యం ఇలా ఎన్ని ఆశ్చర్య కారణాలు. అసమాధేయాలైన సందేహాలు.

ఇలాంటి అంతటి జీవనంలోనూ ఆనంద మోహకమయిన క్షణాలు లేక పోలేదు. ఆ క్షణాలలో ఈ ఊహలన్నీ దూరీకృతములు ఔతవి.

నాల్గవ ఖండం ఉపసంహారం. మానవజీవనం ఎంత దూర దూరాల నుండి ఎన్నిదశలు దాటివచ్చిందో ఎంతదూరం సాగవలసి ఉన్నదో? ఈ అనంత మహాప్రయాణంలో తన క్షణికమయిన జీవనంకూడా సత్యమే. దాని సౌందర్యం దానిదే. ఆనాటికీ అనంతానికీ నడుమసాగే ఈ ప్రయాణంలో ఒక్కొక్క జీవితం. ఆ జీవుడికీ ఆ జీవనమే శాశ్వతమయింది. జీవనం అశాశ్వతంగా భావించి అలౌకిక మయిన మృగమరీచిక వెంటపడి వ్యర్థం చేసుకోరాదని కవి ఉపదేశం. అపరి చ్ఛిన్నమయిన కాలదృష్టితో ప్రత్యక్షమైన జీవన సౌందర్యాన్ని పరిహరించ కూడదు.

ఈయనంత పరిష్వంగ మెచ్చటి కచ్చటికే సరి
అజ్ఞాతాజ్ఞేయాలకు అజ్ఞానంతో నేస్తం

అజ్ఞాతమూ అజ్ఞేయమూ అయిన పారలౌకిక జీవనాన్నిగూర్చిన కల్పనలన్నీ అజ్ఞానంలోనుండి పుట్టినవే.

మానవుడి ఔన్నత్యం, అతని క్షణికమయినా జీవనాన్ని ఆరాధించడంలోనే ఉన్నది.

"నీవధిరోహించిన యీ అల నిత్యం శాశ్వతమూ సుమా
నీకల్పించిన యీకల నిజం నిజం వాస్తవికం
అంతులేని యీ జీవన కాంతారాంతరముల నీ
చింతా దీపంబెంతటి చిన్ని చిన్ని వెలుగిడినా
అంతెచాలు సంతెచాలు అంతకన్న లేదుమేలు"

జీవనాన్ని అలతో పోల్చడంతో ఒక అలనుండి వేరొక అల పుట్టినట్లు మానవుడి జీవనం విడివిడిగా కానవచ్చినా ఒకదానికీ ఒకదానికీ పరస్పర సంబద్ధమయింది మానవుడి జీవనం. ఒక అల అనడంవల్ల ఈ మహామానవ జీవనం ఒక మహా సముద్రం. మానవుడి ఆలోచన తత్కాలంలో యెంత కొంచెమయిన జ్ఞాన వికాసానికి తోడ్పడినా అది అంతేచాలు. ఈ వాక్యాలలో మానవజీవితంలోని పృథగ్భావం నుండి సర్వమానవ జీవనమనే ఒక అనంత మహారూపాన్ని భావింపజేస్తున్నాడు కవి.

ఈ మానవుడికి కవితారాధన నిత్యమయింది. అతడికి కాలంతో నిమిత్తం లేదు. అందువల్లనే ఈ ఖండం చివర కవితా సుందరీమణిని సంబోధించి—

భావుకులూ బంధువులూ భావియనక భూతమనక
కలకాలం కలలవోలె వెలిగింతురు నీదుతోట

అని చెప్పినాడు కవి.

*  *  *  *

ఈ కవితా రచనలో అబ్బూరి రామకృష్ణరావు కవితా దర్శనంలో విలక్షణమయిన దృష్టిని ప్రతిఫలింపజేసినారు. చారిత్రకంగా ప్రగతివాద కవితా యుగంలో నుండి వచ్చిన కొత్తమలుపును సూచించడం, 'పొరపాటీ తిరుగుబాటు' అని స్పష్టంగా పేర్కొనడం ఇందులో విశేషం.

కవితా రంగంలో తాత్త్వికమయిన విభేదాలకన్నా మిన్నగా కాలానికి అతీతంగా మానవుని చైతన్యాన్ని హృదైకమయంగా ఆరాధించే తత్త్వం ప్రతిపాదించడం జరిగింది. రాష్ట్రానికి, దేశానికీ ఇంకా ఇలాంటి పరిధులకు అతీతముగా మానవత్వాన్ని స్వచ్ఛంగా భావించిన తెలుగుకవులలో అబ్బూరి నిజంగా గణనీయులు.

(జనధర్మ, జూలై 1969 ద్వైమాసిక సాహిత్యానుబంధం)

కురుగంటి సీతారామ భట్టాచార్యులు
పిల్లలమర్రి వేంకట హనుమంతరావు

## అబ్బూరి

అబ్బూరి రామకృష్ణరావు (జననము 1896) ఈయన సంస్కారము ఆజన్మముగా ఉన్నవ్యక్తి, ఆంగ్ల కవితారీతులను బాగా పరిశీలించినాడు. ఈయనకు ఉత్సాహము, సంతోషమే గాని, దుఃఖము బాధపెట్టేది కాదు. దుఃఖములో కూడా నవ్వేవ్యక్తి. కాయబారిన శరీరము. పొట్టి గిరజాలు. మడత చెడని సూటు. ఆకర్షవంతంగా ఉంటాడు. మద్రాసునుంచీ మైసూరు వలసవెళ్ళినాడు. అక్కడ కొంతకాలముండి ఆంధ్ర విశ్వవిద్యాలయములోనికి వచ్చినాడు. ఈయన విద్యార్థిగా ఉన్నపుడే యీయన వ్రాసిన కావ్యాలు పఠనీయ గ్రంథాలుగా నిర్ణయింపబడిన వంటే యీయన ప్రతిభ ఎంతటిదో ఆలోచించండి. 'మల్లికాంబ' 'ఊహాగానం' అనే కావ్యాలు, 'నదీసుందరి' అనే నాటికా ఈయనకృతులు. రాయప్రోలువారి కవిత్వము ఈయనను లోగొన్నది. ఆ ప్రోద్బలమువలన ఈయన కావ్యాలు ఉద్బుద్ధాలైనవి. అబ్బూరి వారివలన దరిమిలా యువకులనేకులు కవితాభిరుచి అలవరచుకున్నారంటే అతిశయోక్తికాదు.

(నవ్యాంధ్ర సాహిత్యవీధులు
ద్వితీయ ముద్రణ, 1949.)

రాఘవాచార్యులు, సంపత్

## అబ్బూరి

రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణరావు ఒక తెగకు చెందిన కవులు. వారు భావగీతాలేకాక కథనాత్మకమైన రచనలు కూడా చేశారు...

రాయప్రోలుకు కొంచెము తరవాత వచ్చినా ఆయనతో సమాన స్కంధుడుగా నిలువగలిగినవాడు అబ్బూరి రామకృష్ణరావు. ఆయన 'ఊహాగానము', 'పూర్వ ప్రేమ' 1918 లో ప్రకటించినాడు. 'మల్లికాంబ'' అతని మరొక ఖండకావ్య సంపుటము. రామకృష్ణరావు మంచి వ్యుత్పన్నుడేకాక చక్కని భావుకుడు. తన ప్రసన్నవాణితో కొన్ని చక్కని భావగీతాలు వ్రాశాడు. కాని రామకృష్ణరావు ఏకారణముచేతనో కవితారచన మాని చాలాకాలమైనది.

(తెలుగు విజ్ఞానసర్వస్వము, 3వ సంపుటి.)

కొత్తపల్లి వీరభద్రరావు

## అబ్బూరి

పౌరాణిక ఇతివృత్తమునే గ్రహించి, మంచి కాల్పనికమైన ప్రతిభతో శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు 'నదీసుందరి' నాటికను రచించిరి. ఇది ఈ శాఖకు చెందిన నాటికలలో మేల్బంతియై యున్నది. ఇందులకు ముఖ్యకారణము దీని రచనలోని ప్రత్యేకత, కోమలమైన రచన. మధుర మైన భావము, సన్నివేశ నిర్మాణచాతుర్యము — ఈనాటికలోని ప్రత్యేకత ధర్మములై నాటికకు నాటికి, నేటికి గూడా పేరు తెచ్చుచున్నవి.

(తెలుగు విజ్ఞానసర్వస్వము, 3వ సంపుటి.)

అబ్బూరి రామకృష్ణరావు

## ఆకాశవాణి-రసమంజరి

కళాప్రపూర్ణ అబ్బూరి రామకృష్ణరావుగారి సాహిత్యకృషిని గురించిన సంచికా కార్యక్రమం. సమర్పణ — 'రజని'.

శ్రీరంగం గోపాలరత్నం :

ఓ విశాలావనీ !
శోభాతి పావనీ !

ఆరంభ పుణ్యక్షణముల నీశుడు విసరిన నాటి
నీయాది సౌభాగ్యమెటుల వెల్గెనో? భవదీయశాటి

ఆకుపచ్చని యాకులో
పండువెల్తురు రేకులో

నిన్ను ప్రశ్నింపగాజాల, నీ నాటి ప్రొద్దుటి పూట
గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యపు పాట

ఓ విశాలావనీ !
శోభాతి పావనీ !

రజని : ఓ విశాలావనీ - శోభాతిపావనీ అని తమ కవితాగానంతో అఖిల విశ్వాన్నీ ఆలింగనంచేసుకున్న మహాకవి - మేష్టారు - అబ్బూరి రామకృష్ణారావుగారు. భారతీయ పారంపరిక సంస్కృతి పునాదిగా ఆధునికమానవుని ఆశలనూ ఆశయాలనూ జీర్ణించుకున్నది అబ్బూరివారి కవితా తత్వం. సాంప్రదాయిక సిద్ధాంతాలకూ ఆత్యాధునిక సిద్ధాంతాలకూ భావసేతువుగా నిలిచింది వారికవిత. ముద్రిత

మైన రచనలకంటే దొరకని రచనలే యెక్కువేమో! ముద్రితమై మనకు లభించినవి స్వల్పమైనా, శిల్పం అనల్పమైనది. జీవితమంతా ఒక ఉద్యమంగా గడిపారు అబ్బూరి రామకృష్ణారావుగారు. ఒకటేమిటి? అనేక ఉద్యమా లనవచ్చునేమో! తన్ను తాకని నవమహోద్యమము లేదు - తాను ముట్టని నిత్యనూతనత లేదు. శాంతినికేతనంలో వంగభాషాధ్యయనమూ, స్వాతంత్రోద్యమపు తొలిరోజుల్లో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి అంతేవాసిత్వమూ - తదుపరి ఎం. ఎన్. రాయ్‌గారితో సాన్నిహిత్యమూ, ఆమధ్యనెప్పుడో అరవిందుల ప్రభావం అన్నీ కలిసి అబ్బూరి రామకృష్ణరావుగారి జీవితాన్ని దిద్ది తీరిస్తే, వారిజీవితం గత ఐదు శతాబ్దుల్లో మన అందరి సాంస్కృతిక రాజకీయ జీవనానికి అద్దంలా నిలబడింది. వారి సాహిత్యయాత్ర యెలాసాగిందో వారి ముఖతః విందాం.

అబ్బూరి : వెనుకటికి నూజివీటి అప్పారావుగారిదగ్గర యిద్దరు బ్రాహ్మణ గుమాస్తాలుండేవారు. వారు చిన్నతనంలోనే ఉద్యోగంలో చేరటం చేత సంధ్యావందనం మొదలైనటువంటివన్నీ - గోత్రం మొదలైనటువంటి రికార్డంతా మరచిపోయినారు. చిరకాలమైంతరవాత కొందరు బంధువులు వొచ్చి వారిని "నాయనా మీరు అపస్తంబులా - అశ్వలాయనులా" అని అడిగారట. అనేటప్పటికి వాళ్లు తెల్లమొహం వేసి "మేము అపస్తంబులమూ కాదు అశ్వలాయనులమూ కాదు, అప్పారావుగారి గుమస్తాలం" అని అన్నారు. నన్ను - నన్నడుగుతూంటారు మీరు కవిత్వం రాస్తున్నారా యింకా అని. నేను రాయడం లేదు. నేనడుగుతూంటాను - మీరెందుకు రాస్తున్నారని. అంటే ఇది కేవలం కొంటెతనంగా అడిగిన ముక్కకాదు. దానికి నిజమైన అర్హతవుండి రాయకపోవడం కూడా వొక మంచిగుణమే అని చెప్పి భావించేవాళ్ళల్లో నేనొకణ్ణి. ఆవిధంగా చూస్తే నలభైయ్యాభై సంవత్సరాలకిందట నేను నాసాహిత్య ప్రయత్నం మానేసినట్టుగా అనిపిస్తున్నది. నాక్కూడా నమ్మకం లేదు - అయినాను - అంటే అనేకమందితో సాహచర్యంవల్ల ఈ విధమైనటువంటి దృష్టితో నన్ను నేనువిమర్శించుకుని-నారచనలమీద నాకే వైముఖ్యం

కలిగేస్థితికూడా యేర్పడి - రచన కొంతమటుకు మానుకోవడం తటస్థించింది. రవీంద్రనాథ టాగూరు వొకసారి యెక్కడో అన్నాడు -"నేనో మహాకావ్యాన్ని రాయాలని సంకల్పించాను....

కల్పనా శీవిగేరఖాటి
ఆజార నీచేర జాగిఛె

ఆకల్పనంతా తునిగిపోయి ముక్కచెక్కలయి వేయి చిన్ని చిన్ని గీతాల కింద రాలిపడిపోయిందీ అన్నాడు. అంటే—అలాంటి మహాకావ్యాన్ని రాయలేక పోయాన్నేను. సంకల్పం మాత్రం వుండేది. అనేక సమస్యలు అడ్డంవొచ్చి నలగి_ ఒక విధమైన సంకల్పబలం వుండాలికదండి: అలాంటి బలం రావటానికి జీవన దృష్టంతా సంపూర్ణంగా వొక లక్ష్యంపైనే నిమగ్నంకావాలి. కేంద్రీకరింపచేయాలి. అలాంటిది జరగలేదు. అనేకమంది వ్యక్తులతో నాకున్నటువంటి సంబంధంవల్ల నాలోనూ, జగత్తులోనూ వుండవలసినటువంటి విశ్వాసం చాలా వరకు కుంఠితమైపోయింది. అది యెందువల్లనంటే_ నేను చెప్పలేను. కాని అలావుంది నా అనుభూతి. యీ విధంగా చూస్తే— నేను_ కొన్ని ఘట్టాలు నాకు— జ్ఞాపకం వస్తున్నాయి. చెన్నపట్నం వెళ్ళాను ప్రెసిడెన్సీకాలేజీలో బి.యే. లో చేరడానికి. అక్కడెవరో నాకు తటస్థపడి "మైసూరులో సంస్కృత పాఠశాలవుంది. చాలాగొప్పసంస్థ అది. నీకు సంస్కృతంలో చాలాప్రీతివుంది కాబట్టి అక్కడికి పోతేబాగుంటుంద"ని చెప్పాడు. తీరాపోసి మైసూరు వెళ్ళి సంస్కృత పాఠశాలలోకి వెళితే అక్కడి గుమాస్తా చూసి 'నీకేమన్నా వెర్రెక్కిందా యిక్కడికొచ్చావు, నువ్వు నిక్షేపంగా యింటర్మీడియటు హైస్కూలో ఏలాకాలేజీలోనో చేరక: యిక్కడి గతిలేదు. తిండీ తిప్పలు లేనివాళ్లంతా యిక్కడికొచ్చి— యింకోవ్యాపకం లేనివాళ్లంతా యిక్కడికొస్తారు-యిక్కడి కెందుకొచ్చావు"అన్నాడు. దాంతో నాకు కొంత నిరుత్సాహమైపోయింది. రామానుజాచారి అని ఆ కాలేజీ సూపరింటెంటు_ సాయంకాలం నన్ను కలుసుకుని నన్ను కాంతరాజ అరసు అనే ఆయనదగ్గరకు తీసుకునివెళ్లి తెలివిగల కుర్రాడు మనపాఠశాలకు వచ్చాడు. వెనక్కిపొమ్మనడం భావ్యంకాదు అని చెప్పి — తను ప్రత్యేకంగా— ముగ్గురు విద్వాంసుల్ని యేర్పరిచి_ పంచకావ్యాలన్నీ— నాకు చదివించడానికి యేర్పాటు చేసి కావలసిన సదుపాయాలన్నీచేసి నన్ను పాఠశాలలో ప్రవేశపెట్టాడు.

అదివరకూ—ఆకిందటి సంవత్సరమే— అక్కడ్ణించి చదువు మానేసినటు వంటి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు— ఆయన కొన్నాళ్ల పూర్వస్నేహితుల్ని కలుసుకోవడానికని పాఠశాలకు వచ్చాడు. కొత్తగా యెవరో తెలుగబ్బాయి వొచ్చాడిక్కడికి అంటే— నేనప్పుడు రాయప్రోలు సుబ్బారావు తెలుగుతోట, కష్ట కమల, తృణకంకణం మొదలైన పుస్తకాలు వున్నాయంటే పట్టుకెళ్లాడు. నేనూ కొన్ని పద్యాలు నావి చదివి వినిపించాను. అంటే అతను తమాషాగా ఉన్నాయి యివి అనిచెప్పి— అతను అంతవరకూ వినలేదు రాయప్రోలు సుబ్బారావు పేరు— ఈ సంగతి— పోయి రామలింగారెడ్డితో చెప్పారు. రామలింగారెడ్డిగారు కాలేజీలో ఆయనకి చిన్న ఉద్యోగమిప్పించాడప్పుడు— ఆకిందటి సంవత్సరమే. చెబితే "సుబ్బారావెవరో యెరగనండి". అబ్బూరి రామకృష్ణరావుట యెవరో. మల్లికాంబ అనే పుస్తకం రాశాట్ట. చెన్నపట్నంలో నాకిచ్చారిది. యిది చూడండి: చాలా బాగుంది!" అన్నాడు. అంటే "ఆ కుర్రా డిక్కడే వున్నాడండి" అంటే "ఓసారి తీసుకురండి కలుసుకుందాం— చూద్దాం" అన్నాడు. ఆ విధంగా నాకు ఆయన పరిచయం కలిగింది. నాకు తెలియకుండానే ఆయన— కొన్నాళ్ళు జరిగి పోయింతర్వాత నాకక్కడ స్కాలర్‌షిప్ అరేంజ్‌చేసి యెన్నో విధాల ఆదరించా రాయన నన్ను. నాలుగైదు సంవత్సరాలు అక్కడుండి అధికారాంతం వరకూ వ్యాకరణం చదువుకున్నాను. కాని నాకు తృప్తికలగలేదు. యేం చేదామను కుంటూండగా చీరాల నుంచి యిద్దరు విద్యార్థులు వచ్చారు. జ్యోతిషపరీక్ష ఇయ్య టానికి— రవీంద్రనాథటాగూరు గురించినటువంటి కథలెన్నో వుండేవి ఇంగ్లీషులో మహాకవీశ్వరుడని— వొకాయన చేతిలో........ అతని స్వదస్తూరితో రాసినటువంటి రెండు పాటలు ముద్రించారు— అవి బెంగాలీలో ఎలావుంటాయో తెలుసుకోవాలనే కుతూహలంవుండేది—ఆయనకు బెంగాలీ లిపి రావడంవలన ఆయనచేత చదివించు కున్నాను— అంటే— ఆయన—చదివి వినిపించాడతను—

షేజే ఆషే ఆషే ఆషే
కభీయే శ్రావణ ఉడా తేరే షేజె ఆషే
పరే పరే దినే దినే
దినబజీసే షేజె ఆషే

అవి రెండూవిని— నేను వంగదేశంవెళ్లి టాగూరును చూసి—భాషనేర్చుకోవాలని కుతూహలం వొకటి కలిగింది. యేది తలుచుకుంటే అది చెయ్యగలిగినటువంటి

స్వాతంత్ర్యం నాకొకటుండేది కాబట్టి అప్పుడే సంకల్పించుకున్నాను వెళదామని. అది రామలింగారెడ్డిగారికి యిష్టంలేదు— నేను వెళ్ళడం. యే డాక్టరూ నాకు సర్టిఫికేటియ్యటానికి సాహసించలేదు. యెందుకంటే మంచి ఆరోగ్యంగావున్నాను. చదువు మానాల్సిన అవసరం లేదుకాబట్టి. అదే— యేదో వ్యాజంతో నేను వెళ్లి కలకత్తా చేరుకున్నాను. కలకత్తాలో ఏ కాలేజీలోనూ సీటుదొరకలేదు. నాన్‌కాలేజి యేట్ స్టూడెంటుగా సిటీకాలేజీలో చేరి — హేరంబచంద్ర మిత్రాకింద — టాగూరుకో ఉత్తరం రాశాను. నేనీ విధంగా పలుపాట్లుపడి ఎన్నాళ్ళనుంచో ఉన్నటువంటి సంకల్ప బలంచేతనే యిక్కడికి రాగలిగాను. నీ ఆశ్రమానికి వొచ్చి కొన్నాళ్ళక్కడ గడపాలని— నీదర్శనం చెయ్యాలనివుందనీను. అంటే— ప్రిన్స్‌పాల్‌గారు వుత్తరంరాశారు— అప్పుడు కాలేజీకి ప్రతిరోజూ వెళ్ళవలసిన అవసరంలేదు కాబట్టి, తరవాత కాలేజీలోనే చదువుకునే రోజుల్లోకూడా సంస్కృతం స్పెషల్‌స్టడీ— బెంగాలీ వుపాధ్యాయుల సంస్కృతోచ్చారణ చాలా కర్ణకఠోరంగా వుండడంచేత—అది లేకపోతేనే మంచిదనే వుద్దేశంతో—నేను శాంతినికేతనం చేరుకున్నాను. కాని శాంతినికేతనంలో వొక మూడు వారాలు—నాలుగు వారాలు గడిచింతరవాత నాకదివరకున్నటువంటి ఆ—భావం త్వరలో సడలిచ్చింది—చాలావరకూ తగ్గిపోవటానికి యెందువల్లనోమరి—తరిగింది. వైతాళికులని చెప్పి వుదయమే టాగూరుపాడినట్టు పాడుతూ—మేలుకొలుపులు పాడుతూ—విద్యార్థులందరూ తిరగాలి—అక్కడున్న ప్రతిసన్నివేశమూ కూడా టాగూరుకు సంబంధించినది కావటం—అక్కడున్నటువంటి ప్రతికుర్రవాడూ కూడా టాగూరును పొగడుతూ వుండటం నిష్కారణంగా—యివన్నీ చూసి వొకవిధమైనటువంటి జుగుప్స కలిగింది. యెందుకంటే స్వతంత్రమైనటువంటి బుద్ధికలిగినటువంటి యీ యువకులు కూడా యీ విధమైన భావదాస్యానికి లోనుకాగూడదనేటటువంటి భావంలో నాకు—నేను వుండటంచేత—అక్కడున్నటువంటి యీ భావదాస్యాన్ని సహించలేకపోయినాను. తరవాత రెండు మూడుసార్లు ఆయన్ను కలుసుకున్నప్పుడు— నా కన్నా ముందుగానే రాయప్రోలు సుబ్బారావుగారు అక్కడుండటంచాత— ఆయనడిగారు 'యేమిటి మీ సుబ్బారావు యేదన్నా పద్యం చదవమంటే పాడతాడేమిటి అన్నారు—పాడతాడేవిటని. అంటే—చెప్పాను మాది గణబద్ధమైనటువంటి ఛందస్సు—మాత్రాఛందస్సు—తరవాత. అది పాడటంగాదు-వొకవిధమైన—ఛాంట్ చేయాలి. చెయ్యకతప్పదు. ఓ పద్యం మీరురాశారూ— మీ మీటింగ్‌కి వచ్చాను కలకత్తాలో—

"నూతన ............ చటుల తిమిర రాత్రి
.................... సఫలయాత్రి"

అని మీర్రాశారు. అలాగే ఛందో గణబద్ధమైననటువంటిది యేదైనా వొకవిధంగా పాడకతప్పదేమో. అలాపాడితేనేగాని కొంచెం రిలీఫ్. మరిసాగదీసివుండవచ్చు, అంతకంటె మరేంకాదు. ఆ పద్యాలన్నీగూడా మీవాటిలాగా అక్షరమాత్రికలు కాదు. గణమాత్రికలు అనగానే ఆయన సంతోషించారు.

తరవాత అక్కణ్ణించి నేను వెళ్ళిపోయాను. కలకత్తాలో వుపన్యాసం చెయ్యటానికి వొచ్చినప్పుడల్లా టాగూరు చక్కని పట్టుబట్టలు కట్టుకొని ప్రసన్న మైన చూపులతో, గడ్డం సవరించుకుంటూ, పెద్ద విలువకలిగిన మోటారు కారు లోంచి దిగి సభావేదికపైకి వస్తుంటే ఆయన ఆవచ్చే కాస్తదూరంలోనూ కొన్ని వందలమంది భిక్షుకులు ఆయన అఖండమైనటువంటి ఆయన తేజస్సు ఆయన శరీరసౌష్ఠవమూ వీటన్నింటివెనకా దారిద్ర్యం వాళ్ళనెగతాళి చెయ్యడం వంటివి చూస్తే ఆ తారతమ్యం వుంటే చాలా హృదయవిదారకంగావుండేది. తరవాత రెండు మూడుసార్లు కలకత్తాలో ఆయననివాసం 'జొరాసెంకో'లో వున్నప్పుడు ఆయన్ను చూడటానికి వెళ్ళాము, నేనూ మాగంటి బాపినీడు కలిసి. వాళ్లింట్లో నాటికలు వేస్తూండేవారు. ఆనాటకాలకి చాలావరకు పెద్ద పెద్ద ఉద్యోగాల్లోవున్నటు వంటి పెద్దవాళ్ళంతా వస్తూండేవారు గవర్నర్లూ కౌన్సిలర్లూ మొదలైనవాళ్ళంతా. వొకనాడు మేంకూడా ఈ నాటకం చూడాలని వుందీ మాక్కూడా యేమన్నా కొద్ది ప్రవేశం యిచ్చి అవకాశం కలిగించమని అడిగాం మేం. అంటే ఆయన చెప్పారు 'నాయనా అడ్డమైన ఉద్యోగస్థులూ వస్తుంటారు యిక్కడికి. నాకు యిష్టంలేదు, తప్పదు. తప్పనిసరి. వాళ్ళొస్తే మీబోటివాళ్ళ కెవరికీ అవకాశం వుండదూ, యింకోసారి యెప్పుడన్నా చూస్తాను. శాంతినికేతనం వచ్చినప్పుడు చూద్దురుగాని అని యేదో నచ్చచెప్పి మమ్మల్ని పంపించారు.

మొత్తంమీద తేలిందేమిటంటే వంగ భాష అభ్యసించడానికి నాకవకాశం కలిగింది. ఆయన రచనలు చాలామటుకు మాతృకలలో చూడటానికి అవకాశం కలిగింది. కాని ఆయన మీది ప్రత్యేక వ్యక్తిగతమైనటువంటి గౌరవంలో కొంచెం తగ్గుబాటు కనిపించిందినాకు.

కలకత్తాలో వుండగా చదువుతూండగా ఆంధ్రపత్రిక సబ్ ఎడిటర్స్‌లో కర్నాల నరసింహంగారని యెవరో వుండేవారు. ఆయనతోనూ తరవాత నాగేశ్వర రావుగారితోనూ వుత్తర ప్రత్యుత్తరాలు జరిగి సారస్వతానుబంధమని నేను స్టార్ట్ చెయ్యడానికి యేర్పాటు జరిగింది. తరవాత అక్కణ్ణించి వచ్చిన తరవాత నేనూ, బసవరాజు అప్పారావూ యిద్దరం కలిసి ఈ సారస్వతానుబంధాన్ని ప్రారంభించాం. మొట్టమొదట నేను అనేకవ్యాసాలు రాశాను. 'అభినవ కవితాప్రశంస' అని వొక వ్యాసపరంపర నేరాసిందే దాంట్లో ప్రతివారం ప్రకటితమైంది. తరవాత కొన్ని సంవత్సరాలైన తరవాత సూరిశాస్త్రిగారు—పురాణం సూరిశాస్త్రిగారు- ఆహ్వానించారు. నేను 'రసమంజరి' అని కృష్ణాపత్రికలో వొక లిటరరీ సప్లిమెంటు నేను స్టార్ట్‌చేశానక్కడ. దాంటోనా 'నదీసుందరి' తరవాత అనేకపద్యాలు యివన్నీ మొట్టమొదట పబ్లిష్ అయినాయి. 'సూర్యరాజు కథలని' వోయిరవై కథలు యిరవై అయిదు చిన్నకథలు. అందులో వొక్కటీ యిప్పుడు దొరకలేదు. అక్కడ సంవత్సరం రెండు సంవత్సరాలు గడిపాను. తరవాత అప్పటికి ఈ లోపుగావచ్చిన చిన్న సంఘటనలైతేనేం పెద్ద సంఘటనలైతేనేం - మానసికంగా వొక విధమైనటువంటి అసంతృప్తి కలగటంవల్ల దైవికమైన విషయాల్లో శ్రద్ధ యెక్కువ కానటంవల్లా కొన్ని చిత్ర విచిత్రమైన అనుభూతులు కలిగి కొంత భీతి గూడా కలిగింది. అనేక స్వప్నాలు రావటం మొదలైనవి. ఇది తీర్చుకోవటానికి యీ సందేహాలన్నీ తీర్చుకోవటానికి అనేకమంది సాధువులుంటే వాళ్లను సమీపించి వారి సమాధానాలు కోరుతూవుండేవాణ్ణి. అప్పుడు నా సహాధ్యాయి అయిన ........సంవత్సరం కిందట, వేలూరి చంద్రశేఖరం అరవిందఘోషు దగ్గరుండేవారు. అప్పుడు నేను స్వయంగా యెవరి సహాయం లేకుండా స్వతంత్రంగా చెన్నపట్నం వెళ్ళి అక్కణ్ణించి పుదుచ్చేరి చేరుకుని అరవిందుల సాన్నిధ్యాన్ని చేరుకోవటానికి ప్రయత్నించాను. తీరా పుదుచ్చేరి వెళ్ళిం తర్వాత "అరవిందులు దర్శన మివ్వరు. మాతృశ్రీ మాత్రమే దర్శనమిస్తారు" వారు యేర్పాటు చేస్తామని చెప్పారు. సరే రెండు రోజులున్న తరవాత వారితో వొక యింటర్వ్యూ యేర్పాటుచేసి నన్నక్కడికి తీసుకెళ్లారు. అదివరకే నేను వుత్తరం రాసిచ్చానువారికి. నా అనుభవాలన్నీ రాసి వారియొక్క సలహాకోరుతూ వారియొక్క ప్రసాదాన్ని అభ్యర్థిస్తూ వుత్తరం రాసి పంపించాను. తరవాత నేను... ... ఈ అమ్మగారు సమీపించి నావంక చూసి యేం మాట్లాడకుండా హూష్ హూష్ అని......మళ్ళీ........మళ్ళీ వో మాటు చూసి మళ్ళీ అదే విధంగా

వొక ధ్వని చేశారు. నేను నమస్కరించాను. ఆమె లోపలికి వెళ్ళిపోయినారు. అంతే. అంతకన్నా మాకు సంభాషణ అక్కడ జరగలేదు.

రజని : నాకు కవిత్వం సెకండరీ, అర్థవంతమైన బతుకు బతకడమే నాక్కావాలి అంటారు అబ్బూరివారు. కాలగతిలో వచ్చిన అనేక వుద్యమ స్వరూపాల్ని అర్థంచేసుకొని వాటిలో తాను పాల్గొని జీవితాన్ని సార్థకం చేసుకున్నారు అబ్బూరి. వారి జీవితమే వొక అదర్శమైతే వారు సెకండరీ అంటున్నవారి కవిత్వం అంతకన్నా అదర్శప్రాయమైందికదా. సాటి జనుల కన్నీళ్ళు తుడిచే ప్రయత్నంలో తమవంతు యెంతో వివరిస్తూ ——

అబ్బూరి : నేను స్వతంత్రించి కమ్యూనిస్టు మేనిఫెస్టో చదివి........కమ్యూనిస్టు పార్టీ మనదేశంలోకూడా వొకటి వుంటే బావుణ్ణు అని కమ్యూనిస్టు పార్టీ స్టార్ట్‌చేద్దామనే వుద్దేశంతో అనేకమంది కుర్రవాళ్ళని కలుసుకున్నాను, కొన్నాళ్ళు బెజవాడా అక్కడికి వెళ్ళి. తరవాత కోటం రాజు రామారావు అతని యొక్క సహాయంతో బొంబాయి చేరుకుని తాను జోగ్లేకర్‌నీ వాళ్ళనీ చూసి నా యొక్క అభిప్రాయాన్ని వాళ్ళకు తెలిపితే నాకు విశాఖపట్నంలో పార్టీతరపున పనిచెయ్యటానికి అధికారపత్రాలన్నీ యిచ్చి వెళ్ళిపోయినారు. అప్పుడు నేను విశాఖపట్నంలో వొకరిద్దరు సహచరులతో కలిసి డాక్‌వర్కర్స్ యూనియను వొకటి యేర్పాటు చెయ్యగలిగాను. ఆరునెలలు ఆహోరాత్రాలు కృషిచేస్తే అది యేర్పాటు చెయ్యడానికి వీలైంది. నేను యూనివర్సిటీలో పనిచేస్తున్నాను. కాబట్టి బహిరంగంగా కమ్యూనిస్టునని చెప్పకోటానికి నాకు అనుమతి ఇయ్యలేదు పార్టీవారు. రహస్యంగానే పార్టీ పనిచెయ్యమన్నారు. అందువల్ల నేను...... అవకాశం కలిగింది. అప్పుడు మన యం. వి. కృష్ణరావుగారిని అధ్యక్షులుగా నియమించి నేను చాటుగా పనిచేస్తున్నాను. కొన్నాళ్ళైం. తరవాత నేను కమ్యూనిస్టు పార్టీలో వుండటం చాలా దుర్భరమైనటువంటి పరిస్థితులన్నీ యేర్పడ్డాయి. యెందువల్లంటే సాధారణంగా ఈ సంచాలకులంతా అర్ధరాత్రి వొంటిగంటా రెండు గంటలకు

నైపుణ్యాన్ని ప్రదర్శించినపుడు— అది వొక నిర్దిష్టమైన, సంప్రదాయసిద్ధమైన, విలక్షణ అభిరుచి ప్రేరితం కాబట్టి దానికి వొక సార్థకతయేర్పడేది. నామరూపాలు లేని యే అకాడమీ సభ్యులనో ఉద్దేశించే చిత్రం యేవిధంగా వుంటుంది? యెవరిని రంజిస్తుంది?

(రచనాకాలం 1950—1955. యేదో చిత్రకారుల సమావేశంలో యిచ్చిన ఉపన్యాసానికి చిత్తుప్రతి అయివుండాలి. *ఈ గుర్తు వున్నచోట విడిగా "అప్పారావుగారి గుమాస్తాలం" అని రాసివుంది. ఇది అబ్బూరి తరచూ ఉపన్యాసాలలో వాడే పిట్టకథ. 'రజని'తో జరిపిన రేడియోగోష్ఠిలోవుంది—సం).

అబ్బూరి రామకృష్ణరావు

# క్షేత్రయ్యపదాలు

ఇంగ్లండులో సుప్రసిద్ధ నాటకప్రయోక్త అయిన గార్డన్ క్రేగ్ తనకాలంలో వున్న నాటకప్రయోగాల నశ్వరత్వాన్ని మనసులో వుంచుకొని వొక విచిత్ర మైన సూచనచేశాడు. ఎంతటి ప్రతిభావంతులైన నటీనటుల సహకారంతో ప్రయో గాన్ని ప్రవర్తింపచేసినా ఆప్రయోగానికి స్థిరత్వంలేక అది ఉత్తరక్షణంలో విస్మృత ప్రాయం కావటమూ యితర ప్రయోక్తలకు దానివల్ల యేవిధమైన ప్రయోజనమూ లేకపోవటమూ నేటికీ పరిపాటియేకదా. అందువల్ల స్త్రీ పురుషుల సహాయంతో కాక, కర్రబొమ్మలతోను తోలుబొమ్మలతోను కల్పించే వినోదం స్త్రీ పురుషుల నటన వల్ల చేకూరదని ఆయన నిర్ణయించాడు. ఇంతేగాక ఉత్తమ పురుషార్థసిద్ధికోసం వినియోగించాల్సిన మానవ శరీరాన్ని కళాసాధన కోసం వినియోగించటం మానవ గౌరవానికి భంగమని కూడా ఆయన నిర్ణయించాడు. ఆ సమయంలో ఆనంద కుమారస్వామి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య కలిసి ఇంగ్లీషులోకి అనువదించిన నందికేశ్వరుని 'అభినయదర్పణం' అనే గ్రంథం అతని చేతిలోపడింది. దాంతో అతను చిరకాలంనుంచీ కల్పించుకొన్న సిద్ధాంతాలన్నీ తారుమారైపోయినాయి.

అభినయం అనేది విశిష్టమూ సర్వ స్వతంత్రమూ అయిన సాంకేతిక భాష. ఈ భాషతో ఏక్లిష్టభావాన్నయినా ఏసుకుమార మనఃప్రవృత్తినైనా సుగమంగా సుందరంగా వ్యక్తం చేయవచ్చు. ఈ వ్యాపారమంతా సుప్రతిష్ఠితం చేసి పునరా వృత్తం చేయవచ్చు. ఈ అభినయవిద్య సహాయంవల్ల ఒకనాటి నాటకప్రయో గాన్ని వేరొకనాడు యథాతథంగా రూపొందించవచ్చు. నాటక ప్రయోగానికి యీ దృష్టితో చూస్తే నశ్వరత్వదోషం రాదు.

అభినయానికి నాలుగు ముఖాలు :ఆంగికమని, వాచికమని, ఆహార్యమని, సాత్వికమని. భ్రూవిక్షేపాలు, శిరఃకంపాలు, నయన స్పందాలు, నానావిధాలైన

ముద్రల హస్తాలు, భంగిమలు— యివన్నీ ఆంగికాలు. కాకుస్వరవిధానాన్ని అల వరచుకొన్న భాషోచ్చారణ పద్ధతులన్నీ వాచికాలు. ఉచిత వేషధారణవల్ల ఏర్పడే రూపకల్పనంతా ఆహార్యం. ముఖబింబంలో వున్మీలితాలయ్యే భావపరంపరలన్నీ సాత్వికమర్యాదలు. ఈ నాలుగూ నాలుగుముఖాలేకాని నాలుగు ప్రత్యేక విద్యలు కావు. శకుంతలా ప్రథమ సందర్శన సమయంలో దుష్యంతుడన్న 'ఆయే లబ్ధం నేత్రనిర్వాణం' అన్నమాట సమ్యక్‌వేషాన్ని ధరించిన దుష్యంతుడు దాని కుచిత మైన ఆంగికవిన్యాసంతో తన మనస్సులో కలిగిన అనుభూతిని వ్యక్తంచేస్తూ అన్న మాటే. ఈ సంబోధనలో యీ నాలుగు విధాలయిన అభినయాలు ఏకత్ర సమ్మి శితమై ఒక అపూర్వమైన సుందరదృశ్యాన్ని సామాజికులకు సాక్షాత్కరింప చేస్తున్నాయి.

కేవలం నాదప్రధానంగా భాసించే సంగీతాన్ని మనం ఎరుగుదుం. ఇది ముఖ్యంగా రాగాలాపనలలోను స్వరప్రస్తారంలోను మనకు గోచరిస్తుంది. ఇది గాక భాషను ఉపాంగంగా గ్రహించి సంగీతాన్ని భాషను మేళనంచేసిన పద్ధతి త్యాగరాజాది కృతులలో కనిపిస్తుంది. నృత్యమనేది స్వతంత్రమైనకళ. ఇతర కళానపేక్షంగా కేవలం తాళలయాత్మకమైనది నృత్యకళ. కాని దీనికికూడా గానంతో మేళనం చేయడంవల్ల ఒకవింత శోభ చేకూరుతుంది. ఆదశలో నృత్యం ప్రధానంగాను సంగీతం అప్రధానంగాను వుండటం సహజం. ఒక్కొక్కప్పుడు యీనృత్యసంగీతాలకు భాషకూడా తోడై 'పదం' అనే ఒక విశిష్టరూపం కల్పిత మవుతున్నది.

ఈ పదమనేది స్ఫుటరూపంతో క్షేత్రయ్య నిర్మించిన కళాసృష్టి. సాధా రణంగా యీ విధమైన కళాఖండాలలో భాషకు భాషను, సంగీతానికి సంగీతాన్ని, నృత్యానికి నృత్యాన్ని విడదీయటం భావ్యంకాదు. ఈ మూడింటి సంయోగంవల్ల కలిగే రసానందం విశిష్టమైనది కావటంవల్ల, యీ విభాగంవల్ల సహజస్వరూపం కుంటుపడిపోతుంది. కాని క్షేత్రయ్యలోవున్న గొప్పతనమేమంటే సాహిత్యప్రియు లకు తన భాషలోవున్న పలుకుబళ్లు, నుడికారాలు, లలితసుకుమార పదసంయో జనము సంతోషాన్ని కల్పిస్తాయి. గానకళాభిమానులకు విలంబగతిలో సాగే రాగోన్మీలనము ఆకర్షణీయంగా వుంటుంది. ఆయా అవస్థాభేదాలతో అభిన యించే నటీనటుల నటనల్లో సంగీతసాహిత్యాలకు వ్యాఖ్యానప్రాయంగా వున్న

కొత్త కొత్త కల్పనలు ఎన్నో కనిపిస్తాయి. అందువల్లనే యీ వర్ధంతి సమయంలో పదకవితా సామ్రాజ్యానికి అధినేతగావున్న క్షేత్రయ్య ప్రతిభను భిన్నభిన్న దృక్పథాలనుంచి చూచి రసికవిమర్శ చేయడానికి అనుకూలత ఏర్పడుతున్నది.

ఇతని భాషావైశద్యాన్ని గురించి పరిశీలించేముందు యీ పదాలలో ప్రధాన వస్తువుగా వున్న విషయాన్ని కొంత అవగాహన చేసుకోవడం అవసరం. ఈ పదాలన్నిటిలో స్త్రీ పురుష సంయోగంవల్ల ఉత్పత్తిల్లే శృంగారం అభివర్ణితమైంది. ఈ పదాలన్నీ మువ్వ గ్రామంలో వెలిసిన గోపాలమూర్తికి అంకితాలైనట్లు స్థూలంగా మనకు గోచరిస్తున్నది. అంటే ప్రతిపదంలోను మువ్వగోపాలప్రసక్తి మనకు గోచరిస్తూంటుంది. ఈ కారణంవల్ల యిందులో వర్ణించిన శృంగారం కామినీ కాముకుల శారీరక సంయోగంవల్ల జన్మించే శృంగారం కాదనీ, యిందులో ముఖ్యంగా ఉద్దేశించినది ఆధ్యాత్మిక భక్తి శృంగారమనీ కొందరంటారు. ఇందులో వర్ణించిన నాయికలు స్వీయలనీ, పరకీయలనీ, సామాన్యలనీ మూడు విధాలు. శాస్త్రసమ్మతంగా అనుగ్రహీత అయిన భార్య స్వీయ, పరదార అయినది పరకీయ. వేశ్యావృత్తినే ప్రధానంగా ఆచరిస్తున్నది సామాన్య. ఈ పదాలలో యీ ముగ్గురు నాయికలు మువ్వగోపాలునితో పొందుకలిగి వుండటం అభివర్ణితమైనది. పారదారిక వర్ణనంవల్ల వేశ్యాసంభోగ వర్ణనంవల్ల భక్తి ప్రపత్తులకు భంగం వాటిల్లగలదనే సంశయం కేవలం నిరాధారం కాదు. కాని యీ పురుషార్థాలు కూడా నాలుగు విధాలయిన అభినయాలవలెనే విభిన్నం కావని మనం గుర్తించడానికి వీలున్నదేమో. కేవల ధర్మప్రవృత్తిగాని అర్థప్రవృత్తిగాని కామప్రవృత్తిగాని మోక్షప్రవృత్తిగాని ఏ మానవుడిలోనూ నిరపేక్షంగా వుండవు. ఒక్కొక్క అధికారంలో ఒక్కొక్క ప్రవృత్తి ప్రధానంగా వుంటుంది. అయితే కామప్రవృత్తి ప్రధానంగా వున్న వ్యక్తికి ధర్మప్రవణత్వం లేదనడానికి వీలు కాదు. ఈ విధంగానే యితర పురుషార్థ ప్రవృత్తులుకూడా నాయికానాయకుల సంభోగశృంగారం వర్ణితమైనప్పుడు ఆ వర్ణనలన్నిటిలోను నిగూఢంగా అంతర్గర్భితంగా ధర్మాభిముఖమైన చిత్తప్రవృత్తి మాటుమణగివుండవచ్చు. శాస్త్ర సమ్మతమైన దాంపత్యంలో కూడా స్వీయ పరకీయవేషాన్ని అశాకమైన వేశ్య వైభవాన్ని కల్పనచేసి నాయికానాయకుల సంభోగక్రీడావినోదాన్ని సముజ్వలం చేయడంకూడా జరగవచ్చు. ఈ విధమైన విలాసాలవల్ల మనం

కల్పించుకొన్న ఆవరణలు, నియమాలు పభిన్నాలయిపోయి విగళిత వేద్యాంతర మైన ఒక ఉదాత్తానుభూతి లభించవచ్చు.

ఏది ఎలావున్నా సాధారణ మానవులకు యీ పదాలలో కాయికమైన కామ ప్రవృత్తితప్ప వేరొకటి కనిపించదు. కులీనకుటుంబాలలో స్త్రీ పురుషులు యీ పదాల నభ్యసించి, అభినయించి విస్తృతంగా వీటిని తమ దైనందినవ్యవహారాలలో ప్రధానంగా భావించగలరనే ఆశ ఏమాత్రమూ సముచితంగా కనిపించటంలేదు. నేటివరకు మనకు సంక్రమించిన సంప్రదాయాన్ని అనుసరించి ఈ పద అభినయ ప్రచారం దేవదాసీగణాల వశమై వుండటమే యిందుకు నిదర్శనంగా కనిపిస్తున్నది. ఈ పదాలలో స్త్రీ పురుషరతి వర్ణనాత్మకమైన భాగమంతా అను సరణయోగ్యం కాదనే అనాలి. విలంబగతిలో సాగే యీ పదాల అభినయ ధోరణి అత్యంతరమణీయంగా వుంటుంది. అలతి అలతి పదాలతో అల్లిన తెలుగునుడికారాలు, ముచ్చటైన పలుకుబళ్లు భాషా ప్రియులందరికీ అత్యంత ఆకర్షణీయమైన ఘట్టాలు, ఇందులోవున్న అసభ్యశృంగారాన్ని మనం చూస్తూ చూస్తూ అనుసరించలేము. ఉత్తమ అభినయానికి అనుకూలమైన రసవత్సన్ని వేశాలను విస్మరించలేము. వీటిలోని భాషాసౌకుమార్యాన్ని పదే పదే మనం మననంచేయకతప్పదు. ఇంత ఉజ్జ్వలమైన మాటలకూర్పు అనితరసాధ్యం కాబట్టి.

శాపగ్రస్తుడైన దుష్యంతుడు శకుంతలను చూసి పొందిన ద్వైధీభావమే యీపదాలను చూసి మనం పొందక తప్పదు.

"భ్రమర ఇవ విభాతే కుంద మంతస్తుషారం,
నచఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్."

బాగాయె నీవగలెల్లా మాబాగాయె 1
నిద్దుర కనురెప్పలపై నిండియున్న దేమోయి 3
పట్టిన పట్టు పట్టిదనిపించేనా 5
తెరువులు చూచి వేసారితి
నెలలెంచి యలసితి
నిలుపరాని ప్రేమ నెమ్మది నరచుకొంటి 7

| | |
|---|---|
| మొదటి పొందే చాలు | 7 |
| పదింటిలో సగ మొనరించితినమ్మా | 8 |
| పందెమాకు కొన్నారట | |
| పట్టుకపొయ్యేమనుచు | 9 |
| ఎగ్గు చేసినా యెదురా ? | 10 |
| చెమ్మి రేగిన కీడ్జడ వేటు | |
| మబ్బు మీరిన నిదురపాటు | 10 |
| తెలివి యొకరి సొమ్మా | 11 |
| విభుని దవ్వుల బెట్టే చెలులు | 12 |
| విరజమ్మి నాయాస విడిపింతునేమో | 13 |
| కత్తి కోతగాడు మగడేమి జేసునో | 13 |
| ఏల వేగించేవే నీవు | |
| ఊరెల్ల మాటు మణగె | |
| ఆసించినా ఫలించే దరుదు గాదటవే | 15 |
| రాపుచేయుట మేలా ? | |
| నిన్ను రమ్మంటే మావారు | |
| మూతులు త్రిప్పేరు | 16 |
| కోపగించి పోయేవు కొన్ని నాళ్లాయి నీవు | 16 |
| కొండంత కాపురమే | |
| రానుపోను | |
| కోమలి కందలమే | 17 |
| తీరదింక నేనేమి సేయుదు | 18 |
| దేపుడలిగెను మనమీద | |

(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1963 ఆగస్టు 11న విజయవాడలో క్షేత్రయ్య త్రిశతాబ్ద్యుత్సవం జరిపింది. ఆ సందర్భంలో ఏర్పాటుచేసిన సాహిత్యోపన్యాసాల కోసం శ్రీ అబ్బూరి ఈ ప్రసంగవ్యాసాన్ని తయారు చేసి

నట్లు కనబడుతుంది. చివరకి ఈ వ్యాసం ఆ సభలో చదివారో లేదో తెలియదు. గాని సుదీర్ఘమైన ప్రసంగానికి ఇది శకలప్రాయమైన రచనగా తోస్తోంది. చివర చేర్చిన క్షేత్రయ్య ప్రయోగాలను గురించి కూడా రాయదలనుకొనీ రాసినట్లులేదు. 'సాహిత్యోపన్యాసాల' పేర 'క్షేత్రయ్య పదసాహిత్యము' గురించి ఇచ్చిన ఉపన్యాసాల సంకలనం అకాడమీ అచ్చువేసింది. అందులో ఈ వ్యాసంలేదు. ఇది అముద్రితం—సం).

అబ్బూరి రామకృష్ణరావు

# ద్విజేంద్రలాల్ రాయ్

**వం**గభాషా మహాకవి ద్విజేంద్రలాల్ రాయ్ జన్మించి యిప్పటికి నూరు సంవత్సరాలైంది. ఆయన జీవించిన యాభై సంవత్సరాల్లోనూ యేపది పదిహేను సంవత్సరాలో కృషికి వినియోగించారు— యీ కృషికూడా యేకైక లక్ష్యంగా సాగించిందికాదు. డిప్యూటీ మేజిస్ట్రేటుగా వుద్యోగ ధర్మాన్ని ప్రధానంగా నిర్వహిస్తూ తీరిక సమయంలో సాధించిందే—అయినా యీ అల్పకాలంలో అజరామరమైన కీర్తిని సంపాదించి కేవలం తమ మాతృభాషమీదనే కాక యితర భారతీయ సాహిత్యంమీద కూడా తమ ప్రభావాన్ని వ్యాపింపజేశారు.

వివిధచ్ఛందోరీతుల్లో యీయన పద్యాలూ గేయాలూ రచించాడు. అవి వంగదేశపు నాలుగు మూలలా వ్యాపించి ప్రజల్లో అంతులేని వుత్సాహాన్ని ఆనందాన్నీ కల్పించినై. 'ధనధాన్యపుష్పభరా వసుంధరా' అనే చరణంతో ఆరంభమై 'నా జన్మభూమి' అనే మకుటంతో వున్న దేశభక్తిగేయం జాతీయగీతంగా వొకనాడు బహుళ ప్రచారాన్ని పొందింది. కాని ముఖ్యంగా నాటకకర్తగానే ద్విజేంద్రుడి కీర్తి నేటివరకూ నిలిచింది.

తక్కిన భారతీయ భాషా ప్రాంతాల్లో వలెనే వంగదేశంలో కూడా నాటకరంగం అనేకాంతరాయాలకులోనై జీర్ణించిపోయింది. మహోదాత్తమయిన ప్రాచీన సంస్కృతనాటక సంప్రదాయం మొగలాయీ తురుష్క దండయాత్రల ఫలితంగా నాగరక వ్యవహారానికి దూరమైపోయింది. దేశిమార్గంలో నడిచిన[1] యాత్రలు మొదలైన వినోదాలు ప్రజాజీవనంలో అంతర్వాహినిగా నిలిచిపోయినైగాని శిష్టజన గౌరవాన్ని పొందలేకపోయినై.

---

1. జాత్ర—బెంగాల్ రాష్ట్రంలోవున్న వొక జానపదనాటక కళారూపం—సం.

ఈ దుస్సంధి సమయంలో వాణిజ్యంకోసమూ, విదేశయాత్రావాంఛతోనూ, సామ్రాజ్యకాంక్షతోనూ భరతదేశాన్ని ప్రవేశించిన పాశ్చాత్యజనగణం తమ వినోదంకోసం కొన్ని నాటకాలు ప్రయోగించటమూ, వాటిని మనిదేశీయులు చూచి అనుకరించటాని కుద్యమించటమూ జరిగింది. యీ విధంగా కొంతవరకు కృతకంగా ప్రారంభమైనా వంగనాటకం త్వరలో పుష్టినీ శక్తినీ సంపాయించి సమకాలిక సామాజికలోకానికి వినోదాన్నీ విజ్ఞానాన్నీ కల్పించే వుత్తమ సాధనంగా రూపొందింది. యీ మహాపరిణామానికి వైతాళికులుగా కృషిచేసిన వారెందరో వున్నారు. వీరందిరిలో విశ్వకవి రవీంద్రుని జ్యేష్ఠసోదరుడైన జ్యోతిరింద్రనాథ ఠాకూరూ, నటుడుగా నాటకకర్తగా, ప్రయోక్తగా నిర్విరామంగా వుద్యోగించి వంగ జాతీయ నాటకరంగాన్ని నెలకొల్పిన గిరీశచంద్ర ఘోషూ, హాస్యరసభరితాలైన, అశేష ప్రేక్షకలోకానికి ప్రేమ పాత్రాలయిన నాటకాలెన్నో రాసి నటుడుగా కూడా ప్రఖ్యాతి పొందిన అమృతలాల్ వసూ, గణనీయులు. యీ పరంపరకు చెందినవాడే ద్విజేంద్రలాల్‌రాయి.

ద్విజేంద్రుడు నాటకకర్తగా వంగసాహిత్యంలో అడుగుపెట్టేటప్పటికి వంగ నాటకరంగం సుస్థిరమైన స్థానాన్ని సంపాదించింది. రంగపరికరాలన్నీ సిద్ధంగా వుంచుకున్న నాటకశాలలూ, సలక్షణంగా నాటకాన్ని ప్రయోగించే నైపుణ్యంగలిగిన ప్రయోక్తలూ, కొత్తనాటకాలకోసం యెదురు చూచేరోజులవి. భారతదేశమంతటిలోనూ అన్ని రంగాల్లోనూ నాయకత్వాన్ని వహించిన మహానాయకులెందరో వంగదేశంలోవెలిశారు. గోపాలకృష్ణగోఖలే అన్నట్లు యీనాడు వంగదేశం చూపిన మార్గం మర్నాడు భారతదేశమంతా అనుసరిస్తుంది. చిరకాల దాస్యంచేత సంక్షుభితమైన భారతదేశం మొదటిసారిగా విప్లవశంఖాన్ని వంగ దేశంలో ఆనాడు పూరించింది. మొట్టమొదట ద్విజేంద్రుడు సాంఘిక దురాచారాలనూ, మూఢాచార పరాయణులైన భారతీయులనూ చిత్రిస్తూ నాటకాలు రాసినా, నాటక ప్రక్రియలో పరిణతి నార్జించిన తర్వాత ప్రగాఢమైన దేశభక్తితో నిండిన నాటకాలు రాయటం ఆరంభించాడు. యితనికి పూర్వం దేశభక్తిని ప్రదర్శించిన నాటకాలింత ప్రస్ఫుటంగాలేవు. యే రామరావణ సంగ్రామాన్నో, కృష్ణ కంస యుద్ధాన్నో పురస్కరించుకొని సామాజికులకు వూహించుకొనేందుకు వీలుగా వ్యంగ్యంగా మనపరిపాలకుల దుష్టచర్యలను తీవ్రంగా విమర్శిస్తూ వుండేవారు. ద్విజేంద్రుడు భారతీయ చరిత్రలోనుంచి వీరాగ్రేసరులను నాయకులుగా గ్రహించి,

నాటకౌచిత్యాన్ని పాటిస్తూ, పరదాస్య విమోచనానికి పాటుపడాలనే వుత్కంఠ సామాజికుల్లో రేకెత్తించే శక్తిమంతాలైన సంభాషణలతో నాటకాలు రాశారు. వీటిలో ముఖ్యమైనవి మేవాడు పతనము, షాజహాను, చంద్రగుప్త. యీ నాటకాలొక్క వంగదేశంలోనే కాక, అనేక భారతీయ భాషల్లోకి అనువదించటంద్వారా యావద్భారతదేశంలోను భావసంచలనాన్ని కలిగించినా యనటంలో సందేహం లేదు.

మేవాడు పతనంలో యెన్నో ప్రేక్షకులను పులకింపచేసే సన్నివేశాలున్నాయి. పదహారోశతాబ్దిలో పరిపాలించిన రసపుత్ర సార్వభౌముడు రాణాప్రతాపుడు యావజ్జీవితమూ అతనికి శత్రువులైన మొగలు చక్రవర్తులతో, అక్బరు సార్వభౌమునితో, పోరాటం తప్పలేదు. తన ఐశ్వర్యమంతట్నీ విసర్జించి తన రాజప్రాసాదంలో జరిగే భోగాల కన్నిటికీ స్వస్తిచెప్పి, తనదేశం స్వతంత్రం కానంతవరకూ తృణశయ్యమీద పవళిస్తూ, పత్రపుటాల్లో భోజనం చేస్తూ వుంటానని కఠోరమైన ప్రతిజ్ఞచేసి జీవితాంతంవరకూ అచంచలమైన సంకల్పబలంతో దాన్ని పాలించినవాడు రాణాప్రతాపుడు. అతి కరుణమైన వొక సన్నివేశంలో రాణాతన భార్య బిడ్డలతో వొక వృక్షచ్ఛాయలో విశ్రమించి వుండగా ఆకలికోర్వలేక వొక బిడ్డ ఆహారాన్ని కోరినప్పుడు, నాటకాన్ని చూచే సామాజికుల కన్నులు చెమ్మగిల్లటం నేనెరుగుదును. ఆగస్టు 1947లో మన దేశానికి స్వాతంత్ర్యం లభించినంతవరకూ, రసపుత్రరాజులందరూ రాణాప్రతాపుడి ప్రతిజ్ఞనుస్మరిస్తూ తాము శయనించే పట్టుపాన్పులకిందా, భుజించే స్వర్ణరజిత పాత్రల కిందా కొన్ని తృణాంకురా లుంచుకునేవారు.

ద్విజేంద్రుడి చారిత్రక నాటకాలన్నిటిలోకీ చాలా ప్రసిద్ధిచెందినది చంద్రగుప్త నాటకం. నాలుగో శతాబ్దంలో మౌర్యవంశానికి చెందిన హిందూ సార్వభౌముడు చంద్రగుప్తుడు. రాజ్యభ్రష్టుడై తన ఆచార్యుడూ, మంత్రీ అయిన చాణక్యుని రాజనీతిచేత పట్టాభిషిక్తుడు కావటం యీ నాటకానికి వస్తువు. నందుడిచే పరిభవింపబడిన చాణక్యుడు నందుడి వినాశనానికై చూపిన ప్రతిశోధ ఆశ్చర్యజనకమైన ఘట్టం. యీ నాటకంలో చాణక్యుడి పాత్రా, ద్విజేంద్రుడు స్వతంత్రంగా సృష్టించిన హెలీనా, ఛాయా— యీ రెండు స్త్రీ పాత్రలూ ప్రతిభగల నటీనటుల నెందరినో ఆకర్షించి వారివారి నటనాకౌశలానికి గీటురాయిగా పనిచేసినై. ద్విజేంద్రుడి నాటకరచనా పద్ధతి నేటి నాటక మర్యాదకు కొంత భిన్నంగా, రంగ

బాహుళ్యంతోనూ సుదీర్ఘమైన సంభాషణలతోనూ నిండివున్నా వుదాత్తభావోన్మీలనంవల్లా లోకవృత్తానికి సన్నిహితంగా మానవ మనఃప్రవృత్తుల్ని వుజ్జ్వలంగా చిత్రించడంవల్లా నేటికీ ఆకర్షణీయంగానేవుంది. వంగ నాటక కర్త ద్విజేంద్రుణ్ణి మనం అంత తొందరగా మరిచిపోలేం.

(ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి 19 జూలై 1963న ప్రసారమైన ప్రసంగం).

అబ్బూరి రామకృష్ణరావు

# శ్రీ అక్కిరాజు ఉమాకాన్తమ్

శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరుల పేరు జ్ఞాపకానికి రాగానే దాదాపు అర్ధశతాబ్దం క్రిందట తెనుగుదేశానికి సంబంధించిన నానాభావాలతో స్మృతిపథం నిండిపోతుంది. ఈ భావాలు కేవలం తెనుగు వాఙ్మయానికి సంబంధించినవే కాదు. విస్తృతమైన భారతీయ సంస్కారంలో అంతర్భాగమైన తెనుగు సంస్కారాన్ని అఖండరూపంలో మననంచేసి ఆరాధించిన మతులలో శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులొకరు. ఆకారణంచేత ఆనాటి తెలుగు సంసారంలో సంచలనం కలిగించిన సంఘటనలెన్నో జ్ఞాపకం రావటం సహజం. అప్పటికి మొదటి ప్రపంచయుద్ధం ముగిసి యెన్నాళ్లోకాలేదు. ఆ యుద్ధంలో విజయాన్ని సాధించిన మనపాలకులు ఈ దేశంలో తమ పరిపాలనాన్ని నిరంకుశంగా నిర్దాక్షిణ్యంగా సాగించిన రోజులవి. ఈ దుష్పరిపాలనాన్ని ప్రతిఘటించగల శక్తి జాతిలో కావలసినంతగా విస్తరించలేదు. ఈ బలహీనతకు లాంఛనంగా వంగదేశంలో ప్రాదుర్భవించిన దురాగ్రహమూ, హింసామార్గమూ అనేకులకు మార్గదర్శకాలైనవి. గాంధీమహాత్ముని సత్యాగ్రహోద్యమం ఇంకా ఆరంభంకాలేదు.

ఇది యిలా వుండగా వేరొక వైపున రవీంద్రుని సాహిత్యానికి ఖండాంతరాల్లో ఖ్యాతి లభించింది. దాని ప్రభావం యితర దేశభాషలలోవలెనే తెనుగు సాహిత్యంలో కూడా ప్రతిఫలించింది. శ్రీ కందుకూరి వీరేశలింగంగారు అప్పటికీ జీవించేవున్నారు. వారు ప్రవర్తింపజేసిన సాహిత్యోద్యమంలో అగ్రగాములుగా శ్రీ గురజాడ అప్పారావుగారు, గిడుగురామమూర్తిగారు తమ రచనలనూ భాషావాదాలనూ సాగించారు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి కవితావ్యవసాయం యింకా అప్పటికి పూర్తిగా పరిణతంకాలేదు. విద్యాలయాలలో అగ్రపీఠాన్ని అధిష్ఠించిన ఆంగ్లసాహిత్యంతోబాటు క్రొత్తగా ప్రతిష్ఠనార్జించిన వంగ సాహిత్యం కూడా తెనుగు వారికి మార్గదర్శకం కాజొచ్చింది.

ఈ సమయంలో శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారు తమ తర్క వ్యాకరణ విద్యావ్యాసంగాన్ని వంగదేశంలో జరుపుతూ ఉండేవారు. వంగ సాహిత్య వేత్తలతో సాహచర్యంవల్లా, లోకజ్ఞానంవల్లా, స్వానుభవంవల్లా, వంగ సాహిత్యాభ్యుదయానికి గల కారణాలను వివేకంతో సూక్ష్మంగా పరిశీలించడంవల్లా తనకు కలిగిన జ్ఞానాన్ని ఆధారంగా తీసికొని తన మాతృభాష అయిన తెనుగును పరామర్శించటం ఆరంభించారు.

శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారు వంగదేశం విడిచి స్వదేశానికేగిన కొన్నాళ్లకు ఉన్నతవిద్య నపేక్షించి నేను కలకత్తా వెళ్లడం తటస్థించింది. ఆ మహానగరంలోని ఆంధ్రోద్యోగులూ విద్యార్థులూ కలిసి ఆ రోజులలో 'వంగదేశీయాంధ్రసమితి' అనే సంస్థను వొకదాన్ని నడువుతూవుండేవారు. నేనక్కడగడపిన రెండు సంవత్సరాలలోనూ ఒక సంవత్సరం— అంటే 1919లో—ఆ సమితికి నేను ఉపాధ్యక్షుణ్ణిగా ఉండేవాణ్ణి. అంతకు పూర్వం శ్రీ ఉమాకాన్తంగారు ఈ సమితికి ఉపాధ్యక్ష పదవిని నిర్వహించారట. నాహయాములో సమితి సాంవత్సరికోత్సవం జరపవలసివచ్చింది. ఉమాకాన్తంగారితో బాగా పరిచయం గల మిత్రులు సమితిలో ఉండేవారు. వారన్నారు "వెనక నొకమారు ఇలాటి ఉత్సవంలో శ్రీ ఉమాకాన్తంగారు సంస్కృతంలో అనర్గళంగా ఉపన్యసించారు. మీరు కూడా అలాచేస్తే బాగుంటుంది" అని. అంతకు పూర్వం మైసూరు సంస్కృత విద్యాశాలలో రెండు సంవత్సరాల కృషిఫలితంగా ఆర్జించిన కొంచెపు సంస్కృత భాషాపాండిత్యాన్ని ఆధారంగా వొక వుపన్యాసాన్ని వ్రాసి, కంఠస్థంచేసి ఆయేటి వార్షికోత్సవసభలో అనర్గళంగానే వల్లించాను. ఈ సభలకు, ఆంధ్రులయందు ఆదరమూ అభిమానమూ గలిగిన ఒక విఖ్యాత వంగపండితుణ్ణి ఆహ్వానించడం ఆచారం. ఆయేడు విఖ్యాత తర్కవిద్యావేత్త 'ఎ హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్' అనే మహాగ్రంథానికి కర్తా అయిన సతీశచంద్ర విద్యాభూషణులు అధ్యక్షస్థానం అలంకరించారు. వారు తమ అధ్యక్షవచనంలో సాతవాహనులనూ, నాగార్జునుణ్ణీ, పండితరాయలనూ ఉదాహరించి ఆంధ్రుల ప్రాచీన విఖ్యాతిని ఉగ్గడిస్తూ ప్రసంగవశంగా శ్రీ ఉమాకాన్తంగారినికూడా పేర్కొన్నారు.

అప్పటినుంచీ శ్రీ ఉమాకాన్త పండితులను గూర్చి ఎక్కువగా తెలుసుకోవాలనే అభిలాష నాకు కలిగింది. తెలుగు వాఙ్మయ ప్రసక్తి వచ్చినపుడల్లా ఆయన అంటూవచ్చిన మాటలను నామిత్రులు కొందరు జ్ఞాపకం చేస్తూ ఉండే

వారు. వంగదేశంతో పోల్చి చూస్తే తెనుగుదేశంలో సంస్కార దారిద్ర్యం స్ఫుటంగా కనిపిస్తున్నదని వారంటూ ఉండేవారట. వంగదేశంలో మనప్రాంతంలో కన్న చాలాకాలంక్రిందటనే ఆంగ్లభాషాసంస్కృతుల సంపర్కం కలగడం వల్లా, అచ్చటి ఆంగ్ల విద్యాశాలల్లో ప్రవేశపరీక్షకు సంస్కృత భాషావరసం నిర్బంధం కావటంవల్లా, అక్కడి పట్టభద్రులకు కొంత సంస్కృత వ్యాకరణంలో ప్రవేశమూ, వాల్మీకి రామాయణంతోనూ కాళిదాసాది మహాకవుల కావ్యాలతోనూ అంతో ఇంతో పరిచయం కలగడంవల్ల సంస్కృత భాషలో గుప్తమై ఉన్న భారతీయ విజ్ఞానం వారికి సన్నిహితంగా ఉండేదనీ, అంతేకాక సంస్కృతంలోని ఉదాత్తగ్రంథాలిన్నిటికీ తర్జుమాలు ఏనాడోవెలసి జిజ్ఞాసువుల కందుబాటులో ఉండేవనీ ఆసమ్మేళనంవల్ల ఒక విశిష్టచోదన ప్రారంభమై వంగసాహిత్య వికాసానికి దారితీసిందనీ వారంటూండటం పరిపాటి. ఇందుకు భిన్నంగా మన భాషా ప్రాంతంలో ఆంగ్ల విద్యాశాలలందు పట్టభద్రులైనవారికి వచ్చీరాని ఇంగ్లీషు, తెలిసీ తెలియని సంస్కృతమూ ఆధారంకావడమూ, తెనుగు భాషలో విజ్ఞానప్రదాలైన తర్జుమాలుకూడా విరివిగా లేకపోవడంవల్ల అభ్యుదయానికి దారితీసే సాధన సంపత్తి మృగ్యమైనదని కూడా ఆయన తరచుగా విమర్శిస్తూ ఉండేవారట.

తరువాత ఏడెనిమిదేండ్లకుగాని శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరుల ముఖపరిచయం నాకు లభించలేదు. వారు 1926 సంవత్సరంలో కాబోలు చెన్నపట్నంలో వారిచ్చిన ఉపన్యాసాల అసమగ్ర స్వరూపాన్ని ఆంధ్ర పత్రికాముఖంగా చూచి ఒకసారి వారిని చెన్నపట్నంలో స్వయంగా కలుసుకున్నాను. ఆనాటి సంభాషణ యథాతథంగా జ్ఞాపకం లేదుగాని ఆయన వాక్యధోరణిలో కన్పించిన ఆంధ్రవాఙ్మయ సేవాతత్పరతా, కూలంకషమైన భాషా పాండిత్యమూ, తెనుగు భాషోద్ధారాది విషయమై ఆయనకు గల తృష్ణా నాకిప్పటికీ స్మరణీయంగా ఉన్నవి.

శ్రీ ఉమాకాన్తంగారు 1889లో జన్మించారు. చాలావరకు స్వయంకృషి వల్లనే విద్య ఆర్జించారని చెప్పవచ్చు. వంగదేశంలో నవద్వీప సంప్రదాయాన్ని అనుసరించి భాష్యాంతంగా సంస్కృత వ్యాకరణమూ, తర్కశాస్త్రమూ అభ్యసించారు. శ్రీ వావిలకొలను సుబ్బారావుగారి అనంతరం ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకులుగా పనిచేశారు. వావిళ్లవారు నడిపిన త్రిలిఙ్గ పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. లౌకిక దృష్టితో చెప్పుకోదగిన పెద్ద సంఘటనలేవీ ఆయన జీవితంలో లేవు. పాండిత్యానికి తగ్గశరీరదార్ఢ్యం ఆయన కెన్నడూ లేకపోయింది. ఆయన

చేసిన విమర్శనలలోని అత్యుక్తులను కొన్నిటిని ప్రతివిమర్శచేస్తూ ఛలోక్తిగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారంటూవుండేవారు "చివరకు మంచినీళ్లు కూడా జీర్ణించుకోలేని దుర్బలుడీ ఉమాకాన్తం. ఉదాత్తకావ్యాల్లోని రసాన్ని ఎలా ఆస్వాదించగలుగుతాడు" అని. ఇది ఛలోక్తిగా అన్నా నాకు మాత్రం శ్రవణకటువుగానే ఉండేది. నలభైమూడేండ్లు నిండీ నిండకమునుపే 1932లో ఆయన జీవయాత్ర చాలించారు. ఆయన వ్రాయదలచినవీ, వ్రాసినవీ, విస్తరింపదలచినవీ, గ్రంథాలపేర్లను ఉదాహరిస్తే ఆయన సర్వతోముఖమైన వాఙ్మయ జిజ్ఞాస మనకు విశదమౌతుంది. టిప్పుసుల్తాను అనునవల, పల్నాటి వీరులకథలు, షేక్స్పియరు నాటకకథలు, త్రిలింగ చిన్న కథలూ సరళమైన గ్రాంథిక శైలిలో వ్రాసినవి. ఇది వారి రచనా పరంపరలోని మొదటి ఘట్టానికి చెందినవి. అలంకార శాస్త్రానికి సంబంధించినది రసమీమాంస, ఆంధ్ర చంద్రాలోక వివరణమూ, సంస్కృత వ్యాకరణ ప్రదీపమూ, పాణినీయము సాంధ్రవివరణమూ, పూర్తికాలేదు. వృత్తి సహితంగా వ్రాయటానికి ఆరంభించిన తెనుగు భాషావ్యాకరణము సిద్ధంకాలేదు. వారి కృతులన్నిటిలోనూ సూత్రప్రాయంగా వ్రాసిన వాఙ్మయదర్శనం చాలా ప్రధానమైనది. దానిలో నేటికాలపు కవిత్వం అనే అధ్యాయానికి తప్ప తక్కిన భాగాలకు వివృతి వ్రాయకుండానే వారు జీవితం చాలించారు. తెనుగు వాఙ్మయ పరిశీలనంలో వారు వ్యక్తంచేసిన భావాలను కొన్నిటిని ఇక్కడ ఉదాహరిస్తాను. ఆంధ్రుల దేశభాషా వాఙ్మయం ప్రతికూల పరిస్థితులలో ప్రారంభమైంది.

నేటి చరిత్రతో సంబంధంలేని సాతవాహనులు స్మృతికందరాని ప్రాచీన కాలాననే గతించారు. కాకతీయ, రెడ్ల పరిపాలనలో ఆవిర్భవించిన కొద్దిభాగం తప్ప నన్నయ భారతంనుంచి తక్కిన వాఙ్మయమంతా ఆంధ్రేతరులైన చాళుక్యుల క్రిందా, విదేశీయులైన కృష్ణదేవరాయాదుల క్రిందా బయలుదేరినది. క్షీణదశలో ఉన్న సంస్కృత వాఙ్మయం యొక్క అనుచితలక్షణాలు తెనుగు భాషను ఆవరించి క్షుద్రకావ్యాలకు దారితీసినై. ఇంగ్లీషు భాష మనకెంతో శ్రేయస్సు నిచ్చింది కాని అవివేకంతో మనపూర్వుల విజ్ఞానానికి అంధులమై ఉండటంవల్ల పాశ్చాత్య భారతీయ విజ్ఞానాల సమ్మేళనంవల్ల కలుగవలసిన విశిష్ట చోదన మనలో ఫలప్రదం కాలేదు. తక్కినదేశాలకంటే ఆంధ్రదేశం భారతీయ విజ్ఞాన వ్యాప్తిలో యెంతో వెనకబడివున్నది. భారతవర్షంలో మన ముచితస్థానం ఆక్రమించక మనమీ అజ్ఞాన నిద్రనుంచి ప్రబోధం పొందక చిరకాలం వుండడం ఆత్మ

వినాశహేతువు. ఇదికాక నన్నయతో ఆరంభమైన పిమ్మట వారవలంబించిన తెనుగు పద్యం అనేక దుర్లక్షణాలతోనిండి హేయదశలో ఉన్నది. విరతి, విరామం, విశ్రాంతి అనే పేర్లతో వ్యవహరించే యతి అనేదాన్ని అక్షరానికి అక్షరం రావడంగా భావించి పాదాంతంలో కూడా విశ్రాంతిలేకుండా తరువాత చరణంతో కలిపి పద్యం వ్రాయడం మనకాచారమైపోయింది. ఈ విధంగా నియత స్థానంలో పదచ్ఛేదం చేసే యతివల్ల వాగింద్రియానికి విశ్రాంతీ, పద్యార్థానికి సుబోధతా, గణబద్ధమైన పద్యంలోని గతీరమ్యతా వెలయించడానికి వీలౌతుంది. చరణం సుదీర్ఘంగా ఉన్నవృత్తాలలో చరణ మధ్యంలో తప్పక విరతి ఉండితీరాలి.

కాళిదాస మహాకవి మందాక్రాంత వృత్తాలలో పాదాంతంలోనేకాక పాద మధ్యంలో రెండుసార్లు ఈ విశ్రాంతిని పాటించి ఉండడం మేఘసందేశం చదివిన వారందరికీ విదితమే. ఈ ఆచారం కేవలం సంస్కృతంలోనే కాదు. ప్రపంచ భాషా సాహిత్యాలన్నిటిలోనూ నియతంగా ఉంటూఉన్నది. ఇది లేకపోయి నట్లయితే కొన్ని ఊతపదాలతోకూడిన గద్యం అవుతుంది గాని పద్యస్వరూపమూ దాని సహజగతీ పూర్తిగా అంతర్ధానమైపోతుంది. పోతన భాగవతంలో "ఓయమ్మ నీ కుమారుడు, మా యిండ్లను పాలు పెరుగు మననీడమ్మా, పోయెద మెచ్చటి కైనను, మా యన్నల సురభు లాన మంజులవాణీ" అనే పద్యంలో వృత్తం చిన్న దైనా ప్రథమ తృతీయ చరణాలలో పాదాంతంలోనూ, అంతకన్న దీర్ఘంగా వున్న ద్వితీయ చతుర్థ చరణాల్లో పాదమధ్యంలో కూడా విశ్రాంతిని పాటించడం జరిగింది. ఇలాంటి పద్యాలు క్వాచిత్కంగా కనిపిస్తవి. కాని బహుళ ప్రచారంలో ఉన్న పద్యం ఇలా ఉంటుంది. "సుకుమారుడతడు, గోపాలకవృత్తి వహించి, యడవులం గ్రుమ్మరు చున్కికి నౌక కాదు పగవారికినైన నకట, మన మెరియదే వగలన్". ఇందులో పదసంయోజనమూ, ఉదాత్త భావోన్మీలనమూ రమణీయంగా వున్నవి. కాని కందపద్యగతి ననుసరించి నియత స్థానాల్లో యతిని పాటిస్తూ చదివితే "సుకుమారుడతడుగోపా। లకవృత్తి వహించి యడవు। లంగ్రుమ్మరుచున్ కికి నౌక కాదు పగవా। రికినైన నకట మనమె। రియదేవగలన్॥" అనే వికార రూపాన్ని పొందుతుంది.

ఈ విధంగా శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులు మన వాఙ్మయంలో యెన్నో లోపాలను చూపించారు. వారుచేసిన వాఙ్మయ పరిశీలనంలో నేటికాలపు కవుల

దోషాలనే యెక్కువగా పరామర్శించి గుణగణనం చేయకపోవడంవల్ల వారియెడల మనలో ఒక విధమైన వైముఖ్యం కనిపిస్తున్నది. కాని వారు చేసిన ఆక్షేపణలకు తగిన సమాధానం ఇంతవరకూ రాలేదనే అనుకోవలసి వస్తున్నది.

అనేక ముఖాలుగా వివృద్ధమౌతూవున్న తెనుగు వాఙ్మయాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించి, విశ్వవిజ్ఞాన దృష్టితో పరిశీలింపగల శోధకులు మనలో అంతగా లేరు. కేవలం పాక్షిక దృష్టితో నేటి రచనలలోని సాధుత్వాసాధుత్వాలు నిర్ణయించడం జరుగుతున్నది. ఈ సమయంలో శ్రీ ఉమాకాన్త పండితులు జీవించి ఉన్నట్లైతే సర్వతో ముఖ్యమైన వారి పరిశీలనంవల్ల మన సాహిత్యానికెంతో మేలు కలిగేదికదా అని నేను తరుచుగా విచారిస్తూ ఉంటాను.

(వ్రాతప్రతి ఆధారంగా —బహుశా రేడియోప్రసారితం—సం).

అబ్బూరి రామకృష్ణరావు

# ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘం

ఆంధ్ర సంఘంలో నేడు సమూలములైన మార్పులు గోచరిస్తున్నవి. కానీ ప్రతికూలశక్తులు కూడా చిట్టచివరికి నశించవలసినవే అయినా, మార్గ నిరోధాలు కల్పిస్తున్నవి.

ఆంధ్ర జీవితంలో కనబడుతూవున్న మార్పులను వాఙ్మయంలో ప్రదర్శించి అభివృద్ధి ప్రయత్నాలను కొనసాగించడం ఆంధ్రలేఖకు లందరికిన్నీ విహితధర్మం.

ప్రాచీన సంస్కృతి విచ్ఛిన్నమైన తర్వాత మన వాఙ్మయం లౌకికజీవనం లోని వైవిధ్యాలను సమన్వయించుకోలేక అతిలోకంగా సంచరిస్తూవుంది. వ్యర్థమైన తాత్త్వికజిజ్ఞాసలలోను, నిరాధారములైన కేవలకల్పనలలోను తలదాచు కొంటున్నది. ఇందుకు ఫలితంగా సాహిత్యం నీరసించి విగ్రహపుష్టి మాత్రం మిగిలి పెడసరపు భావాలలో మునిగి తేలుతున్నది. ఇందువల్లనే నేటి వ్రాతలలో నర్మ కవితలూ, భక్తిభావాలూ, ఔచిత్యమూ, సందర్భశుద్ధిలేని ఆవేశాలూ, స్త్రీ పురుష సంబంధాలను నిష్కళంక దృష్టితో చూడలేక పోవడమూ, వివేకశూన్యతా విరివిగా కనిపిస్తూవున్నవి.

ఈలాంటి వ్రాతలు వ్రాసేదీ, చదివేదీ మార్పులు సహించలేని పూర్వాచార పరాయణులే. చిరకాలనుంచీ వీరిచేతుల్లో నిలిచివుండడంతో వాఙ్మయం ప్రజాసామా న్యానికి అందని మ్రానిపండయినది. అందుకనే వర్ధమాన లేఖకులు ఆంధ్ర వాఙ్మ యాన్ని పునరుద్ధరించి, దాన్ని ప్రజల జీవితానికి చేరువగా కొనివచ్చి అందులో వాస్తవజీవితాన్ని ప్రతిఫలింపజేసి అందరూ ఆకాంక్షించే ఉజ్జ్వల భవిష్యానికి దారి తీయవలసి ఉంటుంది.

ప్రాచీనాంధ్ర సభ్యతలోని ఉత్తమ సంప్రదాయాలంటే మాకు వైముఖ్యం లేదు. కాని వాటినిగురించి పాదుకొన్న అపోహలను ఆమూలాగ్రంగా విమర్శించి,

స్వదేశ విదేశ సాహిత్యాలలోంచి అభివృద్ధిని పెంపొందించే రసవద్ఘట్టాలను ఆంధ్రప్రజలకు అందజేసి నూతన రూపంతో జన్మించబోయే భవిష్యత్సంఘానికి దాంతీయగల ప్రయత్నాలన్నిటికీ తోడ్పడుతూవుంటాయి. నేడు యావద్భారత సంసారాన్ని కలవరపరుస్తూ ఉన్న ఆకలీ, పేదరికం, ఆచారదాస్యం, పరాధీనతా ఈ నూతన వాఙ్మయానికి ప్రధాన వస్తువులు.

జడత్వం, నిర్వ్యాపారతా హేతువాద వైముఖ్యం; వీటిని వృద్ధినిరోధకాలని నిర్ణయించి పరిత్యజిస్తున్నాము.

మనలో విమర్శకబుద్ధిని పెంపొందించేదీ, సంస్థలనూ, ఆచారాలనూ హేతువాదంతో పరిశీలింపజేసేదీ, కార్యపరత్వానికి సహాయకమైనదీ, చిందర వందరలైన మన శక్తులన్నిటినీ ఏకముఖంగా నడిపించగలిగినదీ, మనలో సముచితపరివర్తనం కలిగించేదీ; వీటిని వర్ధమానమని అంగీకరిస్తున్నాము.

ఆశయాలు.

ప్రజల వాఙ్మయం అభివృద్ధి చెయ్యడం ఈ సంఘానికి ముఖ్యోద్దేశం. వర్ధమాన సాహిత్యం సృష్టించినవారూ, అట్టి ప్రజ్ఞకలవారూ సభ్యత్వానికి అర్హులు. సాహిత్యవాసనలేకుండా రాజకీయాందోళనకు యత్నించదలచినవారికి ఈ సంస్థలో చోటులేదు.

ఈ క్రిందివి మరికొన్ని లక్ష్యాలు :

ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో ఈ సంఘశాఖలు నెలకొల్పడం; సమావేశాలవల్లనూ రచనలమూలంగానూ వేరువేరు శాఖల వ్యవహారాలన్నీ ఏకముఖంగా కొనసాగించడం.

ఈ సంఘంవారి లక్ష్యాలకు విరుద్ధంగా వర్తించని ఇతర సంస్థలన్నింటితోనూ కలిసిపనిచేయడం.

పల్లెలలోనూ, పట్టణాలలోనూ, అధోగతిలోపడి ఉన్న జనసమూహాలకు వర్ధమాన భావాలు ప్రబోధించడం.

తెనుగులో వర్ధమాన సాహిత్యాన్ని సృష్టించడానికి తగిన అవకాశాలు కలిగించడం. ఇతర భాషలలోనుంచి అట్టి సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించడం, సభ్యుల స్వతంత్రరచనలు ప్రకటించడం. ఈ విధంగా ప్రతికూల శక్తులను నిర్మూలించి సాంఘిక పునరుజ్జీవనానికి దారితీయడం.

వర్ధమాన లేఖకులహక్కులను సంరక్షించడం.
పరిపూర్ణమైన భావ స్వాతంత్ర్యాన్ని సాధించడం.

(ఆంధ్ర వర్ధమానలేఖకసంఘం మానిఫెస్టో యిది. ప్రచురణకాలం 1934).

బూదరాజు రాధాకృష్ణ

# సరస వచస్సుతో సాహితీ పిపాసువుల్ని తనిపే 'అబ్బూరి చలివేంద్ర'

అబ్బూరి రామకృష్ణారావుగారు సహస్రాధిక మాసజీవులు (జననం 1896 మే). గడచిన రెండేళ్లలో శారీరకంగా వారిలో వార్ధక్యచిహ్నాలు ఎక్కువయినా బౌద్ధికంగా మార్పేమీ రాలేదు. అదే చమత్కార సంభాషణ. అదే జ్ఞాపకశక్తి. అదే విద్యావ్యసనం. వందల వేల పద్యాలూ, శ్లోకాలూ ఇంకా వారి ధారణలో ఉన్నాయి.

తెలుగు కవుల్లో అన్యభాషా సాహితీ పరులతో ఆత్మీయతా సంబంధాలున్న వారు చాలా కొద్దిమంది. అందులోనూ భిన్నమనస్తత్వాలతో, భిన్న విద్యావాసనలతో, భిన్నాదర్శాలతో ఒకరితో ఒకరికి పొత్తులేకుండా ఉన్న భిన్న భాషాసాహితీ పరులు చాలా మందితో అబ్బూరి వారికి అభిమాన పూర్వకమైన స్నేహ సంబంధాలున్నాయి. ఆయన పెరిగిన వాతావరణం అటువంటిది. బందరులో చిన్న తరగతుల్లో చదివేటప్పుడే భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి, చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి ప్రభావం ఆయనమీద పడ్డది. ఆ తరవాత మైసూర్‌లో సంస్కృత కళాశాలలో చదివేనాడు కట్టమంచి, రాళ్లపల్లి వారల స్నేహసౌభ్రాత్రాలు కలిసి వచ్చాయి. 1917–19 మధ్య శాంతినికేతన్‌లో రవీంద్రనాథ్ ఠాకుర్, అరవింద ఘోష్‌ల ప్రభావం సోకింది. 1919 నుంచి నాలుగైదు సంవత్సరాలు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ప్రథమ శిష్యులుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనటంతోనూ, 1936లో ప్రేమ్‌చంద్, సజాద్ జహీర్, హీరేన్ ముఖర్జీలతో కలిసి అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపించి ఆ సంఘంవారి పత్రిక 'ఇండియన్ లిటరేచర్'కు సంపాదకవర్గంలో ఒకరుగా ఉండటంతోనూ, 1939 ప్రాంతంలో ఎమ్. ఎన్. రాయ్, తర్కతీర్థ లక్ష్మణశాస్త్రి జోషీ, సచ్చిదానంద వాత్స్యాయన్లతో కలిసి ఇండియన్ రినైసాన్స్ అసోషియేషన్ స్థాపించటంతోనూ

అబ్బూరి రామకృష్ణారావుగారి సాహితీదృక్పథం, రాజకీయదృష్టి జాతీయాం తర్జాతీయ స్థాయుల్లోని మహనీయులు కారణంగా సువిశాలమయింది.

## కవితా రచన

అబ్బూరి వారి కవితారచన వారు అయిదోఫారం చదువుతుండగానే మొదలయింది. 1909లో 'జలాంజలి' రచించారు. అయితే అది 1914 కు గాని ప్రచురితంకాలేదు. అప్పటినుంచీ ఇప్పటివరకూ వారు అడపాదడపా రాస్తూనే ఉన్నారు. మల్లికాంబ, ఊహాగానం, నదీసుందరి మొదలైనవి పుస్తకరూపంలో విడిగానూ, ఎట్టిగన్నేరు, మందార శిశువు మొదలైనవి వైతాళికులు, మహోదయం, వెన్నెల కుప్పలవంటి సంకలన గ్రంథాల్లోనూ ప్రచురితమైనాయి. రాయప్రోలు, కట్టమంచి వంటి తొలితరం భావకవులతోబాటే అబ్బూరివారుకూడా ఆధునిక కవితా ధోరణులను ఆంధ్రదేశంలో వ్యాపింపజేశారు. అయితే తక్కిన వారి భాషా దృష్టి, భావదృష్టి పెద్ద మార్పులు చెందలేదు గాని అబ్బూరివారి రాజకీయ సామాజిక సాహితీ భావనలు అనుక్షణం వినూతనత్వాన్ని అన్వేషిస్తూనే ఉన్నాయి. 'క్షణేక్షణే యన్నవతా ముపైతి, తదేవ రూపం రమణీయతాయాః'. కాని చాలామంది తెలుగు కవులకు, పండితులకులాగా అబ్బూరి వారికి కీర్తికండూతిలేదు. ఆయన నిర్లిప్తతతో భౌతికలాభాలకు దూరంగానే గడిపారు; గడుపుతున్నారు. సమృద్ధిలో పుట్టి, సమృద్ధిలో పెరిగి, సమృద్ధ విజ్ఞానసంపాదనమేగాని ధనాధికార సంపాదనలు ప్రధానం కావనుకుంటూనే కాలం దొర్లిస్తున్నారు. ఆ దృష్టితోనే అందివచ్చిన అధికారాలను కూడా వదులుకున్నారు. సాహితీ సంస్థలకు దూరంగా ఉన్నారు. ఫలితం: ప్రచార పరాయణమైన బెర్నార్డ్ షా యుగంలోని మన సాహితీపరులకు అనేకులకులాగా ఆయనకు రావలసినంత ఖ్యాతిరాలేదు. అందు కాయన విచారించడమూలేదు. స్విన్‌బర్న్, పింగళి సూరనల్లాగానే అబ్బూరి వారు కూడా నిరవధిక కాలంలో, విపులమైన విశ్వంలో సారస్వత ప్రతిష్ఠకు భవిష్యత్తువైపు చూడవలసి ఉంది.

అబ్బూరి రామకృష్ణారావుగారు పద్యగేయాలు మాత్రమే రాయలేదు. ఆంధ్ర పత్రికవారిని ఒప్పించి "సారస్వతానుబంధం" పెట్టించి అందులో తొలిరచనగా తమ 'అభినవకవితా ప్రశంస'ను ప్రచురించారు. 1919లో వారు రాసిన 'జలియన్

వాలాబాగ్' (బుర్రకథ)ను అప్పటి ప్రభుత్వం నిషేధించింది. ఆ రచన ఇప్పటికీ దొరకలేదు. 1923—24 మధ్యకాలంలో కృష్ణాపత్రికలో 'రసమంజరి'ని ఆరంభింప జేసి మొదటగా తాము 'సూర్య రాజుకథలు' రాశారు. అవి 15, 16 అప్పట్లో ముద్రితమైనాయి. అప్పటికింకా కథా సాహిత్యానికి ఇప్పటి ప్రచార గౌరవాలు రాలేదు. 1924లో 'మంగళ సూత్రం' అనే అపరాధ పరిశోధక నవలను కూడా రాశారు. 1936లో "నటాలి" అనే నటబృందంతో 'నాట్యగోష్ఠి' నిర్వహిస్తునప్పుడు కన్యాశుల్కాన్ని ప్రదర్శనయోగ్యతరంచేసి, 'ధాన్యలక్ష్మి'ని ప్రదర్శించి నాటక రంగంలో పనిచేశారు. అనేక చాటువులు రాశారు. రామప్పంతులు వేషం వేసి రక్తికట్టించారు. ఆయన భావనలో, భాషలో వచ్చిన మార్పులను 1954లో అచ్చయిన 'కవిత'లో చూడవచ్చు. శ్రీ శ్రీ మొదలు చిన్నారి పాపలవరకూ చాలా మంది ఆధునిక కవి విమర్శకులకు ఆయన గురువు, ప్రోత్సాహకుడు. స్పర్ధామయమైన సాహితీ లోకంలో అమృతప్రేమ చూపి అందరినీ ప్రోత్సహించగల సహృదయత్వం అబ్బూరివారిలో కనిపిస్తుంది. నిర్మోహ సమ్యగ్దృష్టి ఆయన గ్రంథ సంఖ్య పెంచలేదు. చమత్కార సంభాషణల్లో ఎంతచతురులో నిర్ద్వంద్వంగా, నిర్మొగమాటంగా తన అభిప్రాయాలు వెలిబుచ్చటంలో అంత నిశిత వాక్కులు.

నిన్న మొన్నటి సాహితీ ప్రపంచానికి సంబంధించిన కొన్ని విషయాలను వారితో చర్చిస్తే వారు చెప్పిన అభిప్రాయాలివి:

1. ఉత్తమ సాహితీ లక్షణం ఏమిటి?

—లోకవృత్తాన్ని ప్రతిఫలించటమే. ఇది భరతర్షి కాలంనుంచి ఇప్పటివరకూ ఇక ముందుకాలంలో కూడా ఆమోదయోగ్యమైనది. సాహిత్యాన్ని గురించి, సాహిత్యంలోని కొన్ని ధోరణులను గురించి నాకు మొదటినుంచీ కొన్ని స్థిరాభిప్రాయాలున్నాయి.

2. అవి కొన్ని చెప్పండి.

—దేశాన్ని తల్లిగా భావించటం మన సాహితీపరుల్లో ఎక్కువ. ఈ అభిప్రాయమే నాకు నచ్చదు. భారతదేశాన్ని 'మాతృభూమి'గా భావించినవాళ్లే మళ్ళీ "తెలుగు తల్లి", "అరవతల్లి" మొదలైన మాట

లంటూంటే హాస్యాస్పదంకాదా మరి ? తల్లులుగా భావించటం భావ్యం కాదు. అందుకు నేను "'జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ' జన్మభూమి జననికాదు. సామాన్య సుమీ ఆయమ, వసుమతి యగు నామె కొరకు వల్లభులెందరు పెనగిరి ?'" అని ఎప్పుడో రాశాను ('కవిత'లో 1954). అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతుడు శకుంతలతో 'పరిగ్రహ బహుత్వేపి, ద్వే ప్రతిష్ఠే కులస్య మే, సముద్రరశనా చోర్వీ, సఖీచ యువయో రియమ్' అన్నాడుగదా. కనీసం అప్పటి నుంచయినా దేశం అనుభవయోగ్యమైన భోగ్యవస్తువుగానే ఉందని చెప్పాలి. భోగ్యవస్తువును తల్లిగా భావించటం నాకు నచ్చదు. పైపెచ్చు తల్లిని భోగించడం ఇంకా అసహ్యం. 'మనిషిమాట మరచిపోయి, మరచిపోయి మనిషిమాట.... ఆవరించి తీవరించి అవరోధం కల్పించే ఈ చింతాదారిద్ర్యం ఎన్నడు మము వీడిపోవునని విచారిస్తున్నాను. 'ఎందరెందరీ నేలను ఇలాపతులు భూపతులై ఏలలేదు ? సాటిలేని ఏకచ్ఛత్రమ్ము క్రింద, 'నా దేశం, నా రాష్ట్రం, నా పట్నం, నాజిల్లా మట్టిగడ్డ కాదుకాదు, మానవజాతి పురోగతి'అని నా విశ్వాసం.

3. ఇందాక లోకవృత్తం ప్రతిఫలించటమే ఉత్తమ కావ్యలక్షణమన్నారే అది మీరెంతవరకు సాధించారు ?

—లోక వృత్తాన్ని ప్రతిఫలించటానికి విద్యలన్నీ చదవాలి. కేవలం ప్రతిభమీద ఆధారపడి ఈ పనిచేయలేం. రాజశేఖరుడు కావ్యమీమాంసలో అన్నట్లు కేవలం కవితలోనేగాక అనేక విద్యల్లో ప్రాచుర్యం సంపాదిస్తేనేగాని సమ్యగ్‌దృష్టి ఏర్పడదు. ఈ సమ్యగ్ దృష్టి కోసం ప్రయత్నించి నేను వైఫల్యం పొందాను. కావ్యదృష్టితో చూస్తే నేను యాభైఏళ్ళ క్రితమే చనిపోయి ఉండవలసింది.

4. కవులు జీవించినా మరణించినా కావ్యం జీవిస్తుంది గదా? కావ్యం వల్ల కవి యశఃకాయం శాశ్వతంగా ఉంటుందిగదా?

—కాదు. "సప్తసంతానములలో ప్రశస్తిగాంచి ఖిలముగాకుండునది ధాత్రి కృతియ" అన్నాడుగాని అల్లసాని పెద్దన, ఖిలంగాని కృతే లేదంటాను నేను. ఉదాహరణకు కాళిదాసు "ప్రథితయశసాం భాస

కవిపుత్రసౌమిల్లకాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియా కథం పరిషదో బహుమానం?" అన్నాడు గదా మాళవికాగ్నిమిత్రంలో. ఈ భాసాదుల కావ్యాలు ఖిలంకాలేదా? గణపతిశాస్త్రి ధర్మమా అని ఇటీవల భాసనాటకాలు దొరికాయిగాని తక్కిన వేమైనట్లు? క్రీడాభిరామంలో చిమ్మపూడి అమరేశ్వరుణ్ణీ, రావిపాటి తిప్పన్ననూ అంత కీర్తించారుగదా, అమరేశ్వరుడి రచన లేవి? ఎర్రాప్రగడ రామాయణ మేమయింది? ఇవన్నీ చూస్తే కృతి ఖిలం కాదనగలమా?

బౌద్ధమతవాదం ప్రకారం 'ధర్మకాయం' ఒకటి ఉంది. అట్లాగే సాహిత్యకాయం' ఉంటుంది. చిన్నా పెద్దా కవులూ, రచయితలూ ఈ సాహితీకాయాన్ని పరిపుష్టంచేస్తారు. నామ రూపాలతో నిమిత్తం లేని పారంపర్యంలో నాకు విశ్వాసం ఉంది. కావ్యం శాశ్వతంగా నిలవా లనుకోవటంలో తప్పులేదు. మహాకవులనూ, మహా విద్వాంసులనూ కూడా అంత ప్రధానమైనవికావు. అంతమాత్రాన కృతులు ఆచంద్రార్కం ఉంటాయనటం, అనుకోవటం భ్రమమాత్రమే.

5. వచనకవిత్వాన్ని గురించి మీ అభిప్రాయమేమిటి?

—గణయతి ప్రాసలు వర్జిస్తామన్న వచనకవుల రచనల్లోనే "ఛందస్సు మొక్కలు నాటను, సామాన్యుడి పరిధిని దాటను" అన్న చోట ఈ లక్షణాలన్నీ ఉన్నాయి. పద్యగేయరచనల పరమార్థం మననం చేయటానికి అనుకూలంగా రచించటమేగాని వేరుకాదు. అదే "శ్లోకత్వం" పొందటం. వేల పద్యాలు కంఠస్థం చేసినవాళ్లున్నారు గాని పది పంక్తుల వచనం మననం చేసినవాళ్ళు చాలా అరుదు. ఛందస్సు ప్రయోజనం గుర్తించాలి. ఎజ్రా పౌండ్ చెప్పినట్లు మీటర్ కన్నా మెట్రోనోమ్స్ ముఖ్యం. మ్యూజికల్ ప్రోజ్ ప్రధానం కావాలి. శివకవ్యాదులు రాసిన వచన రచనలు అటువంటివే. ప్రకృతంలో వచన కవిత కూడా ఛందో బద్ధ కవితలాగా నియమబద్ధమే అవుతున్నది. దీన్ని "నూతన కృతకఛ్ఛందస్సు" అనవచ్చు.

6. దిగంబర కవిత్వాన్ని గురించి మీ అభిప్రాయమేమిటి?

—అదొకరకం వచన కవిత. అవిచారమూలకమైన అభిప్రాయాలు, అనుచిత పదజాలం ఉన్నంతమాత్రాన కొత్తదనం రాదు.

పాఠకుల్ని ఆకర్షించటానికి "ఘటం భింద్యాత్ పటం ఛింద్యాత్" లాంటి మార్గాలు తొక్కవచ్చు. అంతమాత్రాన కవితావస్తువు, సాహిత్యవస్తువు మారినట్లు కాదు. కవితకు గౌరవమూ రాదు.

7. 'సినీ కవిత్వం' ఎట్లాంటి దంటారు ?

—ఇటీవల సాహితీ విలువలున్న సినీకవిత్వం ప్రచురించాలనే ధోరణి వచ్చింది. ఇది వ్యభిచరించే పతివ్రతల ధోరణి. ఉత్తమ కవిత్వం సినీమాల్లో రావాలంటే సినిమా పూర్తిగా కళాత్మకం కావాలి. అంటే ఏక చిత్త సంభవం కావాలి. కథ, మాటలు, పాటలు, చిత్రీకరణ— అన్నీ ఒక్క చేతిమీద సాగితేనే గాని కళాత్మకం కాలేదు. అట్లాంటి పరిస్థితిలో చార్లీ చాప్లిన్ ధురంధరత్వాన్ని అంగీకరించవచ్చు. నేటికాలంలో న్యూవేవ్ పేరిట కొందరు సుప్రసిద్ధదర్శకులు నానా దేశాల్లో పరిశ్రమిస్తున్నారు. సినీకవిత్వం ఉత్తమం కావాలంటే "ఏకపత్నీవ్రత దుఃఖశీలం" కావాలి. 'మా చెడ్డ పతివ్రత' కావాలి. అంతవరకు సాహితీ విలువకూ సినీ కవితకూ పొంతన కుదరదు.

8. "ఆస్థానకవి" పదవినిగురించి మీరేమంటారు ?

—కవితను జీవనాధారంగా పెట్టుకున్నవాళ్ళు ఆర్థికంగా కొంత లాభం పొంది ఇతరులను ఆశ్రయించవలసిన అగత్యం లేకపోవటం హర్షించదగ్గ విషయమే. అంతకన్నా ఆస్థానకవిపదవికి ప్రాచుర్యమివ్వనక్కరలేదు. వర్డ్స్‌వర్త్ ఆస్థానకవి అయినప్పటి బ్రౌనింగ్ ఆక్షేపణ అనుసంధించుకోండి. అభినవ కవితా రచనల్లో దాశరథి సమర్థుడైనందువల్ల ఎక్కువ సంతృప్తి పొందనక్కరలేదు. అనేక ఉద్యోగాల్లాగా ఇదో ఉద్యోగం. ఒక పదవి. ఆచార్య పదవి లాంటిది. నష్టాచార పునరుద్ధరణ అవ్యక్తంగా తోచినా వృద్ధికాముడైన దాశరథి ఆ పదవిలో ఉంటే నష్టమేమిటి ? అవసరమా ? అనే

ప్రశ్న అకాడమీల విషయంలో కూడా వేయవచ్చు. దాశరథి కనీసం పద్యరచన బాగా చేస్తాడు.

9. బిరుదుల సంగతి ఏమిటి? సన్మానాల వ్యామోహా న్నేమంటారు?

—బౌద్ధంలో కొన్ని అవాచ్య విషయాలను గురించి మాట్లాడినప్పుడు మంచి నీటితో మూఁడుసార్లు పుక్కిలించమన్నారు. అకాడమీలూ, విశ్వవిద్యాలయాలూ, ప్రభుత్వమూ చేసే పనుల్లో కొన్ని అలాంటివే. నోరు పరిశుభ్రపరుచుకోవడానికి పనికివస్తాయి. పద్మశ్రీలతోబాటు కళాప్రపూర్ణలు, డాక్టరేట్లు కూడా పోతేనే బాగుండేది.

10. విశ్వనాథ వారిని గురించి ఏమంటారు?

—విశ్వనాథ సత్యనారాయణ లక్ష్యసిద్ధిని గురించి వాదప్రతి వాదాలున్నా, లక్ష్యశుద్ధిని గురించి సందేహమేమీ లేదు. పొందవలసినవి పొందాడు. శుద్ధి కాలానుగుణంగా ఉంటుంది. ఇది షేక్స్పియర్‌కు కూడా తప్పలేదు. అయితే ఆయన తెలుగుసాహితికి "ప్రశస్తి" తేలేదుగాని కొంత "ప్రసిద్ధి" తెచ్చాడు.

11. సాహితీ సంఘాలను గురించి మీ అభిప్రాయాలు చెప్పండి.

—కవితా వ్యాసంగంలో ముఠాలు ఏర్పడటం అంత శ్రేయోదాయకం కాదు. ఉత్తమసాహితీ రచనల్లో సంఘాలకు ప్రాధాన్యం ఎన్నడూ లేదు. రాజశేఖరు డన్నట్లు కొన్ని కావ్యాలు "జీర్ణ మంగే సుభాషితం" లాగా నష్టమవుతాయి. కొన్ని పైకి వచ్చి నష్టమవుతాయి. పోగా మిగిలినవి విశ్వకుతూహలంతో జగద్వ్యాప్తంగా రాణిస్తుంటాయి. రచయితల సహకార సంఘాల లాంటివి వ్యాపార దృష్టిలో ప్రచారానికి పనికివచ్చేవేగాని ఉత్తమ సాహిత్య సృష్టికి సంబంధించినవి కావు. సాహితీ స్రష్ట అయిన వ్యక్తిలో లోపాలున్నా కాలాంతరంలో అవి సమసిపోవచ్చు. కవితాశక్తికీ, వ్యక్తిగత జీవితానికీ సంబంధంలేదు. స్విన్‌బర్న్, ఆస్కార్‌వైల్డ్, బైరన్‌లకు కొన్ని దురభ్యాసా లున్నవని వారి రచనలకు లోపంరాలేదు.

> వైల్డ్‌కు ఆపాదించిన హోమోసెక్సువాలిటీ అప్పుడు నేరమైతే ఇప్పుడు అమెరికాలో న్యాయబద్ధమయింది. నే ననేదేమంటే గొప్ప తక్కువలతో, నామరూపాలతో నిమిత్తంలేని పారంపర్యానికి ప్రాధాన్యం ఉంది గాని మరో దానిక్కాదు. ఆ దృష్టితో ఈ సంఘాలవల్ల ఎటు వంటి సాహితీ ప్రయోజనమూ లేదు.

పై విధంగా జరిగిన ప్రశ్నోత్తరాలను పొడిగించటం ఆయన ప్రస్తుతా రోగ్య దృష్ట్యా సాధ్యం కాలేదు. 'ఊహాగానము' ఇతరకృతులు 1973లో పునర్ము ద్రితాలయినాయి. ఆయన వచనగేయ రచనలు కొన్నీ, చాటువులన్నీ ముద్రణ భాగ్యం సంపాదించుకోవలసి ఉంది. కొన్ని చాటువులద్వారా ఒకనాటి పరిస్థితులను తెలుసుకోవచ్చు. మచ్చుకు 1921లో "మైలవరం" వారి నాటకాల మీద చెప్పిన పద్యమొకటి.

> దమయంతీసతి కృత్రిమ స్తనము లందం బేది అల్లాద అ
> ల్లము మస్తానుల తీసిపోవని కళాలంకారుడౌ నైషధో
> త్తము కుస్తీలనుచూచి బాహుకుని బేతాళప్రతిజ్ఞామతి
> భ్రమణమ్ముల్ కనుగొంటి మైలవర కూపప్రాయ నాట్యస్థలిన్.

ఆనాడు మగవాళ్ళే ఆడవేషాలు వేసేవారు. రంగస్థలం గుంటలో ఉండేది. ప్రేక్షకులు ఎత్తున కూర్చుండేవాళ్ళు. అప్పటి నల పాత్రధారి అల్లం మస్తాన్ అనే వస్తాదు. ఆటువంటి వనేకం. అబ్బూరివారి రచనాసర్వస్వం కాలక్రమంగా ముద్రితమైనప్పుడుగాని ఆయన సాహితీస్వరూపం ఎంత ఉదాత్తమైనదో తెలియదు లోకానికి.

(అక్టోబరు 20 గురువారం 1977 ఆంధ్రప్రభ)

పన్నాల సుబ్రహ్మణ్యభట్

# అబ్బూరి అంతరంగం

కమ్యూనిస్టు పార్టీ, సాహిత్య అకాడమీ— ఇలా ఎన్నో రంగాలతో సాన్నిహిత్యం ఉన్న మనిషి స్వర్గీయ అబ్బూరి. కీర్తికాంక్షని చేరనివ్వని యోగదృష్టి వారిది. చావునీ, ప్రభుతనీ ధిక్కరించి స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారు. తాత్వికత రుజువర్తన కరువైతే ఉద్యమాలనే వదులుకున్నారు. వారి అంతరంగం వినిపించే ఈ క్రింది పలుకులు ఆ మధ్య హైదరాబాదులో ప్రత్యేకంగా శ్రీ పన్నాల సుబ్రహ్మణ్య భట్టు రికార్డు చేశారు.

## కమ్యూనిస్టులు

''కోటంరాజు రామారావుగారు విశాఖపట్నం మీదుగా వచ్చారు ఒకసారి. నేను పార్టీ స్థాపించడం గురించి అడిగాను. రామారావుగారు మీ ప్రాంతంలో కూడా వున్నది. వేరే స్థాపించ నక్కర్లేదన్నారు. నెలరోజుల తర్వాత బెజవాడ వస్తే సుందరయ్యగారు నన్ను చేర్చుకొని విశాఖపట్నం ప్రాంతం అప్పచెప్పారు. వి. ఎల్. నరసింహారావుతో కలిసి యూనియన్ స్థాపించగలిగారు. అప్పటికి మొదలియార్ వంటి వాళ్ళు ప్రయత్నించి విఫలురయ్యారు. సుందరయ్య రాజేశ్వరరావు అనే కుర్రాడిని ఇంట్రడ్యూస్ చేసి ఇతను తెలివైనవాడు, ఉత్సాహవంతుడు, ఇతనితో సాహచర్యం పనికొస్తుందో లేదో చూసి పార్టీలో చేర్చుకోవలసిందన్నాడు. రాజేశ్వరరావు రెండు నెలలు మా ఇంట కూచోడం, పనిచేయటం జరిగింది. నాకు ఉద్యోగ రీత్యా రహస్యంగా పనిచేసే అవసరాలవల్ల, విశాఖపట్నం యూనిట్‌ని అతనికి అప్పచెప్పి తప్పుకొన్నాను. కాని ఆ మర్నాడే అతను ప్రొవిన్షియల్ కమిటీకి నా మీద ఫిర్యాదుచేశాడు. ఏమీలేదు. ఫలానా ఫలానాచోట్ల ఇన్ని గంటలకు ఇలా అన్నాడు అని. వాళ్ళు అర్ధరాత్రి రహస్య సమావేశం పెట్టి నన్ను సస్పెండుచేశారు. అప్పుడు కమ్యూనిస్టు పార్టీతో తొలగిపోయాను. ఒక రకమైన

జుగుప్స కల్గింది. నాకు కావలసిన మేధస్సు, విచారణశీలత వాళ్ళలో లేక పోవటంవల్ల, వాళ్ళెవరూ నాకు కిట్టకపోవటవంవల్ల అలా జరిగింది. తమ తమ మార్గాలను సమర్థించుకొనే ప్రయత్నం చేయడం కూడా కారణం... ఎసెంబ్లీ గురించి రాయ్ ఒక థీసిస్ పబ్లిష్ చేశారు. దానిని డిస్కస్ చేయాల్సివచ్చింది. దానికి ప్రతిగా కమ్యూనిస్టు పార్టీకూడా థీసిస్ తయారు చేసింది, ఒక బెంప ఫ్రాయిడ్ నునిందిస్తూ—సరిగా అదే మోస్తరుగా, వీళ్ళ థీసిస్ కూడా ప్రశ్నించడంతప్ప దాంట్లో స్వతంత్రమైన ఆలోచనలున్నట్లు నాకు కనిపించలేదు. అయితే నాకు పరిచిత మైన నాయకుల్లో సుందరయ్య తను నమ్మిన అయిడియల్స్ కోసం, ఆదర్శాల కోసం ప్రాణాలనుకూడా అర్పించగల శక్తిగలవాడు. రాజేశ్వరరావు కార్య శీలి. అంటే రెండు మూడు విధాలుగా ఆలోచించి తనకు తెలిసినా తెలియక పోయినా తనుపెట్టుకొన్నగ లక్ష్యాలను సాధించగల శక్తిలవాడు. సుందరయ్య లక్ష్యశుద్ధి గలవాడు. రాజేశ్వరరావు లక్ష్యసిద్ధిని పొందగల్గినవాడు.... అలాగే కమ్యూనిజం అనేది మన దేశంలో వ్యాప్తం కావాలంటే, కమ్యూనిజంగా, అది నిజంగా పనికివచ్చే కమ్యూనిజమా, లేక విదేశాలనుండి తెచ్చి గ్రాఫ్ట్ చేసినటు వంటిదా అని విచారిస్తే— మనదేశానికి సంబంధించినది కాదు అనిపిస్తుంది. కాని ఈ రోజుల్లో ఏ విషయమైనా సకల ప్రపంచవ్యాప్తంగా ఉన్నదికాబట్టి మన దేశం విదేశం అనేటటువంటి భేదంలేకుండా, అభిప్రాయాలు భావాలు పరివ్యాప్త మవుతున్నాయి. అందువల్ల మన దేశానికి ప్రత్యేకమైనదీ, అనుగుణమైనటువంటిదీ అంటూ ఎక్కువగా వుండదు. కార్యకలాపాలు, వాటి ఆచరణలో చాలాభేదాలుండ వచ్చు. ఆ భేదాలు మన సంప్రదాయాల కనుగుణంగా అనుకూలంగా వుంటే వ్యాప్తిలోకి రావడానికి వీలవుతుంది. అంతే కాని కేవలం రష్యాలోగాని చైనాలో గాని వున్నది వున్నట్లుగా ఇక్కడ ఆచరించుదామంటే వీలుండదు.

మొట్టమొదటి నుంచి మన వాళ్ళు—నాయకులు—ఏ విధంగా ఉన్నారంటే— మావోయే మనకి కూడా చైర్మన్‌గా ఉన్నాడు. అతణ్ని అధ్యక్షు డన్నారు. అది మావోయే ఖండించాడు. మీ దేశానికి చైర్మన్ నేనేమిటి, మీ చైర్మన్ ఉండాలని దేశంలో నాటి, వేళ్లు పాదుకుని ఇక్కడ పెరగా లన్నటువంటిది ఆ మధ్య నాయకులంతా గ్రహించారు.

కమ్యూనిజమనేది, తక్కిన రాజకీయ పార్టీలవలెకాక, అన్నిటికన్నా ఛిన్నా భిన్నమై అనేక శాఖోపశాఖలుగా చీలిపోయి బలహీన మయిపోవడానికి కారణ

మయింది. ఎందుచేత : మన దేశానికి ప్రత్యేకమైన ధోరణిగాని, మార్గంగానీ ఏమీ వుంచుకోలేకపోవటంవల్ల.

తక్కిన రాజకీయరంగాల్లో జరిగేటటువంటి వ్యవహారాల్లో కన్నా ఇప్పటికి ఇక్కడ కమ్యూనిస్టు పార్టీల్లో, కార్యశీలత, కార్యోత్సాహం ఎక్కువగా ఉన్నా యని చెప్పకతప్పదు.

## అకాడెమీ

మొట్టమొదట ఆంధ్ర సాహిత్య అకాడెమీ స్థాపించడానికి ముఖ్య కారకులం నేను, నార్ల అని భావిస్తున్నాం. కేవలం నా యొక్క సాహచర్యంవల్లనే పట్టాభి రామారావుగారిని దాని కానిస్టిట్యూషన్ రాయించగలిగారు. ఆచరణలో పెట్టగలి గారు. మేము ముఖ్యమైన దనుకున్నది ప్రామాణికమైన ఆంధ్ర నిఘంటువుతయారు చేయించి ఒకటి ఏర్పరచటం ప్రభుత్వ లక్ష్యంగా భావించాలి. తక్కిన సాహిత్య ప్రచారపు పనులు ఇతరసంఘాలవి. ఇందుకు అనుకూలించే మౌలిక గ్రంథాలు సాహిత్య పదప్రయోగకోశాలు, నిఘంటువులు తయారుచేయటం ముఖ్యమైన ఉద్దేశం అయింది. కాని గోపాలరెడ్డిగారు అధ్యక్షులయిన తర్వాత వారికి ఈ విధమైన దృష్టి లేకపోవటంచేత ఇంకొక మార్గంలో పోవటానికి కారణమయింది. ఆ కారణంచేత మేమిద్దరం దాంట్లో మెల్లిగా వైదొలగిపోవటం జరిగింది. వారు చేసేటటువంటి పనులన్నీ తప్పపనులనిగానీ చేయకూడనివనికానీ నేననను. కాని ఉద్దేశించింది ఒకటి, వ్యవహారంలో జరుగుతున్నది ఒకటి అని చెప్పక తప్పదు.

పద ప్రయోగాలు నిరంతరం అంతులేకుండా పెరిగేటటువంటివి. పద, భాషాప్రయోగాలు అనంతంగా పెరుగుతూ, క్షణక్షణానికీ మారేటటువంటివి, ఎన్నాళ్లో గడిచినతర్వాత సేకరించేకన్నా ఎప్పటికప్పుడు పరిశీలించడమే చక్కని పని —ఇది ఎవరో చేయడానికి వీల్లేని పని— ఒక అకాడెమీ తప్ప. దీనికి ప్రత్యేక అకాడెమీ ఉండటం అవసరం.

## రచనలు

ప్రతి రచనలోనూ, ఏదోరకమైన స్ఫూర్తి ఉండక తప్పదు. ఏదైనా సాహిత్య ప్రవాహంలో కలసి ప్రవాహాన్ని పరిపుష్టం చేయగలదని నా నమ్మకం.

ఇది ఎక్కువ అది తక్కువ అనే బెడ్డభావం లేనంతకాలం ఒకవిధమైన దృష్టి వుంటుంది. (నారచనల్లో నచ్చిందంటూ ప్రత్యేకంగా ఏమీలేదు. అన్నీ అసంతృప్తికల్గించినవే. నచ్చినది చదవండి).

"అంతులేని జీవనకాంతారాంతరమ్ము లోన
చింతాదీప మ్మెంతటి చిన్నచిన్న వెలుగిడినా
అంతెచాలు అంతెచాలు అంతకన్న లేదు మేలు"

సాహితీలోకం అన్నది ఏనాదో (నన్ను) మరచిపోయింది. (అందుకు) నేను చాలావరకు తోడ్పడ్డాను. ఎందుకంటే సాహిత్యంలోనే కాక ఇతరరంగాల్లో పరిశ్రమించడానికి ప్రయత్నించాను. నాటకాలు రాశాను. ప్రయోగించాను. రాజకీయాల్లో వ్యవహరించాను. వీటన్నిటివల్ల ఒక సమ్యగ్దృష్టి సంపాయించ డానికి ప్రయత్నించాను. నేను ప్రత్యేకమైన విలక్షణమైన ఏ శక్తినీ పొందడానికి ఉద్దేశించలేదు. కాని కొంతవరకు, చాలావరకు, వైఫల్యం పొందటంచేత నిరు త్సాహపడి మానుకున్నాను. ఏకోశానా కీర్తికాంక్ష లేదు నాకు.

ప్రత్యేకంగా, వ్యక్తిపరంగా సాధించి కీర్తి పొందుదామన్న ఉద్దేశం చాలా పొరపాటు అనీ, కీర్తికాంక్ష ఉన్నా అది గట్టిగా నిలవదు అని నాకు గట్టి నమ్మకం. ఆ నమ్మకం స్థిరపడ్డది జీవితంలో. నామరూపాలతో సంబంధం లేని పారం పర్యం చాల ముఖ్యమైనటువంటిది. జీవనకాలం పరిపుష్టం కావడానికి ప్రతివ్యక్తి ఏదో పాటుపడ్తాడు... ప్రతిఫలాపేక్ష లేకుండా చేస్తూండాలి. కార్యదీక్ష కార్యోత్సాహం మొక్కవోకుండా చేస్తుండాలి. ఈ ఉత్సాహానికి ఇతరుల సహ కారాలు కానీ ఇతరు లిచ్చేటటువంటి కీర్తిప్రతిష్ఠలుకానీ (ఆధారం) కాకూడదు. ఇది జీవితం నాకు నేర్పిన పాఠం. నిరాశ సమష్టిగా ఉన్నప్పు డెక్కు వవుతుందని నేను నమ్మను. నిరాశ వ్యక్తిగతమైనది. సమాహారంగా ఎంతమంది కలిసి కూడినా నిరాశ ఎక్కువ కావటానికి అవకాశంలేదు. ఆశకోసం ప్రయత్నించకూడదు. కీర్తి కోసం ప్రయత్నించకూడదు. అది అనుకున్నంతమాత్రాన వచ్చేది కాదు.

నేను ఏ సాహితీ సమితుల్లోనూ సభ్యుణ్ణికాదు. నన్ను ప్రత్యేకంగా ప్రశంసిం చినవారు కానీ నిందించినవారు కానీ లేరు. ఏదో కొద్దిమంది వున్నా అది నా జీవితాన్ని ఎక్కడా స్పృశించలేదు. అందువల్ల నాకు సాహిత్య రంగంలో

ఎక్కువ కీర్తిగానీ, కీర్తిహీనతగానీ లేకపోవడానికి కారణంగా ఏర్పడ్డది. ఎందు చేతనంటే నేను ఇందాక చెప్పినట్లు నామరూపాల్ని ఎక్కువ ప్రసిద్ధిలోవుంచే వుద్దేశం లేకపోవటంచేత నల్గురిచేత పీఠికలు రాయించడంకాని, ఒకరికి అంకితా లివ్వడంకాని, అంకితం ఇచ్చి, సమావేశాల్లో పొగడ్తలు పొందటంకాని, నాకా దృష్టి లేకపోవటంవల్ల, ఇతరులు అవి చేస్తూంటే అసూయాగ్రస్తు ణ్నయ్యే వాడిని కాను. నాకన్న ఎక్కువ ప్రశంసలు పొందిన వారిని చూస్తే, పొందటం చూస్తే నాకు కించిత్తు అసూయలేదు. ఇంకా వారందరినీ ఇతరులతో కలిసి ప్రశంసిం చడానికి పూనుకునేవాడిని కూడాను. ఏ మాత్రం గుణలేశం ఉన్నా అది అను గ్రహించి ఉగ్గడించేస్థితి ఉండాలి అందిరికీని. అసూయాగ్రస్తత వుంటే సాహితీ రంగంలో ముఖ్యంగా ఎవరికీ లాభించదనీ, రాణించదని నా లెక్క.

ఇదివరకు మృత్యువుని ధిక్కరించే వాణ్ణి. ఇప్పుడు సఖుడుగా అంగీకరి స్తున్నాను. నిన్ననే (17–4–79) సానెట్ పూర్తిచేశాను :

ఎన్నో రుతువులు, గడిచిన వెన్నో మధురక్షణాలు
నా జీవన పయోరాశి బుద్బుదములవోలె లేచి
నానావర్ణవిభూషిత గోళాకృతితోరణాలు
వెలయించి లయించిపోయె; వాటికొరకు వేచివేచి
చెరిగిన తొలి ఆనవాళ్ళు మరల కానిపింపవనీ
వేరు తెగిన ఆశాలత చిగురింపగ నేరదనీ
గిరితటమున సెలయేరులు వెనుకకు ప్రవహింపవనీ,
కోరికలున్నంతవరకు దుఃఖింపక తీరదనీ

... ...

మృత్యుసఖా ః నీ కరావలంబ మిచ్చి దాటింపుము
భవజలధిని ధర్మరాజ్య దయాదృష్టి పాటింపుము.

(ఆంధ్రప్రభ—ఆదివారం, 1979 జూలై 22)

అబ్బూరి రామకృష్ణరావు

# ఆ కా శ వా ణి

...ఉత్పన్నమైనటువంటిది అని చెప్పడానికి నా జీవనం ఓ విధంగా ఏర్పడితేతప్ప దానిలోనుంచి "సాహిత్యగంధం" కనిపించదుకదా అనే ఉద్దేశంతో background అంతా చెప్తున్నాను.

ప్రశ్న : దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో మీ సహవాసంగురించి ఇది ఏ period లో కొస్తుందో అది కొంచెం, అది ఒక వేళ...?

నాకు ప్రధానంగా జీవనలక్ష్యం సాహిత్యంలో అగ్రస్థానం సంపాయిద్దామనిగాదు. అది ఏం ప్రధానంగా లేకపోవటంవల్ల జీవనాన్ని సార్థకం చేసుకుందామనేటటువంటి ఉద్దేశంతో అహోరాత్రాలూ పాటుబడుతూ ఉండటంచేత దీనిమీద నాకు దృష్టి ఎక్కువగా ఉండేది. తక్కిన సాహిత్యరచనలుగాని, సాహిత్య వ్యాసంగంగాని, ప్రాసంగికంగా ఉండేవి. అంచువల్ల చెబుతున్నాను.

తరువాత ఈ సంఘటనలన్నీ అయింతరువాత ఇదే ఉద్దేశంలో నేను మైసూరులో ఉండగానే రాసినటువంటి పద్యాలన్నీ కలిపి, నేను కలకత్తాలో ఉండగా "ఊహాగానం" అనేటువంటి పేరుతో అచ్చువేయించాను. కాని రచనలన్నీ గూడా చాలావరకు మైసూరులో ఉండగా రాసినటువంటివే.

ఒకనాడు నేను తెనాలిలో ఉండగా...మార్కెటుకుపోయి కూరలుతెచ్చుకోవటానికి ఓ స్త్రీ వస్తూ ఉంటే...ఒక ఇంట్లోనించి నాపద్యం వినిపించింది. ఆ పద్యం వినిపిస్తే, ఎవర్రా ఇది అనిచెప్పి నేను వెళ్లానక్కడికి. ఆ చేతిలో ఉన్న కూరల సంచి పుచ్చుకుని అక్కడ నిలబడ్డాను. అంటే...కొంచెం దూరంపోతే నా స్నేహితుడి ఇల్లే అది. పోతుమంచి శ్రీరామమూర్తి అని. అతని ఇంట్లో అతనికి ఇంగ్లండులో పరిచితుడైనటువంటి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఈ గ్రంథాన్ని

చదివి, దాంట్లో పద్యాలు చదివి తీవ్రంగా విమర్శిస్తున్నారు. నేనెవరో ఆయనకు తెలీదు. ఆయనెవరో నాకు తెలీదు. అలా నాకాయన్తో పరిచయం కలిగింది.

తరవాత, తరచుగా అక్కడ కలుసుకోవటంచేత...ఆయన అప్పుడు ఏ ఉద్యోగంలేకుండా రాజమండ్రి కాలేజినుంచి రాజీనామాచేసి ఒక పెద్ద మహోద్యమాన్ని ప్రారంభిద్దామనేటువంటి సంకల్పంతో మాబోటి యువకులందరినీ చేరదీయటం ప్రారంభించారు. దాన్లో అవేశంకొద్దీ, ఆయనయం దున్నటువంటి గౌరవంచేత, ఆయనతో సాహచర్యం ప్రారంభించాను.

తరవాత, చీరాల వెళ్ళి, అక్కడ స్వయంగా ఆయనతోపాటు నేను కూడా ఒక చిన్న ఇల్లు కట్టుకున్నాను, ఆంధ్ర విద్యాపీఠగోష్ఠి అని. ఆంధ్ర విద్యాపీఠ గోష్ఠి అనేది.—అది విద్యాసంస్థ. రామదండు అనేది దానికి ఒక military adjunct అన్నమాట. బ్రాహ్మణులమతం అనేది లక్ష్యసాధనకు ఏర్పరచుకొనినటువంటిది. అంటే, జగత్తులోనూ ఈ భారతదేశంలో ఉన్న, యావన్మందినీ బ్రాహ్మణులని. 'బ్రాహ్మణో రక్షితః స్యాత్, అధికధర్మో రక్షితః స్యాత్' అని చెప్పినందువల్ల మనమందరం బ్రాహ్మలమే, మనమతం బ్రాహ్మణమతం, హిందూమతం కాదు. పేకమళ్ళీ కలిపేసి ఇప్పుడున్న వర్ణవ్యవస్థ అంతా చిందరవందర అయిపోయి, అస్తవ్యస్తంగా ఉన్నవి. మళ్ళీ నూతనమైనటువంటి జాతిని సృష్టించాలంటే మన బ్రాహ్మణమతాన్ని ఉద్ధరించాలి. దీనికి అందరూ బ్రాహ్మణులే. అందరికీ గాయత్రీ ఉపదేశం చేసి ఒక యజ్ఞోపవీతం ప్రదానంచేసి అందర్నీ బ్రాహ్మణులను చేయాలనేటువంటి సంకల్పంతో, అది, ఈ సంకల్పాన్ని నెరవేర్చటానికి ఆంధ్ర విద్యాపీఠగోష్ఠిని ఏర్పరచి, ఇది నలుమూలలా చాటి, అందర్నీ సంఘటిత పరచటానికి రామదండు అనేటటువంటి ఒక సంస్థ నేర్పాటు చేసి, భారతదేశమంతా సంచారం చెయ్యాలనేటటువంటి ఉద్దేశంతో ఆయన సంకల్పించాడు. అది. మాకున్నటువంటి ఉత్సాహం కొద్దీ మేము కూడా ఆయనతో ఏకీభవించి, కొంతమటుకు పనిచేయాలని చీరాలలో స్వగృహాలు కట్టుకుని స్థిరపడ్డాము. అందులో బసవరాజు అప్పారావు ఉన్నాడు, కొన్నాళ్లు. అంతా ఒకొ్క్కక్కరే, ఒక్కొక్కరే జారిపోవటం తటస్థించింది. రెండు సంవత్సరాలు అయిన తర్వాత ఆయన దేశసంచారం. మహాత్మాగాంధీ వచ్చినప్పుడు ఆయనకి మేమొకవినతి పత్రం సమర్పించాము. అందులోనూ తాటాకుల్లో వ్రాసి ఇచ్చాము. అందులో ఒక శ్లోకం వ్రాశాను :

"పునీతా గాంధిఃత్వత్పదపరిచితా రామనగరీ
గరీయః ప్రస్థానః"

అని ఒక శ్లోకం వ్రాసి, ఆయనకు తాటాకుల మీద తాటాకుల పుస్తకంలో చుట్టి వినతి పత్రం ఇస్తే, ఇంతవరకు నాకు భారతదేశ సంచారంలో స్వాగత పత్రంలో ఇలాటి పత్రాలు ఎవరిచ్చారు; ఇది విచిత్రంగా ఉంది, అని చెప్పి ఆయన చెప్పారు. అంత రాత్రివేళ చాలా మెచ్చుకున్నారు పాపం, ఆయన.

ఆయన ఆజ్ఞను అనుసరించి, మునిసిపాలిటిని ధిక్కరించి, అక్కర్లేదని తిరగబడినటువంటి ప్రజలంతా దేశత్యాగం చేయటానికి పూనుకుని, చీరాల—పేరాల రెండు పట్నాలు వదిలేసి తాటాకుపాకలు వేసుకుని మా ఆశ్రమంలో—రామనగర ఆశ్రమంలో ఇళ్లు కట్టుకుని యావన్మందీ వచ్చేశారు. అక్కడికి వచ్చి మేము కోర్టులు పెట్టాము. ఈ నూతనవ్యవస్థ స్థాపించినప్పట్నుంచీ ఆజ్ఞను ధిక్కరించినవాళ్ళని శిక్షించటానికి జరిగేవి. రిజర్వుపోలీసులు వచ్చినా వాళ్ళకు అన్నపానాదులు లేక ఏరీతి సహాయం లేక వాళ్ళకు ప్రజలదగ్గర్నించి, వాళ్ళు తిరిగిపోవలసి వచ్చేదన్నమాట. ఆవిధంగా రెండు సంవత్సరాలు అక్కడ ఉన్న తరువాత ఆయన జైల్లోకిపోయినాడు. నేనొక్కడినీ చూడాల్సి వచ్చింది అది; తరవాత, ప్రజల్లో నిరుత్సాహం ప్రబలి వాళ్ళు ఇళ్ళూ వాకిళ్ళూ తగులబెట్టుకొని, మళ్ళీ కొంపలకు చేరుకున్నారు.

ఈ విధంగా అనేకమైనటువంటి దుస్సంఘటనలవల్ల జీవితంలో పరమార్థ మనేది సాధించటం ఎంత దుష్కరమో, ఒక విధమైనటువంటి లక్ష్యశుద్ధితో సంచరించటం ఎంత కష్టమో నేను గ్రహించగలిగాను. అందువల్ల నాకెప్పుడూ దృష్టి—యెప్పుడూ ఏమిటంటే, జీవితాన్ని, వృథాపుచ్చకుండా, జీవితాన్ని, ఒక విధమైనటువంటి meaningful journey కింద (ప్రయోజనాత్మకంగా) లక్ష్యశుద్ధి గలిగినటువంటి ప్రయాణం కింద భావిస్తూ నేను సంచరిస్తున్నాను. అందువల్లనే, సాహిత్యంలో నాకన్నా చాలా తక్కువ స్థాయిలో ఉన్నటువంటి వాళ్ళనేకమంది ప్రసిద్ధులు కావటం, నేను కాకపోవటం అనేటువంటిది అనేకమంది నా స్నేహితులు నాకు జ్ఞాపకానికి తెస్తున్నప్పుడు నాకేవిధమైనటువంటి అసూయగాని, ఒక పశ్చాత్తాపం గాని, ఏమీ ఉండదు నాకు. ఇతరులు వృద్ధిలోకి వస్తున్నారంటే, నా

కాలపువాళ్ళు, నేను సంతోషిస్తాను గాని, నాకే విధమైనటువంటి అసూయ ఉండదు.

తరవాత ఇంకోటేమిటంటే నేను నాకు భగవంతు డిచ్చినటువంటి ఒక సుగుణ మేమిటంటే, నేను నా శిష్యులకు శిష్యుణ్ణిగా ప్రవర్తించగలిగినటువంటి వినీతి నాకు స్వయంగా అబ్బింది. నేను నా దగ్గర చదువుకున్నటువంటి వాళ్ళుగాని, నాచేత ప్రభావితుల మైనామని చెప్పుకునేటువంటి అనేకమంది దగ్గర గాని, నేను వాళ్ళ వల్ల ప్రభావితుణ్ణైనట్టుగా భావిస్తూ, నిజంగా ఆవిధంగా సంచరించగలిగిన అదృష్టం నాకున్న దని అనుకుంటున్నాను.

ఆ విధంగా చూస్తే; శ్రీనివాసరావు ఉన్నాడు—శ్రీరంగం శ్రీనివాసరావు. మొట్టమొదట అతన్ని ఆ దారిలో పెట్టింది నేనేమో అని చెప్పి నే ననేకవిధాల అనుకొంటూ ఉంటాను. అతనూ అనుకొంటాడు.

(''మాబోటివాళ్ళం కొంతమందిమి ఆ విషయం మొదటినుంచి కూడా నమ్మిన వాళ్లమండీ ఇప్పటికి నమ్ముతున్నాం కూడాను...")

ఆంధ్రా యూనివర్సిటీలో ఉన్నప్పుడు, అతనికి ఈ సర్రియిలిజం, దీన్ని గురించినటువంటి సాహిత్యాన్ని ఒకటో, రెండో, పుస్తకాలు నా దగ్గర ఉన్నవి అతనికి చూపించాను. అతను కేవలం సహజప్రతిభ కలిగినటువంటి ప్రజ్ఞావంతుడు కాబట్టి, అతను దాన్ని అల్లుకొనిపోయినాడు. కేవలం నావల్ల ఏం లేకపోయినా, ఇంకో విధమైనటువంటి కారణంవల్ల అతనీ స్థితికి వచ్చేవాడు దానికి సందేహం లేదు. కాని, నేను నిమిత్త మాత్రంగా అక్కడ ఉండటం నాకు అదృష్టంగా భావిస్తున్నాను.

ప్రోగ్రెసివ్ రైటర్స్ ఎసోసియేషన్ అని, లక్నోలో దానికి ప్రతినిధిగా నేను పోతున్నపుడు నాతోపాటు హిరేన్ ముఖర్జీ, కపూర్, సోమంచి యజ్ఞన్న శాస్త్రి వీళ్ళుకూడా వచ్చారు. ఆ సందర్భంలో అప్పటికి నేను కమ్యూనిస్టు పార్టీలో మెంబర్నిగా ఉండిపోయేవాణ్ణి. అక్కడ్ణించి వచ్చింతర్వాత వర్ధమాన రచయితల సంఘం అని చెప్పి, వాళ్ళ manifesto నేను శ్రీనివాసరావును ఇంటికి పిలిపించి translate చేసి, ఆ అభ్యుదయ కవితా సంఘాన్ని మొట్టమొదట స్థాపించింది నేనే అక్కడ. దానివల్ల అతను అల్లుకుపోయినాడు, తరవాత అక్కడ్ణించి చెన్న

పట్నం పోయి ఇటువంటి సాహిత్యాన్ని ఎంతో పరిశీలించి. ఎంత పరిశీలించినా తర్జుమాలు చేయగలరు కాని, స్వతంత్రించి అతని వలెనే ఒక ఉద్యమాన్ని స్థాపించగలిగినటువంటి శక్తి కావాలంటే, శ్రీనివాసరావుకే ఉన్నదా శక్తి అందరిలోకి. ఆవిషయంలో నాకతను గురుతుల్యుడుగా నేను భావిస్తాను.

(మీరు ఒక భావనాబలం; ఒక బల్ల ఒక ఈజీ చైరు వేసుకొని కలంతో సాహిత్యం సృష్టించడంలో కంటే, మీకు ఈ రంగస్థల వేదికపై జీవితనాటకాల్ని ఆడించడంలో కొంచెం ఎక్కువ తృప్తి కనబడుతూ ఉండేదెమోనని నాబోటి గాళ్ళం అనుకొంటూ ఉంటామండి. మీ జీవితరంగంలో ఈ రంగస్థలాన్ని గుర్తించిన అంకం గురించి మీ భావాలను వినాలని కోరుతున్నానండి...).

నాటకాల విషయంలో కూడా, నాటకాల మీద నాకున్నటువంటి ఆసక్తి కూడా చాలా చిన్నతనం నుంచే ప్రారంభమయింది. నేను తెనాలి హైస్కూలులో చదువుతున్నప్పుడు ములుకుట్ల నరసింహశాస్త్రిగారిచేత నాటకం రాయించి ఈ ప్రసిద్ధ సినీనటులందరూ గోవిందరాజుల సుబ్బారావు, మాధవపెద్ది వెంకట్రామయ్య ప్రదర్శించారు. వీళ్ళందరూ మా స్కూల్లో చదువుతున్నవాళ్ళే. అక్కడనే మొట్ట మొదట ఇదంతా ప్రారంభమయింది.

నాటకాలు వెయ్యడమనేటటువంటిది కూడా చాలా చిన్నతనంనుంచీ ప్రారంభమయింది. నేను ఫిఫ్తుఫారం, స్కూలు ఫైనలు, తెనాలి హైస్కూల్లో చదువుతున్నప్పటి నుంచి, తెలుగు ఉపాధ్యాయులు పైడిభొట్ల విశ్వనాథశాస్త్రిగారు పిల్లలచేత వేయిస్తూ ఉండేవారు. అక్కడినుంచి బైటపడ్డవాళ్ళే మాధవపెద్ది వెంకట్రామయ్య, గోవిందరాజుల సుబ్బారావు మొదలైనవాళ్ళు.

తరవాత, అక్కడ తర్ఫీదయినటువంటి వాళ్ళతోనే రామవిలాస సభ ఏర్పడ్డది, తెనాలిలో కూడా. నేను ఇంటర్మీడియేటు....చదువుతున్నప్పుడే బందరు బుట్టయ్యపేటహాలులో జూలియస్ సీజరు నాటకం వేశాం. దుస్తులు ఎన్ని దొరికితే అన్ని పట్టుకొచ్చి, అవి ఒంటినిండా గ్రీకులు ధరించేటటువంటి పద్ధతిగా ధరించి, ఆ నాటకం వేశాము. అందులో నేను జూలియస్ సీజరుపాత్ర ధరించాను. ఎటొచ్చి ముఖ్యమైన ఘట్టంలో బ్రూటస్ చంపినప్పుడు కిందపడిపోతూ ఎట్ టూ బ్రూటస్ అనాలి కదా, ఆ కాస్తా మరిచిపోయి పడిపోయినాను. తరవాత ఎన్నాళ్లో బాధపడ్డాను. అది మళ్ళీ ఇంకోమాటు వేయటానికి అవకాశం లేకపోయింది.

తరవాత, ఈ నాటకం అనేది సాహిత్యానికి ఒక ముఖ్యమైన ప్రక్రియ అని అప్పటినుంచి తెలుసు కాబట్టి, ఆది నేను సాధించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాను. నేను రాసింది చాలా కొద్ది అని చెప్పి నా స్నేహితులంతా అనుకుంటారు. కాని, నేను వ్రాసి నష్టం చేసినటువంటి —నాశనం చేసినటువంటి సాహిత్యం ఎంతో ఉన్నది. అది ఇప్పుడు అచ్చుపడ్డవన్నీ కలిపి ఒకచోట చేర్చినా ఇంకో రెండు మూడు సంపుటాలవుతాయి. కాని అవి దొరకలేదు. సామాన్యంగా నాకు అలవాటేమిటంటే, పద్యం కాగితం మీద వ్రాయటం అలవాటు లేదు. మనసులో అనుకుని పూర్తయిపోయిన తర్వాత వ్రాయటమే.

అలా కొన్ని నా స్నేహితుల నోళ్ళల్లో మిగిలిపోయాయి. ముఖ్యంగా నాటకం సంగతి మాట్లాడుతున్నాం కదా, ఈ నాటకాన్ని గురించి నాకున్నటు వంటి అభిలాషంతా తీర్చుకోవటానికి — నేను ఆంధ్రా యూనివర్సిటీలో చేరిన కొన్నాళ్ళకు, యుద్ధ సమయంలో నటాలి అనేటువంటి — ఒక సంఘాన్ని స్థాపించాను. అది గవర్నమెంటు యొక్క సహాయంచేత స్థాపించడానికి అవకాశం కలిగింది. నేను యుద్ధానికి ప్రచారం చేస్తున్నాననేటువంటి అపవాదు నామీద ఎంతోమంది లేవదీశారు, ఆరోజుల్లో. కాని, యుద్ధానికీ నాకూ ఏమాత్రం సంబంధంలేదు. ప్రత్యేకంగా నేను గవర్నమెంటుతో ముఖ్యంగా చెప్పాను: షేక్స్పియర్ నాటకాలు వేస్తే, కాళిదాసు నాటకాలు వేస్తే, ఆ చూసిన వాళ్ళకు మనశ్శాంతి కలుగుతుంది. అంతకన్నా యుద్ధ సమయంలో ఏ విధ మైనటువంటి నాటకాలూ ఇంకోటి లేవు. నువ్వు యుద్ధం చెయ్యి, నువ్వు బియ్యం దంచు, నువ్వు ఎక్కువ పండించు అని నాటకాలు వేస్తే మరి ఆ పంటా ఎక్కువ కాదు, తినే తిండీ ఎక్కువ కాదు. కాని ఉత్తమోత్తమ మయినటువంటి నాటకాలను రసవత్తరమైనటువంటి నాటకాలను ప్రదర్శించటంవల్లనే ప్రజల్లో ఒక విధమైనటు వంటి శాంతి దొరకటానికి అవకాశం వుంటుతుందని నేను వాదించి, ఈ అంగీకా రాన్ని, వారి దగ్గర నుంచి తీసుకుని, మేజర్ హార్వే అనేటువంటి Director of Publicity, అతని ద్వారా నటాలి సంస్థకు ఒక విధమైన సహాయాన్ని సంపా దించగలిగాను. ఆ సహాయం ఎలాటిదంటే, నేను నాటకాలను ప్రదర్శించటం, ఆ నాటకాలను ప్రదర్శించటంవలన వచ్చేటటువంటి నష్టాన్ని, గవర్నమెంటు పూర్తి చెయ్యటం, దానిలో లాభంగనక ఏదన్నా వచ్చినట్లయితే ఆ లాభం వారికిచ్చే సెయ్యటం అంతేకాని ఒక దమ్మిడీ వారి దగ్గర్నుంచి తీసుకోలేదు, నేను స్వప్రయోజనానికి.

ఈ agreement లో ఈ ప్రచారం లేకుండా సహాయం చేయటానికి గవర్నమెంటులో advisors అని ఉండేవాళ్ళు రుదర్‌ఫర్డ్ మొదలైనవారు. అటువంటి adviserగా శొంఠి రామమూర్తిగారు ఉన్నారు. శొంఠి రామమూర్తిగారికి అల్లుడైనటువంటి బుర్రా సుబ్రహ్మణ్యంగారి ద్వారా వారితో పరిచయం చేసుకుని వారిని consult చేస్తే ఆయన చెప్పారు; "రామకృష్ణారావు అన్నమాట మంచిది, ప్రచారం అన్నమాట దీనిలో ఉండటమనేది గవర్నమెంటుకూ భావ్యంకాదు, ప్రజలకూ భావ్యంకాదు, ఆయన ఇష్టం వచ్చినటువంటి నాటకాలు వేయించవచ్చు. నాటకం ఉత్తమంగా ఉన్నదా? లేదా? అని చూసుకోవటమేగాని నాటకం ప్రచారయోగ్యంగా ఉన్నదా లేదా అని చూడటం భావ్యంకా"దని నిర్ణయించి, ఆ విధంగా సహాయం చెయ్యటానికి వారు అంగీకరించారు. ఆ ఒప్పందం కిందట నేను కన్యాశుల్కం...అని ఒకటి, ప్రతిమాసుందరి అని ఒకటి, రెండు నాటకాలు మాత్రమే ప్రదర్శించాను. ఈ రెంటిలో ప్రచారం ఏమిలేదు (నవ్వు) నా స్నేహితుడు మాగంటి బాపినీడు అంటుండే వాడు, "ఇందులో కూడా ఎక్కడో కాస్తంత ప్రచారం పెట్టి ఉంటావు'' అని. అది అతని ఊహేకాని, అతని ఇమాజినేషనే కాని, దానిలో ఏమీ లేనటువంటి మాట నిజం.

కాని మొట్టమొదట నటాలి స్థాపించినపుడు చెన్నపట్నంలో ఎంతోమంది గొప్పసామాజికుల సమక్షంలో సెయింట్‌మేరీస్ హాల్లో ప్రథమ ప్రదర్శన చేశాను. ఈ రంగస్థలాన్ని నిర్మాణం చెయ్యటానికి, రంగ ప్రసాధనం చెయ్యటానికి కొంత మందిని నియోగించి, వారి ద్వారా సహాయం పొందటానికి ప్రయత్నించాను. దాంట్లో బలిజేపల్లి లక్ష్మీకాంతం, రంగస్వామిఅయ్యంగార్, జలసూత్రం రుక్మిణీ నాథశాస్త్రి, పూర్ణిమ ఇంకా అనేకమంది చాలాగొప్పనటులు వేషాలువేశారు. చిట్టచివరికి లింగమూర్తిగారికేమో రామప్పంతులు వేషం ఇద్దామని, ఆయనకు చివరి రోజున, అనుమతి లేకపోవటంచేత నేనే వేయాల్సివచ్చింది, ఆ పాత్ర. అప్పుడు, దాంట్లో రంగస్థలంలో కావలసినటువంటి వస్తువులన్నీ సేకరించటానికి శ్రీరంగం శ్రీనివాసరావును నియోగించాను. అతను చిట్టచివరికి ఇంకో అరగంటలో నాటకం (నవ్వు) ప్రారంభమవుతుందనగా చేతులు జాడించుకుంటూ వచ్చి, ఏమీ దొరకలేదని చెప్పాడు, వేషం వేసుకుంటున్నప్పుడు. అప్పుడు సభాసదుల దగ్గర్నించి ఒక చెప్పులజత, ఒక చేతికర్ర ఇలాంటివన్నీ, తెప్పించుకొని రంగస్థలం మీదికి రావాల్సివచ్చింది.

చివరికి వచ్చేటప్పటికి ఆ చెరువుకట్ట సీన్ దగ్గర్కి వచ్చేటప్పటికి ఆ ఉన్న సీను రంగాన్ని మార్చటానికి వీలులేకుండా పెద్ద పెద్ద మేకుల్తో బిగించిపోయి నాడు రంగస్థలనిర్మాత. ఎందువల్లనంటే నేను గవర్నమెంటు ప్రచారం చేస్తున్నానని, ప్రజలకు విరుద్ధంగా సంచరిస్తున్నానని చేసినటువంటి అపవాదులకు అతడు కూడా లోనై ఆ పని చేసిపోయినాడు. అప్పుడు సభాసదులని నమస్క-రించి, కారణాంతరాలచేత నాటకం ఇంతటితో ఆపివేయాల్సి వచ్చిందని, ఆపి వేశాము.

అలా ప్రారంభమైనటువంటి నటాలి నాటకాలు ఒక సంవత్సరం చాలా దిగ్విజయంగా జరిగి ఆంధ్రదేశంలో అన్ని జిల్లాల్లోనూ సంచరించటానికి అవ కాశం కలిగింది. అనేకమంది మెప్పుదలను పొందటానికి వీలయింది.

కాని, చిరకాలం దాంట్లోనే ఉండి అది కొనసాగించటానికి అవకాశం లేక మళ్ళీ యూనివర్సిటీలో చేరవలసిన స్థితి రావటంవలన అది మానుకోగా, అంతటితో అది అంతరించింది. దానివల్ల వచ్చినటువంటి అనుభవంతో, ఆంధ్రా యూనివర్సిటీలో నాటక సమాజం పెట్టినప్పుడు దానికి వైస్‌ప్రెసిడెంటుగా ఉన్నాను. తరువాత గోపాలస్వామిగారు వచ్చి దాన్ని, మంచి వృద్ధిలోకి తీసు కొని వచ్చారు.

(సాహితీ రచయితల సల్లాపాలు వినే శ్రోతలకి ఒక కుతూహలం ఉంటూ ఉంటుందండి. వారి ప్రసిద్ధమైన రచన ఏదన్నా ఒకటిగాని, రెండు గాని తీసు కొన్నా ఆ రచనలకి ఏదన్నా ఒకటిగాని, రెండుగాని తీసుకొన్నా ఆ రచనలకి ఏదన్నా ప్రేరణ అంటూ ఉందా ? సాధారణంగా ఒకటి పద్యం కావడానికికాని, ఒకటి నాటకం కావడానికిగాని, ఆ రచయితకు ఏమన్నా ప్రత్యేక ప్రేరణలు ఉండి ఉంటాయా ? అని తెలుసుకోవాలని ఉంటుందండి. ఈ దృష్ట్యా మీ రచనల్లో కారణములూ, ఉద్బోధకములూ ఏమన్నా చెబుతారా దయచేసి ?)

అసలు కవిత్వముంటే అసక్తి కలగటమనేది. చాలా చిన్నతనంలోనే, నేను తొమ్మిది పది సంవత్సరాల్లో ఉండగానే జరిగింది. బందరు నోబుల్ కాలేజీలో కె. టి. రామారావుగారని, ఆయన తరవాత ఆశ్రమం స్వీకరించి కుర్తాలం పీఠాధి పతిగా ఉన్నారు.

(ఆయన ఇంగ్లీషులో విక్రమాదిత్య అన్న poem రాశారుగాదూ ?)

కె. టి. రామారావుగారని - త్రివిక్రమ రామారావుగారు - చెళ్ళ పిళ్ళ వెంకటశాస్త్రిగారికి చాలా సన్నిహితులు. ఆయన బందర్నించి మా స్వగ్రామం అనంతవరం దగ్గర జెముడుపాడని, తెనాలి తాలూకాలోని అత్తవారింటికి వస్తూండే వారు. మా నాన్నగారూన్నూ, తాతగారూ కూడా కొంచెం కొంచెం కవిత్వంలో ప్రవేశం ఉన్నవారే. మాతాతగారి పద్యం ఒకటి చదువుతాను కావాలంటే.

పిల్లొచ్చి, పాలుతాగి మజ్జిగతాగి పోతుండేది మా ఇంట్లో. మా తాతగారు అప్పయ్యగారండి అబ్బూరి అప్పయ్యగారు ఆయన కూడా కవిత్వం చెప్పేవారు. పిల్లి పాలూ మజ్జిగా ఇంట్లో తాగిపోతుంటే.

మెల్లని పదముల నిడుచును
కల్లగ మా యిల్లు జొచ్చి కలకాలముగా
చల్లన్ని తాగిపోతివి
పిల్లీ ! నీ తల్లికడుపు భిన్నము గానూ !

అని ఒక పద్యం చెప్పారు. ఒక ప్రబంధం కూడా రాశారు.

మా నాన్నగారు కూడా చక్కని కవిత్వం, చాలా అల్పంగా రాశారను కోండి, చిన్న పల్లెటూర్లోనేమో, ఇట్లాంటి సాహిత్యగోష్ఠికింకెవరూ లేక, మానాన్న గారి దగ్గరికి వచ్చేవారు కె. టి. రామారావుగారు.

ఆరోజుల్లో దేవి భాగవతం రాస్తున్నారు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు. నాకు ఒక పద్యం ఆ చరణం బాగా జ్ఞాపకం ఉంది.

"కట్టుకట్టి యది తప్పెడినన్నయ...." అనే పద్యం. "ఏమైనను భారతంబు నకు అంజలిచేయ తప్పదేరికిన్".

ఇలాటి పద్యాలన్నీ చదివి వినిపిస్తూ ఉండేవారు. పద్యాల రుచి గ్రహించ టానికి నాకు వారు చదవటంతోడ్పడింది. ప్రతిరోజూ సాయంకాలం వచ్చి ఒక గంటా రెండు గంటలూ వాళ్ళుగోష్ఠి చేస్తుంటే వారు చదివిన పద్యాలు విని, అలాంటి పద్యాలు రాయాలనేటటువంటి ఉద్దేశం నాకు కలిగి కేవలం ఆ నడకవల్లనే నేను పద్యం రాయటం నేర్చుకొన్నాను, మొట్టమొదట ఛిప్తుఫారం చదివేటప్పుడన్న మాట. ఎలాగో ఒక్కొక్క చరణం రాయడమనేటటువంటిది ప్రారంభమయిందన్న మాట.

ఇలా జరిగిన తర్వాత నేను తెనాలిలో ఉండగానే, ఫిఫ్తుఫారం చదువు తున్నప్పుడే, మొట్టమొదట "జలాంజలి" అని దాంట్లో సగం భాగం దొరకలేదు, దొరికినదే అచ్చుపడ్డదనుకోండి, అది రాశాను. కొడవటిగంటి వెంకట సుబ్బయ్య నాకు సహాయంగా ఉండేవాడు. అతను చక్కటి ముద్దయిన అక్షరాలతో కాపీచేసి ఇచ్చాడు పాపం.

అతనూ నేనూ ఇద్దరం కలిసి ఈ కవిత్వం మొదలైనాక ఈ దేశమంతా తిరుగుదామని, సాధువుల్లో కలుద్దామని, అనుకొన్నాము. అతనొక్కడూ వెళ్ళిపోయినాడు.

("అగుమాగుము తెరువరీ ఆయాసఖేదం
బపనయింపుము, మా గృహాంగణ కుసుమ
సముదయ మధువు లియ్యవిగో"
వెంకట సుబ్బయ్యగారి పద్యం కదూ !")

అతను వెళ్ళిపోయినాడు పాపం. ఏదో బైరాగుల్లో కలిసిపోయినాడని మళ్ళీ అంతూపొంతూ లేకుండా వెళ్ళిపోయినాడట. నాకు చాలా ఆప్తుడైన మిత్రుడు. అతనితో కలిసి ఎన్నో సార్లు పద్యాలు గద్యాలు చదువుకోవటం చేస్తుండేవాళ్ళం. ఇదంతా పూర్వగ్రంథాలతో ఎక్కువ పరిచయం లేకుండానే.

ఇదైపోయిన తర్వాత నేను మెట్రిక్యులేషన్ చదువుతుండగా ఏదో ఒక పెళ్ళి సంబంధంలో మామిళ్లపల్లి అనే గ్రామంవెళ్ళి అక్కడే శతావధానం చేశాను.

శతావధానం చేసినదాంట్లో మొదటి పద్యం కుర్చీమీద. "అర్చింపందగు నిన్ను'' అని మొదలుపెట్టి, "ఓ కుర్చీ!'' అని దాన్ని సంబోధించి, కుర్చీమీద పద్యం చెప్పి ఓ ఇరవైమందో ఓ ఇరవై అయిదు మందికో—అప్పుడు శతావధానాలంటే పదిహేను మందికి, ఇరవైమందికి కూడా జరిగిపోయేవి కదా_తరవాత తక్కినవాళ్ళు లేచి నామీద పద్యాలు చదవటం, ఇలాటివన్ని జరిగినై.

అప్పటికి పద్యం కొంత ధారాళంగా రాయడము చెయ్యటమూ అది కొంత జరిగింది. అప్పుడు గుంటూరులో ఫస్టు కంపెనీకి అధికారిగా మా పెద్ద బావగారుండేవారు, పోలూరి హనుమంతరావుగారు. అందులో హరిప్రసాదరావు, బలిజే

పల్లి లక్ష్మీకాంతంగారూ వాళ్లూ ఉండేవాళ్ళు. వాళ్ళ చిత్రనళీయ, హరిశ్చంద్ర నాటకం వేశేవారు నాటకాలన్నీ చూసేవాణ్ణి అప్పుడు. అందులో బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిత్వమంటే కొంచెం చెవికింపుగా ఉండేది, ఆయన చదవటంవల్లా దాని వల్లా మా అన్నగారు కూడా బుద్ధిమతీవిలాసం అని ఒక చిన్న నాటకం వ్రాశాడు. సాహిత్యగోష్ఠి మా యింటిలో ఉండేదన్నమాట. అన్నదమ్ములందరితోనూ మాట్లాడుకుంటున్నప్పుడు ఏదో పద్యం చేర్చి రాయటమనేది...

మా అన్నగారు, రెండో అన్నగారు, మూడో అన్నగారు కలిసి కొద్దిగా ఇంటి దగ్గర్నించి డబ్బు తీసుకొని బందర్లో చదువుకోటానికి వెళ్ళార్ట. దాన్ని గురించి పద్యం రాయటానికి ప్రారంభించారు. బందరెళ్లిన తర్వాత ఆ ఉన్న కాస్త డబ్బులూ తలాకాస్త పంచుకున్నారుపంచుకున్న దానిమీద పద్యం:

బందరు పట్టణం దగర
బంచిన సొమ్ముకు కంతులేదు

తరవాత రాలేదు పద్యం. అంతవరకు వచ్చింది. నీ పిండాకూడు! ఇదేం పద్యం ? దగ్గర అంటానికి 'దగర' ఏమిటీ ? అని అడిగితే, కాదు దీంట్లో బ్రహ్మాండమైన శబ్దాలంకారం ఉంది.

బమ్—దరు పట్టణం దగర
బమ్—చిన సొమ్ముకు
కమ్—తు లేదు

అన్నారు! అంటే ఏమన్నమాట, పద్యం అల్లటంలో ఉన్న మెళకువలన్నీ తెలుసుకోవటం ఇలాంటి చిలిపి చేష్టలవల్ల అలవాటయింది.

ఈ విధమైనటువంటి అనుభూతులనేకం కలిగేవి. ప్రతిరోజూ ఉదయం లేచేవాణ్ణి నాలుగు గంటలకు. పక్కమీదపడుకుని, ఏదో మరిచిపోయినట్లు నాకు పూర్తిగా పరిచితమైనటువంటి ఏదో ఒక అనుభవాన్ని మరిచిపోయినట్లు, దానిని జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నట్టు ఒక గంటా గంటన్నర కొట్టుకునే వాణ్ణి ఏదో జ్ఞాపకం రాదు. ఏమిటది ? అది నిజంగా ఉన్నదో, లేదో, ఏమీ తెలీదు. ఏదో ఒకటి ఉన్నట్టు, దాన్ని నేను మరిచిపోయినట్లు, అది జ్ఞాపకం

చేసుకోవటానికి ప్రయత్నం చేసేవాణ్ణి. ఇది ఒక రోజు కాదు, రెండురోజులు కాదు, నెలకాదు, ఒక సంవత్సరం పాటు జరిగింది.

తరువాత నేను శాకుంతలం చదువుతున్నప్పుడు—

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి య త్సుఖితోపి జంతుః
త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.

అంటే ఇదేనని నేననుకున్నాను. ఏదో జననాంతర సౌహృదం అయి ఉండాలి. అతడే చెప్పాడు కదా, 'నూనం' అని చెప్పాడు. ఇది తప్పదు. వాసనారూపంగా ఉన్నటువంటివి జననాంతర సౌహృదాలను చేతసా స్మరతి నూనం అబోధ పూర్వమైనటువంటిది. ఆ అనుభవాన్ని విశదం చేయటానికని ఈ కావేరి ఇతి వృత్తాన్ని స్వీకరించాను. ఎక్కడో చదివాను కథ, కావేరి నదిగా మారటం అనేది. అగస్త్యకుమారి అంటే ఈ పూర్వానుభవాన్ని, జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నం చేశాను.

మన అందరికీ పూర్వ స్మృతులు, అనంతమైనటువంటి యోగానికి సంబంధించినటువంటివి, అనంతమైనటువంటి కాలంలో ఇమిడి ఉన్నటువంటివి, పూర్వ సంబంధమైనటువంటి ఏవో ఉండి ఉంటాయి, ప్రతి జీవితంలోనూ—అప్పుడు ఉపశాంతి కలిగిందన్నమాట.

నేను కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడుగా ఉన్నప్పుడు ఎం. ఎన్. రాయ్‌ని గురించి ఆ పార్టీలో ప్రతికూల ప్రచారం సాగుతూ ఉండేది, ఆయన వెలిబుచ్చినటువంటి అభిప్రాయాలు సరియైనవి కావని చెబుతూ, కొన్నాళ్లకు ఆ అభిప్రాయాలనే వీరు సమ్మతించగా చూస్తూ ఉండేవాళ్ళం. అందువల్ల ఈయన సంగతుల్ని గురించి తెలుసుకుందా మనేటటువంటి ఉబలాటం నాకే కాదు, పార్టీలో కొంత మంది ఇతర సభ్యులకు గూడా కలిగేది. సరిగా ఆ సందర్భంలో నాకు ఆప్త మిత్రుడైనటువంటి ములుకుట్ల వెంకటశాస్త్రి, కాకినాడ, అడ్వకేటు ఫైజ్ పూరు కాంగ్రెసుకు వెళ్లటం తటస్థించింది. అక్కడ ఎం. ఎన్. రాయ్‌ని చూసి, ఆయన చేసిన ఉపన్యాసంతో ప్రభావితుడై అతన్ని నా కోరిక మీద, ధనాభిలాష

కొద్ది ఆంధ్రదేశానికి రమ్మని ఆహ్వానించాడు. అది పురస్కరించుకుని ఆయన కాకినాడ వచ్చి పైడా వెంకటనారాయణగారింట్లో బసచేశారు, కొన్నాళ్ళు. అక్కడ వ్యాధిగ్రస్తుడైపోయినాడు. పాపం అక్కడుండగా నేను చూడటానికి వెళ్ళి విశాఖపట్టణం రావలసిందని, తగిన చికిత్స చేయించటానికి సదుపాయాలు అన్నీ ఉన్నాయి అని చెప్పి విశాఖపట్నానికి ఆహ్వానించాను.

అదే సమయంలో యూరప్ నుంచి ఆయన సతీమణి ఎల్లెన్. రాయ్ గారు కూడా రావటం తటస్థించింది. ఆమె పనిచేయటంవల్లనే ఆయన అస్వస్థత నుంచి కోలుకొన్నారు. వారిద్దరూ కలిసి విశాఖపట్టణం నాకు అతిథులుగా రాగలి గారు.

మా యింటి పక్క నున్న బారిస్టర్ పోలిసెట్టి హనుమయ్యగారింట్లో వారికివిడిది చేసి, హాస్టల్లో ఆయన అభిప్రాయాలకు అనుకూలంగా ఉన్న విద్యార్థుల దగ్గరనించి చిన్న చిన్న చందాలు పోగుచేసి, అప్పుడు హాస్టలు వార్డెన్‌గా ఉన్నటువంటి మామిడిపూడి వెంకటరంగయ్యగారి ద్వారా నేను దాదాపు నెలకు రెండు వందల యాభై రూపాయలు సంపాదించి, వారిని నా అతిథిగా దాదాపు ఆరు వారాలు అక్కడ ఉంచుకోగలిగాను. ఈ ఆరు వారాల్లో విజయనగరం, భీమునిపట్నం మొదలైనటువంటి పరిసర ప్రాంతాలకు ఆయన వెళ్ళటమూ, అక్కడ మహోపన్యాసాలు చెయ్యటం, అనేకమంది రాజకీయ వేత్తలతో పరిచయం కల్పించుకోవటం జరిగింది. అక్కడ ఉన్నప్పుడే భోగరాజు పట్టాభి సీతారామయ్య గారు, దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు, వెంకట్రామయ్యగారు మొదలైన పెద్దలెందరో అయన్ను సందర్శించి, ఆయన అభిప్రాయాలను అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించారు. ఆయనతో నాకు సంపూర్ణమైనటువంటి సాహచర్యం లభించటం వల్ల ఆయనయందు గౌరవం చాలా ఇనుమడించింది. ఆ ఆరువారాల్లోనూ ప్రతి నిత్యం ఆయనతో ఏకాంతంగా సంభాషణలు చెయ్యటానికి అవకాశం కలగటం వల్ల ఆయన లక్ష్యశుద్ధిని, ఆయన అభిప్రాయాల్ని, గౌరవించి, వారి అభిప్రాయాల వల్ల ఎంతో నేను ప్రభావితుణ్ణై నా జీవితమంతా కూడా ఒక మలుపు తిరిగినట్లు భావించాను.

ఆయన చాలా సహనశీలి. అంటే పరప్రత్యయ పరాఙ్ముఖుడు కాదు. ఆయన నిష్కల్మషమైనటువంటి భౌతిక వాది. అందులో ఏ విధమైనటువంటి

రాజీ కూడా లేదు. కాని, నాకు చాలా పెద్ద అస్వస్థత చేసినప్పుడు నాకాయన ఉత్తరం రాశాడు : "భగవంతుడనే వాడు కనక ఉన్నట్లయితే నువ్వు తొందరగా కోలుకోవాలి, అని ప్రార్థిస్తున్నాను" అని. అది ఎంత సహనశీలాన్ని వ్యక్తం చేస్తుందో గమనించండి. రాజకీయ ప్రాతికూల్యం కూడా ఈ విధంగానే సహనంతో ఆయన సంభావించేవాడు. ఆయన తాత్త్విక చింతన స్రవంతి ఒకచోట మలుపు తిరిగినా, మలినమైపోకుండా ధారావాహికంగా నిరంతరమూ కొత్త లక్ష్యాల కోసం అన్వేషిస్తూ, ప్రవహిస్తూనే ఉండేది. అది ఎక్కడా ఒక్కచోట నిలిచిపోయేటట్టిది కాదు. అందువల్లనే ఆయనగురించి నేను చెప్పుకొన్నాను.

"హేతువు సేతువుగా భవపారావారము తరించి, పయనించే త్రోవకు జిజ్ఞాసువులను చేరబిలిచి, అసంఖ్యేయ భారతీయ మనోమందిరాల నిలిపి విజ్ఞాన ప్రదీపాన్ని నవమానవతా జ్యోతిని మహామతీ! మానవేంద్ర ! నీ చరితము అజరామరము నీ అనుయాయులెసీవై సాగింతురు నీ సమరం''.

(ఈ కాలపు రచయితలకు మీ సందేశం ఏమిటి ?)

ఒకతను—మా ఊళ్ళో అనాథశరణాలయం పెట్టాం —మీ సందేశం పంపించండి అంటే, ఇద్దరు అనాథల్ని పంపించాడట. ఆ విధంగా నేను ఇప్పుడు ఏ ఉపదేశం చేసినా, ఇప్పుడున్న ఉపదేశాల సహస్రంలో ఒక భాగంగా మనస్సును కొంచెం కలత పరుస్తుందే కాని, అంతకన్నా ఏమీ మేలు చేకూరుస్తుందనుకోవటంలేదు.

అయినా మా కాలంలో మేము రాసేటప్పుడు ఇంత ఆడంబరం లేదు. ఎవరికి వారు రాసుకోవటం ఆ రాసింది సహృదయు లెవరన్నా ఏ దూరదేశంలో ఉన్నాకాని వారితో సంబంధం కల్పించుకోవటం జరుగుతోండేది. కాని ఇప్పుడు సన్మానాలు, ఈ అంకితాలు మొదలైనవి చాలా విరివిగా కలగటంచేత ఏది మంచి ? ఏది చెడ్డ ? ఎవరు ప్రసిద్ధుడు ? ఎవరు అప్రసిద్ధుడు ? నిర్ణయించటానికి వీలులేని ఒక గందరగోళం కింద ఏర్పడిపోయింది.

ఆ విధంగా నేను నేటి యువతరం వారికి సందేశం ఈయటం అనేది కొంత వరకు అసంగతంగానే కనబడుతున్నది.

ఎందుకంటే నేటి యువతరం వారికి పెద్దలమీద గౌరవం చాలమటుకు సన్నగిల్లింది. అది వారి అపరాధ మనటానికి వీల్లేదు. పెద్దల అపరాధం అనటానికి వీల్లేదు. పరస్పరం అవగాహన చేసుకొనే శక్తి ఉభయుల్లోనూ నశించిన కారణం అయివుంటుంది.

తరవాత, సందేశం అనేది చెప్పటానికి పెద్దలున్నారు. 'హితం మనోహరి చ దుర్లభం వచః"అని ఏ ఉపదేశం చేసినా అది హితంగానూ మనోహరంగానూ ఉండడం చాలా కష్టం. దుర్లభం అన్నారు గాని అసంభవం అని మాత్రం అన లేదు. అలా హితంగానూ మనోహరంగానూ చెప్పగలిగిన మహామతులు కొంత మంది ఉంటారు. వారు సందేశం ఇవ్వవచ్చు.

కాని, నామటుకు నేను యువతరం వారి మనోవ్యాపారం ఎలా ఉందో గ్రహించటానికి ప్రయత్నం చేస్తాగాని వారికి సందేశం ఇయ్యటానికి నేనెప్పుడూ సంకల్పించుకోలేదు.

అందువల్ల నా యీ రెండు ముక్కలూ వయోవృద్ధులైన నాబోటివారికి సందేశంగా భావించవలసిందేగాని, యువతరానికి కాదు.

యువతరాన్నుంచి సందేశం నేనే ఆర్థించేటటువంటి అభ్యాసం కలవాణ్ణి.

(1974లో రేడియోప్రసారం కోసం అబ్బూరిని యింటర్వ్యూచేసి రికార్డు చేసిన ప్రసంగపాఠంలో రెండవభాగం. మొదటిభాగం లభ్యంకాలేదు. ఈ రెండూ విజయవాడ రేడియో కేంద్రంలోని archives లో భద్రపరిచారని వింటున్నాను. ఈ రెండుభాగాల్లోనించి యేరిన అబ్బూరి జీవితాంశాలను రసమంజరి కార్యక్రమంలో రేడియో నుంచి ప్రసారంచేశారు. అబ్బూరిని మొదట వాల్తేరులోనూ, తరవాత హైదరాబాదులోనూ యింటర్వ్యూచేసి రెండు కేసెట్లలో రికార్డుచేశారు, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు. మొదటి కేసెట్టులో అబ్బూరి బాల్యం రవీంద్రునితో పరిచయం, తత్పరిణామరూపమైన వైముఖ్యం, సంస్కృత కవితాభినివేశం, కొన్ని సంస్కృత శ్లోకాల ఉదాహరణలూ ఉన్నవని ముందుగా యీ ప్రసంగ పాఠాన్ని సంపాదించిపెట్టిన ఏల్చూరి మురళీధరరావు చెప్పగా విన్నాము.

ప్రశ్నలు వేసింది బాలాంత్రపు రజనీకాంతరావుగారు. వారి ప్రశ్నలను బ్రాకెట్లలో సూచించాం.

ఈ ప్రసంగపాఠాన్ని శ్రమకోర్చి మా కందచేసిన శ్రీ ఏల్చూరి మురళీధరరావుకు, శ్రీ పన్నాల సుబ్రహ్మణ్యభట్టుకు మా కృతజ్ఞత. సం॥)

# అనితర సాధ్యమైన ప్రతిభ

అలసిపోయి, పాతఅలవాట్ల చొప్పున చెట్టాపట్టాలు పట్టుకుని, ప్రతిరచన లోనూ ప్రత్యక్షమయ్యే తెలుగు పలుకుబళ్ళకు జీవంపోసి విలక్షణమైన మేళవింపులతో కొత్తదనాన్నీ, కమ్మదనాన్నీ, ధ్వనిసంపదనూ కల్పించి కావ్యప్రౌఢిని పాటించే శిల్పంలో అనితరసాధ్యమైన ప్రతిభ చూపినవారు శ్రీ దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి. ఆతని సన్మానవార్త విని ఆనందించని వారెవరుంటారు?

అబ్బూరి రామకృష్ణరావు
(కృష్ణశాస్త్రి కవితాస్వర్ణోత్సవ సంచిక)

చెన్నపట్నం,
9-10-1942.

.................................

మీరు పంపిన 'సాంధ్యగీతి' అనే నాటికను కార్యాంతర్నిమగ్నుడనై ఉండడంవల్ల తీరికగా చదువలేకపోయినా, ఆమూలాగ్రముగా ఒకసారి చూచాను. అందులోని సన్నివేశాలు ఉత్తమనాటక రచనకు యోగ్యంగానే ఉన్నవని నాకు తోచినవి. సాహిత్యప్రపంచంలో నాటకము ఉత్తమోత్తమమైన కావ్యరూపమని రసికులందరు భావించడంచేత, లోకమంతటా నాటక వ్యవసాయం విరివిగా జరుగుతున్నది. కాని ప్రయోగయోగ్యాలైన నాటకాలు అరుదుగానే ఉన్నవి. ఇది సహజమే. లోకంలో మహాకవులుకూడా ఎందరో లేరుకదా! ఈ ప్రయత్నాలన్నీ రానున్న మహాకవికీ రాబోయే మహాకావ్యానికీ దారితీసినా వీటి ప్రయోజనం చాలా గొప్పదిగా మనం భావించాలి. సూర్యచంద్రులు రచించిన యీ ప్రథమ నాటికలో ఇలాటి ప్రయత్నం స్పష్టంగా గోచరిస్తున్నదని నా అభిప్రాయం. వస్తూన్మీల

నానికీ, రచనా విధానానికీ సంబంధించిన ఉత్తమసంప్రదాయాలను అన్నిటిసీ శ్రద్ధతో పాటించి కృషిచేస్తే యీ యువకవులు ముందుముందు రసవంతము లైన ఉదాత్తనాటకాలను వ్రాయగలరని నా విశ్వాసము.

........ - ................

(శ్రీ జమ్మలమడక సూర్యప్రకాశరావు, శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు, కలిసి 'సూర్యచంద్రులు' అనే కలం పేరుతో రాసిన "సాంధ్యగీతి" అనే ఏకాంక రూపకానికి రాసిన పరిచయ వాక్యాలు ఇవి. సాధన సమితి సికింద్రాబాదు వారు 1942లో ఈ రూపకాన్ని ప్రచురించారు_సం).

అబ్బూరి రామకృష్ణరావు

# మనవి

విశాఖ రచయితలసంఘం దాదాపు పదేళ్ళక్రిందట ఆరంభమై నేటివరకూ నిరంతరాయంగా తెనుగువాఙ్మయాన్ని పరిపుష్టంచేయడానికి ప్రయత్నిస్తున్నది. ఇందున్న సభ్యులందరూ ఆరంభంలో తెనుగుపాఠకలోకానికి కొత్తవారు. కేవలం ఆంధ్రవాఙ్మయరంగంలో సుప్రతిష్ఠితులైనవారి ఆశీర్వాదబలంవల్ల కాక, తమకు తామే శక్తిమంతాలైన రచనలతో పాఠకలోకాన్ని ఆకర్షించి వారి మన్ననలకు పాత్రులు కాగలుగుతున్నారు. వీరెవ్వరిలోనూ అవాంఛనీయమైన పాక్షికభావం కని పించదు. ప్రాంతీయ గౌరవంకోసం ప్రాకులాటలేదు. అందువల్లనే అన్యప్రాంతాల నుంచి వచ్చి ఇక్కడస్థిర నివాసం యేర్పరచుకొన్న నాలాంటివారికి వీరుసన్ని హితులూ, ఆప్తమిత్రులుగా వున్నారు. సహృదయుల సాంగత్యంవల్ల లభించే సాహిత్యతత్పరతే వీరి ప్రధాన లక్ష్యం.

కాని వీరి రచనలలో ఒక అపూర్వమైన విశిష్టతలేకపోలేదు. శ్రీ గురజాడ అప్పారావుగారి రచనలు యావదాంధ్రదేశంలోనూ విస్తరించిన తర్వాత ఈ ప్రాంతంలో వాడుకయందున్న తెనుగులోగల సౌకుమార్యమూ, జాతీయాలతో నిండిన చిక్కదనమూ ఎందరినో మురిపించినవి. ఇలా అనడంలో ఒక ప్రాంతపు భాషకూ వేరొకప్రాంతపు భాషకూ ఎక్కువతక్కువలను నిర్ణయించవలసిన అవకాశంలేదు. నానాటికీ వర్ధమానమౌతున్న ఆంధ్రుల ఏకోన్ముఖత్వానికి ఫలితంగా యెన్నడో ఒకనాడు మన మాండలికభాషా వ్యవహారాలన్నీ ఆంధ్రులన్నవారం దరికీ ఉపాదేయాలు కాక తప్పదు. అంతవరకూ వివిధప్రాంతాలలోవున్న ఉత్తమ భాషా ప్రయోగరీతులు అన్నీ వారివారి రచనలలో ప్రతిఫలింపకమానవు. శ్రీ శ్రీ, బలివాడ, రాచకొండ మొదలైన వారిలో ఈ విశిష్టత సువ్యక్తంగా వున్నది.

అంతేకాదు. తమతమ స్వంతరచనలనే ప్రధానంగా భావించక అను దినమూ ఆవిష్కృతమౌతూవున్న రచనా సముదాయాన్ని సేకరించి, పరిశీలించి,

విభాగించి, పట్టికలు తయారు చేయడంకూడా వీరు తలపెట్టిన పనులలో ముఖ్య మైనది. ఆత్మాశ్రయ దృష్టితో అన్యుల రచనలను విమర్శించడమూ, తమ కజ్ఞా తంగావున్న వాఙ్మయాన్ని అసలు లేనేలేదన్నట్లుగా నిర్ధారణచేయడమూ పరి పాటిగా వున్న యీ రోజులలో ఈలాటి నిష్పాక్షికమైన పరిశీలనంవల్ల యెందరో అజ్ఞాత రచయితలకు ఆత్మాభిమానాన్ని కలిగించడానికి ఈ కృషియెంతో ఉప కారకమౌతుంది.

"రచన" ఈయేటి వార్షికోత్సవ సందర్భంలో సాహితీబద్ధమైన వినమ్రతతో అర్పించిన కానుక. ఈ సంచికను నియమిత సమయాలలో తరచుగా ప్రకటించ వలెననే కోరిక గాఢంగా సభ్యులందరికీ వున్నది. దీనితోపాటు ఆ మంచివేళ కోసం వేచివుండగల సహనమూ, శ్రద్ధావిశ్వాసాలుకూడా వుండడంవల్ల వారి ప్రయత్నం ఫలప్రదం కాగలదనంటలో సందేహముండదనుకుంటాను.

(రచన—విశాఖ రచయితల సంఘ వార్షికోత్సవ ప్రత్యేక సంచిక, 1 ఏప్రిల్ 1957)

అబ్బూరి రామకృష్ణరావు

# మేమూ-మా లక్ష్యాలూ

విశాఖ రచయితల సంఘం దాదాపు పదేళ్లనుంచీ తెలుగు వాఙ్మయ రంగంలో యథాశక్తిగా కృషి సాగిస్తున్నది. కడచిన వార్షికోత్సవగోష్ఠిలో జరిగిన చర్చల ఫలితంగా ఈ సంఘం తన లక్ష్యాలను మరోసారి విస్పష్టంగా నిర్వచించుకోడం జరిగింది. కేవలం రసవద్రచనల విషయంలోనే కాక, అలాటి రచనలకు పుష్టిచేకూర్చే భాషావిషయికమైన కృషిలోకూడా శ్రద్ధాసక్తులు చూపవలసిన ఆవశ్యకతను గుర్తించింది.

నేటి తెలుగు వాఙ్మయంలో ఉన్న అవ్యవస్థను తొలగించడానికి దేశ వ్యాప్తంగా సాహితీపరులందరూ కొనసాగించవలసిన కృషినిగురించి ఆ సందర్భంలో ప్రకటించిన నివేదికలో ఈ విధంగా సూచించింది :

"ఏనాడో నన్నయ కాలంలో శాసించి, నేటివరకూ కేవలం పద్యరచనానుకూలంగానే వివృద్ధమవుతూ వచ్చిన తెలుగుభాష వచనరచనకు ప్రతిబంధకంగా తోచడంవల్ల గిడుగువారు శిష్టవ్యావహారిక భాషావాదాన్ని లేవదీయడం జరిగింది. బహుళ ప్రచార ఫలితంగా వారివాదం అనేకుల ఆదరానికి పాత్రమై వెనుకటి భాషా నియమాలను విచ్ఛిన్నం చేయగలిగినా, ఆ స్థానంలో వచనరచనను పరిపుష్టం చేయగల నూతన నియమాలను మాత్రం నెలకొల్పలేకపోయింది. ప్రపంచ విజ్ఞానాన్నంతా తెలుగులోకి తెచ్చుకోవలసిఉన్న ఈ తరుణంలో సర్వవిధాలైన భావచ్ఛాయలనూ వ్యక్తంచేయగల పటిష్ఠమైన భాషగా తెలుగును తీర్చిదిద్దుకోవాలి. అందుకు ప్రామాణిక భాషా స్వరూప నిర్ణయం వెంటనే జరగాలి.

"దీనితోపాటు కవిత్రయం వారి గ్రంథాలకే కాక ఇతర ప్రామాణికాంధ్ర కవులందరి గ్రంథాలకూ వాటిలో ప్రయోగించిన పదాలన్నిటినీ క్రోడీకరించే పద

ప్రయోగ సూచికలుకూడా తయారుచేసుకోవాలి. అట్టి సూచికలు లేనిదే మన భాషా పరిణామక్రమం విస్పష్టంకాదు.

"అటువంటి పదప్రయోగ సూచికలవల్ల గ్రంథస్థ పదజాలాని కంతటికీ సమగ్రమైన వ్యుత్పత్తి నిఘంటువుకూడా సుకరమవుతుంది.

"క్రమంగా గ్రంథస్థాలు కాక కేవలం వ్యవహారంలోనే ఉన్నమాండలిక పదప్రయోగాల నిఘంటువులుకూడా నిర్మించుకోవలసి వుంది.

"భాషా రంగంలోనేకాక, సాహిత్యంలోకూడా నేడు కనిపిస్తూన్న అవ్యవస్థ పోవాలంటే, రాగద్వేష విరహితమూ, సహృదయతా ప్రేరితమూ అయిన ఉత్తమ సాహిత్యవిమర్శ రావాలి. ప్రాక్ ప్రతీచీ సాహిత్యతత్త్వ విచారాన్ని సమన్వయం చేసే కృషి జరగాలి.

"ఆధునికాంధ్ర వాఙ్మయం ఆరంభమై దాదాపు శతాబ్దం గడిచింది. ఏదో విధమైన గ్రంథరచన అవిరళంగా సాగుతూనే వస్తున్నది. అయినా, పూర్వ వాఙ్మయ స్వరూప సింహావలోకనానికి ఆవశ్యకాలైన పరిశీలక గ్రంథాలుగాని, సమాలోచక గ్రంథాలుగాని లేకపోవడంవల్ల ఆధునికాంధ్రవాఙ్మయానికి సత్సం ప్రదాయాలను ఏర్పరుచుకోగల శక్తి మనలో లోపించింది. మన వాఙ్మయంలో ఏయే శాఖలలో పుష్టి కొరవడిందో తేల్చుకోగల సాధనం మనకు లేకుండాపోయింది. జిజ్ఞాసువులైన ఆంధ్రేతరులు తెలుగువాఙ్మయాన్నిగూర్చి అడిగే ప్రశ్నలకు ఎంతగొప్ప ఆంధ్ర విద్వాంసుడైనా తగిన సమాధానం ఈయజాలని దుస్థితి ఏర్ప డింది. ఇప్పటికైనా ఈ కొరత తీర్చుకోవాలంటే తెలుగులో నేటివరకూ వచ్చిన ముద్రితాముద్రిత గ్రంథ జాలాన్నంతటినీ వర్గీకరించిన సమగ్ర వాఙ్మయ పట్టికలు తయారుచేసుకోవాలి".

ఈ ఆశయాలను కొంతవరకైనా సాధించేందుకు అనువైన కార్యక్రమాన్ని నిర్ణయించడానికి విశాఖ రచయితల సంఘం కడచిన సెప్టెంబరు ఒకటో తేదీన కొన్ని ఉపసంఘాలు నియమించింది. ఆ ఉపసంఘాలు ఉత్సాహంతో పని చేసి కొన్ని పద్ధతులను సూచించినవి. వాటిని అనుసరించి సభ్యులందరూ తమ తమ విశ్రాంతి సమయాలలో పనిచేసి అన్ని శాఖలలోను కొంత పురోగతిని సాధించగలిగారు.

నేటి తెనుగు రచనా వ్యవహారంలో బహుజనాంగీకార యోగ్యాలైన నియామాలేవీ లేకపోవడంవల్ల కలిగిన అవ్యవస్థ కారణంగా రచయితలలో ఏదో ఒక విధమైన అసంతృప్తి కనిపిస్తూనే ఉంది. అలాంటి నియమాలేర్పడాలంటే తెలుగుదేశం నానా ప్రాంతాలలోనూ వ్యవహార సిద్ధంగా ఉన్న మాండలిక భాషా నిర్మాణాన్ని ముందుగా పరిశీలించాలి. అప్పుడుగాని అఖండ రూపంలో రచనానుకూలమైన ప్రమాణాంధ్రభాషాస్వరూపం గోచరించదు. ఈ దృష్టితో విశాఖ రచయితలు కొందరు ఇందుకు కావలసిన భాషా సామగ్రిని సంకలనం చేయడంలో నిమగ్నులై ఉన్నారు.

మరికొందరు నన్నయ భారత భాగానికి పదప్రయోగసూచి నిర్మించడానికి పూనుకొని, ఇప్పటికప్పుడే కొన్ని ఆశ్వాసాలను పూర్తిచేయగలిగారు.

దీనితోపాటు వేర్వేరు వృత్తులకు సంబంధించిన పదజాలాన్నీ, మాండలికాలనూ వీలైనంతవరకు ప్రయోగాలతో సహా కొంతమంది సేకరిస్తున్నారు.

ఈ శతాబ్దంలో తెలుగులో వచ్చిన కావ్యనాటక కథానికల పట్టికలు ముఖ్యమైన వివరాలన్నిటితోనూ కూర్చే ఉద్యమం కూడా సక్రమంగా సాగుతున్నది.

ఈ పనులన్నిటినీ నిర్వహించటానికి పూనుకొన్న జిజ్ఞాసువులందరూ తెలుగు వాఙ్మయ శ్రేయస్సునే ప్రధానంగా భావించి, ఏ విధమైన పట్టుదలలూ పాటించక, ఆయా శాఖలలో నిష్ణాతులైన విద్వాంసుల ఉపదేశాన్ని, మనోహరంగా లేకపోయినా హితంగా ఉంటే శిరసావహించటానికి సిద్ధంగా ఉన్నారు. ఈ సంచికలో సంపాదించి ప్రకటించిన ఉదాహరణాలన్నీ సూచనప్రాయాలే కాని, మార్చటానికి వీల్లేని పద్ధతులకు ప్రతిబింబాలు కావు. భావుకులు మాయీ పూనికనూ, మే మనుసరిస్తున్న కార్యాచరణ విధానాలనూ సావధానంగా పరిశీలించి, ఉద్దిష్ట కార్యసిద్ధి కనుకూలించే సూచనలు అందజేస్తారని ఆశిస్తున్నాం.

("విశాఖ సాహితి" సంపాదకీయం. విశాఖ రచయితల సంఘ వృత్తాంత నివేదిక— మార్గశీర్షం 14, 1879 (15—12—1957), సంపాదకుడు : అబ్బూరి రామకృష్ణరావు).

అబ్బూరి రామకృష్ణరావు

# ప రి చ య ం

పంధొమ్మిది వందల పదమూడు నవంబరు నెలలో రవీంద్రనాథ్ ఠాకూర్ రాసిన 'గీతాంజలి'కి నోబెల్ బహుమానం లభించింది. అంతవరకూ యితర భారతీయ భాషా ప్రాంతాలలో వంగ సాహిత్యాన్ని గురించిగాని, రవీంద్రుడి కవితా ప్రతిభని గురించిగాని యెవరికీ యెక్కువగా తెలియదనే చెప్పాలి. ఆ కొత్త రోజులలో నా జన్మస్థలమైన అనంతవరం గ్రామానికి ఏదో శతావధాన సందర్భంగా వచ్చిన శ్రీ దివాకర్ల తిరుపతి శాస్త్రితో కలిసి శ్రీ రాయప్రోలు సుబ్బారావూ, నేను గ్రామాంతరానికి నడిచి వెళుతూ ఉండగా గీతాంజలి ప్రసక్తి రావడం నాకింకా జ్ఞాపకం ఉంది. అంతకు కొద్ది రోజులముందే ఆంగ్ల గీతాంజలికి శ్రీ ఆదిపూడి సోమనాథరావు ఆంధ్రానువాదం వచ్చింది. ఆ అనువాదంతో కొంత భాగం చదివి శ్రీ తిరుపతిశాస్త్రి "మహాకవిగా చెప్పుకోదగ్గ సారస్యం యిందులో ఏమీ కనిపించదే!'' అన్నాడు. అప్పుడు నేనూ, శ్రీ సుబ్బారావూ వంగమాతృకలో వున్న శబ్ద మాధుర్యంతోగాని, భావవైశద్యంతోగాని పరిచయం లేకపోవటంవల్లా, కేవలం ఆంగ్లానువాదానికి అనువాదంగా వచ్చిన రచన కావటంవల్లా, రవీంద్రుడి భావ ధోరణి సన్నిహితం కాకపోవటంవల్లా కావ్య గౌరవాన్ని పొందగలిగిన వైశిష్ట్యం దీనిలో లోపించి ఉండవచ్చు". అన్నాం. ఆనాటినుంచి నేటివరకూ నా యెరిగినంతలో 'గీతాంజలి'కి తెనుగులో అయిదారు అనువాదాలొచ్చాయి. కాని యీ గీతాలన్నీ వంగ భాషలోనే చదివి అనందించే భాగ్యం నాకు కలగటంవల్ల ఆ అనువాదాలలో ఏదీ నాకు తగినంతగా తృప్తి నియ్యలేదు. పైగా యీ అనువాదాలన్నీ సరాసరి వంగ మాతృకనుంచి కాక, వంగ మాతృకలోవున్న ఛంద స్సౌందర్యమూ, భావశబలతా లుప్తమైన ఆంగ్లానువాదానికి అనువాదాలు కావటం యీ అసంతృప్తికి కొంత కారణం కావచ్చు.

రవీంద్రుడు తన ముప్పయ్యో యేటినుంచి యాభైరెండో యేటి దాకా ప్రకటించిన పది కావ్య సంపుటాలనుంచి సేకరించిన నూట మూడు గీతాల

సంకలనమే 'గీతాంజలి'గా విశ్వవిఖ్యాతి పొందిన యీ గ్రంథం. వంగ 'గీతాంజలి' నుంచి యాభయ్యొకటీ, 'గీతామాల్య' నుంచి పదిహేడూ, 'ఖేయా' నుంచి పదకొండూ, 'శిశు' నుంచి మూడు, 'చైతాలి', 'ఉత్సర్గ' 'స్మరణ్', 'అచలాయతన్' వీటి నుంచి ఒక్కొక్కటి యీ సంకలనంలో చేరాయి.

ఆత్మానుభూతమైన ఆధ్యాత్మిక చింతనమే యీ గీతాలలో ప్రధాన వస్తువు. పరంపరాగతంగా భారతీయ సంప్రదాయంలో వ్యక్తమయ్యే రూపకల్పన ఇందులో గోచరించదు. అందువల్లనే కొందరు వంగవిమర్శకులు రవీంద్రుడి రచనా ధోరణి భారతీయేతర సంప్రదాయాలకే ఎక్కువ సన్నిహితమనీ, ఆ కారణంవల్ల అతని ఆంగ్లానువాదాలలో వున్న సౌందర్యం వంగ మాతృకలలో గోచరించదనీ అన్నారు. ఇది కొంతవరకు అత్యుక్తి అయినా, వంగకవితాసంప్రదాయంలో ఆయన తెచ్చిన కొత్తదనాన్ని సూచించటంవల్ల పూర్తిగా సత్యదూరంకాదనే చెప్పాలి.

నిరాకారమూ, నిర్గుణమూ అయిన పరతత్వానుభూతి యీ గీతాలలో అభివర్ణితమైంది. ఈ అనుభూతితో ఏది ఋతమో, ఏది అనృతమో నిర్ణయించటం సజాతీయమయిన అనుభూతిగలవారికి తప్ప యితరులకు సాధ్యంకాదు. కలకత్తాలో వంగభాష అభ్యసించే రోజులలో రవీంద్రుని గీతాలు ప్రజారంజకంగా ఉండటం చూసి, అదే మోస్తరుగా కొన్ని ప్రతికృతులూ తయారుచేసి, ప్రకటిస్తూన్న కొందరు యువకవులను నేనెరుగుదును.

"వేజె హొషె ఏషె బోషె ఛిలో తబు జాగినీ
కీ ఘూమ్ తోర పేయే ఛిలో హతాభాగినీ"

(నా సఖు దరుదెంచి శయ్యా
నాసీనుండైనను నే
నటులె నిదురవోతి నెంత
హతభాగినినో! (—26వ గీతం)

అని రవీంద్రుడంటే—

"చెలికా దరుదెంచి ద్వార
సీమ నిలిచి నన్ను పిలువ

పలుకనైతి నెంతటి హత
భాగ్యురాలనో !''

అని వొక యువకవి అంటాడు. ఇలాంటి రచనలలో ఎందులో నిజాయితీ వుందో, ఎందులో లేదో సమాన ధర్మంగల సహృదయులకే వేద్యం అవుతుంది. అలాంటి సమాన ధర్మం నాకున్నదని నేను భావించకపోవటంవల్ల ఎవరు రాసినా, అనువాదాలు మూలానుబోధంగా లేకపోవటం నేను దోషంగానే భావిస్తున్నాను.

"కావ్యానికి కావ్యమే పూర్ణవ్యాఖ్యాన" మన్నట్టుగా యీ అనువాదాలు కూడా కావ్యత్వగౌరవం పొందగలిగితేనే కాని తృప్తినియ్యవు. అందుకే ఆంగ్లానువాదంలో కొన్ని భాగాలను పరిహరించీ, కొన్నిటిని కుంచించీ, విస్తరించీ అక్కడక్కడ రెండేసి గీతాలొక్క గీతంగా సంతరించీ, రవీంద్రుడు స్వతంత్రంగా రచన సాగించాడు. శ్రుతిసుఖాన్ని కల్పించే అంత్యప్రాసలతోనూ, శబ్దాలంకారాల తోనూ, గానయోగ్యమయిన గతితోనూ, అల్లిక జిగితోనూ వున్న మూలాన్ని ఆంగ్లంలోకి కేవల గద్యాత్మకంగానే అనువదించినా రెండు కృతులకూ కర్త వొక్కడే కావటంవల్ల భావోన్మీలనంలో కావ్యపుష్టి యేమాత్రమూ తగ్గలేదు. అందుచేత— యీ రెండు కృతులతోనూ సన్నిహితమయిన పరిచయం లేకపోయి నట్టయితే యితర భాషాంతరీకరణాలలో రవీంద్రుడి భావచ్ఛాయలు యథాతథంగా ఆవిష్కృతం కాకపోవచ్చు. ఇంతవరకూ వొచ్చిన తెలుగు అనువాదాలన్నీ ఆంగ్లానువాదానికి ప్రతికృతులు కావటంవల్ల మూలాపకర్షకంగానూ, తెలుగు నుడికారానికి దూరంగానూ వున్న పలుకుబళ్ళతోనిండి వింతగా కనిపిస్తున్నాయి.

ప్రకృతానువాదానికి కర్తలైన శ్రీ సింగరాచార్య యీ రెండు కృతులనూ పరిశీలించి తన రచన కుపక్రమించిన సూచనలు నా కక్కడక్కడ కనిపించాయి. ఛందోబద్ధమైన యీయన రచనలో రవీంద్రుడి భావగాంభీర్యమూ, సౌకుమార్యమూ, తెలుగు పాఠకులకు కొంతవరకు అందించగలిగారనే నేను భావిస్తున్నాను. ఏ అనువాదమైనా సరే పాఠకులలో మూలగ్రంథావలోకనకుతూహలాన్ని కలిగించగలిగితే అది చరితార్థమవుతుంది. అలాంటి అభిలాషకు యీ అనువాదం ప్రేరకమవుతూందని నేననుకుంటున్నాను.

ఒక్క గీతం చూద్దాం :

"అమార్ ఏయ్ పథచావ్వాతేయ్ ఆనంద
ఖేలే జాయ్ రౌద్ర ఛాయా వర్షా ఆసే వసంత

కారా ఏయ్ సముఖ్ దియే
ఆసే జాయ్ ఖబర్ నియే

ఖుషీ రయ్ ఆపన్—మనే వాతాస్ వహే సుమంద
సారా దిన్ ఆఁఖి మేలే దువారే రబా ఏకా
శుభక్షణ్ హఠాత్ ఏలే తఖని జాబొ దేఖా

తతొఖన్ క్షణే క్షణే
హాసి గాయ్ మనే మనే
తతొఖన్ రహి రహి భేసే ఆసే సుగంధ"

"ఈ మార్గాన్ని కోరుకొనటంలోనే నాకు ఆనందం, ఎండా, నీడా ఆడుతున్నాయి: వర్షర్తువూ వసంతమూ వొస్తున్నాయి. ఈనా యెదురుగుండా యెవరో వార్తలు తీసుకుని వస్తున్నారు. పోతున్నారు. గాలి సుమందంగా వీస్తున్నది. రోజల్లా నే నొక్కణ్ణీ చూడ్కులుసాఁకిస్తూ ద్వారంలో నిలిచివున్నాను. హఠాత్తుగా ఆశుభక్షణమే వొస్తే అప్పుడు నేను చూడగలగుతాను. అంతదాకా క్షణ క్షణమూ లోలోపల నవ్వుకుంటాను; పాడుకుంటాను. అంతదాకా సుగంధం వుండి వుండి తేలి వస్తుంది."

ఇది వంగ మాతృకకు నీరసమైన ప్రతిపదార్థచ్ఛాయ. ఈశ్వర సందర్శనౌత్సుక్యంతోవున్న వొక భక్తుడి మనఃప్రవృత్తి యీ గీతంలో వర్ణితమైంది. మార్గాన్ని నిర్ణయించుకున్న తరువాత గమ్యాన్ని చేరటానికి సందేహంలేదు. అదే అతడి ఆనందం. ఇందులో వాడిన శుభక్షణం రానున్న యీశ్వర సందర్శన క్షణమే: చివరి పాదంలో సుగంధం యీశ్వరసాన్నిధ్యంనుంచి భక్తుడివైపు యెడనెడ ప్రవహిస్తూ వొచ్చే అనుగ్రహానికి సంకేతం.

దీనికి ఆంగ్ల పాఠం :

"This is my delight, thus to wait and watch at the wayside where shadow chases light and the rain comes in the wake of summer.

Messengers, with tidings from unknown skies, greet me and speed along the road. My heart is glad within and the breath of the passing breeze is sweet.

From dawn till dusk I sit here before my door. and I know that of a sudden the happy moment will arrive when I shall see.

In the meanwhile I smile and sing all alone. In the meanwhile the air is filling with the perfume of promise".

ఈ గీతానికి శ్రీ గుడిపాటి వెంకటచలం అనువాదం :

"వెలుగుని చీకటి తరిమేచోట, గ్రీష్మం వెంటతగిలి వర్షం సమీపించేచోట. ఆ తోవ పక్కన ఎదురుచూస్తో కూచుని వుండడం నా ఆనందం.

అందని పినువీథుల్నించి ఏవో సందేశాలతో దూతలు నన్ను పలకరించి, వారి తోవన తొందరగా వెళ్ళిపోతున్నారు. నా లోపల, హృదయం సంతోషపడు తోంది; పక్కనించి పోయేగాలి వూపిరి మధురంగా వుంది.

పగటినించి రాత్రివరకు నా తలుపు వాకిట్లో ఇట్లా కూచునివుంటాను, నా కళ్లు తెరుచుకునే సంతోషసమయం ఆకస్మాత్తుగా వొస్తుందని నాకు తెలుసు.

ఈ లోపల నేను వొంటరిగా చిరునవ్వుతూ పాడుకుంటో వుంటాను. వాగ్దాన పరిమళాలతో గాలి నిండిపోతోంది."

ఇందులో "పగటినించి రాత్రివరకు", "తలుపు వాకిట్లో", "నాకళ్లు తెరుచుకునే సంతోషసమయం", "వాగ్దానపరిమళాలతో" మొదలైనవి— ఎంత భక్తి పారవశ్యంతో రాసినా,— ఆంగ్లానువాదంలో వున్న నుడికారాన్ని అపార్థం చేసుకోవటంవల్ల వొచ్చిన స్ఖాలిత్యాలనే చెప్పాలి.

దీనికి శ్రీసింగరాచార్య అనువాదం :

"వెలుగు నీడ ఎండ వాన చెలగాటము లాడుచోట
ఈ బాటను నిలిచి నిరీక్షించు టిదే వ్రతము నాకు

అజ్ఞాతాకాశదూత లభినందన దెలిపిపోవ
ఎరియు హృదిని మోదసుషము వీచు మధురమధుపవనము

అహరహ మీ ద్వారసీమ ఆశ నెదురుసూచుచుందు
అమరు స్వామిదర్శనభాగ్యము నేడిక తప్పదనుచు

అంతలోన నాలో నేనె ఆడి పాడి నవ్వుకొందు
చల్లని తెమ్మెర లాశాసౌరభ మందించి యేగు"

దీంట్లో కూడా ఆనందానికి "వ్రత" మని (4వ పంక్తి) వాడటం, చివరి రెండు పంక్తులూ వెనకటి రెండు పంక్తులతో సమన్వయించక పోవటం వంటివి కనిపిస్తున్నా, మొత్తంమీద యీ అనువాదకుడి రచనలో రవీంద్రుడి భావ వైలక్షణ్యం యితరానువాదాలలోకన్న యెక్కువ ప్రసన్నంగా ప్రతిఫలిస్తున్నది.

అనువదించటంలో వుండే సాధక బాధకాలను సూచించటానికి మాత్రమే స్థాలీపులాకంగా యీ తారతమ్యాలు చూపిస్తున్నాను.

శ్రీ సింగరాచార్య ప్రప్రథమంగా కవితా వ్యాసంగం చేసే రోజులలోనే వారి రచనలమీద నాకెంతో అభిమానం వుండేది. తన రచనలను తానే తీవ్రంగా విమర్శించుకోగల ధీరస్వభావం గలవాడు కావటంవల్ల రాసిన వెన్నో తోసి పుచ్చటం, కీర్తికామనకన్న కీర్తివైముఖ్యమే యెక్కువగా పాటించటం నే నెరుగుదును. తెనుగు పద్యం రమణీయంగా, శక్తిమంతగా నడపటంలో యీయ నకు చక్కని కౌశలం వున్నదని నేను భావిస్తున్నాను. ఈ అనువాదంలో కూడా—

"అలంకార భారములను
త్యజియించెను నా గీతము"

"మూఢమతీ ! నీ మూపున
నీవే యెటు లూరేగెదు ?"

"ఆ కమలము విరిసిన దినమున నే
నన్యమనస్కుడనై యుంటి నహో !"

"ఈ బికారి యెడద అలసి
యెందొ యొదిగియున్న వేళ
ద్వారమ్ముల నన్ని పగుల
దన్ని చక్రవర్తివోలె...దయసేయవె దేవదేవ !"

"నా కుటి కాటుకచీకటి కిరవై
నవయు నా కొనగగదె నీదీపిక"

"నాడు కనరాదు నా నీడేని ఈ పృథివి
నా ప్రాణవధువు వెన్నంటి చన పతివెంట"

ఇలాంటి స్వతంత్ర రచనలుగా తోచే చక్కని చరణా లెన్నో కనిపిస్తాయి.

చిరకాలం "జీర్ణమంగే సుభాషితమ్" అన్నట్టు మౌనంగా వుంటూ వచ్చినా, యీనాటికైనా మళ్ళీ తెలుగు సాహితీ వ్యవసాయాన్ని సాగించటానికి వుద్యమించిన శ్రీ సింగరాచార్యను సంతోషంతో సంభావించటం నా విధిగా నేను భావిస్తున్నాను.

ఇలాగే — స్వతంత్రమైన రచనలు కూడా ముందుముందు సాగిస్తే బాగుండును గదా అని నేను అనుకుంటూ వుంటాను.

వాల్తేరు, అబ్బూరి రామకృష్ణరావు
18—4—61.

(శ్రీ బొమ్మకంటి వేంకట సింగరాచార్య గీతాంజలికి చేసిన తెలుగు అనువాదం, కల్యాణీ ప్రచురణలు, వాల్తేరు వారు మే 1961లో ముద్రించారు. ఆ అనువాదానికి పరిచయం యిది—సం॥).

అబ్బూరి రామకృష్ణరావు

## కావ్యజగత్తు

ఆధునిక యుగంలో దాదాపు ఒక అర్ధశతాబ్దంనుంచీ తెనుగు సాహిత్యంలో తీవ్రమైన కృషి జరుగుతున్నప్పటికీ, విశ్వ సాహిత్యదృష్టిలో చెప్పుకోదగ్గ మహాకవిగాని, కావ్యంగాని నేటివరకూ అవతరించలేదు. దీనికి ప్రబలమైన కారణం లోకవృత్తానికీ, మన సాహిత్యానికీ కలిగిన లోకవిరోధం— ప్రాచీన పరిషత్తులకూ, నవ్య పరిషత్తులకూ గల భేదం విభక్తిప్రత్యయాల్లోనూ, క్రియా పదాల్లోనూ కొంత కనిపిస్తుంది కాని, అనంతంగా విస్తరించిన నూతన విజ్ఞానాన్ని ప్రతిబింబించడంలోగాని, "ఖిలముకాని" కృతులను నిర్మించడంలో గాని కనిపించదు. Escapism సాహిత్యానికి లక్ష్యమని అదొక గొప్పగా నేటివారు కొందరు చెప్పుకుంటున్నారు— శ్రీ కృష్ణరావుగారు వ్రాసిన "కావ్యజగత్తు" ఈ అపోహలను తొలగించి, లోకానికీ సాహిత్యానికీ మధ్య తెగిపోయిన సంబంధాన్ని పునరుద్ధరించడానికి ప్రయత్నించింది. ప్రాచీన అలంకారికమతాన్ని ఖండించే సందర్భాల్లోనూ, అదునాతన మనస్తత్వవేత్తల సిద్ధాంతాలు వివరించే చోట్లనూ, సామాన్య పాఠకులకు ఈ గ్రంథంలో కొంత అసంపూర్ణత కనిపించవచ్చు—కాని యీ విషయాలతో అదివరకే పరిచయం కలిగి కృష్ణరావుగారి ప్రధానవాదాన్ని అనుసరించే సహృదయులకు వారి విలక్షణమైన తత్త్వవిచారం స్పష్టంగా గోచరిస్తుంది—నూతనదృష్టితో కావ్యజగత్తును పరిశీలించి నూతన భావాలను ప్రేరేపించే యీ చిన్ని పుస్తకం విశేషంగా పొగడదగినది.

(జి. వి. కృష్ణరావుగారి 'కావ్యజగత్తు' గ్రంథం గురించిన అభిప్రాయం— 1942).

అబ్బూరి రామకృష్ణరావు

# నాకీ కావ్యం నచ్చింది

'కావ్యానికి కావ్యమే పూర్ణవ్యాఖ్యానం' అనే ప్రాచీన సంప్రదాయానికి అనుగుణంగా ఉత్తమ కావ్యప్రశంస మరొక కావ్యం వ్రాయడంవల్ల కాని కొనసాగదు. కావ్యంలోని సాధుత్వ అసాధుత్వాలను నిర్ణయించడానికి ప్రమాణం ఏదీలేదనే చెప్పాలి— సహృదయుల అంతఃకరణ ప్రవృత్తితప్ప!

మహాకవి రవీంద్రుని గూర్చిన ఒక చిన్నగాథ నాకు జ్ఞాపకం వస్తోంది. రవీంద్రు డొకనాటి సాయంకాలం పద్మానదిలో ఒక చిన్ని విలాసనౌకలో విహారం చేస్తున్నాడు. ఆ పడవలో తానూ సరంగూతప్ప వేరెవరూ లేరు. నదికి రెండు వైపుల్లో రమణీయమైన తరులతా పంక్తులు గాలిలో కదులుతూ ఉన్నవి. పడవ మెల్లగా సాగిపోతోంది. ఉన్నట్టుండి అకస్మాత్తుగా అలలులేని ఆనదీజలాలపైకి మిలమిలలాడే ఒక తెల్లనిచేప ముచ్చటగా తలయెత్తి ఒకత్రుటిలో తిరిగి అంతర్ధానమైంది. ఆ దృశ్యాన్ని చూసి రవీంద్రుడు ముగ్ధుడైనాడు. ఈ మానవలోకం లాంటిదే సుఖదుఃఖభాజనమైనదీ, రమణీయమైనదీ ఒక ప్రాణిలోకం జలాంతర్భాగంలో కూడా ఉండడం మననంచేసికొని అంతర్ముఖుడైనాడు! ఆదృశ్యాన్ని సరంగుకూడా చూశాడు. 'అరే— ఎంతచక్కనిచేప' అనుకొన్నాడు. ఇంకా కొంత సమీపంలోకి అది రాగల్గితే తనచేత చిక్కేదికదా అని, ఆ రాత్రి తనకూ రుచికరమైన భోజనము లభించేదికదా అని అతని ఊహ! ఒకే దృశ్యాన్ని ఇద్దరు వ్యక్తులు చూడడం, వారిద్దరూ భిన్నమైన అనుభూతిని పొందడం జరిగింది. కావ్యరసాస్వాదన విషయంలోకూడా ఇలాంటిదే రుచివైవిధ్యం కనిపిస్తుంది. కావ్యంలో ఉండే రామణీయకం కేవలం సహృదయులకే వేద్యమౌతుందని పెద్దలంటారు. నాకీకావ్యం నచ్చింది. దీనికి కారణం ఇంతకన్న వివరించి చెప్పలేను.

ఎందరో ప్రసిద్ధులుండగా కవిపదవాచ్యుణ్ణే కానని తరుచూ భావిస్తూ ఉండే నన్ను ఈ రచయిత తన కావ్యాన్ని సమీక్షచేయవలసిందిగా కోరడం నాకేకాదు

ఈ కావ్యాన్ని చదువబోయే వారందరికీకూడా విస్మయం కలిగించవచ్చు. దీనికి కేవలం మైత్రి కారణం. అందులో అంతర్నిహితంగా ఉన్న సహృదయతకూడా ఒక కారణం కావచ్చు. ఇతని గురుపాదులు శ్రీ కోపల్లె శివకామేశ్వరరావు నా సహధ్యాయి కావడం, కృతికర్త చిరంజీవి భాస్కరరావు నా కాప్తుడుకావడం, మేమందరమూ సన్నిహితమిత్రులం కావడం ఇంకోకారణం కావచ్చు.

ఈ కావ్యంలోని ఛందస్సు నన్నాకర్షించింది. ఆరుమాత్రల గణాలతో అల్లిన చిన్ని చిన్ని చరణాలతో, ప్రతి చరణాంతంలోనూ నియతంగా యతిని పాటించే నిండుదనంతో, జాతీయమైన తియ్యని జానుతెనుగులో ఈ రచనసాగింది. యతి అంటే విశ్రాంతి అని మన ఛందోవేత్తల అభిప్రాయం. దీన్ని దీర్ఘపాదాలు గల వృత్తాలలో పాదమధ్యంలోనూ, విధిగా అన్ని వృత్తాలకు పాదాంతంలోనూ నియమించారు. దీనివల్ల పద్యార్థం సుబోధంకావడం వృత్తం పఠనయోగ్యం కావడం జరుగుతుంది. ఇందుకుభిన్నంగా నన్నయనుంచి నేటివరకూ మనకవు లందరూ అక్షరానికి అక్షరం రావడమే యతిగా భావించడంవల్ల తెలుగుపద్యం "హేయదశ"లో ఉన్నదనిభావించే వారిలో నేనుగూడా ఒకణ్ణి. అందువల్ల ఈ 'పణవిపణి'లో పద్యాలు చాలవరకు ఉచితస్థానాల్లో విశ్రాంతిని పాటించడం కారణంగా శ్రవణయోగ్యంగానూ, సుబోధంగానూ ఉన్నవని నేను భావిస్తున్నాను. అంతేకాదు, కావ్యానికి ఒక విలక్షణమైన అందం చేకూరిందని అనుకొంటాను—

'అందమ్ముల బంధమ్మె
ఛందమ్మని నేనందును' అన్నాడు రచయిత !

ఒకానొక భావుకుని జీవితగాథ ఈ కావ్యంలో వర్ణితమైంది. ఈ లోకమంతా తుదీ మొదలూ లేని ఒక ప్రాణఖండం కాని, ఆద్యంతాల సంబంధం గ్రాహ్యంకానిదే ఇది అంతగా అర్థమయ్యే విషయంకాదు. ఏదో ఒక అతిలోకసౌందర్యాన్నీ, ఒక అతీంద్రియశక్తినీ భక్తితాత్పర్యంతో ఆరాధించేవారికితప్ప దీని కార్యకారణ సంబంధాలు సుబోధంకావు. ఇక్కడ మనం చేసే ప్రయత్నా లన్నీ అవి చారమూలకమైనవిగానూ, మనం చేరబోయే గమ్యాలన్నీ అందరానివిగానూ, ఈ లోకం అంతా ఒక పణవిపణిగానూ కనిపించడం సహజం.

"ముండ్లులేని గులాబీల
చెండ్లకు దారమ్ములేదు ;

క్రీనీడలు లేని వెలుగు
తానీషాలైన కనరు :

శ్రుతి కలియని పాటలతో
బ్రతుకంతయు చితికినది—
ఏనాటికి వ్రాసినదో
యీ నాటిక సుఖాంతమ్ము !

ఈ అఖండమైన సత్యాన్ని అవగాహన చేసుకోలేక పాక్షికవిశ్వాసాలతో విధీ విరామం లేకుండా తాపత్రయపడేవాళ్ళున్నారు.

'కపటద్యూతము జీవిత
కార్యకలాప మ్మంతయు—
ఆడెను నిషధుడు, ధర్మజు
డాడెను, నేనాడితిని—'

అంటాడు కవి. నిరాశామయమైన జీవితానికి ఈ కపటద్యూతము కొంత వినోద హేతువే అవుతుంది.

'జరిగిన నాజీవితకథ
సరిలేని విషాదగాథ'

ఎంత విషాదమయమైనా జీవితంలో

'ప్రహసనమనిపించెడి కథ
పట్టులు కలవేమొ......'

అని అనిపిస్తూనే ఉంటుంది.

ఈ లోకంలోని అంతఃసత్యాన్ని గ్రహించే ఉత్కంఠ ఎంత ప్రబలంగా ఉన్నా ఆ జిజ్ఞాస వైఫల్యానికే దారితీయడంవల్ల

'అజ్ఞానమునకు సౌఖ్యము
లందుబాటులో నుండును'

అనే నైరాశ్యాన్ని మేలుకొలుపుతూ ఉంటుంది. జ్ఞానతృష్ణతో పరితపించే ప్రాణులు అసంఖ్యాకంగా ఉన్నారు. వారి దప్పితీరటంలేదు. తీర్చేవారు లేరు సరిగదా—

'తార్కికు లీవిషయమ్మున
తలకొక చొప్పున చెప్పిరి !'

అందుచేత సమస్య ఇంకా దురూహ్యం అయిపోతోంది.

'తరచితి నెన్నో తలపులు
తెరచితి నెన్నో తలుపులు!'

నిజమే ; ఎంత తరచినా, ఎంతతెరచినా చివరకు మనకు గ్రహణయోగ్యమయ్యేది:

'జీవులెల్ల యాచకులే
జీవన మొక కబళమ్ము !'

ఈ కబళమే మన జీవనానికి ఆధారం. ఇది అఖండసత్యం కాకపోవచ్చు. మాయ కావచ్చు—కాని

'మాయాప్రవరుని మోహము
మనుచరిత్ర కాధారము !'

లాభనష్టాలకుకాని, సుఖదుఃఖాలకుకాని అవకాశం లేదు—

'కాబో లీ జీవిత మొక
ఖర్చులు కట్టని బేరము !'

ఒక్కొక్కప్పుడు

'దిక్కులేని నా కీ నిశి
దీర్ఘమ్మై తోచెడిని—
కడలి మునిగెనో భానుడు
కడసారిగ............'

అనిపించినా

'నాజీవిత పరమావధి
రాజీలకు లోనుగాదు!'

అని అనగల్గిన ఈ భావుకునికి వెలుగులేని ఆచీకటి రాత్రిలో ఎప్పుడో ఒక మెరుపు మెరసి

'అదిగదిగో మనోనేత్ర
మారయగల్గెను—ఓహో!
ఎంతటి చల్లని చూపులు,
ఏమీ యీ చైతన్యము!'

అనే ఆశాజనకమైన అవకాశం గోచరమవుతూనే వుంటుంది. అవకాశం తొలకరించగానే మానవప్రయత్నాలు మొలకలెత్తుతాయి! ఇంతకీ—

'నిన్నటి రేపటుల మధ్య
నే డొక కట్టని వంతెన!'

తెలిసినదానికి, తెలియనిదానికీ మధ్యవున్న త్రిశంకుస్వర్గము మానవుడి భావనా ప్రపంచం!

"ఈ పాటలు లోకమ్మును
కాపాడుటకా? కాదు?
కష్టజీవులకు సౌఖ్యము
కల్పించుటకా? కాదు.

ప్రకృతిలోని వైచిత్రికి
పారవశ్యమందిన నా
కన్నుల విరిసిన వెన్నెల
వన్నెలుసుమి యీ పాటలు"

(శ్రీ నళినీకుమార్ రచించిన 'పణవిపణి' కావ్యానికి శ్రీ అబ్బూరి రాసిన పరిచయం ఇది. కీర్తిశేషుడైన నళినీ కుమార్ అబ్బూరి స్థాపించిన "నటాలి" సంస్థ ప్రదర్శించిన "కన్యాశుల్కం"లో గిరీశం పాత్ర ధరించేవారు. శ్రీ శ్రీ మహాప్రస్థానం మొదటిసారి ప్రకటించింది నళినీకుమారే.)

అబ్బూరి రామకృష్ణరావు

# సందేశం

పంధొమ్మిదివందల అరవై రెండో సంవత్సరం జూన్‌నెల పదోతేదీన వియన్నాలో అంతర్జాతీయ నాట్యకళాపరిషత్తు తొమ్మిదో సమావేశం జరిగింది. నలభై మూడు దేశాల ప్రతినిధులు హాజరైనారు. ఆ మహాసభలో ఫిన్లాండ్ దేశపు ప్రతినిధి ప్రతిపాదన ఆధారంగా తీసుకొని ప్రతి సంవత్సరమూ యీరోజు అంటే మార్చి 27 నాట్యరంగాని కంకితంచేసి, నానాదేశాలమధ్య శాంతినీ సౌహార్ద్రాన్నీ పెంపొందించాలని నిశ్చయించారు. నాటకరంగంతో సంబంధంలేని విద్యగాని శాస్త్రంగాని లేనేలే దన్నమాట అంతో యింతో మనందరికీ తెలిసిందే. అది సకల కళానిలయం. శోకార్తులకూ, శ్రమార్తులకు విశ్రాంతినీ, వికాసాన్నీ, వినోదాన్నీ, ఆనందాన్నీ కల్పిస్తుంది. అందువల్ల కేవలం మహాకవులైన నాటకకర్తలకూ, నటులకూ, దీన్తో ప్రమేయమున్న యితరనిపుణులకూ మాత్రమే కాక, యీ భూవలయమ్మీద నివాసంచేసే మానవకుటుంబ మంతటికీ యీ రోజు పండుగరోజు. యీ రోజున జాతివైషమ్యాలు విస్మరించి, వర్ణవర్గభేదాలు మరిచిపోయి, మానవులందరికీ సాధారణమైన వ్యథలనూ, బాధకాలనూ వుపశమింపజేసే మార్గాన్ని అన్వేషిస్తారు. వాదప్రతివాదాలతో గాదు—లోక వృత్తాంత దర్శకమైన రంగస్థల దృశ్యాలు చూచి తమతమ మనోమాలిన్యాన్ని క్షాలనం చేసుకోవటంవల్ల.

అసలీ నాట్యవ్యాపారం మన సాంసారిక జీవనంలో ప్రధానమైన అంతర్భాగం. ప్రత్యేకంగా నెలకొన్న వినోదంకాదు. రుతువులు మారి, లతలు పల్లవించి కుసుమించిన వేళల్లో, వానచినుకుల స్పర్శమాధుర్యంతో వసుంధర పులకించి శ్యామలకోమల వేషాన్ని ధరించిన సమయాల్లో, పెళ్ళిళ్ళలో పేరంటాలలో స్త్రీ పురుషుల ఆనందాన్ని ప్రతిబింబిస్తూ అప్రయత్నంగా ఆశువుగా పెల్లుబికిన ఆంగికవిన్యాసాలూ, సంభాషణలూ నేటి నాటకాలకు పూర్వరూపాలు. ఈ ఛాయలు మన జానపద గేయాల్లో అక్కడక్కడ కనిపిస్తూ వుంటాయి. మన

జీవనానికీ ఈ నాటకానికీ యీ సన్నిహితత్వం వుండటంవల్లనే సినిమాలు మొద లైన యాంత్రికవినోదాలు యెన్ని వొచ్చినా నానాదేశ భాషల్లో నాటకాల ప్రయో జనం సన్నగిల్లటంలేదు. ప్రాంతీయ వైలక్షణ్యాలనూ, ప్రాదేశికభావాలనూ అతిక్ర మించిన మానవత్వం నాటకాల్లో పరిస్ఫుటమౌతున్నది.

దాదాపు రెండువేల సంవత్సరాల క్రిందట గ్రీసుదేశంలో నాటకం సర్వాంగ సుందరంగా పరిణతి చెందింది. మహామతులైన యీస్కైలసు, సొఫాలికీసు, యూరిపైడీసు, అరిస్టాఫెనీసు రచనలు యూరపు ఖండమంతటా వ్యాపించి ఉదాత్తమైన పునరుజ్జీవనానికి దారితీసినై. ఆ మహారచయితలు భాషా వైదుష్యం లోనూ, ప్రయోగవిజ్ఞానంలోనేగాక, అగాధమూ వర్ణనాతీతమూ అయిన జీవన రహస్యాన్ని వర్ణింపగల్గిన ఉత్తమ సంస్కారసంపన్నులు. అందువల్లనే వారి దృశ్యకావ్యాలు నేటికీ నేల నాలుగు చెరగులా ప్రయోగయోగ్యంగా అశేషప్రేక్షక జనానీకానికి ప్రమోదాన్ని చేకూరుస్తున్నై. యీప్రభావంవల్లనే రోమక సామ్రాజ్యంలో మినాండరు, ప్లాటసు, టెరెన్సు కొత్తబాటలు తొక్కగలిగారు.

స్పెయిను దేశంలో వేయి నాటకాలకు పైగా రాసిన లోప్ డివేగా, క్షాత్ర ధర్మాన్ని వుగ్గడిస్తూ నూటికిపైగా నాటకాలు రచించిన కాల్డెరాను గణనీయులు. యింగ్లండులో కవితా వైభవాన్ని నాటకరంగంలో ప్రతిష్ఠించి ఫౌస్టసు, టాంబర్లేను నాటకాలు రచించిన మార్లోను, జగద్విఖ్యాతిగాంచి నాటకచక్రవర్తిగా పేరొందిన షేక్సుపియరు, బెన్‌జాన్సనులను యెరుగని వారెవరూ యీ దేశపు విద్యావంతు లలో వుండరు. యిదే విధంగా హాస్యరసరాజధానిని పరిపాలించిన మోలియరును, ఆతని సమకాలీనుడైన ప్రౌఢకవి రాసేనును మనకు పరిచితులే. కాళిదాసశాకుంత లానికి మోనియరు విలియమ్సు ఆంగ్లానువాదాన్ని చదివి పరవశుడైన జర్మను నాటకకర్త గెతీ, అతని సహోదరుడైన షిల్లరు చిరస్మరణీయులైన ప్రతిభావంతులు. నార్వేదేశంలో జన్మించి నాటకరచనలో విలక్షణమైన నూతనమార్గనిదర్శకుడై వొక శతాబ్దానికి పైగా ప్రపంచసాహిత్యాలన్నిటిపైనా తన ప్రభావాన్ని ప్రసరింప చేసిన యిబ్సెను ఆధునికుల్లో జగజ్జేత అయిన రచయిత. ప్రపంచభాషలన్నింటి లోనూ ఆయన నాటకప్రయోగాలు నేటికీ కొత్తదనాన్ని కోల్పోక సామాజికులకు ప్రీతిపాత్రంగా వుంటున్నాయి.

సరిగా మన గురజాడ అప్పారావుగారు జన్మించిన సంవత్సరంలోనే జన్మించి ఆయనవలెనే మన సాంసారిక జీవనంలో దైవోపహతులైన సామాన్య

మానవుల కష్టనిష్ఠురాలను కర్ణరసాయంగా వాడుకభాషలో నాటకాలుగా రాసిన జెరార్డు హోప్ప్మెను, నలభైనాలుగు సంవత్సరాలకే జీవయాత్ర చాలించినా బ్రతుకు లోతులన్నిటినీ అవగాహనచేసుకుని Chery Orchard వంటి మరపురాని మహా నాటకాలను మన కందించిన రష్యను చెహూవ్, అయిర్లాండు దేశంలోవున్న పల్లీ ప్రాంతాల్లో నివసించే సాధారణుల జీవనరహస్యాన్ని మథించి, చవులూరే వారి జీవద్భాషలో కరుణరస ప్రధానాలైన నాటకాలు రాసిన జాన్ మిడ్జిలను నిండు హాస్యంతోనూ వక్రోక్తివైచిత్రితోనూ, సాంఘికజాడ్యాన్ని నిర్విరామంగా ప్రదర్శించి మానవ పురోగమనానికి తోడ్పడ్డ కరణార్ద్రమనస్కుడు బెర్నార్డు షా నాటక ప్రపంచంలో చిరస్థాయిగా నిలిచే వ్యక్తులు.

యీ మహనీయులందరిలో విచిత్రమేమంటే వీరందరూ వాకరిచే వాకరు ప్రభావితులై తమతమ దేశకాలాల నతిక్రమించి అఖండరూపంతో మానవత్వాన్ని ప్రదర్శించటం. గ్రీకునాటక ప్రభావంవల్ల ఆంగ్లనాటకం పరిపుష్టమయింది. రోమక నాటకాలవల్ల యిటాలియను నాటకా లుత్తేజితా లైనాయి. యిబ్సెను నాటకాలవల్ల నానాభాషలలో నాటకరచనా పద్ధతులూ ప్రయోగపద్ధతులూ మారిపోయినాయి. మహాకవి కాళిదాసు శాకుంతలనాటకం ఆంగ్లానువాదంలో పఠించిన గెతే తన నాటకరచనా విధానంలో భారతీయపద్ధతు లవలంబించటం జరిగింది. యీ విధంగా నాటకరంగం దేశకాలాదులకు సంబంధించిన అవధులన్నిటినీ దాటి మానవజాతి అంతటిలోనూ ఐకమత్యాన్ని సాధించగల ఉదాత్తసాధనంగా పరిణమించింది.

యీ సమయంలో ప్రపంచమంతటా నానాప్రాంతీయభాషల్లో యీ మహనీయులను సంస్మరిస్తూ ప్రసంగాలు, నాటకప్రయోగాలు, రేడియోగోష్ఠులు జరుగుతూ వుంటాయి. మనకు మనం యెవరికివారు యీ మంగళ ముహూర్తాన్ని పురస్కరించుకొని నాటకరంగంద్వారా సాధించగలిగిన మానవసౌహార్దమనే లక్ష్యాన్ని మననంచేసి ఆశుభపర్యవసానం కోసం కలలుగంటూ, వుత్సాహంతో ముందడుగు వేద్దాం.

(అంతర్జాతీయ రంగస్థల దినోత్సవాని కిచ్చింది, 1963).

అబ్బూరి రామకృష్ణరావు

# ఆంధ్ర మహాజనులకు విన్నపము

కీర్తిశేషులగు శ్రీ ఆంధ్రరత్న రామదాసు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిచే స్థాపింపబడిన శ్రీమదాంధ్ర విద్యాపీఠగోష్ఠి వారు శ్రీ గోపాలకృష్ణయ్యగారి జీవిత చరిత్ర, రచనలు, ఉపన్యాసములు, ఇష్టాగోష్ఠి, హాస్యసల్లాపములు, చాటు పద్యములు, లేఖలు మొదలగువానికి గ్రంథరూపమున ఆంధ్రమందును, ఆంగ్లము నందును వేఱువేఱుగ నచ్చొత్తించి ఆంధ్రమహా జనులకు సమర్పించుకొన సంకల్పించియున్నారు. శ్రీ గోపాలకృష్ణయ్యగారి జీవితమునందలి మహదాశయములను ఆంధ్రలోకము మరువకుండుటకీయత్నమెంత యవసరమో మేము వేరుగ తెలుపనక్కరలేదు. కాని యీ యుద్యమము నెరవేరుట శ్రీ గోపాలకృష్ణయ్యగారితో నేదో విధముగా పరిచయముగల ఆంధ్ర మహాజనులు బహుమంది యొక్క తోడ్పాటుపై నాధారపడియున్నకతమున, ఆంధ్రమహాజనులెల్లరును పైనుదాహరించిన విషయముల గూర్చి, వారి వారికి తెలిసిన యావద్వృత్తాంతమును, శ్రీ వారి స్వహస్తలిఖిత లేఖలు (లేక అందుకు సరియగు నకళ్ళు), రచనలు, ఛాయాపటములు మొదలగునని యీ దిగువ చిరునామాకు పంపించి మాకు తోడ్పడ లందులకు ప్రార్థించుచున్నాము. అట్లు పంపించిన లేఖలు ఛాయాపటములు తిరిగి కావలయునని కోరినచో త్వరలో వారికి వాపసు చేయబబడును.

ఉత్తర ప్రత్యుత్తరములన్నియు యీ దిగువ చిరునామాకు పంపదగును. గుమ్మిడిదల వెంకట సుబ్బారావు, ఇండియన్ బ్యాంకు, బెజవాడ.

ఇట్లు విన్నవించు—

1. నడింపల్లి వేంకట లక్ష్మినరసింహారావు
2. అబ్బూరి రామకృష్ణారావు
3. గుమ్మిడిదల వేంకట సుబ్బారావు

ఆంధ్ర విద్యాపీఠగోష్ఠి, బెజవాడ, 24–7–28.

(భారతి విభవ శ్రావణమాసము—1928 ఆగస్టు—325 పేజీ).

అబ్బూరి రామకృష్ణరావు

# అవీ ఇవీ

అన్యరచనా పరాఙ్ముఖత ప్రతిభావంతుల్లో బహుళంగా కనిపిస్తూంటుంది. గెటే అనే జర్మను మహాకవిని గూర్చి సమకాలికుడైనా తనకు తెలియదని విక్టరు హ్యూగో అన్నట్లు మన మెరుగుదుము. 'వాల్టైరు' అన్న అక్షరాలు వాక్యంపైన, ఫుల్‌స్టాప్ దగ్గర హంసపాదం గుర్తుతోరాసివున్నాయి. (వాల్టైరు) ప్రతిభావంతులైన కావ్య స్రష్టలలో— మహాకవులైనా అంతకు తక్కువ శ్రేణిలో వున్న కవులైనా— కనిపించే యీ లక్షణం సాహిత్యోన్మేషాని కేమాత్రం అంతరాయంకాదు. అనన్యాకృష్టమైన వారి మనస్సులలో క్రొత్తసృష్టి రూపొందడానికి అవకాశం కలుగుతుంది. భిన్నభిన్నాధికారాలతో వున్న అసంఖ్యాకమైన పాఠకలోకానికి తమకుచితమైన కావ్యాలు అనంతంగా అవిష్కృతం కావటానికి అవకాశం కలుగుతుంది. కాని ఈ శాఖకు చెందినవారి చేతులలో పరిషత్తుండడం అనర్థహేతువౌవుతుంది—

ఆంధ్రేతరుల సమక్షంలో ప్రతివారూ తక్కినవారి నందరినీ నిరసించడం జరుగుతున్నది. ఆంధ్రేతరులకు మనసాహిత్య స్వరూపాన్ని నిష్పాక్షికంగా ఉన్నదున్నట్లు చెప్పటం అవసరం. దానిలోని మంచి చెడ్డలను నిర్ణయించే పని వారికే వదలి నేయడం మంచిది.

రామకోటేశ్వరరావుగారి అత్యుక్తి, 'కో స్తి ధన్యో మదన్యః' అన్న అహంకృతీ అ॥ ఆ॥ సా॥ పరిషత్తువంటి సంస్థలకు వినాశహేతువై సంస్కార సాంకర్యానికి దారి తీయడం జరుగుతుంది.

1957

* * * *

తెలుగు సాహిత్య చరిత్రలో యితరకవుల రచనలను దొంగిలించడం కనిపిస్తూ వున్నప్పటికీ, యితరకవుల రచనలలో తమ నీరసపు రాతలను దూర్చి

మహాకవులకే అపచారం చెయ్యడమనేది యిటీవల ప్రారంభమైంది. దీన్ని సాహితీ ప్రియులందరూ ఖండించి తీరాలి.

గురజాడ 'లవణరాజుకల', చక్కని వస్త్వైక్యం కలిగి, సమగ్రమైన తన అఖండ రూపంతో రసికులందరికీ ఆహ్లాదం కలిగించే రచన. ముత్యాలసరాలలో ముచ్చటగా కూర్చిన ఆకళాఖండాన్ని ఛేదించి, ఆరూపానికి అపకర్షకంగాను, అశ్లీలంగాను, కనిపించే కొత్తపాటను, కొత్తనడకను సామాన్య గేయాలను జోడించి, సినిమాపక్కీలో చౌకబారు అభిరుచులకు అనుగుణంగా సంకరం చెయ్యడం, తెలుగువారందరూ దుఃఖించవలసిన విషయం.

(హైదరాబాదులో గురజాడ శతజయంతి కమిటీ ఆర్థిక సహాయంతో వొక స్థానికసంస్థ "లవణరాజుకల"ను పూర్తిగా మార్చి, సినిమాబాణీలో ప్రదర్శించడం జరిగింది. దానిమీద "ఆంధ్రభూమి" పత్రికలో వాదోపవాదాలు కూడా తీవ్రంగా జరిగాయి. "రాజధానిలో" అనే శీర్షికతో "సుబ్బారావు" అనే విలేఖరితో ఈ ప్రదర్శన పట్ల నిరసన తెలియచేస్తూ చెప్పిన విషయం ఇది. అందులోనే బాలాంత్రపు రజనీ కాంతరావుగారి అభిప్రాయం కూడా ఉన్నది. ప్రచురణ తేదీ 17 అక్టోబరు 1962)

* * * *

పద్యమునందలి భావమునకెంత గౌరవము జూపుదుమో, పదముల పొందికకు గూడ సమానగౌరవము జూపవలయును. (వాల్ట్)

"భావము స్ఫురించుట సగము సంతోషము. భావానుగుణములగు పదముల యథాస్థలములయం దతుకుట సగము సంతోషము" అని యొక ప్రసిద్ధకవి మతము.

కొన్నివేళల, భావమెంత సామాన్యముగ నున్నను పదముల యొక్క ఉచిత యోజనమువలన, పద్యము నెన్నిసారులు చదివినను తనివి తీరదు—

కొండని వేడ్కతో పసిడికొండ మొ॥

వసుచరిత్రములోని కొన్ని పద్యములవలె శుష్కములగు పైపయి వన్నెలేమియు నిచటలేవు— 'నిండుమనంబును' తలపించును— అన్ని విధముల తిక్కన కవితను బోలును. ఇట్టి యోజనమే కవిత కలంకారము. ముక్తపద గ్రస్తములు మొదలగునవి కావు—

